శ్రీరస్తు.

శ్రీబాలాత్రిపురసుందర్యైనమః

# సుజ్ఞానదీపిక.

బ్రహ్మసూత్రభాష్యాది సర్వవేదాంత
సారసంగ్రహము.
తెలుగు తాత్పర్య సహితము.

---

మంథా లక్ష్మీనరసింహముచే
వివరింపబడి
పేరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే
పరిశోధింపబడి

---

అమలాపురం
వామరాజు చంద్రమౌళిగారి
స్వకీయ శ్రీమారుతి ముద్రానిలయమందు
ముద్రింపబడియె.

---

— 1931 —

వెల రు 4-0-0

# ప్రచురపత్రిక

ఈక్రింది పుస్తకములు నావద్ద నున్నవి.

1 వరివస్యారహస్యము:-సంస్కృతమూలవ్యాఖ్యానములు. శ్రీభాస్కరరాయకృతము. ఖరీదు రు 0-12-

2 శ్రీశివశక్త్యైక్యదర్పణము:-ఉపాసననుగూర్చి అనేకగ్రంథసారసంగ్రహము. వరివస్యారహస్య సహిత తెలుగుతాత్పర్యముతో ఖరీదు రు 2-8-

3 అద్వైతసుధాసారము:-త్రిపురారహస్యము జ్ఞానఖండము. వ్యాఖ్యానమును, తెలుగుతాత్పర్యమును కలది. 1 భాగము రు 2-0-0

2 భాగము రు 2-0-0

4 శ్రీసుజ్ఞానదీపిక:-అనేకభాష్యముల తెలుగు తాత్పర్యసహితము ఖరీదు రు 4-0-0



మంథాలక్ష్మీనరసింహం,
ప్లీడరు,
ఇందుపల్లి.
అమలాపురంతాలూకా,
తూర్పుగోదావరి డి॥

శ్రీ

శ్రీగురుపరదేవతాయై నమః

# విజ్ఞప్తి

1. ఈసుజ్ఞానదీపికయందు పదునారు ప్రకరణములుఁగలవు. మోక్షమును సాధించుటకు నరజన్మముత్తమమైనది. ధర్మార్థకామమోక్షములలో మోక్షమే నిత్యసుఖమగు పరమానందము కలది. జన్మములయందు సుఖముకంటె దుఃఖమధికము ఎట్లనగా- మొదట మాతృగర్భములోను, జననమైనతరువాత కొంతకాలమువరకును మలమూత్రములలో మునుగుచుండుట, పిమ్మట విద్యాభ్యాసముకొఱకు తల్లిదండ్రులు మొదలగువారిచే శిక్షింపబడుట, యౌవనమందు కోరిన స్త్రీధనాదులు సంభవింపకను, సంభవించినవానికి నాశముకలుగుటయును, దారపుత్రాదులనుగూర్చి అనేకవిధములగు క్లేశములును, మనోవ్యాధి బహిర్వ్యాధులచే దుఃఖించుటయును, కలుగుటవలన దీనికిరోసి, నిత్యానందము, జన్మరాహిత్యము కలుగుమోక్షముకొఱకే శ్రద్ధతో యత్నింపవలయును. ఉపనయనాధ్యయన, యజ్ఞ, దానాది కర్మములు శూద్రులకు లేనందున ద్విజాతులుమాత్రమే జ్ఞానాధికారులనియు, శూద్రులకు జ్ఞానాధికారములేదనియు, అపశూద్రాధికరణమునందు చెప్పబడినది. కాని ద్విజాతులలో యాగాదికర్మములు చేయనివారును, కర్మాధికారములేని శూద్రులును, జన్మాంతరవాసననుబట్టి జ్ఞానవిద్యానిపుణులనేకులు గలరు. గనుక జ్ఞానవిద్యకు జన్మాంతరవాసన, ఈశ్వరానుగ్రహము, అంగములు గాని కర్మలేశ

ము, వర్ణాశ్రమభేదము అంగములుకావు. మఱియు శూద్రు నకు యజ్ఞాదికర్మములు నిరాకరింపబడెను. గాని జ్ఞానవిద్య నివారింపబడలేదు. విదుర ధర్మవ్యాధాదులు దీనికి నిదర్శనము అని ప్రథమప్రకరణమునందును- పుట 2

2. ధర్మార్థకామములు మూడును సకామకర్మఫలమైన దున దానివలన కలుగు స్వర్గాదులు శాశ్వతముకావని 2వ ప్రకరణమునందును- పుట 34

3. నిష్కామకర్మములవలన మోక్షము సిద్ధించును గనుక తాను ఫలముకోరకుండా నీశ్వరార్పణముగ చేయుటయే శ్రేయమని 3వ ప్రకరణమునందును- పుట 37

4. జగత్తు అశాశ్వతమైనది. గతజన్మములలోని దారపుత్ర ధనాదులేవియును ఈజన్మమున స్మరణకు రానట్లే రాగలజన్మ ములందును రానేరదు. మఱియు నీజన్మములోనిదైనను సుషుప్తియందేదియును తెలియదుగదా? అప్పుడు ఉన్నదనిగాని, పోయినదనిగాని విచారమేమియును లేదుగదా? గనుక వీనిని గూర్చి చేయుయత్నము దుఃఖముకొఱకే. కాని సుఖముకొఱకు కానేరదు. కావున అశాశ్వతములగు జగత్పదారములు దుఃఖప్రదములని 4వ ప్రకరణమునందును- పుట 47.

5. సచ్చిదానందరూపవిమర్శనమువలన దుఃఖములులేని మోక్షము కలుగును. అది నిర్గుణమే. కాని దానిని సాధించుటకు సౌధము (మేడ) నెక్కుటకు మెట్లు యేర్పడినట్లే సగుణ రూపమనెడి మెట్లు కల్పింపబడినది. ఆసగుణరూపము బ్రహ్మ మని, చిచ్ఛక్తియని రెండువిధములుగనున్నది. అదియే స్త్రీ పురుషరూపములు. జగత్సృష్టికి కారణము. ఆ రెండింటికిని

చంద్రచంద్రికలవలె నామభేదమేకాని వాస్తవభేదము లేదు. నామరూపములన్నియు కల్పితము. నిర్గుణమందు నామరూపములే లేవు. సగుణమూర్త్యుపాసనమువలన సగుణలోకఫలమును, అనంతరము క్రమముగా ముక్తియును కలుగును. అని 5 వ ప్రకరణమునందును- పుట 53.

6. పురుషప్రయత్నముచేత జగద్వ్యాపారములను సాధించునట్లే జ్ఞానవిద్యనుకూడ సాధింపవచ్చును. మోక్షముకొఱకు చేయు యత్నమే ముఖ్యము. గాని మిగిలినవన్నియు అశాశ్వతమై నశించును. గనుక జ్ఞానముకొఱకే యత్నింపుమని వాసిష్ఠమునందు శ్రీరామమూర్తికి ఉపదేశించిన వాక్యములను 6 వ ప్రకరణమునందును- పుట 161.

7. వేదాధ్యయన, యజ్ఞ, దానాదికర్మములు జ్ఞానసాధనములని 7 వ ప్రకరణమునందును- పుట 177.

8. అట్టికర్మములీజన్మమునందు లేకున్నను, జన్మాంతరవాసనచేతను, దేవతానుగ్రహముచేతను జ్ఞానవిద్య పొందబడును జ్ఞానవిద్య స్వతంత్రమైనది. దానికి కర్మములు అంగము కాని కర్మములకది అంగముకాదు. అని 8 వ ప్ర॥దును- పుట 178.

9. తానే బ్రహ్మమనెడి అహంగ్రహోపాసనమువలననుత్తమమగు కైవల్యముక్తికలుగునని 9వ ప్ర॥ను-పుట 208.

10. సూర్యుడు, మనస్సు మొదలగునవియే బ్రహ్మమని చేయు ప్రతీకోపాసనమువలన కలుగునది నికృష్టఫలముగాని, ఉత్తమఫలముకాదని 10 వ ప్రకరణమునందును- పుట 210.

11. జ్ఞానసాధనములని వాసిష్ఠమునందు చెప్పబడిన సప్తభూమికల వివరణము 11 వ ప్రకరణమునందును- పుట 212.

12. సగుణ నిర్గుణోపాసనల చేత ఫలభేదము కలదు. వీ
లో నిర్గుణోపాసనచే కలుగు ఫలము శ్రేయము. వైశ్వాన
విద్యనుగూర్చి జాబాలశ్రుతులనుబట్టి పరబ్రహ్మస్థానము
హామందు ద్వాదశాంతము (ఉచ్చిలిగుంట) అగునని 12
ప్రకరణమునందును- పుట 215.

13. జ్ఞానులగు వ్యాసులు, నారదుడు మొదలగువారికి కొన్ని కారణముల చేత మఱల జన్మము కలిగినది. కాని అందు వలన జ్ఞానమునకు భంగము లేదు. ఆ దేహాంతమందు వారును ముక్తులే. వారికి అట్లు కలుగుటకు ఈశ్వర ప్రేరణయను ప్రారబ్ధమే. అని 13 వ ప్రకరణమునందును- పుట 247

14. సగుణము ఉపాసనకొఱకు కల్పితము. నిర్గుణబ్రహ్మమునుండియే ధర్మార్థకామ మోక్షముల నెడి చతుర్విధపురుషార్థములును సిద్ధించును. అని 14 వ ప్ర॥నందును- పుట 252.

15. జ్ఞానవిద్యాభ్యాసమువలన కైవల్యముక్తి కలుగువఱకును క్రమముగా శ్రేష్ఠమయిన సంపత్తులుగల గృహమందును, యోగులకులమందును జన్మించి ఉత్తమఫలమునే పొందుచు మిగిలినజ్ఞానముకొఱకు యత్నించుదురు. కాని ఇంతకంటె హీనజాతిలో పుట్టరు. కలిగిన జ్ఞానవాసన లేశమైనను నశింపదు. కనుక జ్ఞానప్రవృత్తివలన క్రమముగా అనంతసుఖమును పొందవచ్చును. అని 15 వ ప్రకరణమునందును-

16. ఆ క్షేత్రేతరవ్యాపారము శ్రేయము కాదు. ఇతరమతములును సరియయినవి కావు. చిద్రూపమునే విమర్శింపుము. అని చెప్పిన బ్రహ్మసూత్రములలో మొదటి 15 దు ప్రకరణములలో చేరిన 162 సూత్రములుగాక మిగిలిన 393 సూత్రముల

ముఖ్యతాత్పర్యము 16 వ ప్రకరణమునందును కలదు.

17. ఈ కలియుగము శుక్లసంవత్సరాంతము 1930సంవత్సరం మేప్రియిలువరకు 5030 సంవత్సరములు గతించినవి. ఇది విశేషపాపయుగమే. కాని గురుభక్తి, శాస్త్రవిశ్వాసము, సత్సాంగత్యము, వైరాగ్యము మొదలగు గుణసంపదగల ధీమంతులు శీఘ్రకాలములోనే ముక్తిని పొందవచ్చును. 'తూలాగ్నివద్విద్యా' దూదిరాశియందు పడిన అగ్ని తాను లేశమైనను దూదిని అంతను దహించునట్లే జ్ఞానవిద్య క్రమముగ వృద్ధియగుచు అజ్ఞానమును దహించును. జ్ఞానవిద్యకొరకు యత్నించువారే అరుదు. యత్నించువారికి చతుర్విధపురుషార్థములును వారివారి భక్త్యాదులననుసరించి సిద్ధించును.

18. జగత్పదార్థములేవియును ఆత్మకాదు. వీనినన్నిటిని సాక్షిగా చూచునట్టి తెలివియే ఆత్మయనబడును. అది అన్నిటియందును కలదు. గనుకనే నరులయొక్క భావముననుసరించి పశుపక్ష్యాదులు సంచరించుచున్నవి.

19. చక్రవర్తికంటె క్రిందివారివలన కలుగు ఫలము స్వల్పమగునట్లే చిచ్ఛక్తివలనకలుగు ఫలముకంటె నితర దేవతల వలన కలుగుఫలము స్వల్పము. సృష్టికర్త నిర్గుణమైనను, 'తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్। సర్వం ఖల్విదం బ్రహ్మ' యను శ్రుతులవలన పురుషార్థములు నాలుగును నిర్గుణబ్రహ్మమునుండియే కలుగును. బ్రహ్మవిష్ణుమహేశ్వరేంద్రాది దేవతలును తమచిద్రూపశక్తివలననే భక్తులకు ఫలమునిచ్చునట్లును పిరు మహర్షి శాపబద్ధులును, మహాప్రళయమునందు నశించువారును, అయినట్లును శాస్త్రములు చెప్పుచున్నవి.

20. గతజన్మమునందు బ్రాహ్మణుడైనను తిరిగి శూద్ర జన్మములు కలుగవచ్చునని 15 వ ప్రకరణమునందు చెప్ప డినది. ఒక్కొక్క జీవుడు అనేక ఉపాధులను గ్రహించుచుండు ను. లోకములో నరులు తమగృహములను మార్చునట్లే జీ లకు ఉపాధులును కర్మవశమున మారుచుండును. కాని ఉపా ధిభేదమున్నను గతజన్మవాసన పోనేరదు.

21. బ్రహ్మవిద్యనుగూర్చి పండితులనేకులు సంస్కృతము తోను తెలుగుటీకతోను గ్రంథములు రచించిరి. కాని అ అందఱికిని సులభముగా అర్థముకాకుండ గంభీరవాక్యము తోనున్నందున వానినెల్ల నొకచోట నాశక్తి కొలదిని చేర్చి దేవతాకృపవలన సులభశైలితో సంగ్రహముగ నింద వ్రాసితిని.

22. శ్రీవ్యాసకృత బ్రహ్మసూత్రములకు చేయబడిన శ్రీ శంకరాచార్యభాష్యానుసారముగా బ్రహ్మశ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రులుగారు రచించిన ఆంధ్రటీకననుసరించి సం గ్రహతాత్పర్యము వ్రాయబడెను. బ్రహ్మవిద్యనుగూర్చి బ్రహ్మసూత్రార్థమేకాక ప్రసంగాగతవాక్యములను ప్రమా ణముగా మఱికొన్ని గ్రంథములనుండి యిందువ్రాయబడినవి.

ఈగ్రంథమందు ఉదహరించిన

| గ్రంథములును. | గ్రంథకర్తయును. |
|---|---|
| 1 బ్రహ్మసూత్రములు | వ్యాసకృతము. |
| 2 పంచదశీప్రకరణములు | విద్యారణ్యకృతము. |
| 3 గౌడపాదసూత్రములు | విద్యారణ్యవ్యాఖ్య. |

4 ఈశ్వరప్రత్యభిజ్ఞ సూత్రములు. 5 యోగవాసిష్ఠము.

6 జీవన్ముక్తివివేకము విద్యారణ్యకృతము. 7 భగవద్గీత శంకరభాష్యం. 8 అపరోక్షానుభూతి 9 వివేకచూడామణి శంకరాచార్యకృతం. 10 అద్వైతసుధాసారమనెడి త్రిపురా రహస్యంజ్ఞానఖండము దత్తాత్రేయులు. 11 అష్టావక్రగీత అష్టావక్రముని 12 త్రిపురాతాపినీ, మహానారాయణ, ఛాందోగ్య, బృహదారణ్య, శ్వేతాశ్వతర, తైత్తిరీయ, కఠవల్లి, దక్షిణామూర్తి, భావనోపనిషత్తులు. 13 షోడశీభాష్యము. 14 దధీచిసంహిత. 15 త్రిశతినామ శంకరాచార్యవ్యాఖ్య. 16 త్రిపురాసిద్ధాంతము. 17 జ్ఞానార్ణవము. 18 దేవీభాగవతము. 19 సూతసంహిత విద్యారణ్యవ్యాఖ్య. 20 భోజరాజవృత్తి. 21 సౌర, దత్తాత్రేయ సంహితలు. 22 లలితా సహస్రనామభాష్యము. 23 వామకేశ్వరతంత్రము. 24 గరుడ, లింగ, విష్ణు, కూర్మ, వరాహ, పద్మ, మార్కండేయ, బ్రహ్మాండ, స్కాంద, దేవీపురాణములు. 25 బ్రహ్మవైవర్తము. 26 హరివంశము. 27 దేవీవేదపాదస్తవము 28 పంచదశీస్తవము. 29 ఏకశ్లోకి, దశశ్లోకి మనీషాపంచకము. శంకరాచార్యకృతం. 30 సప్తభూమికలు వాసిష్ఠము. 31 విజ్ఞానభైరవభట్టారిక. 32 ఆమ్నాయములు. 33 యోగశాస్త్రము. 34 ఉమాసువార్చలాతంత్రము. 35 వరివస్యారహస్యము. 36 దక్షిణామూర్తిమంత్రము-శంకరాచార్యభాష్యము.

23. జన్మాంతరవాసన, దేవతానుగ్రహము లను గూర్చి నాఅనుభవమునుగూడ చెప్పుచున్నాను. నేను 12 సంవత్సరములవయస్సుతో ప్లీడరుగుమాస్తాగా ప్రవేశించి 1882 సం॥రం మొదలు తెలుగుపల్లెద్వారా వ్యవహరించి 1925 సంవత్స

రముతో నాయుద్యోగమునుండి విరమించితిని. అప్పటికి నావయస్సు 70 సంవత్సరములు. సంస్కృతాంధ్రాంగ్లేయ భాషలయందు పాండిత్యము లేదు. చిరారాధిత శ్రీపర దేవతకు నాయందుకలిగిన కటాక్షమువలనన, శ్రీభాస్కరానందనాథాఖ్యసద్గురుప్రబోధవలనను, ప్రకాశానందనాథసమాఖ్యగల నేను నాకు శక్యముకానిదైనను బ్రహ్మవిద్యయందలి తాత్పర్యసంగ్రహమును చిత్తాపస్థులకు ఆవర్జా వేసినట్లు షోడశీవిద్యయందలి భక్తిచేత ఇతరవ్యాపారాసక్తి లేకుండ పదునారుప్రకరణములుగా సీసుజ్ఞానదీపికను యథాశక్తితో వ్రాసితిని. 'ప్రమాదో ధీమతామపి' బుద్ధిమంతులకుకూడ ప్రమాదముకలుగవచ్చునను న్యాయమువనుసరించి ఏపాండిత్యమును లేని నేను వ్రాసిన దీనియందు ప్రమాదములున్నను బాలునివాక్యములకు తల్లిదండ్రులానందించునట్లు సుజ్ఞానులు బాలాభాషణమని సుగుణములనే గ్రహించి తప్పులను మన్నించి సుసిద్ధముచేయుదురుగాక? యని విన్నవించుచున్నాను.

ఈగ్రంథము అమలాపురం హైస్కూలు సంస్కృతపండితులగు పేరి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు మొదలగు పండితులచేత ఆదరముతో పరీక్షింపబడి ఆచ్ఛాత్తించుటకు ప్రోత్సాహపరుపబడెను.

ఇట్లు సజ్జనవిధేయుడు,

ద్రావిడశాఖీయ, భారద్వాజసగోత్రజుడు,

మంథా లక్ష్మీనరసింహము, ప్లీడరు.

ఇందుపల్లి, అమలాపురంతాలూకా, తూర్పుగోదావరిజిల్లా.

ఇతి శ్రీబాలాత్రిపురసుందరీసమేత-శ్రీమేధాదక్షిణామూర్తిదేవతార్పణమస్తు.

# విషయసూచిక

27సూ. దేవతలు ఒక్కొక్కరు అనేకరూపములను పొందుటచేత ఒకకాలమందు జరిగే యజ్ఞములన్నిటియందును వారు ఉండు టవలన విరోధములేదు. 16-17 28సూ. శరీరముకలదనుట చేత దేవతలు అనిత్యులనతగదు. దేవాదులతో కూడిన జగత్తు వేదమునుండిపుట్టుటవలనవిరోధములేదు. 18 29సూ. వేద శబ్దములకు నిత్యత్వముగ్రహింపతగునని. 19 30సూ. సృష్టి లయములు పూర్వమువలెనే జరుగుచుండుటచేత విరోధము లేదని. 20 31సూ. మధువిద్యాదులందు దేవతలకు అధికార ములేనందున జ్ఞానవిద్యకును అల్లెు అని జైమిని పూర్వపక్షము 20. 32సూ. దేవతలకు శరీరమేలేదని మరియొక పూ॥ము21 33సూ. దేవతలకు జ్ఞానాధికారముకలదని వ్యాసముని సిద్ధాంతము. 21 10 అపశూద్రాధిక॥ శూద్రులకును జ్ఞానవిద్యాధికారముకలదని పూర్వపక్షమురాగా 34సూ. జానశ్రుతి శూద్రుడు అనితలచి నిరాకరించుట 21-22 35సూ. జానశ్రుతి క్షత్రియుడుగనుక అతనికి జ్ఞానవిద్యాధికారము కలదు. గాని జాతిశూద్రునకు లేదనియు, శూద్రులయిన విదురాదులకు జన్మాంతరవాసనచేత జ్ఞానవిద్యపొందబడెననియు. 22 36సూ. విద్యాంగములగు ఉపనయనాధ్యయనాదులు శూద్రునకులేనందున బ్రహ్మవిద్యాధికారములేదని. 23. 37సూ. జాబాలునికి శూద్రత్వములేనందున గౌతముడు అతనికి ఉపనయనము చేయబూనెనని. 23-24 38సూ. శూద్రులు వేదమును వినకూడదు. చదువకూడదు అని శ్రుతి స్మృతులుచెప్పుచున్నవని 24. వివరణము-అధ్యయన యజ్ఞాదికర్మములు శూద్రునకులేవని చెప్పబడినవి. కాని అధికారమున్నను. అవిచేయనివారు

ద్విజాతులలో అనేకులు జ్ఞానవిద్యాప్రవర్తకులుగానున్నందున నిచట జ్ఞానవిద్యకు. జన్మాంతరవాసనయు, ఈశ్వరానుగ్రహమును, ముఖ్యము కాని కర్మములు ప్రధానముకావనుట.25-26. ఆత్మలాభమును కోరువారు తదితరములను విడువవలయు నని యోగవాసిష్ఠము. 26 కర్మములవలన, పుత్రధనాదులవలన ముక్తికలుగదని నారాయణోపనిషత్తు. 27 వర్ణాశ్రమాదులును, కర్మాదులును, మాయచేత కల్పితములనుట. పం. ప్ర మహావాక్యవివేకము. 27 ధ్యానదీపము. 28 అష్టావక్రగీత. 29-30 పూర్వజన్మవాసనననుసరించి జన్మాదులు కలుగునని పం. ప్ర. చిత్రదీపము. 31 పం. ప్ర. జ్ఞానుల ప్రవర్తనము అనేకవిధములుగానుండుననుట. 32 పం. ప్ర. ధ్యానదీపము. కేవలము బ్రహ్మలోకమునుమాత్రము పొందనిచ్ఛగలవానికి ఆత్మసాక్షాత్కారము కలుగదనుట. 33 పం. ప్ర. నిర్గుణోపాసకునికి జీవించియుండగాను, లేక మరణకాలమునందును, లేక బ్రహ్మలోకమునందును అపరోక్షజ్ఞానము కలిగి మోక్షమును పొందును అని. 33-34.

## 2వ ప్రకరణము.

బ్ర.సూ. 3అ. 1పా. 9సూ. ఫలాపేక్షతో కర్మములను చేయువాడు ఫలానుభవానంతరము మరలజన్మించును.34-35 భ.గీ. జ్ఞానముకలుగువరకును కర్మములుచేయుమనుట.35-36 పం. ప్ర. పామరవ్యాపారముకంటె తీర్థయాత్ర, యజ్ఞదానాది కర్మములును, వానికంటె సగుణోపాసనమును, దానికంటె నిర్గుణోపాసనమును శ్రేష్ఠము. 36 భ.గీ. వేదవేత్తలు యజ్ఞాదిక్రతువులవలన ఇంద్రలోకాదిఫలమనుభవించుదురు. 36

3వ ప్రకరణము.

బ్ర. సూ. 3అ 4పా. 11సూ. ఫలాసక్తి లేకుండ కర్మములుచేయువాడు ముక్తినిపొందును. భ. గీ. 6అ. డిటో. 37 అ.గీ. మిథ్యాభూతమైన జగద్వస్తువులలో దేనినిగాని కోరక గ్రహింపక, సంతోషింపక, కోపింపక పోవుటయే ముక్తి.37 డిటో జ్ఞానికి సంకల్పవికల్పములే లేనందున ప్రపంచసంబంధమే లేదు. ఇతడు సంసారివలె వర్తించినను దగ్ధపటమువలె సంసారికాడు. 28 భ. గీ. ఫలాపేక్షలేకుండ కర్మములు చేయుము. 39 చిత్తమందు ఇతరాసక్తి లేక పరమేశ్వరార్పణములతో కర్మములుచేయువానిని సంసారబంధమునుండి శీఘ్రముగతొలగించెదనని శ్రీకృష్ణుని ప్రతిజ్ఞ. 39 త్రి తాపిన్యుపనిషత్తు. మనస్సునందు కోరికలులేక పోవుటయే ముక్తి. 40 జీ.వి. సుషుప్తియందువలెనే జాగ్రదవస్థలోకూడా వృత్తులు లేకుండుటయే ముక్తి. 40-41 భ.గీ. ఫలమునుకోరక వర్ణాశ్రమాది విహితకర్మములు చేయువాడు చిత్తశుద్ధికలిగి జగత్తును చిదాత్మముగా భావించును. అట్టివాడు లోకసంరక్షణకొరకు కర్మములు చేయవలెను. 41 భ.గీ. తనను ఆత్మస్వరూపముగా భావించువాడు యోగక్షేమములు పొందును.42 పం. ప్ర. ఆత్మజ్ఞానములేని సకామకర్మములుచేయువానికి జన్మము లేకలుగును. భ.గీ. ఫలమునుకోరకుండ చేయుకర్మములవలన ముక్తికలుగును. 43 జనకాదులు నిష్కామకర్మముచేత మోక్షమును పొందిరి. కొందరుచేయు సకామకర్మములను జ్ఞాని దూషింపకూడదు. అవి భక్తిజ్ఞానములను కలిగించును. 44 జీ.వి. జ్ఞానిచేయుకర్మములవలన శిష్యునికి, భక్తు

నికి తటస్థులుగానున్న ఆస్తికులకును, నాస్తికులకును ఉపకారమగును. పుట 44-46

4వ ప్రకరణము.

బ్ర.సూ. 1అ. 2పా. సగుణమంతయును కల్పితము. ఆత్మ నిత్యమనుటకు 9సూ. చరాచరములుగల జగత్తును భక్షించువాడు బ్రహ్మమే. పం.ప్ర. జగత్తును స్వప్నవస్తువులవలెకల్పితమగుటచేతనిత్యముకాదనియు, దీనికాధారమగు పరమాత్మయే నిత్యమనియు. 47

అ.గీ. త్రాడునుసర్పమనుకొనునట్లే దృశ్యప్రపంచమున్ను కల్పితము. బద్ధత, ముక్తత, అనువానిలో దేనియందు ఎవనికి నిశ్చయాభిమానముండునో వానికదికలుగును. 48

జగత్తు మాయచేతకల్పితము. సద్రూపముకాదు. ఆత్మస్వరూపమే అన్నికాలములయందునుసాక్షిగానున్నది. 49

ఏకాత్మనై నేనీశరీరమునువలె ప్రపంచమునుగూడ ప్రకాశింపచేయుచున్నాను. నాకు ద్వైతభ్రాంతిలేదు. దృశ్యవస్తువులందు ప్రీతియునులేదు. 50

అనిత్యమైన జగత్తు చిదాత్మయందారోపితమైనది. అ.గీ. ప్రతిజన్మమునందును అత్యంతాసక్తితో సంపాదించిన ధన, ధాన్య, రాజ్య, పుత్ర, కళత్ర, మిత్రాదులు నీజన్మమునందు స్పృహకురానట్లే రాగలజన్మములందును రావు. గనుక వీని కొఱకుచేయు ప్రయత్నము వ్యర్థము. 51

కడవలు, మూకుళ్లు మొదలగునామములసత్యములై వానికధిష్ఠానములగు పృథివి నిత్యమగునట్లె అగ్ని, భూమి మొద

లుగాగల జగత్తున్ను నిత్యము కాదు. సర్వమున్ను భ్రమమా త్రికల్పితము. వీనికధిష్ఠానమగు ఆత్మయే నిత్యము అని. 52

5వ ప్రకరణము.

బ్రహ్మసూత్రములందలి అధ్యాసభాష్యము. జగత్తులో నామరూపములుకలవన్నియు జీవులు. వీనికి అధిష్ఠానము పర బ్రహ్మము. మిథ్యాజగద్వస్తుధర్మములు బ్రహ్మమునంటవు. కర్మలు అసంగాత్మయందు వర్ణాశ్రమాది భేదముతో నున్నవి. తత్త్వజ్ఞానమునకు ఆకర్మముల నియమములేదు. అధ్యాస నాలుగువిధములుగానున్నది. జీవేశ్వరులకు భేదములేదు. జీవు లు అనంతములు. ఉపాధినాశ్రయించినపుడే స్త్రీపురుషభేదము కలిగినది. గాని సర్వమున్ను బ్రహ్మమే. ఉపాధినాశ్రయింపన పుడు నిర్గుణమొకటియే. ఉత్తమపురుషార్థముకొరకు పర మాత్మవిమర్శము ముఖ్యము. 53ల॥ 56

1అ॥ 1పా॥ 1సూ॥ వేదమందలి కర్మఫలము అనిత్యము. సాధనచతుష్టయముకలిగి పరమాత్మవిమర్శము చేయుము. వి॥ సాధనచతుష్టయములో కర్మములుగాని, జాతిగాని, ఆశ్ర మములుగాని, వానిధర్మములుగాని లేవు. 57

2సూ॥ జగత్సృష్టి స్థితి లయములు చేయునదియే బ్రహ్మ ము. 3సూ॥ బ్రహ్మము ఋగ్వేదాది శాస్త్రోత్పత్తికి కారణ ము. లేక ఆశాస్త్రమువలన తెలియునది. 58

4సూ॥ వేదశ్రుతులవల్లన బ్రహ్మమే ప్రతిపాదింపబడు చున్నది. 59ల॥ 63

భ.గీ. నాయొక్క జడప్రకృతియే పృథివ్యాది పంచమహా సూక్ష్మభూతములున్ను, మనోబుద్ధ్యహంకారాదులున్ను, నా

రెండవప్రకృతియే పరాశక్తి. అవినాశుద్ధరూపము. జగత్తును ధరించుచు బ్రహ్మాదులను నియమించుచున్నది. కొందఱు మూఢులు మాయకులోబడి ఇట్టిగుణమూర్తిగా నన్ను సేవింపలేరని శ్రీకృష్ణుడు చెప్పెను. 63ల॥ 64

భ॥గీ॥ కర్మయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము శ్రేయము. త్రిశతి॥ చిచ్ఛక్తియే శ్రీకృష్ణరూపమును పొందెనని శ్రుతిచెప్పుచున్నది. వివరణము--అందువలననే దశావతారములలో శ్రీకృష్ణావతారమందు జన్మించినదిమొదలు భగవంతునిలీలలు కనపర్చబడినవి. 65

బ్ర॥సూ॥ 2అ॥ 3పా॥ 9సూ॥ జగత్సృష్టిలయములకు మూలప్రకృతిని అంగీకరించినపుడు అనవస్థలేదు. ఆమూలప్రకృతియే మాకుబ్రహ్మము. అని శంకరాచార్యులుచెప్పెను. 66

బ్ర॥ 1అ॥ 4పా॥ 23సూ॥ మట్టి ఉపాదానకారణము దానివలన కుండచేయునట్టి కుమ్మరి నిమిత్తకారణము. పరబ్రహ్మమే నిమిత్తోపాదానకారణములు. 67-68

బ్ర॥ 24సూ॥ 'సోకామయత' యను శ్రుతికర్తృత్వమును, 'బహుస్యాం' యను శ్రుతి ప్రకృతిత్వమును చెప్పుచున్నవి.69

25సూ॥ బ్రహ్మము ఉపాదానకారణమే. ప్రకృతివలన కలిగిన జగత్తు లయమందు ప్రకృతియేయగును. 26సూ॥ జగత్తు బ్రహ్మమునుండి పుట్టుటవలన బ్రహ్మము ప్రకృతియే. 27సూ॥ యోనియనగా కారణము. బ్రహ్మము జగద్యోనియని శ్రుతికలదు. యోనిశబ్దముచేత ప్రకృతియే ఉపాదానకారణము. అది స్త్రీలకును వర్తించును. ఈశ్రుతిశబ్దము ఈశ్వరునకు ప్రకృతిత్వమును చెప్పుచున్నది. 70

28సూ॥ ప్రధాన, బౌద్ధ, జైన, తార్కిక మొదలగు వాదములన్నియు పరిహరింపబడినవి. 71

1అ॥ 1పా॥ 24సూ॥ ఇట జ్యోతిశ్శబ్దముచేత బ్రహ్మమే. కాని అగ్ని కాదు. 25సూ॥ ప్రపంచమును గాయత్రి యని ఛందస్సు చెప్పుటవలన మనస్సును ఆత్మయందైక్యముచేయుట చేత విరోధములేదు. గాయత్రి బ్రహ్మోపాసనముగా శ్రుతి చెప్పుచున్నది. 72

26సూ॥ శ్రుతిలో పృథివ్యాది భూతములు పాదములుగా చెప్పుటచేత బ్రహ్మమే కాని ఛందస్సు కాదు. దానికి పంచ భూతములు పాదములు కాజాలవు 27సూ॥ జ్యోతిశ్శబ్దము బ్రహ్మపరమే. 73

1అ॥ 2పా॥2సూ॥ మనోమయత్వాది గుణములు బ్రహ్మమునకే తగును. 1అ॥ 4పా॥9సూ॥ అజామంత్రవాచ్యమగు ప్రకృతి పరమేశ్వరశక్తియే. కాని సాంఖ్యమతప్రధానముకాదు. 74

2అ॥ 1పా॥ 24సూ॥ పాలు పెరుగుఅయినట్లే బ్రహ్మము శక్తివలన జగద్రూపపరిణామమగును. 75

25సూ॥ దేవతలు, పితరులు, ఋషులు మొదలగువారు బాహ్యసాధనసామగ్రిలేకయే సంకల్పమాత్రముచేత నానా విధశరీరములు, ప్రాసాదములు మొదలగునవి సృజించినట్లే బ్రహ్మమున్ను సంకల్పమాత్రముచేత సృజించును. 26సూ॥ జగత్కారణము బ్రహ్మమను నెడల అవయవములు లేనివానికి పృథివ్యాదులు అవయవములు కావలయును. లేదా అవయవములు లేవనిచెప్పిన శ్రుతులకు విరోధమైనను కలుగునని పూర్వపక్షము. 76

27సూ. బ్రహ్మమును తెలిసికొనుటకు వేదమేప్రమాణము 77

30సూ॥ పరయగు దేవత సర్వశక్తులు కలదని శ్రుతులు చెప్పుచున్నవి. 31సూ పరదేవత దేహేంద్రియాదులు లేకున్నను కార్యముచేయగలదని శ్రుతులు చెప్పుచున్నవి. 78

37సూ॥ సర్వజ్ఞత్వాది ధర్మములుగల ప్రకృతి బ్రహ్మము నందేకలదు. గనుక నీ రెండిటికిని నిస్సంశయముగ భేదము లేదు. దేవీపురాణము- గాన నృత్యములచేత దేవతలవలన ధ్యానింపబడి రక్షించుటచేతను, ధాం. మననముచేయువారిని రక్షించుటచేతను, మహావాసిష్ఠ రామాయణము-గానముచేత తెలిసికొనబడుటచేతను గాయత్రి. 79

గా॥ 3సూ॥ చిచ్ఛక్తియే చైతన్య (ఆత్మ) స్వరూపము.80

4సూ. ఇదియె నిర్గుణమగు శ్రీవిద్యయు, మోక్షస్వరూపమును, మూడు అక్షరములుగల బాలావిద్య బ్రహ్మవిద్య. బృ. ఆమూడక్షరములుగల విద్య హృదయరూపము. సత్యరూపమున్ను. 81

ఈశ్వరప్రత్యభిజ్ఞ సూత్రములు. 1సూ. చిచ్ఛక్తి ఇతరాపేక్షలేకనే జగత్సృష్ట్యాదులను చేయుచుండును. 13సూ. భస్మముచేత అగ్నివలె అజ్ఞానముచేత చిదగ్నికప్పబడినను జ్ఞానవిమర్శముచేత అగ్నిసాక్షాత్కారము చేయుచున్నది. సుషుప్త్యవస్థలోనున్నట్లే జాగ్రదాద్యవస్థలలో వృత్తులులేకుండుటయే చిద్రూపావస్థ. 14సూ. చిదగ్నివృద్ధిపొంది మాయాకార్యములను దహించును. 15సూ. చిద్రూపసిద్ధికలిగినవానికి దేహప్రాణాదులు స్ఫురించినను జీవన్ముక్తి కలుగును. 82

16సూ. సుషుమ్నానాడియొక్క వికాసమువలన చిద్రూ

ప్రసిద్ధికలుగును. హృదయమందలి చిచ్ఛక్తి కంటె జగత్తు వేఱు కాదు. 83

షోడశీభాష్యం-ఓ దేవీ నిన్ను విడిచి కేవలము నన్ను భజించినవారు నూఱు బ్రహ్మకల్పములకైనను నా సాయుజ్యమును పొందలేరని ఈశ్వరుడు చెప్పెను. 84

షో॥ శబ్దము శక్తిస్వరూపము. అర్థము శివస్వరూపము. శబ్దార్థములకువలెనే శివశక్తులకును భేదములేదు. షో॥ చిచ్ఛక్తి అనగా చిదాకారమైన శక్తి అనియు, లేక ఆత్మను జగదాకారముగ చేయుసమర్థతకలదనియు, లేక ఉపాసకునకు ఆనందముకలిగించునదనియు అర్థము. శాక్తదర్శనమునందు బాలామంత్రబీజములమీద పరబ్రహ్మముగా చెప్పబడినది. 85-87

షోడశీమంత్రబీజోద్ధారభాష్యము- బ్రహ్మవిద్యయగు గాయత్రిమంత్రముయొక్క మూడుపాదములనుండి పంచదశీమంత్రము మూడుఖండములును, దానినుండి బాలామంత్రబీజములు మూడును, దానినుండి ఓంకారమును, దానినుండి బిందుస్వరూపమును కలిగెను. సోహం అనునది ఆత్మమంత్రమంత్రము. ఇది సమస్తమునకు బీజము. 88

త్రి॥ర॥ అద్వైతసుధాసారము. జగత్సృష్టికర్త పరబ్రహ్మమేకాని యితరముకాదు. శివ, విష్ణు, గణేశ, సూర్య చంద్రాదులని ఆయామతస్థులచేత కల్పితనామములుగాని వాస్తవముకావు. 89

మోహమునుకలిగించిన పరమేశ్వరుని భక్తిచేత నారాధించిన పురుషునకు ఆమోహముతొలగును. పరమేశ్వరుడు

భక్తులయెడల దయగలవాడు. ప్రారబ్ధమున్న, నోసటివ్రాత యును, ఈశ్వరభక్తులకే మారును. 90

పరమేశ్వరుడు ఏదేవతనారాధించిన భక్తునకు ఆదేవతా రూపముననే కోరికలను దీర్చును. అతనిదేహము చిత్స్వరూ పము. ఆచిత్తు త్రిపురాపరమేశ్వరిగా భాసిల్లుచున్నది. నిష్క ళంకమగు అట్టిచిద్రూపమునే సేవింపుము. అట్టిసమర్థతలేనవు డు సోపానమువంటి సగుణరూపమును సేవింపుము. అట్లుచేయ నిదే కోటిజన్మములకైలను ముక్తికలుగదు. 91

పరాశక్తియొక్క అనుగ్రహములేనిదే చిద్రూపవిమర్శ ముకలుగదు. ఆత్మస్వరూపమునకుకాని మిగిలినవ్యాపార ములన్నియు స్వప్నతుల్యములు. సుషుప్త్యవస్థకును, జాగ్రద వస్థకును, మధ్యను భాసించునది చిద్రూపమే. 92-93

జగద్వస్తులన్నిటియొక్క నామరూపములను తీసివేయగా మిగునదియే ఆత్మరూపము. తాను ఆస్వరూపమేయని నిశ్చ యజ్ఞానముగలవాడు ముక్తుడు. జగత్తునకు ఆత్మస్వరూపమధి ష్ఠానమని తెలియగా జగద్వస్తువులు మిథ్యయగును. పంచ కృత్యములను విడిచి క్షణమాత్రము మనస్సును నిరోధించిన వానికి ఆత్మవస్తువు చూడబడును. ఈచరాచరజగత్తంతయు ను చైతన్యమే అని నిరంతరము సేవింపుడు. జగన్మాత సకల మును చేయుచున్నను చేయనిదే. సాక్షిగాచూచునది. భ్రమ రకీటన్యాయమున పురుషుడు నిరంతరము భావించెడిరూపము ను పొందును. మాయాశక్తిమహిమచేత పండితాభిమానులు పరతత్త్వమును వినియును, కుతర్కములచేత దానినుపేక్షిం తురు. 94లు 97

యో॥వా॥ సంతోష సత్సాంగత్యాదులు మోక్షసాధనములు. వీనిచేత ప్రియత్నింపుము. యథాలాభసంతుష్టితోను సౌమ్యమైన ఆచారముతోను ఉండుటయే సంతోషము. చిచ్ఛక్తియొక్క విమర్శమువలన జ్ఞానాజ్ఞానవాసనలు నశించి చిద్రూపుడగును. తాను దేహిననుకొనుటయే బంధము. తనతోకూడిన జగత్తు బ్రహ్మమనెడి దృఢనిశ్చయమే మోక్షము ప్రతిదేశమందును, ప్రతిక్షణమందును, సంభవించినంతసత్సంగముతో విమర్శించువానికి మోక్షమే. కాని మరలజన్మము లేదు. యుక్తమైన వాక్యము బాలుడుచెప్పినను గ్రహింపతగును. 98ల॥ 101

జీ॥ వి॥ అన్ని శరీరములయందును పరమేశ్వరుడున్నను ఉపాసనలేనిదే హితమును చేయడు. 101

అపరోక్షానుభూతి- విమర్శమనెడి సాధనము లేనిదే జ్ఞానముసిద్ధింపదు. కాకి మలమందువలెనే జగద్వస్తువులందును ఇచ్ఛలేకుండుట దృఢవైరాగ్యము. జగత్కారణము చిత్తు (బ్రహ్మము) సమస్తనామరూపములును, కర్మములును, బ్రహ్మముగా చూచువానికి శోకమోహములు లేవు. 102-103

దధీచిసంహిత- భువనేశ్వరీబీజోపాసనము బ్రహ్మవిద్యోపాసనమే. సృష్టికిపూర్వము ఈజగత్తు చిద్రూపమందులీనమైయున్నది. 103

త్రిశతినామములు 98 హ్రీంకారము ఓంకారమువలెనే బ్రహ్మోపాసనకు సన్నిహితకారణము. 104

149 బ్రహ్మముయొక్క నిట్టూర్పులే వేదములు. బ్రహ్మమే శాస్త్రములకు కారణము. పరమేశ్వరి యీవిధముగా

కళలను, విద్యలను ప్రకాశింపచేయు ముఖముకలది. 180జీవ భ్రాంతిగల బ్రహ్మావిష్ణ్వాది దేవతలు కల్పింపబడినవారై ఈ శక్తియొక్క ఆజ్ఞకు బద్ధులై యుండిరి. 105

217 సచ్చిదానందరూపమనెడి బ్రహ్మమునకు లక్ష్యార్థము ఈచిచ్ఛక్తియే. త్రిపురాసిద్ధాంతము- నారాయణునికిని, ఈశ్వరునికిని, చిచ్ఛక్తికిని, భువనేశ్వరికిని, సేవకునకును భేదములేదని. 106

జ్ఞానార్ణవము- సదాశివుడు శక్తిలేనికాలమునందేమియును చేయలేడు. శ్వేతాశ్వతరోపనిషత్తు- పరబ్రహ్మమే దేవతలలో నత్యుత్కృష్టము. తైత్తిరీయశ్రుతి- బ్రహ్మము చూచుటచేతనే జడశక్తి జగత్తును పుట్టించెను. చూచుటకుగల శక్తియే చిచ్ఛక్తి. శ్రుతి॥ సర్వాంతర్యామియగు ఈశ్వరుడే సగుణుడును, నిర్గుణుడును, శక్తిస్వరూపుడును, శక్తి అతనికంటె వేఱుకాదు. చిచ్ఛక్తియే మాయగను, అవిద్యగను పరిణమించినది. 107

శివసూ॥ చైతన్యమే చిద్రూపము. భా॥పత్తు॥ చిద్రూపధ్యానమే ఉత్తమమార్గము. స్మృతి॥ బ్రహ్మమును స్త్రీరూపముగాను, లేక పురుషరూపముగాను, లేక నిర్గుణముగాను ధ్యానింపదగును. బ్రహ్మము స్త్రీకాదు, పురుషుడును కాడు. ఉపాధులనుబట్టి ఆయాభేదములుకలిగినవి. దే॥భా॥ సృష్టికి పూర్వమున్నది ఆత్మయనెడి చిద్రూపమే. దానియందు మాయయనెడి శక్తిగాక దానికివిలక్షణమైన వస్తువున్ను కలదు. అవిబ్రహ్మమునందు భేదములేనిది. దానినుండియే సృష్ట్యాదులు జరుగుచున్నవి. అని పార్వతీదేవి చెప్పెను. 108

దే॥ అన్నిటియందునుగల శక్తియే చిచ్ఛక్తి రాక్షసుల చేత పీడింపబడుచున్న హరిహరాదులనే నరులు సేవించుచు న్నారు. కాని దుఃఖములులేని మోక్షమునిచ్చు నిన్ను సేవింప లేకున్నారని పరమేశ్వరిని ఇంద్రాదిదేవతలుచేసినస్తుతి. 110

సూత॥ హంసమంత్రము ఆత్మరూపమనియు, సకారము సంవిద్రూపమనెడి శక్తియనియు, హంబీజము నిష్కలపరశివ స్వరూపమనియు, ఈరెండును శబ్దార్థములవలె నున్నవనియు.
111-112

శ్రు॥ పూర్ణమగు అహంభావనారూపమయినది హంస స్సోహమనుట. సూత॥ భువనేశ్వరీమంత్రజపమువలన మహా పాతకములు నశించును. 113

సూత॥పరశివుడు శక్తితోకూడినపుడే నరులకు భుక్తిము క్తులనిచ్చును. వీరికి భేదమున్నదని తలచుటయే మిథ్య. మ॥వా॥ జీవులకు జీవనాధారము గనుక చిత్తుయనబడును. స్మృ॥ సచ్చిదానందములో సత్తు చిత్తు శివరూపము. ఆనంద ము శక్తిరూపము. భో॥ వృత్తి॥ సృష్ట్యాది పంచకృత్యములను విడిచి స్వరూపమాత్రముగనుండు చిచ్ఛక్తియే మోక్షమన బడును. 114

సౌ॥సం॥ బ్రహ్మముతో అభిన్నమైన శక్తిని భిన్నమని తలచుటయే అవివేకము. ప॥పు॥ సర్వజీవుల చిత్తమునందును చిత్కలయను శక్తికలదు. ద॥సం॥ ముక్తిని పొందగోరినపుడు చిద్విద్యనుపదేశించు గురువునాశ్రయింపవలయును. 115

హాది కాది విద్యలును, షోడశీవిద్యయును, బ్రహ్మవిద్యయే గనుక వీనియందు నిష్ఠగలవారు ముక్తులగుదురు. మా॥ పు॥

ఓ దేవి నాశములేని నీయందు జగత్తున్నది. ద॥సం॥ మోక్షే
చ్ఛగలవారు శ్రీవిద్యను సేవింపవలెను. మోక్షముకొఱకు దే
వతలుగూడ భూలోకజన్మమును కోరుదురు. 116

బృ శు॥ సృష్టికిపూర్వముగల ఆత్మయే పురుషుడనియు,
శక్తిఅనియు భార్యాభర్తలరూపమై జగత్తును సృజించెను.117

ల॥స॥ బ్రహ్మమునందున్న శక్తియును బ్రహ్మమే. క.శ్రు
సత్యమువలన ముక్తి కలుగును. జీ.వి॥ నరులు పుణ్యకర్మమును
చేయకుండా పుణ్యఫలమును కోరుదురు. పాపఫలమును కోర
రు. గాని యత్నముచేత పాపకర్మమునే చేయుదురు. 118

బ్ర.పు॥ జ్ఞానవిద్యాస్వరూపమై ఆద్యంతములులేని చిచ్ఛ
క్తిని సనకాదిమునులు సేవించుచుందురు. వా॥తం॥ పరమేశ్వ
రుడు శక్తితోనున్నపుడే సమస్తముచేయగలడు. 119

త్రి॥తా॥ఉ॥ పూర్ణజ్ఞానము కలిగినపిమ్మట గ్రంథాభ్యాస
మును విడువవలెను. శ్రు॥ ప్రతిదినము సుషుప్తివరకును ఇట్లు
మరణమువరకును పరమాత్మవిమర్శమే చేయవలయును.

బ్ర॥సూ॥ 4అ॥ 1పా॥ 1సూ॥ ఆత్మసాక్షాత్కారమువరకును
సర్వదా విమర్శింపవలెను. 120

ల॥స॥ తరుచుగచేయు అభ్యాసమువలన చిచ్ఛక్తి తెలియ
బడును. త్రి॥ర॥ అనేకవ్యాపారములున్నను స్వరవర్ణలోపము
లులేకుండ నుచ్చరించు శ్రుతి ఉత్తమము. అన్యవ్యాపారము
చేయునపుడు ప్రమాదముతో నుచ్చరించుట మధ్యమము.
తప్పునేమోయని భయపడుచు పఠించుట అధమము. పం॥ప్ర
అపరోక్షజ్ఞానము దృఢమగువరకును వేదాంతశ్రవణ మననా
దులు చేయవలెను. 121

గ॥పు॥ బ్రహ్మచర్యవ్రతము మొదలగునవికలవారికి జాతా శౌచ మృతాశౌచములు లేవు. లిం॥ పు॥ శివశక్తులు చంద్ర చంద్రికలవలె నొకస్వరూపమే. 122

వి॥ పు॥ దేవతలు, నరులు మొదలగువానిలో పురుషవా చకములన్నియు, విష్ణుస్వరూపము. స్త్రీవాచకములన్నియు, లక్ష్మీస్వరూపము. బ్ర॥ వై॥ మూడులోకములయందును, స్త్రీ రూపములన్నియు పరమేశ్వరి అని శాస్త్రనిశ్చయము. హ॥ వం॥ భక్తులయొక్క జననాది సంసారదుఃఖములను నీవు తొ లగించెదవని పరమేశ్వరిని విష్ణుమూర్తిచేసినస్తుతి. 123

వా॥పు॥ ఓదేవీ నిన్ను సేవించువారికి ఆపదలుకలుగవని బ్ర హ్మాదులుచేసిన స్తుతి. కూ॥పు॥ నన్నుశరణుపొందినవారిఆపదల నన్నిటిని నశింపుచేసెదనని పరమేశ్వరిచెప్పెను. పరమేశ్వరు డు తనస్వరూపమును శివుడనియు, విష్ణువనియు, పరాశక్తి అనియు విభజించెను. 124

వివరణము-భగవద్గీతాది గ్రంథములలో నారాయణుడు గాను, పరాశక్తిగాను శివుడుగాను చెప్పబడిన మూడింటినే పరమాత్మగా తరుచుగ ధ్యానాదులాచరింపబడుచున్నవి. 125

అహం అనునది ప్రకాశవిమర్శలనెడి శివశక్తులస్వరూప ము. ప్రజ్ఞానం బ్రహ్మేత్యాది మహావాక్యార్థవివరము. 126

వా॥ర॥ అర్థము తెలియని శబ్దోచ్చారణచేత ఫలములేదు. 127-128

దే॥ వే॥ స్త॥ గతజన్మములందలి యితరదేవతారాధనఫల మువలన చిచ్ఛక్త్యుపాసనమును, ముక్తియునుకలుగును.

పం॥ శీ॥ స॥ మహాప్రళయమునందుశక్తిమాత్రమే సాక్షి

గానున్నది. కొందరు తనయందున్న పరాశక్తిని తెలిసికొనలేక ఆత్మహత్యను చేసికొనుచున్నారు. ఏకశ్లోకి. ఏ తేజస్సుచేత సర్వమును తెలిసికొనుచున్నావని శంకరుడు అడుగగా తుదకు పరబ్రహ్మమని చెప్పబడినది. 129

మనీషాపంచక వ్యాఖ్యానశ్లోకములు- 1 నిర్గుణపరబ్రహ్మమునకును 2 శ్రీశంకరాచార్యసగుణమూర్తికిని నమస్కారములు. శ్రీకాశీలో ఈశ్వరునకును, శ్రీశంకరాచార్యులకును జరిగిన సంవాదము. 132

సచ్చిదానందరూపమగు బ్రహ్మమునందు వీడు ఛండాలుడు, వీడు బ్రాహ్మణుడు అను నియమములేదనే మొదలగు వాక్యములు. 133-134

మనీషాపంచక 1 శ్లో॥ మూడుకాలములయందును ప్రకాశించు జ్ఞానమే నేను. దృశ్యమగు ఈశరీరపదార్థములు నేను కాను. 2 శ్లో॥ బ్రహ్మము సర్వవ్యాపకచైతన్యము. జీవేశ్వరరూపమగు ఈభేదప్రపంచకము అజ్ఞానోపాధిచేత కల్పింపబడినది. 3 శ్లో॥ ఈజగత్తు అనిత్యమని నిశ్చయించి నాశములేని పరమాత్మను విమర్శించుచు వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానములు గలవాడును. 138

4 శ్లో॥ అట్టిబ్రహ్మముయొక్క ప్రకాశచేత ఆత్మస్వరూపము తానేయని భాసించువాడును, నిత్యనిరంతరబ్రహ్మానుసంధానముగలవాడును, ఎవడైనను నాకుపూజ్యుడే. వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానములు మూడును సమకాలాభ్యాసమువలననే శీఘ్రముగా జ్ఞానసిద్ధికలుగును. 142

5 శ్లో॥ స్వప్రకాశచిద్ఘనసదానందైకరసమందు మునిగిన మనస్సుగలవాడు బ్రహ్మముతో భేదములేనివాడు గనుక అట్టి ఏజాతివాడైనను నాకుగురువే. 144

1 నేను ఘనమైన ఆనందచిద్రూపుడను. గనుక నాకుసంసారబంధములేదు. 2 జగత్కారణమైన బ్రహ్మమే నేనని సర్వదా మానమునాశ్రయింపుము. 3 సహజానందము నాశ్రయించి ఆశనుపారదోలుచున్న నాయందు ఆపత్తులు ప్రవేశింపనేరవు. 146

దశశ్లోకి॥ 1 నేను పంచభూతములును కాను. ఇంద్రియములును కాను. ఆనందస్వరూపుడగుశివుడే నేను. 2 వర్ణాశ్రమాదులుగాని, వాని ఆచారములుగాని, నాకు లేవు. 3 తల్లి తండ్రిలు, దేవతలు, లోకములు, యజ్ఞములు, మొదలగునవి పరమాత్మను వర్ణింపలేవు. జగత్సాక్షియగు శివస్వరూపమే నేను. 4 సాంఖ్య శైవ పాంచరాత్ర బౌద్ధ పూర్వమీమాంసాది మతములు నాకులేవు. 5 నాకు లోపల వెలుపల అడ్డము పొడవు తూర్పు పశ్చిమము మొదలగు భేదములులేవు. ఆకాశమువలె పూర్ణమైన పరశివుడనే నేను. 6 నాకు తెలుపు నలుపు మొదలగునవిలేవు. జ్యోతిస్వరూపమునే నేను. 7 మాయచేత కల్పితమైన గురువు, శిష్యుడు, శాస్త్రము, ప్రపంచము మొదలగునవి నేనుకాను. వికల్పములులేనివాడను. 8 జాగ్రత్స్వప్న సుషుప్తులు నాకు లేవు. విశ్వ తైజస ప్రాజ్ఞులును నేనుకాను. వానికతీతమైన తుర్యస్వరూపుడను. 9 దృశ్య ప్రపంచమునకు సాక్షిగనున్న బ్రహ్మమునే నేను. 10 బ్రహ్మము అద్వితీయమైనది గనుక వాక్కుచేత చెప్పశక్యము కాదు.

11 పైపదిశ్లోకములను పఠించువారు సచ్చిదానందరూపుల గుదురు. 147ల॥ 151

జీ వి॥ తపస్సుచేతనే దేవతలు ఉత్తములైరి. ఋషులు సువర్లోకమును పొందిరి. జ్ఞానభూమికలలోని పూర్వపుభూమి కలునలెనే ఉత్తరభూమికలును తపస్సనబడును. ఇదంశబ్ద ముచేత చెప్పబడునవి అన్నియును అహమందులయముచేయు చు చిదూ్రిపానందము ననుభవించుచున్నాను. ఆత్మస్వరూప ము అన్నిటియందునున్నందున నాయాత్మను నిందచేసినవాడు తనయాత్మను నిందచేసికొనినవాడే. నాశరీరమును నిందచేసిన వాడు నాకుస్నేహితుడే. కేవలపరబ్రహ్మమును నేనే. నాకంటె భిన్నమైనదేదియును లేదు. 151-152

స్మృతి॥ మృత్యువువలన నీకు భయమెందుకు? భయము న్నను యముడు విడువడు. పుట్టనివానిని గ్రిహింపడు గనుక మరలజన్మములేని జ్ఞానయత్నమేచేయుము. జీ. వి. సంశయ విపర్యయములు జ్ఞానప్రతిబంధకములు. 153

సాక్షాత్కారపర్యంతము దేవతనుపాసనచేసినవాడే జ్ఞాన విద్యకు ముఖ్యాధికారి. 156

జన్మమునుకలిగించు కామ్యకర్మలను త్యజించుటకూడా సంన్యాసమే. అది స్త్రీపురుషులందరికిని కలదు. 157

నాతల్లి శుద్ధచిత్తు నేను జీవుడనెడి చిత్తును. నాచెలికత్తె యగు బుద్ధి అవిద్యతోస్నేహముచేసెను. అవిద్యయొక్క కు మారుడు మహామోహుడు బుద్ధితోక్రీడించుటచేత అస్థిరమన స్సుదయించెను. ఆమనస్సునకు సంకల్పములనెడి చపలభార్య వలన శబ్దస్పర్శరూపరసగంధములుదయించెను. మనస్సు వీరి

వద్దకుగల రాకపోకలుచేత సుఖదుఃఖములు పొందుటయేగా
క. మనస్సు ఆశను భార్యగాగ్రహించి దానివలనకలిగినక్రోధ
లోభములవలన లోకనిందను పొందును. నాకిట్టి దుష్టసాంగ
త్యమున్నను వానిననుసరింపక సంసారమును ఆభాసముగచూ
చుచున్నట్లే నీవును చూడుమని హేమలేఖ తనభర్తతో
చెప్పెను. 159లు161

## 6వ ప్రకరణము.

యో॥వా॥ ఉపాధినిపొందిన మనస్సు బ్రహ్మముతో ఐక్యానుసంధానములేనిదే చిద్రూపముకానేరదు. ప్రయత్నముచే బ్రహ్మపదమందు మనస్సునిలిపితివేని అత్యంతసుఖముకలుగును. పూర్ణమైన అభ్యాసముచేత శాస్త్రసత్సంగాదులు కలవాడు మోక్షమును పొందును. అనిచెప్పిన వసిష్ఠమహామునిని నా పురాకృతవాసనలనతిక్రమింపగలనా యని శ్రీరామమూర్తి యడుగగా పురుషప్రయత్నముచేతనే గతజన్మవాసనలు నశించును. కాని వేఱొక విధముగా నశింపదు. శత్రుమిత్రులయందుగల సమబుద్ధిచేత నీచిత్తము స్వాధీనమగునని వసిష్ఠమహాముని చెప్పెను. 161లు166

త్రి. ర. శ్రద్ధతో పురుషప్రయత్నముచేయువానికి అన్నియును స్వాధీనమగును. 166

అ. గీ. దేహాదివిషయములందాసక్తిని విషమువలెనే విడువుము. శమదమాదులుకలిగి ఆత్మను విమర్శింపుము. పంచమహాభూతములుగాని వానిగుణములుగాని నీవుకావు. అవిఆత్మధర్మములుకావు. సాక్షిమాత్రమైన ఆత్మయే నేనని భావింపుము. అనిజనకరాజుతో అష్టావక్రుడు చెప్పెను. 167

గురుగీత స్కాం॥ 1-2శ్లో॥ మూడుకాలములయందును చిదే కరసమై ప్రత్యక్షగురురూపమగు పరమాత్మను ధ్యానింపుము 3శ్లో॥ సర్వోపనిషత్సారము, చిదగ్నిరూపము, సర్వశాంతము నగు గురుపాదములను ధ్యానింపుము. 4-5శ్లో॥ యోగపీఠస్థుడు, పరమేశ్వరుడు నగు సద్గురువును ముక్తికొరకు శిరసాను స్మరించుచున్నాను. బ్రహ్మముహూర్తమందు అట్టివానిని శిరస్సునందు ధ్యానింపుము. బ్రహ్మస్వరూపము కాతగినగురు దీక్షను పార్వతీదేవికొరంగా సదాశివుడు చెప్పుచున్నాడు. గురుస్వరూపమే పరశివుడు. పరశివుడే గురుస్వరూపము. అది పరబ్రహ్మస్వరూపమే. కాని వేఱుకాదు. 168లు 172

బ్రహ్మజ్ఞానోపదేశముచేయు గురువు నాశ్రయించుమని శ్రుతులు ఘోషించుచున్నవి. 172

కైవల్యమే పరబ్రహ్మస్వరూపము. కర్మలనువిడిచి బ్రహ్మనిష్ఠయందుండి శ్రుత్యర్థమును తెలిసినవాడే గురువు. యో॥ వా॥ సజ్జనసాంగత్యములేనిదే సంసారబంధము తొలగదు. స్వరూపసాక్షాత్కారముకలవారే సజ్జనులు. 173

త్రిం॥ర॥ సత్సాంగత్యమే సకలశ్రేయోబీజము. హేమలేఖయొక్క సత్సాంగత్యముచేత భర్త మొదలగు పురవాసులందరును ముక్తులైరి. శ్రద్ధయేసమస్తమునకు జీవనాధారము. శాస్త్రములు అనేకవిధములుగానున్నను చిచ్ఛక్తిసేవయే ముఖ్యమని హేమలేఖచెప్పెను. 174-175

స్మృతి॥ బాల్యమనెడి బ్రహ్మచర్యమందు విద్యను, ఆర్జింపలేదు. యౌవనమందు ధనముచు సంపాదింపలేదు. కౌమార

నకు వర్తింపదు. 14సూ॥ కర్మజ్ఞానము విద్యాస్తుతికొరకు చెప్పబడెను. 187

15సూ॥ కొందరువిద్వాంసులు పుత్రధనాదులవలన ప్రయోజనములేదనితలచి ఇచ్ఛచేత కర్మమునువిడుచుచున్నారు. 16సూ॥ విద్యాసామర్థ్యమువలన ప్రపంచనాశమును చూపుచున్నది. 17సూ॥ కర్మములులేని సన్యాసాశ్రమమందును జ్ఞానవిద్యకలదు. 188

18సూ॥ సన్యాసాశ్రమమునకు విధిలేదని పూర్వపక్షము. 19సూ॥ సన్యాసము విహితమని సిద్ధాంతము. 20సూ॥ సన్యాసులు వేదాంతజ్ఞానముచేత ముక్తులగుదురు. 190

21సూ॥ కొన్నిశ్రుతులు ఉపాసనవిధులనే చెప్పుచున్నవి. 22సూ॥డిటొ. 23సూ॥ కొన్నిశ్రుతివాక్యములు విద్యయొక్క స్తుత్యర్థములే. 191

24 కొన్నికథలకు పారిప్లవార్థములేదు. 25 జ్ఞానవిద్యకు అగ్నిహోత్రాదికర్మముల యపేక్ష లేదు. 192

26సూ॥ యజ్ఞాదికర్మములు విద్యాసాధనములు. 27సూ॥ శమదమాదులు విద్యకుసాధనమనుటచేత యజ్ఞాదికర్మములును సాధనములేయగును. 193

28సూ॥ ప్రాణోపాసకుడు ప్రాణముపోవుననునపుడే యెందరియన్నమును భుజింపవచ్చును. 194

29సూ॥ ఇట్లుచెప్పుట అర్థవాదము. 30సూ॥ భక్ష్యమును గూర్చిన శ్రుతులు అర్థవాదమే. 31సూ॥ డిటొ. 195

32సూ॥ నిత్యములగు ఆశ్రమకర్మములు మోక్షేచ్ఛలేనివాడును యావజ్జీవము చేయవలెను. 33సూ॥ ఆశ్రమకర్మము

లు చిత్తశుద్ధిద్వారా జ్ఞానసాధనములగును. 34సూ॥ ఫలము ను కోరకుండా అగ్నిహోత్రాదికర్మములుచేయువాడు సన్యాసియు, యోగియును. 196

35సూ॥ బ్రహ్మచర్యాదిసాధనసంపన్నునకు రాగాదిక్లేశములు నశించును. 36సూ॥ విధురాదులకును, కర్మములులేని చెవుడు, గుడ్డి, మూగ మొదలగునవిగలవారికిని జ్ఞానవిద్యాధికారముగలదు. 37సూ॥ దిగంబరులుగానుండి ఆశ్రిమకర్మములుచేయనివారు మహాయోగులని చెప్పబడినది. 38సూ॥ విధురాదులకును జపోపవాసదేవతారాధనాది ధర్మములుకలవు. 197

39సూ॥ ఏదోయొకయాశ్రిమముండుట శ్రేయము, బ్రహ్మజ్ఞానమునకు పుణ్యకర్మములు సాధనములు. 198

40సూ॥ సన్యాసమునుపొందినవాడు మరల గృహస్థాశ్రిమమునకు రాకూడదు. 199

41సూ॥ బ్రహ్మచర్యవ్రతమునుండి జారినవానికి ప్రాయశ్చిత్తములేదని పూర్వపక్షము. 42 ప్రాయశ్చిత్తముకలదని సిద్ధాంతము. 42సూ॥ వానప్రస్థునికిని వ్రతలోపముచేత ప్రాయశ్చిత్తముకలదు. 200

43సూ॥ నైష్ఠికబ్రహ్మచారి మొదలగువారికి మహాపాతకమైనను, ఉపపాతకమైనను కలిగినపుడు ప్రాయశ్చిత్తముకలదు. 201

44సూ॥ కర్మాంగోపాసనలు యాజమానిచేయవలయునని పూర్వపక్షము. 45 ఋత్విజుడేచేయవలయునని సిద్ధాంతము. 202

46 శ్రుతుల శ్లోకలవు. 47 మౌనములనగా నిధిధ్యాసము విధిగాచేయవలయును. 203

48సూ॥ గృహస్థులు విద్యాసాధనములనన్నిటిని గ్రహింపతగును. 49 సన్యాసమునకును గృహస్థాశ్రమమునకును ఉన్నట్లే వానప్రస్థ బ్రహ్మచర్యాశ్రమములకును శ్రుతిసమ్మతికలదు. 50సూ॥ శ్రుతిలోని బాల్యశబ్దముచేత బాలులవలె దంభదర్పాద్యభిమానము లేకుండాఉండుమని అర్థము. 204

51సూ॥ 26సూత్రము మొదలు ఇంతవరకువిద్యాసాధనము చెప్పబడినది. జ్ఞానసిద్ధి ప్రతిబంధములేనపుడు ఈజన్మమందును ఉన్నపుడు జన్మాంతరమునందును కలుగును. 206

52సూ॥ జ్ఞానసిద్ధివలెనే ముక్తిఫలమున్ను శీఘ్రముగాను లేక ఆలస్యముగాను కలుగును. 207

## 9వ ప్రకరణము.

బ్ర॥ సూ 4 అ 1 పాదము 3సూ॥ ఆత్మస్వరూపము తానే యని ధ్యానోపాసనములను చేయవలయును. 208

1 అ 3 పా 9సూ॥ ప్రకరణధర్మములనుబట్టి భూమశబ్దము చేత పరబ్రహ్మమే. 209

## 10వ ప్రకరణము.

4 అ 1 పా 4 సూ॥ సూర్యాది ప్రతీకోపాసమువలనకలుగునది నికృష్టఫలమేగాని ముఖ్యఫలముకాదు. 210

5సూ॥ ప్రతీకములగు సూర్యాదులందు బ్రహ్మదృష్టినుంచువాడు శ్రేయస్సునుపొందును. 211

## 11వ ప్రకరణము.

మోవా॥ జ్ఞానసాధనములగు సప్తభూమికలలో మొదటిది.

మూఢుసివలెనుండక వైరాగ్యసత్సాంగత్యములతో శాస్త్రి మునువిమర్శించుట శుభేచ్ఛ. 2వది పైవానితో ఆత్మవిమ ర్శనము చేయుటయే విచారణ. 212

3వది భోగములనుకోరక దేహమేఆత్మయనెడి భ్రాంతిని విడిచి వైరాగ్యాదులతోను శాస్త్రార్థమునువిమర్శించుట తను మానస. 4వది జగత్తు మిథ్యయనియు, దీనికధిష్ఠానమగు బ్ర హ్మము సత్యమనియు నిర్వికల్పకబ్రహ్మసాక్షాత్కారముకలు గచేయునది సత్వాపత్తి. 213

5వది పైఅభ్యాసమువలన సత్త్వగుణపరిధానుడై కర్మఫల మును కోరకుండుటయే అసంసక్తి. 6వది బాహ్యాంతరములం దు అన్యపదార్థభావనలేకుండ చిదూర్పుడై పరులపేరిరణలేని దే భిక్షాదులకులేవనియవస్థ పదార్థభావిని. 7వది సర్వదా చిదాత్మనే భావించుచు స్వస్వరూపాను సంధానముతోనుండు అవస్థతుర్యగ. 214

12వ ప్రకరణము.

1 అ 1 పా 12సూ॥ ఆనందమయుడు పరబ్రహ్మమే కాని జీవుడుకాడు. 215

1 అ 2 పా 13సూ కంటిలోనున్నపురుషుడు బ్రహ్మమేకాని ప్రతిబింబోపాస్తికాదు. 14సూ॥ బ్రహ్మమునకు స్థానాదులు ఉ పాసనకొఱకు శ్రుతులుచెప్పుచున్నవి. 217

1 అ 3 పా 13సూ॥ ధ్యానోపాసనముల నెడికర్మ చెప్పుటవ లన ఆపురుషుడు పరబ్రహ్మమే. 218

3 అ 3 పా 16సూ॥ ఆత్మశబ్దముచేత పరబ్రహ్మమేకాని హి రణ్యాగర్భుడుకాడు. 17సూ॥ డిటో. 219

4 అ 3 పా 5సూ॥ అర్చిరాదిమార్గముచేత పోవువారు ఇం ద్రియలయముతో నుందురు. అర్చిరాదులకు నేతృత్వసిద్ధి కలదు. 220

6సూ॥ అమానవపురుషుడే తీసికొనిపోవును. 7సూ॥ కార్య (సగుణ) బ్రహ్మమునేపొందించుచున్నాడనియు. 221

8సూ॥ నిర్గుణబ్రహ్మ పరముకాదనియు పూర్వపక్షము. 9సూ॥ నిర్గుణబ్రహ్మమునకు సామీప్యమువలన సగుణబ్రహ్మ మునకును నపుంసకశబ్దప్రయోగముతగును. 10సూ॥ సగుణబ్ర హ్మలోకము లయమగునపుడు హిరణ్యగర్భుడును నిర్గుణబ్ర హ్మమును పొందుచున్నాడు. 222

11సూ॥ స్మృతిఅట్లేచెప్పుచున్నది. 12సూ॥ నపుంసకశబ్ద మునకు నిర్గుణబ్రహ్మము ముఖ్యార్థమనియు సగుణము గౌణా ర్థమనియు జైమినిమతము. 13సూ॥ శ్రుతితాత్పర్యమదియే. 14సూ॥ గతిశ్రుతులు పరబ్రహ్మపరమని జైమినిపక్షము కా ర్యబ్రహ్మపరమని కొందరిపక్షము. 223

4 అ 4 పా 19సూ॥ పరమాత్మకు సగుణ నిర్గుణస్థితులు రెం డును కలవని శ్రుతిచెప్పుచున్నది. 20సూ॥ పరమాత్మకు వికా రములులేని రూపము నిర్గుణము. 224

పం॥ప్ర॥ నిర్గుణోపాసకునకు మరణకాలమందే ముక్తికలుగును కోరికకలవాడు సగుణబ్రహ్మలోకమునందు పరతత్త్వమును విమర్శించుచు నిర్గుణబ్రహ్మమును పొందుచున్నాడు గాని మ రల జన్మింపడు. లెస్సగాచేసిన నిర్గుణోపాసకునకు జీవితకాల మందైనను, మరణకాలమందైనను, బ్రహ్మలోకమందైనను ముక్తికలుగును. భ॥ గీ॥ సమస్తము చిద్రూపమని భావించువా

డును, మరణకాలమునందు చిదూ్రిపధ్యానము కలవాడును ముక్తినిపొందును. 225

శరీరముఖహస్తాదులను ధ్యానముచేయతగదు. నిరాధారము, నిరాశ్రియము, కళాశూన్యమునగు నిర్గుణమునే ఆకాశమువంటిదిగా ధ్యానింపుము. పం॥ ప్రి పరమాత్మయే అహంశబ్దమునకు లక్ష్యమగు చైతన్యమని యర్థము. బ్రి॥సూ॥ 1 అ॥ 2 ప్రా॥ 7 అధి 24సూ॥ వైశ్వానరశబ్దముచేత పరబ్రిహ్మమే కాని యితరముకాదు. 226-227

25సూ॥ డిటో. 26సూ॥ వైశ్వానరశబ్దముచేత అగ్నికాదు పరబ్రిహ్మమే అతిడేజఠరాగ్నియందున్నవాడు 228

27సూ॥ పంచమహాభూతాగ్నికాని దానినభిమానించు దేవతగానికాదు. 28సూ॥ పరబ్రిహ్మమేయని జైమినిమతము. 29సూ॥ పరమేశ్వరుడు ప్రాదేశమాత్రుడుగానుండుట విరుద్ధముకాదు. 30సూ॥ ధ్యానముకొఱకు అల్పమైనహృదయము చెప్పబడినది. 229

31సూ॥ ప్రాదేశమాత్రుడనుట విరుద్ధముకాదని వ్యాసముని మతము. 230

32సూ॥ ఈపరబ్రిహ్మము గడ్డముమొదలు శిరస్సువరకును గల ప్రిదేశములోనున్నట్లు జాబాలశ్రుతులు చెప్పుచున్నవి 231

వివరణము నరునికిగలఅవయవములు బ్రిహ్మమునకే యాప్రదేశములలోనున్నదిన్ని 232

పరమాత్మస్థానము చుబుకమనెడి ద్వాదశాంతమనుట. ల॥ స॥ మనోన్మని ప్రిరబ్రిహ్మస్థానము. 233.

ద్వాదశాంతముయొక్క వివరణము హ్రీంకార ఓంకార ములందు 12 రూపములున్నవి దానిఅంతమే పరబ్రహ్మస్థానము గనుకనే ద్వాదశాంతమను పేరుకలిగినది. మూలాధారాది చక్రములు మనోన్మనిసహితము సుషుమ్నానాడియందే కలవనుట. 234-238

సూతసంహిత సమస్తతీర్థములును శరీరమునందే కలవనుట. 238

ఉమాసువార్చలాతంత్రము పిండాండమగుశరీరమునందే అండాండ బ్రహ్మాండములును కలవనుట. 239

ద్వాదశాంతము చిద్రూపస్థానమనుట. దక్షిణామూర్త్యుపనిషత్తు. 241

ఉపనిషత్తులోని మంత్రము బ్రహ్మపరముగా శంకరాచార్యులుచేసిన వ్యాఖ్యానము. 243

శరీరమంతకును శిరస్సుప్రధానమనుట. 244

బ్రహ్మరంధ్రమునందలి అమృతబిందువుయొక్క వివరణమును, అధర్వాణశిరస్సున్ను, బ్రహ్మవిద్యోపనిషత్తున్ను. 245-246

## 13వ ప్రకరణము.

బ్ర॥సూ॥ 3 అ 3 పా 32సూ॥ బ్రహ్మవిదులగు వసిష్ఠుడు, సనత్కుమారుడు మొదలగువారికి మరలజన్మము ఈశ్వరనియామకముచేత కలిగినందున వారికి ఆజన్మానంతరమునందు ముక్తి కలుగుననుట. 247-250

అ॥ గీ॥ సచ్చిదానందపదమందు ఐక్యజ్ఞానముగలయోగి సదానందమయుడై యుండును. జ్ఞానిని పుణ్యపాపములంటవు.

దృశ్యజగత్తు ఆత్మస్వరూపమే. కాని భిన్నమేదియును లేదు. జ్ఞాని వ్యవహరించుచున్నను ఆత్మసుఖమునె పొందుచుండును. వ్యవహారసక్తుడై యుండినను ఖేదమొందడు. 251-252

14వ ప్రకరణము.

3 అ 2 పా 11 సూ॥ పరబ్రహ్మమునకు సగుణరూపము కల్పితము. కను॥ నిర్గుణబ్రహ్మమే సత్యము. 252

12సూ॥ సగుణబ్రహ్మ మంగీకరింపతగదు. ఉపాధివిశేషములు బ్రహ్మమునకు అభేదమునే చెప్పుచున్నవి. 253

13సూ॥ జగత్తంతయు బ్రహ్మముకంటె వేఱుకాదు. వేఱని తలచినవానికి జననమరణములు తప్పవు. 14సూ॥ బ్రహ్మము రూపాదులులేనిదని శ్రుతులుకలవు. 254

15సూ॥ బ్రహ్మము పృథివ్యాద్యాకారము పొందినట్లున్నను ఆయాకారము కల్పితము. 16సూ॥ చైతన్యమాత్రమని శ్రుతి చెప్పుచున్నది. 17సూ॥ శ్రుతిస్మృతులు బ్రహ్మమునే చెప్పుచున్నవి. 255

18సూ॥ బ్రహ్మము నిర్గుణముగనుకనే సూర్యచంద్ర ప్రతిబింబములను పోలినట్లు ఉపమానము చెప్పబడినది. 256

19సూ॥ ఆత్మునకు సూర్యదృష్టాంతము యుక్తముకాదని పూర్వపక్షము. 20సూ॥ యుక్తమేయని సిద్ధాంతము. 257

21సూ॥ శ్రుతులట్లె చెప్పుచున్నవి. 22సూ॥ సగుణబ్రహ్మమును నిషేధించుటచేత నిర్గుణబ్రహ్మమే నిశ్చయము. 23సూ॥ బ్రహ్మము ప్రపంచమునకు సాక్షియగుటచేత నింద్రియములకు గోచరింపదు. 258

24సూ॥ యోగులు జగత్తునునిషేధించి ఆత్మనేచూతురు. 259

25సూ॥ బుద్ధ్యాద్యుపాధులయందు భేదమున్నట్లు కనిపించి నను చిదాత్మయేకమే. 26సూ॥ జీవుడు అవిద్యాకృతమైనభేదమును నిరసించి విద్యచేత బ్రహ్మముతోనేకమగును. 260

27సూ॥ పాముకును, దానిచుట్టలకును భేదములేనట్లే జీవేశ్వరులకును భేదములేదు. 261

28సూ॥ సూర్యునకును, వానిప్రకాశమునకును వలెనే జీవేశ్వరులకును భేదాభేదములుండును. 29సూ॥ విద్యచేత బంధము నశించి మోక్షముకలుగును. 30సూ॥ పరమాత్మకంటె వేరైనవస్తువులేదు. 31సూ॥ బ్రహ్మముకంటె వేరైనవస్తువు కలదని పూర్వపక్షము. 262

32సూ॥ బ్రహ్మము సేతువువంటివాడని స్తుతిచేయబడినది కాని వేరువస్తువుకాదని సిద్ధాంతము. 33సూ॥ బ్రహ్మమునకు పరిమాణము ఉపాసనకొఱకు కల్పింపబడినది. 34సూ॥ ఉపాధిభేదమువలనచెప్పిన ఉపదేశములు గౌణము. 263

35సూ॥ జీవేశ్వరులకు స్వరూపసంబంధముకంటె నన్యసంబంధములేదు. 36సూ॥ బ్రహ్మముకంటె నితరమును శ్రుతులు నిషేధించుచున్నవి. 264

37సూ॥ పరబ్రహ్మమునకు అన్నిటియందునునికి సిద్ధించును. 38 ధర్మార్థకామముల ఫలము ఈశ్వరునివలననేకలుగును. 39 ఇదిశ్రుతిసమ్మతము. 40సూ॥ కర్మములే ఫలమునిచ్చునని జైమినిపూర్వపక్షము. 41 కర్మఫలమునిచ్చువాడు ఈశ్వరుడని సిద్ధాంతము. 265

1 అ 2 పా 17 సూ॥ అక్షిపురుషుడు పరబ్రహ్మమేకాని జీవుడుకాడు. 266

అ॥ గీ॥ ధర్మార్థకామములందాసక్తితగదు జనకా? గతజన్మ ములందు నీవుచేసిన కర్మములవలన అనర్థమేకలుగుచున్నది. గనుక కర్మములను విడిచి జ్ఞాననిష్ఠుడవగుము. 1 అ 3 15సూ॥ సుషుప్తికాలమునందు జీవులు నిర్గుణబ్రహ్మమునే పొందుదురు. 267

డిటో. 20సూ॥ జాగ్రత్స్వప్నములందలి శ్రమచేత సుషుప్తియందు బ్రహ్మమునందు విశ్రాంతినిపొందును. 24సూ॥ అంగుష్ఠమాత్రపురుషుడు పరబ్రహ్మమేకాని జీవుడుకాడు. 25సూ॥ ప్రాణులయందు అంగుష్ఠమాత్రపరిమాణముగల హృదయమందుండును. 268

## 15వ ప్రకరణము.

భ॥గీ॥ జ్ఞానముపూర్ణముకాకుండా మరణించినవాడు దేవలోకములో పుణ్యఫలమనుభవించి శ్రీమంతులగృహమందు పుట్టి జ్ఞానసిద్ధికొరకు యత్నించుచున్నాడు. 269

జ్ఞానవాసిష్ఠము 1-2-3 భూమికలలోనుండి మృతిబొందినవాడు దేవలోకఫలమనుభవించి శుచిగల శ్రీమంతులగృహమందు జన్మించి మిగిలినభూమికల నభ్యసించును. 270

పం॥ ప్ర॥ చేసిన బ్రహ్మవిమర్శము వ్యర్థముకాదు మరియొక జన్మమునందు ప్రత్యగాత్మనుపొందును. 3 అ 1 పా 8సూ॥ క్రతువులుచేసిన బ్రాహ్మణునికిని గతజన్మములోని సంస్కారము నుబట్టి శూద్రాదిజన్మములుకలుగవచ్చును. 271-272

16వ ప్రకరణము.

1అ 1పాదము 1-2-3-4 సూత్రములు 5వ ప్రకరణములో నున్నవి. 5సూ॥ జగత్కారణము సాంఖ్యమతప్రధానముకాదు 6సూ॥ ఈక్షితృశబ్దముచేత గౌణపక్షముగానైనను ప్రధానము కాదు. 7సూ॥ సచ్ఛబ్దవాచ్యము బ్రహ్మమే. 8సూ॥ సచ్ఛబ్దము చేత ఆత్మకాదనియు, ఆత్మనుగ్రహింపతగదనియు శ్రుతులు చెప్పలేదు. 273

9సూ॥ జీవుడుసుషుప్తియందు పరమాత్మతోనేకీభవించును 10సూ॥ ఆత్మమేజగత్కారణమని వేదాంతవాక్యములన్నియు ను చెప్పుచున్నవి. 11సూ॥ ఇంద్రియములకు ప్రభువులుజీవులు వీరికిప్రభువు పరమేశ్వరుడు (ఆత్మ) 12 మొదలు 21 వరకును జగత్కారణము బ్రహ్మమేకాని జీవుడుకాడనుట. 12 సూ॥ 12వ ప్రకరణములోనున్నది. 13 బ్రహ్మము పుచ్ఛమువంటిది యని యనతగదు. 274

14సూ॥ ఆనందమునకు బ్రహ్మముకారణము. 15సూ॥ బ్రహ్మమే ఆనందమయశబ్దముచేత చెప్పబడినది. 16సూ॥ శ్రుతులకు విరోధమగుటవలన జగత్కారణముజీవుడుకాడు. 17సూ॥ జీవుడుబ్రహ్మమునుపొందువాడుగనుక భేదముకలదు. 275

18 సూ॥ సృష్ట్యాదిసంకల్పముకలవాడు బ్రహ్మమే కాని సాంఖ్యమతప్రధానముకాదు. 19సూ॥ బ్రహ్మమునందు జీవుని కైక్యము శాస్త్రముచెప్పుచున్నది. 20సూ॥ సూర్యమండలము లోని పురుషుడు బ్రహ్మమే. 276

21సూ॥ సూర్యాదులు జీవులే నేత్రమందును, సూర్యమండలమునందును ఉపాసింపబడువాడు బ్రహ్మమే. 22సూ॥ స్వ

ష్ట్యాదులను చేయునదిపరబ్రహ్మమే కాని భూతాకాశముకాదు. 23సూ॥ సర్వశరీరములకు ముఖ్యమగుప్రాణమునకు ప్రభువు బ్రహ్మమే కాని ప్రాణవాయువుకాదు. 277

24లు॥ 27వరకు సూత్రములు 5వ ప్ర నందుకలవు. 28సూ॥ ప్రాణశబ్దమునకు బ్రహ్మమేకాని జీవాదులర్థముకాదు. 29సూ॥ తినప్రాణమే జగత్కారణమనరాదు. 278

30సూ॥ వామదేవఋషి సర్వమును ఆత్మయని చెప్పెను. గాని తనప్రాణమునుస్తుతిచేసికొనలేదు. 31సూ॥ జగత్కర్త బ్రహ్మమే ప్రాణమనిగాని జీవుడనిగాని యనతగదు. 279

1అ॥ 2పా॥ 1సూ॥ మనోమయాదిగుణములుగలవాడు బ్రహ్మమే కాని జీవుడుకాడు. 2సూ॥ 5వ ప్ర॥ లోనున్నది. 3సూ॥ సత్యసంకల్పాదిగుణములు బ్రహ్మమునకే. గాని జీవునకులేవు. 4సూ॥ బ్రహ్మముముక్తిస్థానము. దానినిపొందువాడు జీవుడు. 280

5సూ॥ పై తాత్పర్యమే. 6సూ॥ ఈశ్వరుడు జీవులయొక్క హృదయమందుండి కర్మలనుచేయించుచున్నాడు. 7సూ॥ బ్రహ్మమునకును అణుత్వధర్మముకలదు. 281

8సూ॥ సుఖదుఃఖములు కర్తయు, భోక్తయు, నగుజీవునకే కలవుగాని బ్రహ్మమునకులేవు. 9 సూ॥ 4 ప్ర॥ లోకలదు. 10సూ॥ అత్తయనుశబ్దముచేత నాశముపుట్టుకయునులేని బ్రహ్మమే. 11సూ॥ హృదయమందున్నవారు జీవేశ్వరులే కాని బుద్ధిజీవులుకారు. 282

12సూ॥ శ్రుతులట్లేచెప్పచున్నవి. 13-14సూ 12వ ప్ర॥ లోకలవు. 15 కంటియందలిపురుషుడు పరబ్రహ్మమే. 16 బ్ర

హ్మవిద్యగలవాడు అర్చిరాదిమార్గముచేత హిరణ్యగర్భలోక మును పొందును. 283

17సూ॥ 14ప్రి॥ లోకలదు. 18సూ॥ పృధివ్యాదులను నియమించువాడు బ్రిహ్మమేకాని జీవుడుకాడు. 19సూ॥ అసాధారణధర్మములు చెప్పటవలన బ్రిహ్మమే. 285

20సూ॥ జీవుడు అంతర్యామికాడు. 21సూ॥ అదృశ్యత్వాదిగుణములచేత బ్రిహ్మమేకాని ప్రిధానాదులుకావు. 286

22 సూ॥ భూతయోని శబ్దమునకు బ్రిహ్మమేయర్థము. 23సూ॥ సర్వాత్మకమగు రూపము ఒకటేలని చెప్పటవలనను బ్రిహ్మమే. 24 మొదలు 32 వరకు సూ॥ 12 ప్రి॥ లోకలవు. 1అ॥ 3పా॥ 1సూ॥ జగత్తునకుఆధారము పరబ్రిహ్మమే. 287

2సూ॥ శ్రుతులలో ముక్తులుపొందతగినది బ్రిహ్మమనిచెప్పెను. కాని 3సూ॥ ప్రిధానాదులని చెప్పలేదు. 4సూ॥ పైకారణములచేత జీవుడునుకాడు. 5సూ॥ జీవుడు బ్రిహ్మమునుపొందువాడు. 6సూ॥ప్రికరణబలమునుబట్టికూడా జీవుడుకాడు. 288

7సూ॥ శరీరమందున్నను కర్మఫలమనుభవించువాడు జీవుడేకాని ఈశ్వరుడుకాడు. 8సూ॥ భూమిశబ్దముచేత బ్రిహ్మమేకాని ప్రాణవాయువుకాదు. 9సూ॥ 9వప్రిలోనున్నది. 10సూ॥ అక్షరశబ్దముచేత బ్రిహ్మమేకాని ఓంకారరూపాక్షరముకాదు. 289

11సూ॥ అక్షరము ఆజ్ఞాపించునదనుటచేత పరబ్రిహ్మమే. 12సూ॥ జీవుడు ప్రిధానము మొదలగునవి జగత్కర్తకానేరవు. 13సూ॥ 12 ప్రి॥లో కలదు. 14 సూ॥ దహరశబ్దముచేత బ్రిహ్మమే. 290

15సూ॥ 14పని॥లోకలదు. 16సూ॥ దహరాకాశము బ్రహ్మ
మే. 17సూ॥ అట్లేశ్రుతిప్రసిద్ధము. 291

18సూ॥ జీవునకుఆకాశముతో పోలికసంభవింపదు. 19సూ॥
జ్ఞానానంతరముకూడా. జీవుడనిచెప్పబడినను జీవేశ్వరులకు భేద
ము లేదు. 292

20సూ॥ 14పని॥లోకలదు. 21సూ॥ అత్పత్వము ఈశ్వరుని
యందునుకలదు. 22సూ॥ శ్రుతి తేజోవిశేషమునుచెప్పలేదు
పరమాత్మనేచెప్పుచున్నది. 293

23సూ॥ స్మృతులును అట్లేచెప్పుచున్నవి. 24-25సూ॥ 14వ:
పని॥లోను 26ల 38వరకు సూ॥ 1 పని॥లోనుకలవు. 39సూ॥ ప్రా
ణశబ్దముచేత భూతవాయువుకాదు బ్రహ్మమే. 40సూ॥ జ్యోతి
శబ్దముచేత పరబ్రహ్మమే. అగ్నికాదు. 41 ఆకాశశబ్దముచేత
పరబ్రహ్మమే. 294

42సూ॥ సుషుప్తి మరణావస్థలయందు జీవపరమాత్మలకు
భేదముకలదుగనుక నిచటపరమాత్మయే. 43సూ॥ పతి మొద
లగుశబ్దములు బ్రహ్మపరమే. 295

1అ॥ 4పా॥ 1సూ॥ జగత్కారణము. సాంఖ్యస్మృతివలనను
ప్రధానముకానేరదు. బ్రహ్మమే. 296

2సూ॥ సూక్ష్మమహాభూతములు అవ్యక్తశబ్దముచేత చెప్ప
తగును. 3సూ॥ జగత్తు అవ్యక్తముయొక్క అధీనమందున్నను
అది ఈశ్వరాధీనమందున్నదే. 297

4సూ॥ అవ్యక్తము ఉపాసనార్హమునిచెప్పలేదు గనుక అవ్య
క్తము సాంఖ్యప్రధానముకాదు. 5సూ॥ అవ్యక్తము పరమా
త్మనుచెప్పునుగాని ప్రధానమునుచెప్పదు. 6సూ॥ ఇట్లా. 298

7సూ॥ మహాశ్చబ్దము సత్త్వగుణప్రధానప్రకృతిని చెప్పు చున్నను అవ్యక్తప్రధానమును చెప్పచాలదు. 8సూ॥ అజశబ్ద మునకు ప్రధానము అర్థముకాదు. 299

9వసూ॥ 5వప్ర॥లోకలదు. 10 ప్రకృతికి అజత్వముకల్పిం పబడినది. 11సూ॥ సాంఖ్యశ్రుతిలోని పంచపంచజనాః అను వాక్యముచేత 25 తత్త్వములుకావు. శ్రుతిచేత ఆత్మనిర్దేశింప బడినది. 300

12సూ॥ పంచజనశబ్దముచేత ప్రాణములయిదేచెప్పబడెను. 13సూ॥ సాంఖ్యమతప్రధానమునుగూర్చి శ్రుతి ఒకటియును లేదు. 301

14 సూ॥ శ్రుతులు బ్రహ్మమునేచెప్పుచున్నవి. 15 సూ॥ డిటో. 302

16సూ॥ జగత్కారణము జీవుడుకాడు. ప్రాణమునుకాదు. 17సూ॥ అట్లే 1అ 4పా 31సూ॥ నందుచెప్పబడినది. 303

18 సూ॥ జీవుడుప్రధానముకాడనియు బ్రహ్మమనియును. 19సూ॥ డిటో. 304

20సూ॥ జీవేశ్వరులకుభేదములేదని ఆశ్మరథ్యాచార్యునిమ తము. 21సూ॥ ప్రసన్నుడగు జీవుడుపరమాత్మతో నైక్యమగు టవలనవీరికిభేదములేదని ఔడులోమాచార్యునిమతము. 305

22సూ॥ పరమాత్ముడే జీవుడుగానున్నందున అభేదజ్ఞానము తగునని కాశకృత్స్నాచార్యుని మతము. 306

23ల॥ 28వరకు సూ॥ 5వప్ర॥లోకలవు. 2అ॥ 1 పా॥ 1సూ॥ మన్వాది కాపిల భారతాదిస్మృతుల నంగీకరింపనిదోషముకలు గుటచేత సాంఖ్యస్మృతినంగీకరింపతగదు. 307-308

2సూ॥ సాంఖ్యస్మృతిలోనిమహత్తత్వాద్యహంకారాదులు వేదాదులయందుకనిపింపవు. 3సూ॥ సాంఖ్యయోగస్మృతులు నిరాకరింపబడినవి. 4సూ॥ జగత్తుఅచేతనముగనుక చేతనమగు బ్రహ్మమువలనపుట్టినదనుట సరికాదనిపూర్వపక్షము. 309

5సూ॥ మృత్తుమొదలగు వానికిని అభిమానదేవతలున్నందున చేతనమనతగదనియు పూర్వపక్షము. 6సూ॥ తా॥ 4-5సూ॥ లోని పూర్వపక్షముసరికాదు. చేతనులగుపురుషులందు అచేతనములైన గోళ్లు కేశములు పుట్టుచున్నందున చేతనులవలన అచేతనములు పుట్టకూడదను నియమములేదు. 310

7సూ॥ ఈప్రపంచము సృష్టికిపూర్వమందును అసత్తుకాదు. కారణరూపముచేత సత్తే. 8సూ॥ జగత్కారణము బ్రహ్మము కాదనిపూర్వపక్షము. 9సూ॥ కారణమును కార్యమెప్పుడును దూషింపదని సిద్ధాంతము. 311

10 శబ్దాదులులేని ప్రధానమువలన శబ్దాదులతోకూడిన జగత్తుపుట్టినదనుట సాంఖ్యమతమందును దోషమే. 11సూ॥ ఆగమములచేతను సత్తర్కముచేతను జగత్కారణము బ్రహ్మమున్ను ప్రకృతియున్ను. 12సూ॥ బౌద్ధమతము ఎవరిచేతను అంగీకరింపబడలేదు. 312

13సూ॥ భోక్తృభోగ్యములు బ్రహ్మముకంటె వేఱుకావు. 14సూ॥ కార్యమైనజగత్తు కారణమగు బ్రహ్మముకంటె వేఱు కాదు. 313

15సూ॥ కారణమున్నప్పుడే కార్యముకనబడును. మృత్తులేనిఘటములేదు. 16సూ॥ జగత్తు బ్రహ్మముకంటెవేఱుకాదు.

17సూ॥ సృష్టికిపూర్వమందును ఈజగత్తుసత్పదార్థమే. 18సూ॥
యుక్తివలనను, శబ్దమువలనను అట్లే. 314

19సూ॥ పటముముడవబడినపుడును, చాపబడినను పటమను
నట్లే జగత్తు సృష్టికి పూర్వ పరములయందును బ్రహ్మమే.

20సూ॥ ప్రాణాపానాదివాయువులు ప్రాణముకంటె వేఱు
కానట్లె జగద్బ్రహ్మములకును భేదములేదు. 315

21సూ॥ అట్లయితే జీవుడేజగత్కారణమనునెడల తనకు
హితమైనకార్యములు ఏలచేసికొనలేడనెడి దోషముకలుగున
నిపూర్వపక్షము. 22సూ॥ జీవేశ్వరులలో నీశ్వరుడుఅధికుడు
అతనికి హితాహితకార్యములు లేవు. 23సూ॥ వజ్రవైడూర్యా
దిమణులకు హెచ్చుతగ్గువెలలున్నట్లె జీవులకును బ్రహ్మమున
కును భేదముండును. గాని అంతమాత్రముచేత బ్రహ్మము జగ
త్కారణముకాకపోదు. 24 ల॥ 27 సూ॥ 5వ ప్ర॥లోకలవు.

28 సూ॥ స్వప్నమందు వాస్తవముగలేని పదార్థములును,
మాయావిమొదలగువారివలన విచిత్రసృష్టులును చూడబడు
నట్లెబ్రహ్మమునందును జగత్సృష్టియగును. 316

29సూ॥ ప్రధాన అణువాదములయందును దోషములుకల
వు. 30-31 సూ॥ 5వ ప్ర॥లోకలవు. 32సూ॥ బ్రహ్మమునకు
కోరికలులేనందున జగత్కర్తకాడని పూర్వపక్షము. 33 సూ॥
రాజులుమొదలగువారు క్రీడలుసలుపునట్లె బ్రహ్మమున్న.

34సూ॥ జీవులకర్మానుసారము సృష్టియగుచున్నది. గాని
బ్రహ్మమునకు రాగాదిదోషములులేవు. 317

35సూ॥ సంసారము అనాదిగనుక విషమకర్మసంభవించు
ను. 36సూ॥ అట్లెశ్రుతిస్మృతులుకలవు. 318

37సూ॥ 5వ ప్రిలోకలదు. 2అ॥ 2పా॥ 1సూ॥ ప్రిధానము అచేతనముగనుక దానివలన జగత్సృష్టికాదనుటకు అనుమానములేదు. 2సూ॥ అచేతనములైన రథాదికార్యములు చేతనులగువారియధీనములోనున్నవి. 3సూ॥ దూడయొక్క వృద్ధికొరకు క్షీరములుస్వభావముచేత పుట్టునట్లే ప్రిధానమున్ను కారణము కారణమనిచెప్పలగదు. క్షీరములును చేతనాధిష్ఠితములైనవానియందేకలదు. 319

4సూ॥ ప్రిధానమునకు ప్రివర్తకనివర్తకములు లేవు. 5సూ॥ తృణాదులను గోవులనుభవించునపుడే క్షీరమగును. గాని ఆ మార్పు యెద్దువలనకాదు అట్లే ప్రిధానమునకును. 6సూ॥ ప్రిధానమునకు ప్రివృత్తియున్నదని చెప్పినను పరిణామము లేదు. 320

7సూ॥ పురుషుడు నిర్గుణుడుగనుక ప్రిధానము నెట్లు ప్రివర్తింపచేయగలడు. 8సూ॥ ప్రిధానము సత్త్వరజస్తమోగుణములస్వరూపమాత్రావస్థయందుండుటచేత అంగాంగిభావములేనందున ప్రివృత్తిలేదు. 9సూ॥ ప్రిధానమునకు చైతన్యశక్తిలేదు. 10సూ॥ సాంఖ్యమతమందు ఇంద్రియాదిసంఖ్య మొదలగు పరస్పరభేదములనేకములున్నందున అదిసరిగాలేదు. 321

11 సూ॥ వైశేషిక సాంఖ్యమతములుసరికావు. 12 సూ॥ అణువులందు సంయోగనిమిత్తకర్మము సంభవింపదు. 13సూ॥

13సూ॥ ద్వ్యణుకమునకు అణువుకారణమనుట సంభవింపదు. 14సూ॥ ప్రివృత్తినిత్యమయితే ప్రిళయములేదు అట్లేనివృత్తి నిత్యమైతేసృష్టిలేదు. 322

15 సూ॥ రూపాదులుగల పరమాణువులకు స్థూలము అనిత్యమనుటవలన అణుకారణవాదము నిరాశ్రయమేయగును. 16 సూ॥ పరమాణువులకు హెచ్చుతగ్గుగుణములలో నేదియున్ననుదోషమే. 17 సూ॥ అణువాదము ఏయంశమందును అంగీకరింపతగదు 18 సూ॥ తార్కిక బౌద్ధమతములుసరికావు. 19 సూ॥ అవిద్యాదులు ఉత్పత్తికేనిమిత్తమగుటవలన చేతనసహాయములేనిదే సిద్ధింపదు. 323

20 సూ॥ కార్యముపుట్టగానే కారణమునకునాశమునుచెప్పు బౌద్ధమతముసరికాదు. 21 సూ॥ ఆత్యంతములయందు పుట్టినపదార్థములన్నియు క్షణకాలమందుండునని చేసినప్రతిజ్ఞకు భంగముకలుగును. 22 సూ॥ పదార్థములకు బుద్ధిపూర్వకనాశమున్ను తనంతటనేకలుగు నాశమున్ను కలుగవు. 23 సూ॥ పై రెండింటిలో మొదటివికల్పమునకు హానియును, రెండవదానికి అనర్థక్యమును కలుగును. 324

23 సూ॥ పై వినాశములు రెండును ఆకాశము, శూన్యము, అని భౌద్ధులకభిమతము. ఆకాశము పుట్టుకకలదిగనుక విశేషములేదు. 25 సూ॥ భౌద్ధులు ప్రపంచమువలె ఆత్మకును క్షణికత్వము చెప్పవలెను. గాని ఆత్మకు క్షణికత్వముసంభవింపదు. 26 సూ॥ అభావమువలన భావముపుట్టదు. 27 సూ॥ అభావమువలన పదార్థములుపుట్టునేని కార్యములు తనకోరికప్రకారము జరుగవలెను అట్లుజరుగదు గనుక నదిభ్రాంతియే. 325

28 సూ॥ ఘటము, పటము మొదలగుపదార్థములు ప్రత్యక్షముగానున్నందున అభావమనరాదు. 29 సూ॥ జాగ్రద్వస్తువులు స్వప్నవస్తువులవలె కనిపింపనివికావు. 30 నీపక్షమందున

బాహ్యపదార్థములకు సాక్షాత్కారములేనందున వాసనలకు త్పత్తిగాని సత్తగాని యుక్తముకాదు. 31 బాహ్యార్థవాద విజ్ఞానవాదములు నిరాకరింపబడినవి. 32సూ బౌద్ధమతము ఇసుకనూతివలె స్థిరపడనేరదు. 33సూ॥ జైనసిద్ధాంతము సరికాదు. 326

34సూ॥ జీవులకు శరీరపరిమాణమే చెప్పుయార్హతుల మతము సరికాదు. జీవులకుమరణములేదు. 35సూ॥ జీవులకు దేహపరిమాణముచెప్పుట సరికాదు. 36సూ॥ మోక్షమునుపొందు జీవునిపరిమాణమునిత్యమని జైనులుచెప్పినట్లే మొదటను మధ్యముననున్న జీవపరిణామము నిత్యమేయగును. గనుక జీవునకు శరీరపరిమాణభేదములేదు. 37 సూ॥ వైశేషికులు మొదలగువారు చెప్పెడి ఈశ్వరుడు నిమిత్తకారణమనుటకు సంభవములేదు. పాశుపతమతముసరికాదు. 327

38సూ సాంఖ్య యోగవాదుల ఈశ్వరకల్పనము యుక్తముకాదు. 39సూ॥ తార్కికులు చెప్పెడి ఈశ్వరునకును ఉపపత్తిలేదు. 40సూ॥ జీవునివలె ప్రేరేపించు సమర్థత ఆ ఈశ్వరునకులేదు. 328

41సూ॥ ప్రధానము, పురుషుడు, ఈశ్వరుడునను ముగ్గురును పరిమాణముకలవారనుటచేత సంసారమునకు నాశమేకలుగును. 42సూ॥ జీవులకుత్పత్తిని చెప్పు పాంచరాత్రాగమము సరికాదు. 43సూ॥ సంకర్షణుడను జీవునివలన ప్రద్యుమ్నుడను మనస్సుపుట్టినదనుట సరికాదు. 44సూ॥ వారుజీవులుకారు. నిత్యమగు ఈశ్వరధర్మములుకలవారు. 329

45సూ॥ పాంచరాత్రాగమసిద్ధాంతముసరికాదు. 2అ॥ 3పా॥

1సూ॥ ఛాందోగ్యశ్రుతిలో ఆకాశోత్పత్తిని చెప్పలేదు. 2సూ॥ కాని తైత్తిరీయమునందు చెప్పబడినది. 330

3సూ॥ ఆకాశోత్పత్తిని చెప్పుశ్రుతి గౌణము. 4సూ॥ ఆకాశము పుట్టుక గాని మరణము గాని లేనిది. 5సూ॥ ఆశ్రుతులు గౌణముఖ్యప్రయోగములు కావచ్చును అని 1లు 5వరకును పూర్వపక్షము. 331

6సూ॥ సిద్ధాంతము బ్రహ్మముకంటె వేఱువస్తువులేదు. 7సూ॥ ఆకాశము ఆత్మనుండి పుట్టినట్లు శ్రుతి చెప్పుచున్నది. 8సూ॥ అందువలన ఆకాశమునకాశ్రయమైనవాయువునకుత్పత్తి తైత్తిరీయమునందే కలదు. 332

9సూ॥ 5వప్ర॥లో కలదు. 10సూ॥ అగ్నికి కారణము బ్రహ్మమని ఛాందోగ్యమునందును వాయువని తైత్తిరీయమునందును కలదు. 11సూ॥ జలము అగ్నివలనను బ్రహ్మమువలనను పుట్టినట్లు శ్రుతులు చెప్పుచున్నవి. 12సూ॥ జలమువలన భూమి పుట్టినది. 333

13సూ॥ పరమేశ్వరుడు అంతర్యామిగనుండి వీనినన్నిటిని ప్రవర్తింపచేయుచున్నాడని శ్రుతులు చెప్పుచున్నవి. 14సూ॥ ఉత్పత్తిక్రమముకంటె విపరీతక్రమముచేత లయమగును. 334

15సూ॥ అట్లుజరుగుటవిరుద్ధము కాదు. 335

16సూ॥ జీవునికి జననమరణములు లేవు. 17 సూ॥ జీవుడు నిత్యుడే. 336

18 సూ॥ జీవుడు నిత్యచైతన్యుడును 19సూ॥ అణుపరిమాణుడును అనుట. 20సూ॥ డిటో. 338–339

21సూ॥ జీవుడుఅణువనుటకు విరోధింపదు. 22సూ॥ ఆత్మ డు అణుమాత్రమని శ్రుతులుకలవు 23సూ॥ బ్రహ్మము శరీరమందొకచోటనున్నను చందనబిందువువలెనంతను సంతోషింపచేయును. 24సూ॥ బ్రహ్మమునకు చందనబిందువువలె నునికి యంగీకరించినను దోషముకాదు. 340

25సూ॥ ఒకచోటనున్నదీపము అంతనుప్రకాశింపచేయునట్లు జీవుడు దేహమునంతను ప్రకాశింపచేయును. 26సూ॥ కుసుమాదులకు పరిమళవిశేషమున్నట్లే జీవునిచైతన్యమునకు నాశ్రయవిశేషముకావచ్చును. 27సూ॥ అట్లేఆత్మునకు హృదయమందణురూపవుడనికియును 28సూ॥ ఆత్మునకు అన్నిశరీరములయందును వ్యాపకత్వము చైతన్యగుణముచేతనేయని 19 మొదలు 28 వరకును పూర్వపక్షము. 341

సిద్ధాంతము 29సూ॥ ఉపాధిధర్మముల నారోపించుటచేత జీవునకు పరిమితత్వోత్క్రాంతిములుకలిగెను. బ్రహ్మమునకణుత్వాదులు సగుణోపాసనమందేకలదు. 30సూ॥ జీవునకుగల బుద్ధిసంయోగము జ్ఞానసిద్ధికలుగువరకు నుండును. 324

31సూ॥ వీర్యము బాల్యయౌవనములందు సూక్ష్మస్థూలములుగనున్నట్లే. 343

బుద్ధిసంయోగముకూడా సుషుప్తిప్రలయములయందుసూక్ష్మముగనుండి జాగ్రదవస్థాసృష్ట్యాదులందు ఘనీభవించును. 32సూ॥ ఆత్మకు అంతఃకరణాదులైదు ఉపాధులుకలవు. 344

33సూ॥ జీవుడుకర్తయనియు యాగదానాదులుచేయుమనియు చెప్పుచున్నది. ఉపాధినశించినపుడే బ్రహ్మమగును. 34సూ॥ జీవునకు స్వప్నాదులందుగల సంచారముచేతను. 345

35 సూ॥ ఉపాదానకారణముచేతను కర్తృత్వముకలదు. 36సూ॥ శ్రుతులశ్లోకలవు. 37సూ॥ జీవుడు కర్తయైనను తనికి ష్టము కానివానిని తగ్గించుకొనుటకు స్వాతంత్ర్యములేదు. 38 బుద్ధియేకర్తయను నెడల కొన్నిదోషములుకలవు. 346

39సూ॥ జీవునకుకర్తృత్వములేదను నెడల బ్రహ్మమును తెలిసికొనుసమాధికి భంగముకలుగును. 40సూ॥ జీవుడుస్వప్నజాగరావస్థలలో దుఃఖించును, సుషుప్త్యవస్థలోసుఖించును. గను క కర్తృత్వముండుటలేకపోవుటయను రెండునుకలవు. 347

41సూ॥ ఉపాధినిపొందిన జీవునకు ఈశ్వరానుగ్రహము వలననే కర్తృత్వభోక్తృత్వములును జ్ఞానముచేత మోక్షమును కలుగును. 348

42సూ॥ జీవులుచేసిన ధర్మాధర్మములననుసరించి యీశ్వరుడు విషమఫలములనిచ్చునుగాని ఈశ్వరునకు పక్షపాతము లేదు. 349

43సూ॥ జీవులు ఈశ్వరాంశమే. 44సూ॥ పరబ్రహ్మమందలి నాల్గవయంశమే అన్నిజంతువులును మిగిలినఅంశములు సూర్యమండలమునందు భక్తులకొఱకున్నవి. 45సూ॥ జీవుడుఈశ్వరాంశమేయని భగవద్గీతయందునుకలదు. 46 సంసారదుఃఖములు జీవునికేగాని ఈశ్వరునకులేవు. 47 సూ॥ఇశ్లోకశ్రుతిస్మృతులుకలవు. 350

48సూ॥ ఆత్మునకు విధినిషేధములుఉపాధిభేదమువలనకలుగును. 351

49సూ॥ జీవునకు ఎల్లశరీరములతోను సంబంధములేనందున ఫలసాంకర్యములేదు. 50సూ॥ జీవుడుఆత్మయొక్క ప్రతిబింబ

మేకాని సాక్షాత్తుగాపరమాత్మకాడు. 51సూ॥ అదృష్టము ఒక్కొక జీవునకు ఒక్కొకవిధముగానుండును. 52 సూ॥ ఆత్మమనస్సంయోగముచేత జీవుల సన్నిధానమందుచేయుచున్న రాగాదులయందు నియమములేదు. 53సూ॥ ఆత్మకు శరీరోపాధినిపొందినపుడే మనస్సుతో సంబంధముగాని పరమార్థకార్యములందు లేదు. ప్రభుత్వము ఎల్లజీవులకును సమానమే. 352

2అ॥ 4పా॥ 1 సూ॥ బ్రహ్మమునుండి ప్రాణములుపుట్టుచున్నవి. 353

2సూ॥ ప్రాణోత్పత్తినిచెప్పుశ్రుతి గౌణముకాదు. 354

3 సూ॥ ఆకాశాదులకువలె ప్రాణములకుత్పత్తిముఖ్యమే. 4సూ॥ ఎల్లప్రాణములును బ్రహ్మమునుండిపుట్టుచున్నవి. 5సూ॥ ప్రాణములు 7అని పూర్వపక్షము. 6సూ॥ 11అని సిద్ధాంతము. 355

7సూ॥ ప్రాణములనెడి ఇంద్రియములు అణుపరిమాణము కలవి. 8సూ॥ తక్కినవానికివలెనే ముఖ్యప్రాణమునకు నుత్పత్తిని ముం॥శ్రుతిచెప్పుచున్నది. 9 సూ॥ ప్రాణమనెడి వాయువు 5 విధములనియు, ప్రాణమేబ్రహ్మముయొక్క నాల్గవపాదమనియు ఛాం॥శ్రుతిచెప్పుచున్నది. 356

10సూ॥ ముఖ్యప్రాణము జీవునకుసహాయముకొఱకే గాని అది స్వతంత్రముకాదు. 11సూ॥ ప్రాణము తక్కినఇంద్రియములకంటె శ్రేష్ఠము. 357

12సూ॥ ప్రాణము 5 వృత్తులుకలది. 13సూ॥ ముఖ్యప్రాణమున్ను అణురూపమగుటచేత దేహమునుండి పోవునపుడు దగ్గిఱనున్నవారికైనను కనిపింపదు. 14సూ॥ ప్రాణములు వానిఅధి

స్థాన దేవతలగుండా కార్యములను చేయును. గాని స్వతంత్రము
లు కావు. 358

15 సూ॥ ఇందిరియములకు అధిష్ఠాన దేవతలున్నను జీవునితో
డనే సంబంధము. 16 సూ॥ సుఖదుఃఖములు జీవునికేగాని ఇంద్రి
యాధిష్ఠాన దేవతలకు లేవు. 359

17 సూ॥ ఆప్రాణములు ముఖ్యప్రాణముకంటె భేదముగలవి
గనుక నింద్రియములనబడును. 18 సూ॥ వాగాదులు ప్రాణము
కంటె వేఱనిశ్రుతులు కలవు 19 సూ॥ వాగాదులు నిద్రించున
పుడు మేల్కొనియుండు ముఖ్యప్రాణమునకు మృత్యుగ్రాసము
లేదు. 20 సూ॥ ఈజగత్తు పరమేశ్వరుని కార్యమే కాని జీవకార్య
ము కాదు. 360

21 సూ॥ భూమ్యగ్నిజలకార్యములు శబ్దానుసారముగా గ్ర
హింపవలెను. 361

22 సూ॥ పృథివ్యాదులయందు భేదోపదేశము యుక్తము. 362

2వ అధ్యాయము సమాప్తము.

3అ॥ 1పా॥ 1 సూ॥ జీవుడు దేహాంతరముకొఱకు సూక్ష్మ
భూతములతో కూడి పోవును. 362

2 సూ॥ జలశబ్దము చేత పంచభూతములును చెప్పబడినవి. 363

3 సూ॥ ప్రాణాదులు జీవుని ననుసరించి ఉదకములతో కలిసి పో
వుచున్నవి. 4 సూ॥ వాగాదులు అగ్న్యాదులను పొందునని చె
ప్పినశ్రుతి గౌణము. జీవునికి ప్రాణాదులు వినాగా దేహాంతర
ప్రాప్తి లేదు. 364

5 సూ॥ జలమును ప్రథమాగ్నియందు చెప్పకున్నను శ్రద్ధా
శబ్దముచేత గ్రహింపతగును. 6 సూ॥ ఉదకములు పంచమాహు

తియంను పురుషాకారమగునని శ్రుతియందు లేకున్నను యజ్వ లకట్టిగమనప్రితీతియుండుటచేత దోషము కాదు. 7సూ॥ యాగములు చేసినవారు దేవతలకాహారమని చెప్పినశ్రుతి గౌణము. దేవతలు పదార్థములను భుజిపరు. ఆత్మజ్ఞానములేని కర్మపరులు దేవతలకాహారమగుదురని శ్రుతికలదు. ఇదియునుగౌణమే 15 ప్రిలోను 9సూ॥ 2 ప్రిలోను కలవు. 365-366

8సూ యజ్ఞాదులఫలమున కానర్థక్యముకలుగునందు వేనిలవి ఆచారమునపేక్షించుటవలన దోషము కాదు. సత్ప్రివర్తనము శ్రేయము. 366

11సూ॥ చరణశబ్దమునకు పుణ్యపాపకర్మములర్థము. 12సూ॥ యజ్ఞాదులుచేయనివారికిని చంద్రిలోకప్రాప్తికలదని పూర్వపక్షము. 13 సూ॥ యాజ్ఞాదులు లేనివారికట్లు కలుగదుగాని యమలోకమునందు కర్మఫలమనుభవించి తిరిగివత్తురు. 367

14సూ॥ అధర్మపరులకు యమలోకశిక్షలనే వ్యాసాదులు చెప్పియున్నారు. 15 అధర్మపరులు రౌరవాదులగు సప్తనరకములను పొందుదురు. 16సూ॥ ఆనరకములందు స్వతంత్రము యమునికేగాని చిత్రిగుప్తునికిలేదు. 17సూ॥ ఆశ్రిమవిహితకర్మములుచేయువారు ధూమాదిమార్గముచేత చంద్రిలోకమునుబొంది మరలవత్తురు. ఉపాసనకలిగి జ్ఞానమునుపొందినవారు అర్చిరాదిమార్గముచేత బ్రిహ్మలోకమునుపొందుదురు. ఈరెండు మార్గములును లేనివారికి క్షుద్రిజన్మములేకలుగుచుండును. 368

18సూ॥ మూడవమార్గమందు దేహముకొఱకు ఆహుతిసంఖ్యానియమము లేదు. 19సూ॥ద్రోణుడు మొదలగువారికి ఆహుతిసంఖ్యలేదు. 369

20సూ॥ స్వేదజోద్భిజ్జములకు గ్రామ్యధర్మములేకయే పు
ట్టుకకలదు. ఇట్లే సత్కర్మములుచేయువారికిని 21సూ॥ స్వేద
జములు ఉద్భిజ్జశబ్దముచేతనే గ్రహింపతగును. 22సూ॥ జీవులు
పొందునది ఆకాశాదులసామ్యమే కాని స్వరూపముకాదు.
23సూ॥ అట్లుండుట స్వల్పకాలమే. 370

24సూ॥ యజ్ఞాదిధర్మములులేనిజీవులు వ్రీహ్యాదిసంసర్గము
కలవారై స్థావరభావమునుపొందుదురు. గాని చంద్రలోకము
నుండివచ్చిన వారికట్లుకాదు. 25సూ॥ పశుహింసాదులున్నను
యజ్ఞాదులు శుద్ధమైనవే. 26సూ॥ వ్రీహ్యాదిభావమునకు తరు
వాత రేతస్సిగ్భావమగును. 27 సూ॥ రేతస్సంబంధమువలన
దేహోత్పత్తికలుగును. 371-372

2పా॥ 1సూ॥ స్వప్నసృష్టి జాగ్రత్కాలమునందలిదివంటిదే
యని పూర్వపక్షము. 2సూ॥ డిటో. 372

3సూ॥ స్వప్నసృష్టిమాయకమని సిద్ధాంతము. 4సూ॥ స్వ
ప్నము రాగలశుభాశుభములను సూచించును. 5సూ॥ జీవునకు
ఈశ్వరునితోగల సమానధర్మము అవిద్యచేత మరుగుపడినది
కాని ఈశ్వరానుగ్రహమువలన అవిద్యనశించును. 373-374

6సూ॥ జీవునికిగల జ్ఞానైశ్వర్యము స్థూలసూక్ష్మదేహమ
నోబుద్ధ్యాదులసంబంధముచేతతిరోహితమగుచున్నది. జీవేశ్వ
రులకు భేదములేదు. 374

7సూ॥ స్వప్నముయొక్క అభావమేసుషుప్తి దానియందు
పరబ్రహ్మముతో జీవుడునేకీభవించుచున్నాడు. 8సూ సుషు
ప్తినుండి ఆత్మవలననే జీవునకు మెలకువకలుగును. 9సూ॥ సు
షుప్తినిచెందిన జీవుడేలేచును గాని మరియొకడుకాదు. 375

10సూ॥ మూర్ఛావస్థ సగముసుషుప్తిధర్మములతోను సగము మరణధర్మములతోనున్నది. 376

3అ॥ 3పా॥ 1సూ॥ జ్ఞానము వేదాంతములయందన్నిచోట్లను సమానమే. 2సూ॥ గుణభేదమువలన జ్ఞానమున కైక్యము లేకపోదు. 3సూ॥ శిరోవ్రితాదులు ఆథర్వణికుల కేగాని యితరులకు లేకున్నను విద్యకుభేదము లేదు. 4సూ॥ పొందతగినవస్తువు. ఓంకారశబ్దవాచ్యమగు బ్రహ్మమే. 5సూ॥ ఒక శాఖలోని గుణములను తుల్యమగు వేఱొక శాఖయందును గ్రహింపవచ్చును. 6సూ॥ వాజసనేయ ఛాందోగ్యశాఖలలోని ప్రాణోపాసనమునకు భేదములేదని పూర్వపక్షము. 7సూ॥ వానిలో ఉపక్రిమమే వేఱుగానున్నందున నేకత్వము లేదని సిద్ధాంతము.

376-377-378

8సూ॥ ఉద్గీథశబ్దము లౌకికముగనుక భేదనే. 9సూ॥ ఓంకారము సర్వవేదసాధారణమగుటవలన నదియుద్గీదశబ్దముచేత విశేణముగాచేయబడినది. 379

10సూ॥ వాజసనేయ ఛాందోగ్యశాఖలలోని వసిష్ఠత్వాది గుణములను కౌషీతకిమొదలగుశాఖలలోని ప్రాణవిద్యయందు గ్రిహింపవలెను. 11సూ॥ బ్రిహ్మమునందు సత్యత్వాదిగుణములు కల్పితధర్మములు. 12సూ॥ తైత్తిరీయకమునందలి ప్రియమేశిరస్సుగానుండుటమొదలగు ధర్మములు ఇతరశాఖలందు గ్రిహింపతగవు. 380

13సూ॥ బ్రిహ్మమునకు సత్యత్వజ్ఞానత్వాదులైదును ప్రితిపత్తిమాత్రిమే. బ్రిహ్మమగుధర్మ అన్నిశాఖలందును గ్రిహింపతగును. 14సూ॥ బ్రిహ్మము అన్నిటికంటె పరమైనదిగనుక

మోక్షసిద్ధిగలుగును. 15 సూ॥ శ్రుతులక్లేకలవు. బ్రహ్మవిద్యచేతకనిషింపడు గాని యత్నముచేతసిద్ధించును. 16-17సూ॥ 12 ప్ర॥లోనున్నవి. 18సూ॥ ఛాందోగులు వాజసనేయులు చెప్పిన ధ్యానాదులుయుక్తమే. 19సూ॥ శాండిల్య. బృహదారణ్యములలోని విద్యలకు ఒకదానిలోనిగుణములను మరియొకదానిలో గ్రహించుటయుక్తమే. 20సూ॥ బృ॥లోని రెండుశ్రుతులు భేదముగనున్నను ' 381-382

21సూ॥ ఆత్మభేదములేదని 20-21 సూ॥ పూర్వపక్షము. 22 సూ॥ ఆరెండుశ్రుతులును భేదముగలవని సిద్ధాంతము. 23సూ॥ డిటో. 24సూ॥ తాండి పైంగిశాఖలలోని పురుషవిద్యామ్నాయములు తైత్తిరీయకమునందు లేనందున గ్రహింపతగదు. 25సూ॥ తాండి మొదలగుశాఖలలోని విద్యలయందలి గుణములను గ్రహింపతగదు. 26 సూ॥ దుష్కృతమును విడుచుటకుచెప్పిన వాక్యముచేత సుకృతమునుస్వీకరించుట కలుగును. గాని ఈరెండును స్తుత్యర్థమే. 27సూ॥ సుకృత దుష్కృతములకు దేహమునుండి జీవుడుపోవునపుడే క్షయమగును. 383-384

28సూ॥ విరజానదినిదాటకపూర్వమే పుణ్యపాపములునశించును. 29 సూ॥ అర్చిరాదిమార్గము సగుణోపాసకులకేగాని నిర్గుణోపాసకునికిలేదు. నిర్గుణబ్రహ్మము దేశాంతరప్రాప్తికధీనమైనదికాదు. 30సూ॥ డిటో. 385

31సూ॥ బ్రహ్మలోకప్రాప్తిగల సగుణవిద్యలకన్నిటికిని అర్చిరాదిమార్గముకలదు. 32 సూ॥ 13ప్ర॥లోకలదు. 33సూ॥ బృ॥ముం॥ ఉపనిషత్తులయందు బ్రహ్మము స్థూలముకాదు సూ

క్షుత్రముకాదు మొదలగు వాక్యములు ఒకదానిలోనివి మరియొకదానిలో గ్రహింపవచ్చును. 386

34సూ॥ ఆథర్వణికులు మొదలగువారు పఠించు వ్యాసుపశ్వేత్యాదిశ్రుతులు జీవేశ్వరులనే చెప్పుటచేత భేదము లేదు 35సూ॥ యాజ్ఞవల్క్యుడు ఉషస్తికహోలమహర్షులతో చెప్పినరెండుశ్రుతులును బ్రహ్మమునుగూర్చి సమానమేయగును. 36సూ॥ విద్యకు భేదమంగీకరింపకున్నను ఉపపత్తికలదు. 387

37సూ॥ బ్రహ్మమును నీవేనేను నేనేనీవుఅనెడి ఉభయవిధ ధ్యానముతగును. 38సూ॥ సత్యబ్రహ్మమునే సత్యవిద్యయని శ్రుతిచెప్పినను విద్యఒకటియేగాని రెండుకావు. 388

39సూ॥ ఛాం॥ బృ॥ లోని రెండుశ్రుతులయందును, హృదయస్థానవిషయము సమముగానున్నందున నొకదానిలోని గుణములను మరియొకదానిలో గ్రహింపతగును. 389

40 సూ॥ ప్రాణాగ్నిహోత్రమునకు భోజనము లేకున్నను నీరుమొదలగు ప్రతినిధిచేతచేయవలెననిపూర్వపక్షము. 389

41సూ॥ భోజనము లేనపుడు ప్రతినిధి చేయనక్కరలేదని సిద్ధాంతము. 42సూ॥ ముఖ్యప్రాణము ఆదిత్యుడు మొదలగు ఉపాసనలు కర్మాంగములవలె నియమింపబడవు. 43సూ॥ సంవర్గము ప్రాణమేఅనియు వాయువేఅనియు చెప్పినరీటియందును ధ్యానమును భేదముకలవిగాని విద్యయొకటే. 390

44సూ॥ అగ్నిరహస్యమందలి మనశ్చిదాదివిద్యలు స్వతంత్రములే. 45సూ॥ మనశ్చిదాదులు కర్మములకు అంగమనియు 46సూ॥ దానినే బలపర్చుచున్నదనియు పూర్వపక్షము. 391

47 సూ॥ సిద్ధాంతము. మనశ్చిదాదుల నెడి యగ్నులు విద్యాత్మకములును, స్వతంత్రములును కాని కర్మాంగములు కావు. 48 సూ॥ శ్రుతుల శ్లేకలవు. 49 సూ॥ వానిస్వాతంత్ర్యమునకు భంగము కల్పింపరాదు. 50 సూ॥ గనుక నవిస్వతంత్రములే.

51 సూ॥ మనశ్చిదాదులకు క్రియాంగత్వము కల్పింపతగదు. 392

52 సూ॥ వానికి కేవలవిద్యాత్మకము సిద్ధము. 53 సూ॥ దేహమే ఆత్మయని పూర్వపక్షము. 393

54 సూ॥ దేహముకంటె ఆత్మవ్యతిరిక్తమని సిద్ధాంతము. 55 సూ॥ కర్మాంగోపాసనములను నియమము లేకుండ నన్నిశాఖలయందును గ్రహింపతగును. 56 సూ॥ డిటో. 57 సూ॥ వైశ్వానరోపాసనమునకు సమస్తోపాసన మేముఖ్యము. 394

58 సూ॥ బ్రహ్మవిద్య ఒకటియైనను ఉపాసమునలు భిన్నములేయగును. 59 సూ॥ దహర, శాండిల్యాది అహంగ్రహోపాసనములను వికల్పముచేత చేయవలయును. గాని వీనిలో ఒకదానిని సాక్షాత్కారపర్యంతము చేయవలెను. 60 సూ॥ ప్రతీకోపాసనములను సముచ్చయముచేతను వికల్పముచేతను యథేచ్ఛగా చేయవచ్చును. 395

61 సూ॥ ఉద్గీథోపాసనములను ఆయా వేదములంను చెప్పినట్లే చేయవలెను. 62 సూ॥ అంగములకును, ఉపాసనములకును భేదములేదు. 63 సూ॥ ఋగ్వేద సామవేదములందు ప్రణవోద్గీథములకు సముచ్చయమనియు. 64 సూ॥ ఓంకారము వేదత్రయసాధారణమగుటవలన నుద్గీథాదులన్నిటియందును సాధారణమనియు. 61 ల॥ 64 వరకును పూర్వపక్షము. 396

65 సూ॥ ఉద్గీదాద్యుపాసనలనిచ్ఛానుసారము చేయవచ్చు ననిసిద్ధాంతము. 66సూ॥ ఉపాసనలకు సహభావము లేనందున సముచ్చయముగా గాని వికల్పముగా గాని చేయవచ్చును.

3 పాదము సమాప్తము.

4 పా॥ 1 మొ॥ 52వరకును సూ॥ 8 ప్రకరణములో కలవు. 397

4అ॥ 1పా॥ మొదటిసూత్రము 5ప్ర॥లో కలదు. 2సూ॥ శ్రవణము పలుమారుచేయవలెనుగాని ఒకమారుచాలదు. 3సూ॥ 9 ప్ర॥లోను, 4-5సూ॥ 10 ప్ర॥లోనుకలవు. 6సూ॥ అవిద్వాంసునికర్మముకంటె సూర్యదృష్టితో జేయు ఉద్గీథాధికర్మము ఎక్కువఫలముగలది. 7సూ॥ కర్మాంగోపాసనలను వానివిధులననుసరించియును, తదితరోపాసనలను కూర్చుండియును చేయవలెను. 8సూ॥ ఉపాసనముధ్యానమే ప్రధానముగాగలద. 9సూ॥ భూమివలెనే కదలక ధ్యానింపవలెను. 10సూ॥ స్మృతి అక్లేకలదు. 398

11సూ॥ కర్మాంగములుకాని యుపాసనలను చిత్తైకాగ్రత కలుగునట్లుగాచేయవలెను. 12సూ॥ కర్మాంగోపాసనలను మరణమువరకు చేయవలెను. అప్పుడును విశేషజ్ఞానముకలుగును. 13సూ॥ బ్రహ్మసాక్షాత్కారము కలుగగానే పూర్వపాపములునుభావి (రాగల) పాపములును నశించును. 399

14సూ॥ పాపకర్మములవలె పుణ్యకర్మములును నశించును. 15సూ॥ ప్రారబ్ధముమాత్రము దేహపాతమువరకు నుండునని కొందరిమతము. 16సూ॥ 7 ప్ర॥లో కలదు. 400

17సూ॥ నిత్యకర్మములకంటె నన్యమగు నిష్కామకర్మఫల ములో పుణ్యముమిత్రులును, పాపము శత్రువులును పొందు నని చెప్పుదురు. గాని కామ్యకర్మము జ్ఞానమునకుపయోగింప దని జైమినిబాదరాచార్యులు తలతురు. 18 సూ॥ విద్యతో కూడిన అగ్నిహోత్రాదికర్మమునకును విద్యతోకూడనికర్మ మునకును ఏకఫలమే శ్రుతిచెప్పుచున్నను ఈకర్మములు జ్ఞాన సాధనములగును. 19సూ॥ ప్రారబ్ధమును అనుభవమూలముగా నశింపుచేసి బ్రహ్మమునుపొందుచున్నాడు. 401

1 పాదము సమాప్తము.

వివరణము అపరోక్షానుభూతి జ్ఞానసమకాలమందే ప్రారబ్ధ మునశించును. జీవన్ముక్తివివేకము డిటో ప్రారబ్ధము లేదని భావ ము. 402

2పా॥ 1సూ॥ వాగింద్రియవృత్తి మనస్సునందు లీనమగు ను. 2సూ॥ చక్షురాదీంద్రియములు మనస్సును 3 సూ॥ మన స్సు ప్రాణమును 4సూ॥ ప్రాణములు జీవునిపొందును. 5 సూ॥ జీవుడు సూక్ష్మభూతములందు నిల్చును. 6 సూ॥ జీవుడు ఒక తేజమునందేయుండడు. 403

7సూ॥ జ్ఞానవిద్యలేనివారికి జన్మము లేకలుగును. సగుణబ్ర హ్మోపాసకులకు అర్చిరాదిమార్గముకలదు. 8సూ॥ సూక్ష్మ భూతసముదాయము మోక్షముకలుగువరకు నుండును. 9సూ॥ శరీరమునుండిపోవుచున్న ప్రకృతిసూక్ష్మమైనది. 404

10సూ॥ భూతవర్గముమిక్కిలిసూక్ష్మమగుటవలన సూక్ష్మ శరీరము నశింపదు. 11 సూ॥ ఊష్మము సూక్ష్మశరీరమునదే. మరణావస్థయందు స్థూలదేహమున్నను ఊష్మముకనిపింపదు.

అది దేహముకంటె వేఱువస్తువు. 12 సూ॥ ప్రాణములు వెడలి పోవుట జీవునినుండిగాని దేహమునుండి కాదు. 405

13 సూ॥ బ్రహ్మవిదుని ప్రాణాదులు శరీరమునుండి పోవని కాణ్వాశాఖవారు చెప్పినట్లే కాతగును విద్వాంసుడు బ్రహ్మము నిచటనే పొందును. గాని అతనికి అర్చిరాదిమార్గముగాని ఉత్క్రాంతిగాని లేదు. 406

14 సూ॥ మహాభారతమునందును అట్లే చెప్పబడినది. 15 సూ॥ డిటో. 16 సూ॥ డిటో. 407

17 సూ॥ శరీరమునుండి పోవదలచి జీవుడు హృదయము నుండి సుషుమ్నా మార్గద్వారా బ్రహ్మరంధ్రాదులనుండి పోవును. బ్రహ్మోపాసన లేనివారు ఇతర నాడీద్వారా పోవుదురు. వీరికి మోక్షము లేదు. 18 సూ॥ సుషుమ్నా మార్గము చేతపోవువాడు సూర్యకిరణములననుసరించియే పోవును. 19 సూ॥ రాత్రియందు మరణించినవానికిని సూర్యకిరణసంబంధముకలదు. 20 సూ॥ దక్షిణాయనమునందును విద్యాఫలము నవశ్యముపొందును. 21 సూ॥ విద్వాంసుడు ఏకాలమందుమరణించినను విద్యాఫలమును పొందకపోడు. 408-409

2 పాదము సమాప్తము.

3 పా॥ 1 సూ॥ సగుణబ్రహ్మోపాసకులకును, వానప్రస్థులకును, త్రిదండిసన్యాసకులకును, అర్చిరాదిమార్గమేకలదు. 410

2 సూ॥ పంచాగ్న్యుపాసకులగు గృహస్థులును, బ్రహ్మనిష్ఠులగు వానప్రస్థులును, పరివ్రాజకులును, క్రమముగా అగ్ని దే

వతను, అహర్దేవతను, శుక్లపక్షోత్తరాయణ సంవత్సర దేవతల
ను, సూర్యుని, చంద్రుని, విద్యుత్తునుపొందుదురు. వీరిని అమా
నవపురుషుడు బ్రహ్మలోకమునుపొందించును. 411

3సూ॥ విద్యుత్తు అంత్యముగాచెప్పబడినను, అదిమెరుపుల
కును, మేఘములకును, సంబంధించినదగుటచేత నర్చిరాది
మార్గమున కంత్యముగ శ్రుతిలోచెప్పబడినది. 412

4సూ॥ మెరుపు అంతముగాగల అర్చిరాదులు దేవతలేయ
ని శ్రుతిచెప్పుచున్నది. 5మొ॥ 14 వరకునుగల సూ॥ 12వ ప్ర॥
లోనున్నవి. 15సూ॥ అహంగ్రహోపాసకులనందరిని అమా
నవసిద్ధుడు బ్రహ్మలోకము పొందించును. 16సూ॥ ప్రతీకో
పాసనములలో కొన్నిటికి ఫలాధిక్యమున్నను అర్చిరాదిమార్గ
ములు లేవు. 413

4పా॥ 1సూ॥ బ్రహ్మమునుపొందినవాడు కేవలాత్మరూపు
డే. 2 సూ॥ అట్టిప్రతిజ్ఞ చతుర్ముఖునివలన చేయబడినది.
3సూ॥ ప్రకరణబలముచేత జ్యోతిశ్శబ్దము బ్రహ్మమే కాని
అగ్ని కాదు. 414

4సూ॥ ముక్తుకు బ్రహ్మముకంటె భిన్నుడు కాడు. 5సూ॥
అట్లె జైమినిమునిమతము. 6 సూ॥ సర్వజ్ఞత్వాదిధర్మములు
చిత్తునందుపుట్టును బ్రహ్మమునకు చైతన్యమే. 415

7సూ॥ ముక్తునకు చైతన్యస్వరూప మంగీకరించినను బ్రా
హ్మమగు నైశ్వర్యమునకు కుశ్శంకలవలనవిరోధములేదని బా
దరిమతము. 8సూ॥ ముక్తునిసంకల్పమువలననే బ్రహ్మలోకమం

దలి భోగములుకలుగును. 9సూ॥ తిరుగులేని సంకల్పముగల వాడగుటవలన ముక్తునకు మరియొకదైవములేదు. 416

10సూ॥ ముక్తుడు బ్రహ్మలోకమునందు కోరికలను మనస్సుచేతనే యనుభవించును. 11సూ॥ ముక్తునకు మనస్సువలెనే ఇంద్రియములతోకూడిన శరీరమున్ను కలదని జైమినిమతము. 12సూ॥ శరీరముండుట, లేకపోవుట అను రెండును ఉండవచ్చునని వ్యాసమునిమతము. 13సూ॥ శరీరేంద్రియములు లేకున్నను స్వప్నమునందు కామములను పొందినట్లేయగును. 417

14సూ॥ జాగ్రదవస్థయందలి భోగములవలెనే ముక్తునకు భోగములుకలుగును. 15సూ॥ విద్వాంసునకు అనేకశరీరములందు ప్రవేశముకలుగును. 16సూ॥ ముక్తునకు నిద్రావస్థయు, మోక్షావస్థయు, కలవని శ్రుతులుకొన్ని చెప్పుచున్నవి. 418

17సూ॥ ముక్తులకు జగత్సృష్ట్యాదులను విడిచి అణిమాద్యైశ్వర్యము కాతగియుండును. 18సూ॥ శ్రుతులట్లేకలవు. ఈ స్వారాజ్యప్రాప్తినిగూర్చి నస్వతంత్రముపరమేశ్వరునకేకలదు. 19-20సూ॥ 12 ప్ర॥లోకలవు 21సూ॥ సగుణోపాసకులకు భోగమాత్రమునకే ఈశ్వరునితో సామ్యముగాని జగత్సృష్ట్యాదులయందు సామ్యములేదు. 419

22సూ॥ బ్రహ్మలోకమునందు సుధాహ్రదములును, కొలను, అశ్వత్థవృక్షములును, ముక్తులుపొందతగిన పురమును, కలవు. అర్చిరాదిమార్గమును పొందినవారికి మరల జన్మము లేదు. 420-421

సమాప్తము.

ష రా:—పదచ్ఛేదములేకయే కొన్ని సూత్రములలో అంకెలు పొరబాటునపడినవిగాని అంకెలులేనట్లుగా గ్రహింపవలెను.

ఈగ్రంథములోని 5వ ప్రకరణమును మూడుసారులు పారాయణచేయుటచేత ఐహికసుఖములును, భూతప్రేతపిశాచాది సంఘాత సమస్తరోగశాంతియును, అర్థానుభవముగలవారికి ఆముష్మిక సాక్షాత్ఫలమగు మోక్షమును కలుగునని పరమేశ్వరాజ్ఞ కలదు.

1 అకారఃసర్వవర్ణాగ్ర్యః ప్రకాశఃపరమశ్శివః।
హకారోంత్యఃకలారూపో విమర్శాఖ్యఃప్రకీర్తితః॥

తా॥ "అహం" శబ్దములోని మొదటి అకారమునకు ప్రకాశరూపుడగు పరశివుడును, అంత్యమగు హకారమునకు విమర్శమనెడి పరాశక్తియు నర్థములు.

2 సచ్చిదానందరూపోహం నామరూపవివర్జితః।
శివోహంసర్వమేవాహం లలితాహంనసంశయః॥

తా॥ ఆ అహంశబ్దమునకు కల్పితమగు నామరూపాత్మకమగు వాచ్యార్థమును విడిచి లక్ష్యార్థమాత్రమును గ్రహింపగా ప్రకాశవిమర్శరూపములగు శివశక్తులే తానని విజ్ఞులు భావింతురు.

3 పరాంబాయాఃప్రసాదేన గ్రంథేస్మిన్గ్రథితేమయా।
అల్పజ్ఞేన గుణాగ్రాహ్యాః క్షీరంహంసైర్యథాబుధైః।

తా॥ అల్పజ్ఞుడనగు నేను పరాంబాప్రసాదమున సంగ్రహిం చిన యీగ్రంథమునందలి దోషములనువిడచి నీటినివిడిచి పాలనుగ్రోలు హంసలవలె పండితులిందలి గుణలేశములనే గ్రహింతురు.

4 దృష్టంకిమపిలోకేస్మి న్ననిర్దోషంననిర్గుణం।
ఆవృణుధ్వమతోదోషా న్వివృణుధ్వంగుణాన్ బుధాః॥

తా॥ లోకమంతయు గుణములతోను, దోషములతోను గలిసియున్నదే. కనుక ఆర్యులారా మీరు దోషములనువిడిచి గుణములనేగ్రహింపుడు. ఎట్లనగా

5 గుణదోషౌబుధోగృహ్ణన్ ఇందుక్ష్వేడావివేశ్వరః।
శిరసాశ్లాఘతేపూర్వం పరంకంఠేనియచ్ఛతి॥

తా॥ చంద్రుని, హాలాహలమునుగ్రహించిన పరమేశ్వరుడు విషమును కంఠమునందేదాచి చంద్రుని శిరసావహించినట్లు పండితులు దోషములనువిడిచి గుణములనేప్రకటింతురు.

6 సుప్రీణాతుపరాదేవీ మాఽకారయదిమాంమయా।
సుజ్ఞానదీపికామస్యా వేదాంతార్థవిమర్శినీం॥

తా॥ ఏపరదేవత ప్రేరేపించి నాచేత వేదాంతార్థవిమర్శకమగు నీసుజ్ఞానదీపికను వ్రాయించెనో ఆపరదేవత యీసుజ్ఞానదీపికవలన సంతోషించుగావుత.

ఓంతత్సత్.

| సంఖ్య | అధికరణములు సూత్రముల సంఖ్య | | పుటసంఖ్య | ప్రకరణము |
|---|---|---|---|---|
| | 1వ అ. 1వ పాదము. | | | |
| 1 | జిజ్ఞాసాధికరణము | 1సూ. | 56 | 5 |
| 2 | జన్మాద్యధిక | 2 | 58 | ,, |
| 3 | శాస్త్రయోనిత్వాధి | 3 | ... | ,, |
| 4 | సమన్వయాధి | 4 | 59 | ,, |
| 5 | ఈక్షత్యధిక | 5=11 | 273-274 | 16 |
| 6 | ఆనందమయాధిక | 12 | 215 | 12 |
| | | 13లు 19 | 274-276 | 16 |
| 7 | అంతరధిక | 20-21 | 277 | ,, |
| 8 | ఆకాశాధిక | 22 | ... | ,, |
| 9 | ప్రాణాధిక | 23 | ... | ,, |
| 10 | జ్యోతిరధిక | 24-25-26-27 | 72-73 | 5 |
| 11 | ప్రాతర్దనాధి (ఇంద్రప్రాణాధి) | 28లు 31కు | 278-279 | 16 |
| | 2వ పాదము. | | | |
| 1 | సర్వత్రప్రసిద్ధ్యధి | 1 | 280 | ,, |
| | | 2సూ. | 74 | 5 |
| | | 3లు 8కు | 280-282 | 16 |
| 2 | అత్త్రధిక | 9సూ. | 47 | 4 |
| | | 10సూ. | 282 | 16 |
| 3 | గుహాధికరణము | 11-12 | 282-283 | 16 |
| 4 | అంతరాధిక | 13-14 | 217 | 12 |

| సంఖ్య | అధికరణములు సూత్రముల సంఖ్య. | పుటసంఖ్య | ప్రకరణము |
|---|---|---|---|
| | 15-16సూ. | 283 | 16 |
| | 17సూ. | 266 | 14 |
| 5 | అంతర్యామ్యధి 18-19-20 | 285-286 | 16 |
| 6 | అదృశ్యత్వా (గుణకా) ధి 21-23 | 286-287 | ,, |
| 7 | వైశ్వానరాధిక 24ల॥ 32 | 226-231 | 12 |
| | 3వ పాదము. | | |
| 1 | ద్యుభ్వాద్యధి 1ల॥ 7 | 287-289 | 16 |
| 2 | భూమాధికరణము॥ 8 | ... | ,, |
| | 9సూ. | 210 | 9 |
| 3 | అక్షరాధిక 10-11-12 | 289-290 | 16 |
| 4 | ఈక్షతికర్మాధిక 13 | 218 | 12 |
| 5 | దహరాధి 14 | 290 | 16 |
| | 15సూ. | 267 | 14 |
| | 16-17-18 | 291-292 | 16 |
| 6 | ఉత్తరాధిక 19సూ. | 292 | 16 |
| | 20 | 268 | 14 |
| | 21 | 293 | 16 |
| 7 | అనుకృత్యధిక 22 | ... | ,, |
| 8 | ప్రమితాధిక 23 | 294 | ,, |
| | 24-25 | 268 | 14 |
| 9 | దేవతాధిక 26ల॥ 33 | 15ల॥ 21 | 1 |

| సంఖ్య | అధికరణములు సూత్రములసంఖ్య. | | పుటసంఖ్య | ప్రకరణము |
|---|---|---|---|---|
| 10 | అపశూద్రాధిక | 34లు 38 | 21లు 24 | 1 |
| 11 | కంపనాధిక | 39 | 294 | 16 |
| 12 | జ్యోతిర్దర్శనాధి | 40 | 294 | ,, |
| 13 | అంతరత్వా (వ్యపదేశా) | 41 | ... | ,, |
| 14 | సుషుప్త్యుత్క్రాంత్యధిక | 42-43 | 295 | ,, |
| | 1అ. 4వ పాదము. | | | |
| 1 | ఆనుమానికాధిక | 1లు 7 | 296-299 | ,, |
| 2 | చమసాధిక | 8 | ... | ,, |
| | | 9సూ. | 74 | 5 |
| | | 10సూ. | 300 | 16 |
| 3 | సంఖ్యోపసంగ్రహాధిక | 11-12-13 | 301 | ,, |
| 4 | కారణత్వాధి | 14-15 | 302 | ,, |
| 5 | జగద్వాచిత్వాధి | 16-17-18 | 303-304 | ,, |
| 6 | వాక్యాన్వయాధిక | 19లు 22 | 304-306 | 16 |
| 7 | ప్రకృత్యధి | 23లు 27 | 67లు 71 | 5 |
| 8 | సర్వవ్యాఖ్యానాధి | 28 | ... | ,, |
| | 2వ అ. 1వ పాదము. | | | |
| 1 | స్మృత్యధిక | 1-2 | 307-309 | 16 |
| 2 | యోగప్రత్యుక్త్యధి | 3 | ... | ,, |
| 3 | నవిలక్షణత్వాధి | 4లు 11 | 309-312 | ,, |
| 4 | శిష్టాపరిగ్రహాధిక | 12 | ... | ,, |

| సం ఖ్య | అధికరణములు | సూత్రములసంఖ్య. | పుటసంఖ్య | ప్రకరణము |
|---|---|---|---|---|
| 5 | భోక్త్రాపత్త్యధిక | 13సూ. | 313 | 16 |
| 6 | ఆరంభణాధిక | 14-20 | 313-315 | ,, |
| 7 | ఇతరవ్యపదేశాధిక | 21 22-23 | 316 | ,, |
| 8 | ఉపసంహారదర్శనాధి | 24-25 | 75-76 | 5 |
| 9 | కృత్స్నప్రసక్త్యధిక | 26-27 | 76-77 | ,, |
| | | 28-29 | 316-317 | 16 |
| 10 | సర్వోపేతాధిక | 30-31 | 78 | 5 |
| 11 | నప్రయోజనవత్త్వాధి | 32-33 | 317 | 16 |
| 12 | వైషమ్యనైర్ఘృణ్యాధి | 34-35-36 | 317-318 | ,, |
| 13 | సర్వధర్మోపపత్త్యధిక | 37 | 79 | 5 |
| | 2వ అ. 2వ పాదము. | | | |
| 1 | రచనానుపపత్త్యధిక | 1లు 10 | 319-321 | 16 |
| 2 | మహద్దీర్ఘాధిక | 11 | 322 | ,, |
| 3 | ఉభయథాధిక | 12-17 | 322-323 | ,, |
| 4 | సముదాయాధిక | 18లు 27 | 323-325 | ,, |
| 5 | ఉపలబ్ధ్యధిక | 28-32 | 326 | ,, |
| 6 | ఏకస్మిన్నసంభవాధి | 33-36 | 326-327 | ,, |
| 7 | పత్యురసామంజస్యాధి | 37.41 | 329 | ,, |
| 8 | ఉత్పత్త్యసంభవాధి | 42-45 | 330 | ,, |
| | 2వ అ. 3వ పాదము. | | | |
| 1 | వియదధికరణము | 1లు 7కు | 332 | ,, |

| సంఖ్య | అధికరణములు | సూత్రములసంఖ్య. | పుటసంఖ్య | ప్రకరణము |
|---|---|---|---|---|
| 2 | మాతరిశ్వవ్యాఖ్యానాధి | 8సూ. | 332 | 16 |
| 3 | అసంభవాధిక | 9 | 66 | 5 |
| 4 | తేజోధిక | 10 | 333 | 16 |
| 5 | అబధిక | 11 | ... | ,, |
| 6 | పృథివ్యధిక | 12 | ... | ,, |
| 7 | తదభిధ్యానాధిక | 13 | 334 | ,, |
| 8 | విపర్యయాధిక | 14 | ... | ,, |
| 9 | అంతరావిజ్ఞానాధిక | 15 | 335 | ,, |
| 10 | చరాచరవ్యపాశ్రయాధిక | 16 | 336 | ,, |
| 11 | ఆత్మాధిక | 17 | ... | ,, |
| 12 | జ్ఞాధికరణం | 18 | 338 | ,, |
| 13 | ఉత్క్రాంతిగత్యాగత్యధిక | 19ల॥ 32 | 338ల॥ 344 | ,, |
| 14 | కర్త్రధిక | 33ల॥ 39 | 345ల॥ 347 | ,, |
| 15 | తక్షాధిక | 40 | 347 | ,, |
| 16 | పరాయత్తాధిక | 41-42 | 348 | ,, |
| 17 | అంశాధిక | 43ల॥ 53 | 349ల॥ 352 | ,, |
| | 2వ అ. 4వ పాదము. | | | |
| 1 | ప్రాణోత్పత్త్యధిక | 1ల॥ 4 | 353ల॥ 355 | ,, |
| 2 | సప్తగత్యధిక | 5-6 | 355ల॥ 356 | ,, |
| | ప్రాణాణుత్వాధిక | 7 | 356 | ,, |
| 34 | శ్రేష్ఠాధిక | 8 | ... | ,, |

| సంఖ్య | అధికరణములు సూత్రములసంఖ్య. | | పుటసంఖ్య | ప్రకరణము |
|---|---|---|---|---|
| 19 | యావదధికారాధిక | 32 | 247 | 13 |
| 20 | అక్షరాద్యధిక | 33 | 386 | 16 |
| 21 | ఇయదామననాధిక | 34 | 387 | ,, |
| 22 | అంతరత్వాధిక | 35-36 | ... | ,, |
| 23 | వ్యతిహారాధిక | 37 | 388 | ,, |
| 24 | సైవహినత్వాద్యధిక | 38 | ... | ,, |
| 25 | కామాద్యధిక | 39 | 389 | ,, |
| 26 | ఆదరాదలోపాధి | 40-41 | 389 | ,, |
| 27 | తన్నిర్ధారణానియమాధిక | 42 | 389-390 | ,, |
| 28 | ప్రదానాధిక | 43 | ... | ,, |
| 29 | లింగభూయస్త్వాధిక | 44లు 52 | 391-393 | ,, |
| 30 | శరీరేభావాధిక | 53-54 | 393-394 | ,, |
| 31 | అంగావబద్ధాధిక | 55-56 | ... | ,, |
| 32 | భూమజ్యాయస్త్వాధిక | 57 | ... | ,, |
| 33 | శబ్దాదిభేదాధిక | 58 | 395 | ,, |
| 34 | వికల్పాధిక | 59 | ... | ,, |
| 35 | కామ్యాధిక | 60 | ... | ,, |
| 36 | యథాశ్రియభావాధిక | 61లు 66 | 396-397 | ,, |
| | 3వ అ. 4వ. పాదము. | | | |
| 1 | పురుషార్థాధిక | 1లు 17 | 179-188 | 8 |
| 2 | పరామర్శాధిక | 18-20 | 190 | ,, |

| సంఖ్య | అధికరణములు | సూత్రముల సంఖ్య | పుటసంఖ్య | ప్రకరణము |
|---|---|---|---|---|
| 3 | స్తుతిమాత్రాధి | 21-22 | 191 | 8 |
| 4 | పారిప్లవాధిక | 23.24 | 192 | ,, |
| 5 | అగ్నీంధనాధిక | 25 | ... | ,, |
| 6 | సర్వాపేక్షాధిక | 26-27 | 193 | ,, |
| 7 | సర్వాన్నానుమత్యధి | 28లు 31 | 194-195 | ,, |
| 8 | విహితత్వాధిక | 32లు 35 | 196-197 | ,, |
| 9 | అంతరాతద్దృష్ట్యధి | 36లు 39 | ... | ,, |
| 10 | తద్భూతాధిక | 40 | 198-199 | ,, |
| 11 | ఆధికారికాధిక | 41-42 | 200 | ,, |
| 12 | స్మృత్యాచారాధిక | 43 | 201 | ,, |
| 13 | స్వామ్యధిక | 44-45-46 | 202-203 | ,, |
| 14 | సహకార్యంతరవిధ్యధి | 47-48-49 | 204 | ,, |
| 15 | అనావిష్కారాధిక | 50 | ... | ,, |
| 16 | ఐహికాధిక | 51 | 206 | ,, |
| 17 | ముక్తిఫలాధిక | 52 | 207 | ,, |
| | 4వ అ. 1వ పాదము | | | |
| 1 | ఆవృత్త్యధికరణము | 1సూ. | 200 | 5 |
| | | 2 | 398 | 16 |
| 2 | ఆత్మత్వోపాసనాధి | 3 | 208 | 9 |
| 3 | ప్రతీకాధిక | 4 | 210 | 10 |
| 4 | బ్రహ్మదృష్ట్యధిక | 5 | 211 | ,, |

| సంఖ్య | అధికరణములు | సూత్రములసంఖ్య. | పుటసంఖ్య | ప్రకరణము |
|---|---|---|---|---|
| 10 | రశ్మ్యనుసారాధిక | 18-19 | 408-409 | 16 |
| 11 | దక్షిణాయనాధి | 20-21 | 409 | ,, |
| | 3వ పాదము. | | | ,, |
| 1 | అర్చిరాద్యధి | 1 | 410 | ,, |
| 2 | వాయ్వధిక | 2 | 411 | ,, |
| 3 | వరుణాధిక | 3 | 412 | ,, |
| 4 | ఆతివాహికాధి | 4 | ... | ,, |
| | | 5 | 220 | 12 |
| | | 6 | 221 | ,, |
| 5 | కార్యాధిక | 7లు 14 | 221-225 | ,, |
| 6 | అప్రతీకాలంబనాధి | 15-16 | 412-413 | 16 |
| | 4వ అ. 4వ పాదము. | | | |
| 1 | సంపద్యావిర్భావాధి | 1.2.3 | 414 | ,, |
| 2 | అవిభాగేన దృష్టత్వాధి | 4 | 415 | ,, |
| 3 | బ్రాహ్మ్యధి | 5.6.7 | 415 | ,, |
| 4 | సంకల్పాధి | 8-9 | 416 | ,, |
| 5 | అభావాధి | 10లు 14 | 416 | ,, |
| 6 | ప్రదీపవదావేశాధి | 15-16 | 417 | ,, |
| 7 | జగద్వ్యాపారవర్జ్యాధి | 17-18 | 418 | ,, |
| | | 19-20 | 224 | 12 |
| | | 21-22 | 419-420 | 16 |

| ప్రకరణము | విభాగము | పాదము | సూత్రములు | సంఖ్య | పుటసంఖ్య |
|---|---|---|---|---|---|
| 1 | 1 | 3 | 26ల॥ 38 | 13 | 15ల। 25 |
| 2 | 3 | 1 | 9 | 1 | 34 |
| 4 | 1 | 2 | 9 | 1 | 47 |
| 5 | 1 | 1 | 1–2–3–4 | 4 | 56ల। 62 |
| | | | 24ల॥ 27 | 4 | 72–73 |
| | | 2 | 2 | 1 | 74 |
| | | 4 | 9 | 1 | 74 |
| | | | 23ల॥ 28 | 6 | 67 |
| | 2 | 1 | 24–25–26–27–30–31–37 | 7 | 75ల79 |
| | | 3 | 9 | 1 | 66 |
| | 4 | 1 | 1 | 1 | 120 |
| 7 | 4 | 1 | 16 | 1 | 177 |
| 8 | 3 | 4 | 1ల॥ 52 | 52 | 179ల। 207 |
| 9 | 1 | 3 | 9 | 1 | 210 |
| | 4 | 1 | 3 | 1 | 208 |
| 10 | 4 | 1 | 4–5 | 2 | 210-211 |
| 12 | 1 | 1 | 12 | 1 | 215 |
| | 1 | 2 | 13–14 | 2 | 217 |
| | | | 24ల॥ 32 | 9 | 226ల। 231 |
| | 1 | 3 | 13 | 1 | 218 |
| | 3 | 3 | 16–17 | 2 | 219 |
| | 4 | 3 | 5ల॥ 14 | 10 | 220ల। 223 |
| | 4 | 4 | 19–20 | 2 | 224 |
| 13 | 3 | 3 | 32 | 1 | 247 |
| 14 | 1 | 2 | 17 | 1 | 266 |
| | 1 | 3 | 15–20–24–25 | 4 | 267-268 |
| | 3 | 2 | 11ల॥ 41 | 31 | 252 |
| 15 | 3 | 1 | 8 | 1 | 271 |
| | | | | 162 | |
| 16 | | | మిగిలినసూత్రములన్నియు | 393 | 273ల। 421 |
| | | | | 555 | |

బ్రహ్మసూత్రములలో ఏప్రకరణములో ఏయేసూత్రములున్నవి వానివివరణ

| అధ్యాయం | పాదము | సూ॥ సంఖ్య | సూత్రములు | ప్రకరణము | సంఖ్య | 16వ ప్రకరణములోని సూత్రములు. | సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 1 | 31 | 1,2,3,4,24.25,26,27 | 5 | 9 | 5ల।11,13ల।23,28ల31 | 22 |
| | | | 12 | 12 | | | |
| | 2 | 32 | 2 | 5 | | 1,3,4,5,6,7,8,1 , 11, | 18 |
| | | | 9 | 4 | 14 | 12.15,16,18ల॥23 | |
| | | | 13,14,24ల॥ 32 | 12 | | | |
| | | | 17 | 14 | | | |
| | 3 | 43 | 9 | 9 | | 1ల।8,10ల।12,14,16, | |
| | | | 13 | 12 | 19 | 17,18,19,21,22.23, | 24 |
| | | | 15,20,24,25 | 14 | | 39ల॥43 | |
| | | | 26ల॥ 38 | 1 | | | |
| | 4 | 28 | 9,23ల॥ 28 | 5 | 7 | 1ల॥8,10ల॥22 | 21 |
| 2 | 1 | 37 | 24ల। 27,30,31,37 | 5 | 7 | 1ల॥23,28,29,32ల॥36 | 30 |
| | 2 | 45 | | | | 1ల॥ 45 | 45 |
| | 3 | 53 | 9 | 5 | 1 | 1ల॥ 8, 10ల॥53 | 52 |
| | 4 | 22 | | | | 1ల॥22 | 22 |
| 3 | 1 | 27 | 8 | 15 | 2 | 1ల॥7, 1 ల॥27 | 25 |
| | | | 9 | 2 | | | |
| | 2 | 41 | 11ల॥ 41 | 14 | 31 | 1ల॥10 | 10 |
| | 3 | 66 | 16,17 | 12 | 3 | 1ల।15,18ల।31,33ల66 | 63 |
| | | | 32 | 13 | | | |
| | 4 | 52 | 1ల॥ 52 | 8 | 52 | | 0 |
| 4 | 1 | 19 | 1 | 5 | | | |
| | | | 3 | 9 | 5 | 2,6ల॥15,17,18,19 | 14 |
| | | | 4,5 | 10 | | | |
| | | | 16 | 7 | | | |
| | 2 | 21 | | | | 1ల॥21 | 21 |
| | 3 | 16 | 5ల॥ 14 | 12 | 1 | 1ల॥4,15,16 | 6 |
| | 4 | 22 | 19,20 | 12 | 2 | 1ల॥18.21,22 | 20 |
| | వెరశి | 555 | | | 162 | | 393 |

| సంకేతాక్షరములు | వివరణము | సంకేతాక్షరములు. | వివరణము. |
|---|---|---|---|
| బ్రి సూ. | బ్రిహ్మసూత్రిములు | ఐ— | ఐతరేయము. |
| అ. పా. | అధ్యాయము, పాదము. | ఈ— | ఈశావాస్యోపనిషత్తు. |
| ఛాం— | ఛాందోగ్యము. | ప్రి— | ప్రిశ్నోపనిషత్తు. |
| తై— | తైత్తిరీయము. | శ్వే— | శ్వేతాశ్వతరోపనిషత్తు. |
| జై. సూ— | జైమినిసూత్రము. | త్రి. ర— | త్రిపురారహస్యము జ్ఞానఖండము. |
| బృ— | బృహదారణ్యము. | వి. పు— | విష్ణుపురాణము. |
| సూ— | సూత్రిము. | వి— | వివరణము. |
| ఋ. సం— | ఋగ్వేదసంహిత. | పద— | పదచ్ఛేదము. |
| ఛం బ్రా— | ఛందోబ్రాహ్మణము. | యో. వా— | యోగవాసిష్ఠము. |
| కౌ— | కౌషీతకీఉపనిషత్తు. | తా— | తాత్పర్యము. |
| భా. శాం— | భారతము, శాంతిపర్వము | కౌ. బ్రా— | కౌషీతకిబ్రాహ్మణము. |
| తై. సం— | తైత్తిరీయసంహిత. | స్మృ— | స్మృతి. |
| శ. బ్రా— | శతపదబ్రాహ్మణము. | శ్రు— | శ్రుతి. |
| భ. గీ— | భగవద్గీత. | కే— | కేనోపనిషత్తు. |
| అధి— | అధికరణము. | జా బా— | జాబాలోపనిషత్తు. |
| పం. ప్రి— | పంచదశిప్రికరణము. | పూ. మీ— | పూర్వమీమాంస. |
| అ. గీ— | అష్టావక్రిగీత. | శ్లో— | శ్లోకము. |
| క— | కఠవల్లి. | | |
| ముం— | ముండకోపనిషత్తు. | | |

శుభమస్తు-అవిఘ్నమస్తు,

శ్రీగురుభ్యో నమః

శ్రీబాలాత్రిపురసుందరీసమేత శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః

# సుజ్ఞాన దీపిక

వందే విఘ్నేశ్వరం దేవం సర్వసిద్ధిప్రదాయినం ।
వామాంకారూఢవామాక్షీకరపల్లవపూజితం ॥

పాశాంకుశేక్షుసుమరాజితపంచశాఖాం । పాటల్యశాలి సుషుమాంచితగాత్రవల్లీం । ప్రాచీనవాక్స్తుతిపదాం పరదేవతాం త్వాం పంచాయుధార్చితపదాం ప్రణమామి దేవీం ॥

గురుర్బ్రహ్మ గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః ॥
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥

జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిం ।
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే ॥

అహం బ్రహ్మ అహం విష్ణుః అహం దేవో మహేశ్వరః।
అహం సాక్షాత్పరబ్రహ్మ అహం త్రిపురసుందరీ ॥
యావిద్యా శివకేశవాదిజననీ యావై జగన్మోహినీ ।
యాపంచప్రణవద్విరేఫనళినీ యాచిత్కళామాలినీ ।
యాబ్రహ్మాది పిపీలికాంతజగదానందైకసంధాయినీ ।
సాపాయాత్పరదేవతా భగవతీ శ్రీరాజరాజేశ్వరీ ॥
కాళికోహం కులేశోహం కుళపూజారతోస్మ్యహం ।
నారాయణోహం బ్రహ్మోహం భైరవోహం శివోస్మ్యహం।
త్రిపురాపాదభక్తోహం అహం త్రిపురసుందరీ ॥

ఓంనమః కారణానందరూపిణీ పరచిన్మయీ ।
విరాజతే జగచ్చిత్రి చిత్రదర్పణరూపిణీ ॥

## 1 వ ప్రకరణము.

నరజన్మము అత్యుత్తమమనుటకును, జ్ఞానవిద్య నరుల లో కొందరికిమాత్రమే (వర్ణాశ్రమాది భేదములును, కర్మములును, లేకయే) పూర్వజన్మవాసన, ఈశ్వరానుగ్రహముల వలన పొందబడుననుటకును ప్రమాణములు.

### భగవద్గీత 7 వ అధ్యాయము.

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥

తా॥ జ్ఞానార్హుడు వెయ్యిమనుష్యులలో ఒకడు.

### శ్రీశంకరాచార్యకృత వివేకచూడామణి.

జంతూనాం నరజన్మదుర్లభమతః పుంస్త్వం తతోవిప్రతా।
తస్మాద్వైదికకర్మమార్గపరతా విద్వత్త్వమస్మాత్పరం।
ఆత్మానాత్మవివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనాసంస్థితిః।
ముక్తిర్నో శతకోటిజన్మసుకృతైః పుణ్యైర్వినా లభ్యతే॥

తా॥ జన్మములలో నరజన్మ శ్రేష్ఠము. అందులోను పురుషజన్మము, బ్రాహ్మణత్వము, వైదికమార్గపరత్వము అనునవి ఒకదానికంటె మఱియొకటి శ్రేష్ఠము. వీనికంటె ఆత్మానాత్మ వివేచనముగల జన్మ మిగుల శ్రేష్ఠము. (ఇది అన్ని జాతులకును సామాన్యముగా మనుష్యులందరికిని వర్తించును) ఇదిగతించిన నూరుకోట్లజన్మములందు చేసిన పుణ్యముచేత భగవదనుగ్రహ మువలననే కలుగును. ఇట్లు పరమాత్మను సేవించినవాడే ముక్తుడును, శ్రేష్ఠుడును.

## వివేకచూడామణి.

దుర్లభం త్రయమేవైతద్దైవానుగ్రహహేతుకం।
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః ॥ 2 ॥
లబ్ధ్వా కథంచిన్నరజన్మ దుర్లభం తత్రాపి పుంస్త్వం శ్రుతి పారదర్శనం। యస్త్వాత్మముక్త్యై నయతేత మూఢధీః సహ్యాత్మహాస్వం వినిహంత్య సద్గ్రహాత్ ॥ 3 ॥
ఇతః కోన్వస్తి మూఢాత్మా యస్తు స్వార్థే ప్రమాద్యతి।
దుర్లభం మానుషం దేహం ప్రాప్య తత్రాపి పౌరుషం ॥ 4 ॥
తా॥ 2 నరజన్మము, మోక్షేచ్ఛ, సత్సాంగత్యము ననునివి భగవదనుగ్రహమువలననే కలుగవలయును. 3 అర్హుడైయుండి మోక్షముకొఱకు యత్నింపని పురుషుడు విషాదులు తిని చచ్చువానితో తుల్యుడు. 4 ఆత్మనిష్ఠలేకపోవుటకంటె మూఢత్వము వేఱొకటిలేదు.
పైసంగతులు నరులందరికిని వర్తించును.

## పంచదశి ప్రత్యక్తత్వవివేకము.

ఇత్థం తత్వవివేకం విధాయ విధివన్మనస్సమాధాయ।
విగళితసంసృతిబంధః ప్రాప్నోతి పరంపదం నరో నచిరాత్।
తా॥ నరుడు పంచకోశములను విభజించి పరతత్వమును విమర్శింపగా అపరోక్షజ్ఞానము కలిగి శీఘ్రముగా మోక్షమును పొందును.

పంచకోశములు

1 అన్నమయకోశము స్థూలదేహము.
2 ప్రాణమయము }
3 మనోమయము } సూక్ష్మదేహము
4 విజ్ఞానమయము }
5 ఆనందమయము కారణదేహము.

యోగవాసిష్ఠము-ఉపశమనప్రకరణము. 19సర్గ

యస్యేదం జన్మ పాశ్చాత్యం తమాశ్వేవ మహామతే ।
విశంతి విద్యా విమలా ముక్తా వేణుమివోత్తమం ॥ 9 ॥
ఆర్యతాహృద్యతామైత్రీ సౌమ్యతా ముక్తతాజ్ఞతా ।
సమాశ్రియంతి తంనిత్య మంతఃపురమివాంగనాః ॥ 10 ॥
పేశలాచారమధురం సర్వేవాంఛంతి తం జనాః ।
వేణుం మధురనిధ్వానం వనే వనమృగాఇవ ॥ 11 ॥

తా॥ ఓరామా! అంతమున వెదురునందు ముత్యములు పండునట్లే అంత్యజన్మమునందు ఉత్తమపురుషుని శుద్ధవిద్యలు పొందును. స్త్రీలు అంతఃపురము నాశ్రయించునట్లే పూజ్యత మొదలగు గుణములు నతనినాశ్రయించును. అడవిమృగములు వేణునాదమును కోరునట్లే జ్ఞానిని ఉత్తమజనులు కోరుదురు.

త్రిపురారహస్యము-జ్ఞానఖండము.
17 అధ్యాయము.

అష్టావక్రమహామునితో జనకమహారాజు చెప్పుచున్నాడు

అనేకజన్మసుకృతైః సంతుష్టా స్వాత్మదేవతా ॥ 50 ॥
యదాతదా ముముక్షుత్వం నాన్యథా కల్పకోటిభిః ।

చేతనత్వం జన్మవత్సు పరమం దుర్లభం భవేత్ ॥ 51 ॥
సుదుర్లభం తేష్వపిచ మానుషం జన్మ సర్వదా ।
తత్రాఽపి సూక్ష్మబుద్ధిత్వ మత్యంతం హి సుదుర్లభం ॥ 52 ॥

తా॥ తానారాధించిన పరదేవతకు ప్రీతికలిగినపుడే, కాని యెన్నికోట్లజన్మములకైనను మోక్షమందిచ్చ కలుగదు. చైతన్యముగల జన్మములలో నరజన్మమును సూక్ష్మబుద్ధియును దుర్లభములు.

పశ్య బ్రహ్మన్ స్థావరాణాం శతాంశేనాపి సంమితం ।
నదృశ్యతే జంగమంవై తేషామపి శతాంశతః ॥ 53 ॥
సమం నాస్తి మనుష్యత్వం తత్రాపి పరభావయ ।
పశుతుల్యాః ప్రదృశ్యంతె మనుష్యాణాం హి కోటయః ।

తా॥ పర్వతవృక్షాది స్థావరములకంటె పశుపక్ష్యాది జంగమములున, వీనికంటె నరులును, బుద్ధిచేత శతాంశముకంటె నధికముగ నున్నారు. అయినను నరులలో పశుప్రాయులు అనేకకోట్లు గలరు.

యే నజానంతి సదసత్పుణ్యంవా పాపమేవవా ।
అన్యేపి కోటిశో మర్త్యాః ప్రవృత్తా కామనాపరాః ॥ 55 ॥
గతాగతం రోచయంతె పాండిత్యాభాసగర్వితాః ।
ఏవంవిధజనానాంతు కేష్యన్యే బుద్ధిమద్విధాః ॥ 56 ॥
మాలిన్యశేషచిత్తాస్తే ష్వద్వైతపదనాస్తికాః ।
భగవన్మాయయాచ్ఛన్న మద్వైతం పరమంపదం ॥ 57 ॥

తా॥ పుణ్యపాపములనెఱుగని నరులకు సంసారమే మిగుల ప్రియము. పండితుడననే దేహాభిమానముగలవానికి వివేక

ము కలుగదు. శాస్త్రజ్ఞులలో కొందరితరులకు సంసారబంధ నివర్తకమగు ఆత్మబోధచేయుటకు బదులుగ అద్వైతముక్తి దుర్లభమనియు, అందరికిని సాధ్యముకాదనియు భయపెట్టు దురు.

భగవద్గీత-7 అధ్యాయము.

సతయాశ్రద్ధయాయుక్త స్తస్యారాధనమీహతే ।
లభతేచ తతఃకామాన్ మయైవ విహితాన్ హితాన్ ॥
అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసాం ।
దేవాన్ దేవయజో యాంతి మద్భక్తా యాంతి మామపి॥

తా॥ భక్తుల కోరికలును తామారాధించిన దేవతలచేత చిదూపుడనగు నేనే దీర్పించుచుందును నిరంతరభక్తితో నాచిదూపమును భజించినవారికి నిత్యానందమోక్షము కలు గునని శ్రీకృష్ణుడు చెప్పెను.

శ్రీశంకరాచార్యకృతి అపరోక్షానుభూతి.

పరిపక్వం మనో యేషాం కేవలోఽయంచ సిద్ధిదః ।
గురుదైవతభక్తానాం సర్వేషాం సులభో జవాత్ ॥ 144॥

తా॥ రాజయోగము పరిపక్వహృదయులకును, గురువు యందును దేవతయందును భక్తిగల సకలజనులకును సులభ మయి శీఘ్రముగ మోక్షమునిచ్చును. గురుదేవతలయందలి భక్తియే అంతరంగసాధనమని "యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ। తస్యైతే కథితాహ్యర్థాః ప్రకా శంతే మహాత్మనః॥" అని శ్వేతాశ్వతరశ్రుతియు, భగవద్భ క్తికలిగి గురువాక్యమందు శ్రద్ధకలవాడు జ్ఞానమును పొందు

నని "తద్విద్ధి ప్రణిపాతేన" "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అని భగవద్గీతయును చెప్పుచున్నవి.

భగవద్గీత-8 అధ్యాయము.

మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతం ।
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాంగతాః ॥ 15॥

తా॥ లక్ష్యార్థమగు నాచిద్రూపమును పొందినవాడు దుఃఖస్థానమయిన జన్మమును మఱల పొందడు.

జీవన్ముక్తివివేకము-బృహస్పతిస్మృతి.

ఆదరేణ యథా స్తౌతి ధనవంతం ధనేచ్ఛయా ।
తథాచేద్విశ్వకర్తారం కోనముచ్యేత బంధనాత్ ।

తా॥ ధనమునిమిత్తము ధనవంతుని పొగడినంతటిశ్రద్ధతో భగవంతుని బ్రార్థించినవాడు ముక్తిని పొందకపోడు.

మహానారాయణోపనిషత్తు.

భక్త్యావినా బ్రహ్మజ్ఞానం కదాపిచ నజాయతే। తస్మాత్త్వమపి సర్వోపాయాన్ పరిత్యజ్య భక్తిమాశ్రయ। భక్తినిష్ఠోభవ। భక్తినిష్ఠోభవ। భక్త్యా సర్వసిద్ధయస్సిధ్యంతి। భక్తేరసాధ్యం నకించిదస్తి।

తా॥ భక్తి లేనిది జ్ఞానముకలుగదు. భక్తిలేక చేసినకార్యమేదియు ఫలింపదు. గనుక సకలసిద్ధిప్రదమగు భక్తినేతప్పక ఆశ్రయింపుము.

జగత్తు నశించునది యని దృఢనమ్మకముతో నిత్యమగు చిద్రూపమును ధ్యానించువాడు కర్మాపేక్షయును, వర్ణాశ్రమాదిభేదమును లేకుండ ముక్తినిపొందుననుటకు ప్రమాణములు.

భగవద్గీత–12 అధ్యాయము.

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణఏవచ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖఃక్షమీ ॥ 13 ॥
సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తః సమేప్రియః ॥ 14 ॥
యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతేచ యః।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యః సచమే ప్రియః ॥ 15
అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారంభపరిత్యాగీ యోమద్భక్తః సమే ప్రియః ॥ 16 ॥
యో నహృష్యతి నద్వేష్టి నశోచతి నకాంక్షతి।
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్యః సమే ప్రియః ॥ 17 ॥
సమః శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు సమః సంగవివర్జితః ॥ 18 ॥
తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్।
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్ మే ప్రియో నరః ॥ 19 ॥

తా॥ అర్జునా! అన్నిప్రాణులయందును దయయు, స్నేహముఁ కలిగి సుఖదుఃఖములకు మోదశోకములను పొందక వానిని సహించుచు అహంకారమమకారములను విడిచి జగత్తంతయు నశ్యమని దృఢముగనమ్మి నాచిద్రూపమునందే చిత్తముంచి

సదానందమును బొందువాడు నాకు ప్రియభక్తుడు. ఇట్టివాడె వనినిగాని బెదిరింపడు. తాను బెదరడు ఖేదమోదములను జెందడు. మఱియు సమస్థుడు, పవిత్రుడు, తటస్థుడు, నిశ్శోకుడునై దేనినిగాని కోరక నిర్వ్యాపారముగ నిరంతరము నాచిద్రూపమునుధ్యానింగువాడును, జాగ్రిద్వ్యాపారము స్వప్నకార్యములతో సమానమనెడి జ్ఞానముకలిగి తనయొక్క పుణ్యపాపకర్మలకు గర్వమును, విచారమును, పొందక అపకారితో ద్వేషింపక శుభాశుభములను కోరనివాడును నాకు ప్రియుడు. శత్రుమిత్రులయొక్క ఉపాధులున్ను, తనయొక్క ఉపాధిన్ని దేహములే కనుక అవి అనిత్యమగుటచేత దేహోపాధికంటె అన్యమగు చిద్రూపుడే తానును, ఇతరులును, కనుక విషమబుద్ధినివిడిచి మానావమానములను, నిందాస్తుతులను గణింపక నిస్సంగుడై కలిగినదానిచేతనే తుష్టిని పొందువాడు నాకు పరమభక్తుడు.

ఆత్మజ్ఞానమునకు సాధనములు.

భగవద్గీత-13 అధ్యాయము.

ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా ।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే ॥ 25 ॥
అన్యేత్వేవమజానంత శ్శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే ।
తేపి చాఽతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః ॥ 26

తా॥ కొందఱు ధ్యానముచేతను, కొందఱు జ్ఞానముచేతను కొందఱు నిష్కామకర్మయోగముచేతను, పరమాత్మను సాక్షాత్కరించి తరింతురు. కొందఱు పైమూడుమార్గములను తెలి

ధునివారైనను గురూపదేశముచేత భక్తిశ్రద్ధలతో వేదాంతమును వినుటచేతకూడ మరల జన్మమును పొందరు.

ఇతరసాధనములు లేకున్నను భక్తిచేత జ్ఞానము కలుగుననుట.

భగవద్గీత-11 అధ్యాయము.

నాహం వేదైర్న తపసా నదానేన నచేజ్యయా ।
శక్యఏవంవిధోద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥ 53 ॥
భక్త్యా త్వనన్యయాశక్య అహమేవంవిధోఽర్జున ।
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥ 54 ॥
మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సంగవర్జితః ।
నిర్వైరస్సర్వభూతేషు యస్సమామేతి పాండవ ॥ 55 ॥

తా॥ వేదాధ్యయనముచేతగాని, దానముచేతగాని, తపస్సుచేతగాని, యజ్ఞాదికర్మలచేతగాని. చూడశక్యముకాని నాచిద్రూపము ఇతరాసక్తిలేని భక్తిచేతనే చూచుటకును, తెలియుటకును, ప్రవేశించుటకును శక్యమగును. నాకొఱకేసత్కర్మములుచేయుచు అన్నివిధముల నన్నుభజించుచు, ధన బంధు పుత్ర మిత్ర కళత్రాదులయందు స్నేహమును, సమస్తప్రాణులయందు వైరమును లేనివాడే నాచిద్రూపమును పొందును.

ఆత్మజ్ఞానములేనిదే కర్మములవలన ముక్తికలుగదు.

పంచదశి ప్ర॥ చిత్రదీపము.

ముక్తిస్తు బ్రహ్మతత్త్వస్య జ్ఞానాదేవ నచాన్యథా ।
స్వప్రబోధం వినానైవ స్వస్వప్నో హీయతే యథా ॥210

తా॥ తనస్వప్నము తనజాగరణమువలననేగాని తొలగన ట్టు ముక్తియును తనయొక్క ప్రత్యగభిన్నపరమాత్మ సాక్షా త్కారమువలననేగాని మఱియొకవిధముగ కలుగదు.

వివేకచూడామణి.

వదంతు శాస్త్రాణి యజంతు దేవాన్ కుర్వంతు కర్మాణి భజంతు దేవతాః। ఆత్మైక్యబోధేన వినాపి ముక్తి ర్నసిధ్యతి బ్రహ్మ శతాంతరేపి ॥ 6 ॥

తా॥ శాస్త్రములు చదివినను, యజ్ఞాదికర్మములు చేసిన ను, దేవతారాధనచేసినను ఆత్మైక్యవిమర్శములేనిదే నూరు బ్రహ్మకల్పములకైనను ముక్తికలుగదు.

అమృతత్వస్య నాశాస్తి విత్తేనేత్యేవహి శ్రుతిః।
బ్రవీతి కర్మణో ముక్తేర హేతుత్వం స్ఫుటం యతః ॥ 7 ॥
అతో విముక్త్యై ప్రయతేత విద్వాన్ సన్న్యస్తబాహ్యార్థ సుఖస్పృహస్సన్। సంతం మహాంతం సముపేత్య దేశికం తేనోపదిష్టార్థసమాహితాత్మా ॥ 8 ॥
ఉద్ధరేదాత్మనాత్మానం మగ్నం సంసారవారిధౌ।
యోగారూఢత్వమాసాద్య సమ్యగ్దర్శననిష్ఠయా ॥ 9 ॥
సన్న్యస్య సర్వకర్మాణి భవబంధవిముక్తయే।
యత్యతాం పండితైర్ధీరై రాత్మాభ్యాసఉపస్థితైః ॥ 10 ॥
చిత్తస్య శుద్ధయే కర్మ నతు వస్తూపలబ్ధయే।
వస్తుసిద్ధిర్విచారేణ నకించిత్కర్మకోటిభిః ॥ 11 ॥
సమ్యగ్విచారతః సిద్ధా రజ్జుతత్త్వావధారణా।
భ్రాంత్యోదితమహాసర్ప భయదుఃఖవినాశినీ ॥ 12 ॥

అతో విచారః కర్తవ్యో జిజ్ఞాసో రాత్మవస్తునః ।
సమాసాద్య దయాసింధుం గురుం బ్రహ్మవిదుత్తమం ॥ 13

తా॥ కర్మలవలన ముక్తి కలుగదని శ్రుతి ఘోషించుచు న్నందున కర్మసాధ్యమగు ధనముచేత ముక్తి కలుగనేరదు. కాబట్టి బుద్ధిమంతుడు సద్గురువునాశ్రయించి వానిఉపదేశము నుశ్రద్ధతో నమ్మి ఆగురుప్రోక్తమగు లక్ష్యమందు నిరంతర నిష్ఠచేత యోగారూఢుడగుచు సంసారసాగరములో మునుగు టచేత జననమరణక్లేశములను బొందుచుండు జీవుని స్వయ ముగ ఉద్ధరింపవలయును. మందాధికారముతో త్రాడునుచూచి పాములని భ్రమపడినవాడు శ్రద్ధతోవిమర్శించి యిది త్రాడే కాని పాముకాదు అని నిశ్చయించి నిర్భయుడగును. ఇట్లే సంసారతప్తుడయి జ్ఞానమునుకోరిన ధీమంతుడు దయానిధియ గు బ్రహ్మజ్ఞానిని సేవించి వారుబోధించిన లక్ష్యమును నిరం తరము విమర్శించినయెడల సంసారభయముతొలగి శాశ్వ తానందమును బొందును. కనుక పండితులు ధైర్యమవలంబిం చి కర్మఫలమును కోరక బంధనివృత్తికై ఆత్మనే నిరంతరము భావింపవలయును. ఎన్నికర్మలుచేసినను వీనివలన చిత్తశుద్ధి మాత్రమే కాని ఆత్మజ్ఞానము కలుగదు.

జన్మాంతరవాసన ముఖ్యమనుట.

పంచదశి 9 వ ప్రకరణము. ధ్యానదీపము.

గర్భఏవ శయానస్సన్ వామదేవోఽవబుద్ధవాన్ ।
పూర్వాభ్యస్తవిచారేణ యద్వదధ్యయనాదిషు ॥ 35 ॥

తా॥ జన్మాంతరమునందు చేసిన తత్త్వవిచారముచేత

వామదేవుడు తల్లిగర్భములోనుండగానే అపరోక్షజ్ఞానమును పొందెనని శ్రుతి చెప్పుచున్నది.

బహువారమధీతేపి తదా నాయాతిచేత్పునః ।
దినాంతరేఽనధీత్యైవ పూర్వాధీతం స్మరేత్పుమాన్ ॥36

తా॥ అనేకసార్లుచదివిన వేదము ముఖస్థముకాకున్నను మరలచదువకయే పూర్వముచదివినదానిని స్మరించుచున్నాడు అట్లే తత్త్వజ్ఞానమున్ను-

కాలేన పరిపచ్యంతే కృషిగర్భాదయో యథా ।
తద్వదాత్మవిచారోపి శనైః కాలేన పచ్యతే ॥ 37 ॥

తా॥ కృషియు, గర్భాదులును ఆయాయుక్తకాలమునందు ఫలించునట్లే ఆత్మవిచారముకూడ కాలక్రమమున పరిపక్వమును బొందును.

ప్రతిబంధలక్షణము.

ప్రతిబంధో వర్తమానో విషయాసక్తిలక్షణః ।
ప్రజ్ఞామాంద్యం కుతర్కశ్చ విపర్యయదురాగ్రహః ॥43॥

తా॥ స్త్రీచ్ఛందనాదులయందు ఆసక్తియు, బుద్ధిమాంద్యము, శుష్కతర్కముచేత శ్రుత్యర్థమును వేఱొకవిధముగనూహించుటయు, ఆత్మకు కర్తృత్వాదిధర్మములు కలవనివాదించుటయు అనునివి వర్తమానప్రతిబంధములు.

ప్రతిబంధనివృత్తిలక్షణము.

శమాద్యైశ్శ్రవణాద్యైశ్చ తత్రతత్రోచితైః క్షయం ।
నీతేస్మిన్ ప్రతిబంధేఽత స్స్వస్య బ్రహ్మత్వమశ్నుతే ॥44

తా॥ "శాంతోదాంత ఉపరత స్తితిక్షుస్సమాహితోభూత్వా" యను శ్రుతిచేత శమము, దమము, ఉపరతి, తితిక్షా, సమాధి, శ్రద్ధలనెడి శమాదిషట్కముచేత విషయాసక్తియును, "శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యః" యను శ్రుతినిబట్టి వేదాంతార్థశ్రవణముచేత బుద్ధిమాంద్యమున్ను, మననముచేత కుతర్కమున్ను, నిధిధ్యాసముచేత విపర్యయదురాగ్రహములున్ను నశించి అపరోక్షజ్ఞానము కలుగును.

పంచదశి 9 ప్ర॥ ధ్యానదీపము.

ప్రతిబంధనివృత్తికిగల కాలవ్యవధి.

ఆగామిప్రతిబంధశ్చ వామదేవే సమీరితః।
ఏకేనజన్మనా క్షీణో భరతస్య త్రిజన్మభిః॥ 45॥

తా॥ మఱియొకజన్మమునకు కారణమగు ప్రారబ్ధకర్మప్రతిబంధము వామదేవునకు ఒకజన్మముచేతను, జడభరతునకు మూడుజన్మములచేతను నశించినది.

భావిప్రతిబంధము భోగము (అనుభవము) చేతనేకాని నశింపదని వార్తికకారుల మతము.

యోగభ్రష్టస్య గీతాయామతీతే బహుజన్మని।
ప్రతిబంధక్షయఃప్రోక్తో నవిచారోప్యనర్థకః॥ 46॥

తా॥ చిద్రూపసాక్షాత్కారము కలుగువరకును విమర్శింపని యోగభ్రష్టునికి అనేకజన్మములు కలిగినపిమ్మట ప్రతిబంధము నశించుననిగీతాశాస్త్రము చెప్పుచున్నది. గనుక కాలనియమములేదు. గాని చేసినతత్త్వవిచారముమాత్రము వ్యర్థము కాదు. పై ప్రమాణములవలన జన్మాంతరవాసనయు, ఈశ్వ

రానుగ్రహమును గలవారికి కర్మములతో నిమిత్తములేకయే జ్ఞానవిద్య పొందబడునని కనిపించుచున్నది. బ్రహ్మసూత్రభాష్యమునందు దేవతలకు కర్మలు లేనందున జ్ఞానవిద్యాధికారములేదని పూర్వపక్షమురాగా వారు జన్మాంతరమునందుకర్మలుచేసినవారు గనుక జ్ఞానవిద్యాధికారముకలదని చెప్పబడెను కావున కర్మములు ఈజన్మమునందే యుండవలయునను నియమములేదు.

వివరణము— బ్రహ్మసూత్రముల పదచ్ఛేదమునందలి 1,2,3,4 ఇత్యాది సంఖ్యలు సూత్రములోనిపదములకుమాఱుగా తాత్పర్యమునందు వ్రాయబడినవి. గనుక ఆయంకెలుచేత సూత్రములోనిపదములే గ్రహింపతగును. సంస్కృతపదముల యర్థము అవసరములేనివారు అంకెలసంఖ్యను విడిచి తాత్పర్యమునుమాత్రమే గ్రహింపనచ్చును.

బ్ర. సూ. 1 అ. 3 పాదము.
9 దేవతాధికరణము.

అవ॥ జ్ఞానాధికారము మనుష్యులకేగాని దేవాదులకులేదని పూర్వపక్షమురాగా—

26 సూ. 1 తదుపర్యపి 2 బాదరాయణః 3 సంభవాత్॥

తా॥ (1) మనుష్యులకంటె మీదనుగల దేవాదులకును శరీరముండుటచేత వారికిని (3) జ్ఞానాధికారసామర్థ్యము కలదని (2) వ్యాసమహాముని తలచుచున్నాడు. దేవతలకును మోక్షేచ్ఛకలుగవచ్చును. వారు జన్మాంతరమునందు వేదమును పఠించినారు. క్రింది 1-2 శ్రుతులు జ్ఞానవిద్యకొఱకువారు

బ్రహ్మచర్యము చేసినట్లును, 3-4 శ్రుతులు కర్మములందే అధికారములేనట్లును చెప్పుచున్నవి గనుక వారికి జ్ఞానాధికారము కలదు.

1 ఛాం 8-11-3 ఏకశతం హవై వర్షాణి మఘవా ప్రజాపతౌ బ్రహ్మచర్యమువాస.

తా॥ ఇంద్రుడు జ్ఞానవిద్యకొరకు చతుర్ముఖునియొద్ద నూరుసంవత్సరములు బ్రహ్మచర్యవ్రతము చేసెను.

2 తై. 3-1 భృగుర్వై వారుణిః వరుణం పితరముపససార। అధీహి భగవో బ్రహ్మ ॥

తా॥ భృగువు జ్ఞానమునుపదేశింపుమని తండ్రిని కోరెను.

3 జై. సూ. 6-1-6 న దేవానాం దేవతాంతరాభావాత్.

తా॥ తమకంటె పైని వేఱగు దేవతలు లేరుగనుక దేవతలకు కర్మములందధికారములేదు.

4 జై. సూ. 6-1-7 న ఋషీణాం ఋష్యంతరాభావాత్।

తా॥ తమకంటె పైని వేఱగు ఋషులు లేరుగనుక ఋషులకు ఋషిసంబంధమగు కర్మములందధికారములేదు.

అవ॥ దేవతలకు శరీరమున్నదనునెడల అనేకచోట్ల యజ్ఞముచేసినపుడు ఆదేవత అన్నిచోట్లను ఒకమారే యుండుటకు వీలులేదుగనుక దేవతలకధికారములేదని పూర్వపక్షమురాగా

27 సూ. విరోధః కర్మణీతిచేన్నానేకప్రతిపత్తేర్దర్శనాత్॥

పద॥ 1 విరోధః 2 కర్మణి 3 ఇతిచేత్ 4 న 5 అనేకప్రతిపత్తేః 6 దర్శనాత్॥

తా॥ దేవాదులకు జ్ఞానాధికారము కలదనునెడల (2) యాగాదికర్మములందు (1) విరోధము కలుగును (3) అని యందువేని (4) విరోధములేదు. (5) ఏకకాలమునందే దేవతలు ఒక్కొకడు అనేకస్వరూపములు పొందునని (6) శ్రుతి స్మృతులవలన కనబడుచున్నది. అట్లే-

1 బృ. 5-9-1 కతిదేవాః "త్రియశ్చ త్రీచ శతాత్రియశ్చ త్రీచ సహస్రా"

2 బృ. 5-9-2 కతమేతే "మహిమానఏవైషా మేతే త్రియస్త్రింశత్వే దేవతాః"

తా॥ 1 శాకల్యుడడుగగా దేవతలు 3306 రు అనియు, వారందరు 2 ఇప్పుడు చెప్పిన 33 రు దేవతలయొక్క విభూతులేయనియు చెప్పెను. ఈ 33 రు దేవతలే అనేకరూపములతో 3306 రుగ నున్నారు. పరమార్థముచేత వసువులు, రుద్రులు, ఆదిత్యులు, ఇంద్రప్రజాపతులు అనెడి ముప్పదిముగ్గురే యని యాజ్ఞవల్క్యుడు చెప్పెను.

3 బృ. 5-9-9 కతమ ఏకో దేవఇతి ప్రాణఇతి।

తా॥ ప్రాణమనునది ఒకే దేవుడు.

4 భారతము- ఆత్మనోవై సహస్రాణి బహూని భరతర్షభ। కుర్యాద్యోగీ బలం ప్రాప్య తైశ్చ సర్వైర్మహీం చరేత్॥ ప్రాప్నుయాద్విషయాన్ కైశ్చిత్కైశ్చిదుగ్రం తపశ్చరేత్। సంక్షిపేచ్చ పునస్తాని సూర్యో రశ్మిగణానివ॥

తా॥ హఠాది యోగములచేత అణిమాదిసిద్ధులను పొందినవాడు అనేకవేల దేహములను సృజించును. కొన్ని దేహముల

తో భూమియందు భోగములననుభవించును. కొన్నిటితో భయంకరమగు వ్రతాదికమును చేయును. మరల వానిని సూర్యుడు కిరణములనువలెనే లయముచేయును.

అన॥ దేవతలకు శరీరమున్నదనుటచేత మనుష్యులవలెఅనిత్యులేగదా? వీరు నిత్యులనుట యెట్లు అని ఆక్షేపమురాగా-

28 సూ. శబ్దఇతిచేన్నాతః ప్రభవాత్ప్రత్యక్షానుమానాభ్యాం ॥

పద॥ 1 శబ్దః 2 ఇతిచేత్ 3 న 4 అతఃప్రభవాత్ 5 ప్రత్యక్షానుమానాభ్యాం ॥

తా॥ దేవతలకు శరీరముకలదనుటచేత అనిత్యులైరి గనుక వీరు నిత్యులను (1) శబ్దమునకు విరోధము కలుగునని (2) యందువేని (4) వేదమునుండి దేవాదులతోకూడిన జగత్తు పుట్టుటవలన విరోధము (3) లేదు. శబ్దములకు సంబంధము ఆకృతులతోగాని వ్యక్తులతోలేదు. వీనిలో ఆకృతులు నిత్యమైనవి. వ్యక్తులు పుట్టుచున్నవి. శబ్దమునుండి జగత్తుపుట్టినట్లు (5) శ్రుతిస్మృతులవలన తెలియబడును. మఱియొకదాని అపేక్షలేకుండ ప్రామాణ్యమైన అర్థమునుచెప్పు శ్రుతి ప్రత్యక్షము. శ్రుతినియపేక్షించిచెప్పు స్మృతి అనుమానము. బ్రహ్మము వైదికశబ్దమును స్మరించి సృష్టిని చేసెనని తై. బ్రా. 2-2-4 శ్రుతి చెప్పుటచేత నిత్యమగు శబ్దమువలన దేవాది వ్యక్తులయొక్క యుత్పత్తి విరుద్ధముకాదు.

1 ఛం. బ్రా. ఏతఇతి వైప్రజాపతిర్దేవా నసృజతా సృగ్రమితి మనుష్యానిందనఇతి పితౄం స్తిరః పవిత్రమితి గ్రహానా

శవఇతి స్తోత్రం విశ్వానీతి శస్త్రమభిసౌభగే త్యన్యాఃప్రజాః॥

తా॥ చతుర్ముఖుడు సర్వనామముచ్చరించి దేవతలను, నరులను, పితృదేవతలను, యజ్ఞపాత్రములను, స్తోత్రమును, శస్త్రములను, తక్కినజంతువులను సృజించెను.

2 బృ. 3-1-4 సమనసా వాచం మిధునం సమభవ ॥

తా॥ బ్రహ్మము వేదమందు ప్రకాశింపచేయబడిన సృష్టిని మనస్సునందాలోచించెను.

3 తై. బ్రా. 2-2-4 సభూరితి వ్యాహరత్ సభూమి మసృజత ॥

తా॥ భూః అను శబ్దమునుచ్చరించి భూమిని సృజించెను.

అవ॥ నిత్యశబ్దమాత్రముచేత వస్తువులు నిత్యములు కావలయునను నియమములేదు.

29 సూ. 1 అతఏవచ 2 నిత్యత్వం ॥

తా॥ (1) దేవాదిజగత్తు నిత్యమగు జాతివాచకమైన వేదశబ్దములనుండి పుట్టుటవలన (2) వేదశబ్దములకు నిత్యత్వము గ్రహింపతగును.

1 ఋ. సం. 10-71-3 యజ్ఞేనవాచః పదవీయ మాయం స్తామన్వవిందన్నృషిషు ప్రవిష్టా ॥

తా॥ యాజ్ఞికులు పూర్వజన్మకృతపుణ్యముచేత వేదవాక్కును గ్రహించిరి.

2 భారతము॥ శాం. అ. 210 శ్లో. 19

యుగాంతేంతర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః।
లేభిరే తపసా పూర్వమనుజ్ఞాతా స్స్వయంభువా॥

తా॥ మహర్షులు ప్రళయకాలమునందు లీనమైన వేదములను, ఇతిహాసములను, తపస్సు (పుణ్యకర్మసామర్థ్యము) చేత బ్రహ్మదేవునివలన సృష్ట్యాదియందు గ్రహించిరి.

30 సూ. సమాననామరూపత్వాచ్చావృత్తావ
ప్యవిరోధో దర్శనాత్స్మృతేశ్చ ॥

పద॥ 1 సమాననామరూపత్వాత్ చ 2 ఆవృత్తావపి 3అవిరోధః 4 దర్శనాత్ 5 స్మృతేశ్చ ॥

తా॥ (2) సృష్టిలయములు మఱిమఱల వచ్చుచున్నను (1) పూర్వసృష్టివలెనే సమాననామరూపములు కలదిగనుక (3) విరోధములేదు. అని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి. సంసారమునకును అనాదిత్వమును (2-1-36 ఉపపద్యతేచాభ్యుపలభ్యతే) సూత్రమునందు చెప్పుచున్నారు.

ఋ. సం. 10-190-3 సూర్యాచంద్రమసౌ ధాతా
యథాపూర్వమకల్పయత్ ॥

తా॥ పూర్వసృష్టివలెనే ఉత్తరసృష్టియు నగును.

31 సూ. మధ్వాదిష్వసంభవాదనధికారం జైమినిః ।

పద॥ 1 మధ్వాదిషు 2 అసంభవాత్ 3 అనధికారం
4 జైమినిః ।

తా॥ (4) జైమిన్యాచార్యుడు (1) వసురుద్రాదిత్యులను ధ్యానించు మధువిద్యాదులందు దేవతలకు (4) అధికారము లేనందువలన బ్రహ్మవిద్యయందును (3) అధికారములేదనితలచుచున్నాడు.

32 సూ. 1 జ్యోతిషి 2 భావాచ్చ ।

తా॥ (1) ఆదిత్యాదిశబ్దములకు అచేతనముగు తేజోమండలమునందే (2) ప్రయోగముండుటవలన దేవతలకు శరీరమే లేనందున బ్రహ్మవిద్యాధికారము లేదని పూర్వపక్షము.

33. సూ. భావంతు బాదరాయణోఽస్తిహి ।

పద॥ 1 భావం 2 తు 3 బాదరాయణః 4 అస్తిహి ।

తా॥ (2) పైపూర్వపక్షము యుక్తముకాదు. (3) వ్యాసముని (1) దేవతలకు బ్రహ్మవిద్యాధికారము (4) కలదనితలచుచున్నాడు.

1 బృ. 3-6-10 తద్యోయో దేవానాం ప్రత్యబుధ్యత
సఏవ తదభవత్తథర్షీణాం తథా మనుష్యాణాం ।

తా॥ దేవతలలోను, ఋషులలోను, మనుష్యులలోను బ్రహ్మమును తెలిసికొనినవాడే బ్రహ్మమగును.

10 అపశూద్రాధికరణము.

అవ॥ ద్విజులకువలెనే శూద్రులకును జ్ఞానవిద్యాధికారము కలదని పూర్వపక్షమురాగా—

34 సూ. శుగస్య తదనాదరశ్రవణాత్తదా
ద్రవణాత్సూచ్యతే హి ।

పద॥ 1 శుక్ 2 అస్య 3 తదనాదరశ్రవణాత్ 4 తదాద్రవణాత్ 5 సూచ్యతే హి।

తా॥ (2) ఈజానశ్రుతియనెడి రాజునకు (3) ఛాం 4-1-3 కంహ్యరఏవ మేతత్సంతంసం యుగ్వానమివ రైక్వ

మాత్థ ॥ యను శ్రుతిలో హంసచెప్పిన వాక్యమునందలి అనాదరణము వినుటవలన (1) దుఃఖముపుట్టెను. ఆదుఃఖము శూద్రశబ్దముచేత (5) సూచింపబడుచున్నది. ఎందువలననగా— (4) ఆశుక్కు తాను రైక్వునివద్దకు చేరుటవలన శూద్రుడని కాని శుక్కుయొక్క పాప్తికుడు గనుక శూద్రుడనికాని అర్థము సంభవించుటచేత దుఃఖముకలిగెను.

శూద్రకులమునందు పుట్టిన విదురుడు ధర్మవ్యాధుడు మొదలగువారు పూర్వజన్మవాసనచేత జ్ఞానులైరి.

1 తై. సం. 7–1–6 తస్మాచ్ఛూద్రో యజ్ఞే నవక్లుప్తః ॥

తా॥ శూద్రునికి యజ్ఞమందును, అగ్నికర్మములందును అధికారములేదు.

2 ఛాం. 4–2–3 అహహారే త్వా శూద్రతవైవ
సహ గోభిరస్తు ॥

తా॥ జానశ్రుతి॥ రైక్వునివద్దకు వరహాలు గోవులను తీసికొనిపోయి విద్యోపదేశము చేయుమని కోరగా శూద్రుడని రైక్వుడు నిరాకరించెను.

అవ॥ జానశ్రుతియొక్క జాతిని నిర్ణయించుచున్నాడు—

35 సూ. క్షత్రియత్వగతే శ్చోత్తరత్ర చైత్ర
రథేన లింగాత్ ॥

పద॥ 1 క్షత్రియత్వగతేశ్చ 2 ఉత్తరత్ర 3 చైత్రరథేన 4 లింగాత్ ।

తా॥ (2) సంవర్గవిద్యావసానమందు (3) చైత్రరథవంశమునందు పుట్టిన యభిప్రతారియను రాజుతో జానశ్రుతికి

సహభోజనాది వ్యవహారమనెడి (4) చిహ్నమువలన (1) క్షత్రియుడని తెలియుటవలన జానశ్రుతి జాతిశూద్రుడు కాడు. గాని జాతిశూద్రునకు బ్రహ్మవిద్యాధికారము లేదు.

36 సూ. సంస్కారపరామర్శాత్తదభావా
భిలాపాచ్చ ॥

పద॥ 1 సంస్కారపరామర్శాత్ 2 తదభావాభిలాపాచ్చ॥

తా. (1) విద్యలకు అంగముగా ఉపనయనాధ్యయన గురుశుశ్రూషాదులు చెప్పుటవలన (2) శూద్రునకు అవిలేనందువలనను జాతిశూద్రునకు బ్రహ్మవిద్యాధికారములేదు.

1 శ. బ్రా. 11-5-3 తం హోపనిన్యే ।

తా॥ ఆచార్యుడు శిష్యునికి ఉపనయనము చేసెను.

2 ఛాం. 7-1-1 అధీహి భగవఇతి హోపససాద ।

తా॥ జ్ఞానవిద్యనుపదేశింపుమని నారదుడు మంత్రములను చదువుచు సమిత్పాణియై సనత్కుమారుని సమీపించెను.

3 ఛా. 5-11-7 తాన్ హానుపనీయైవ ।

తా॥ ప్రాచీనశాలాదులగు బ్రాహ్మణులకు ఉపనయనము లేకయే కేకయరాజు జ్ఞానవిద్యనుపదేశించెను.

4 మనుస్మృతి. 10-4 శూద్రశ్చతుర్థోవర్ణ ఏకజాతి॥

తా॥ శూద్రుడు ఒకజన్మమేగల నాల్గవజాతి. ఉపనయనములేనివాడు.

37 సూ. 1 తదభావనిర్ధారణేచ 2 ప్రవృత్తేః

తా॥ (1) జాబాలునికి శూద్రత్వములేదని గౌతముడు (2) ఉపనయనముచేయ ప్రవర్తించెను.

1 ఛాం. 4-4-5 నైతదబ్రాహ్మణో వివక్తు మర్హతి సమిధం సోమ్యాహరోపత్వా నేష్యేన సత్యాదగా।

తా॥ బ్రాహ్మణుడు కానివాడు బ్రహ్మవిద్యను చెప్పుకొనతగడు. బాలుడా నీవు సత్యమునండి తొలగలేదు. అని గౌతముడు చెప్పెను.

38 సూ. శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్స్మృతేశ్చ।

పద॥ 1 శ్రవణా... షేధాత్ 2 స్మృతేః చ।

తా॥ శూద్రుడు వేదమును వినకూడదు. చదువకూడదు. అర్థమును గ్రహింపకూడదు. దానికర్మములను చేయకూడదు అను నిషేధము స్మృతులు చెప్పుచున్నవి. కాని విదుర ధర్మవ్యాధాదులకు పూర్వకృతసంస్కారమువలన కలిగిన జ్ఞానమునువారింపశక్యముకాదు. శూద్రులకు ఇతిహాసపురాణాదులందేకాని వేదవిద్యయందు అధికారములేదు.

1 గౌ. ధ 12 అథహాస్య వేదముపశృణ్వతః త్రపుజతుభ్యాం శ్రోత్రప్రపూరణం। పద్యుహవా ఏతచ్ఛ్మశానం యచ్ఛూద్రస్తస్మాచ్ఛూద్రసమీపే నాధ్యేతవ్యం।

తా॥ శూద్రుడు ప్రమాదముచేత వేదమును వినినను సీసమును, లక్కను కరిగించి వానిచెవిలో పోయవలెను.

2 న శూద్రాయ మతిం దద్యాత్।

తా॥ శూద్రునకు వేదార్థమును చెప్పరాదు.

3 ద్విజాతీనామధ్యయనమిజ్యాదానం ॥

తా॥ వేదపఠనము, నిత్యదానము, యాగములను చేయుట, బ్రిహ్మక్షత్రియవైశ్యులు మూడువర్ణములవారికే విహితము. కావున శూద్రులకు జ్ఞానవిద్యార్హత లేదు.

వివరణము- ఈ 10 వ అధికరణమునందు ఉపనయనము, వేదాధ్యయనము, యజ్ఞాదిక్రతువులు శూద్రులకు లేనందున జ్ఞానవిద్యాధికారములేదని కర్మలను ప్రిధానముగాచేసి చెప్ప బడుటవలన అట్టికర్మలు చేయుటకు ద్విజాతులకు అధికార మున్నట్లు సూచించుచున్నది. ద్విజాతులలో ఆయాకర్మలు చే సినవారు జ్ఞానవిద్యాధికారులా? కర్మలుచేయకున్నను ద్విజాతి మాత్రిముచేతనే అధికారముకలవారా? యని సంశయము కలుగుచున్నది. అధ్యయన, యజ్ఞ, దానాదులు చేసినవారికే స్వర్గాదిలోకఫలప్రాప్తికలుగును గాని అవిచేయనివారికి జనన మరణములేయని శాస్త్రిము చెప్పుచున్నది. గనుక ద్విజాతి మాత్రిముచేత జ్ఞానాధికారము కలుగదు. లోకమునందు అధ్యయన యజ్ఞాదికర్మలు చేయనివారును, సంస్కృతవిద్య కూడలేనివారును, అనేకులు జ్ఞానవిద్యాప్రివర్తకులు కలరు. కర్మములిజన్మమునందు లేకున్నను వారికి జన్మాంతరవాసనచే తను, ఈశ్వరానుగ్రిహముచేతను ఆవాసన కలిగినట్లుచెప్పతగి యున్నది. మఱియు శూద్రికులమునందుపుట్టిన విదురుడు ధర్మ వ్యాధుడు మొదలగు కొందఱు జన్మాంతరవాసనచేత జ్ఞాను లైనట్లు ఈ 10 వ అధికరణమునందు జన్మాంతరవాసనముఖ్య ముచేతనే చెప్పబడినది. బ్రాహ్మణులకు ఉపనయనముకాకపూ ర్వమే కేకయరాజు జ్ఞానవిద్యనుపదేశించినట్లు ఈయధికరణ

మునందే చెప్పుటచేత నదికూడా ముఖ్యమనితోచదు. జ్ఞానవిద్య కర్మాంగమని పూర్వపక్షముగా కర్మాంగముకాదనియు, కర్మాపేక్ష లేదనియు 8 ప్రకరణములో 3 అధ్యాయము 4 పాదమునందు స్పష్టపఱుపబడినది. గనుక కర్మములు ఈజన్మమునందు లేకున్నను జన్మాంతరవాసనాదులచేత జ్ఞానవిద్య పొందబడుచున్నది. గతజన్మమునందు క్రతువులుచేసిన బ్రాహ్మణుడైనను ఈజన్మమునందు శూద్రకులమున పుట్టవచ్చునని 15 ప్రకరణములోని 3 అధ్యాయము 1 పాదము 8 సూత్రమునందు చెప్పబడినది. గనుక నే వర్తమానమునందు శూద్రజన్మమైనను జన్మాంతరవాసనచేత శూద్రునకును అట్లుకలుగవచ్చును. కావున జ్ఞానవిద్యకు కర్మాపేక్ష లేదు. ఇట్లే శ్రీశంకరాచార్యకృత అధ్యాసభాష్యమునందును కలదు అది 5వ ప్రకరణమునందు చెప్పబడును.

### ఆత్మలాభమును కోరువాడు తదితరములను విడువవలయును.

### యో. వా. ఉపశమప్ర. 25 అధ్యాయము

యావత్సర్వం నసంత్యక్తం తావదాత్మానలభ్యతె ।
సర్వవస్తుపరిత్యాగే శేషఆత్మేతి కధ్యతే ॥ 49 ॥
యావదన్యం నసంత్యక్తం తావత్సామాన్యమేవహి ।
వస్తునా సాద్యతె సాధో స్వాత్మలాభేతు కా కథా ॥ 50 ॥
ఆత్మావలోకనార్థంతు తస్మాత్సర్వం పరిత్యజేత్ ।
సర్వం హేయతత్పరిత్యజ్య యావచ్ఛిష్టం పరంపదం ॥ 51 ॥

తా॥ ఓశ్రీరామా! లోకములో సామాన్యమయిన పనిని

చేయబూనినపుడే ఆపనికంటె నితరమయినవానియందు దృష్టి ఉంచెనేని ఆపని చక్కపడదుగద? ఉత్కృష్టమగు బ్రహ్మవిద్య నుగోరువాడు తుచ్ఛములగు నితరములందు దృష్టిఉంచినయె డల స్వాత్మలాభమెట్లుకలుగును? కలుగనేరదనిభావము. జగ త్తులోని అన్నిటిని ఇదికాదు ఇదికాదు అని త్యజింపగా మిగి లినతెలివియే బ్రహ్మము.

నారాయణము

"నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకె
అమృతత్వమానశుః"

తా॥ కర్మలు, పుత్రాదులు, ధనము మొదలగువానిచేత ముక్తికలుగదు. వానినన్నిటిని త్యజించుటచేత ముక్తికలుగు ను. అట్లువిడుచుటయే సన్యాసము.

త్యాగమనగా పుత్రకళత్రధనాదులు తనవనెడి అభిమా నమును విడిచి అన్నిటియందును నిస్పృహతోనుండి ఈశ్వరా నుగ్రహమువలన తనకుకలిగినదానితో తృప్తిపొందుచు తనకు కలగనిదానికొఱకు దుఃఖములేకుండా అన్నికాలములయందు ను అన్నిటియందును తాను సాక్షిగనుండుటయే త్యాగశబ్దము నకు అర్థము. ఇదియే ముఖ్యసన్యాసము.

వర్ణాశ్రమాదులును, కర్మాదులును మాయచేత
కల్పితమనుట.

పంచదశీప్రకరణము 5 మహావాక్యవివేకము.

చతుర్ముఖేంద్రదేవేషు మనుష్యాశ్వగవాదిషు ।
చైతన్యమేకం బ్రహ్మాతః ప్రజ్ఞానం బ్రహ్మమయ్యపి ॥2॥

తా॥ బ్రహ్మేంద్రాది దేవతలు, మనుష్యులు, గుఱ్ఱములు, గోవులు మొదలగు అన్నిటియందును గల చైతన్యమనెడి బ్రహ్మమొక్కటియే గనుక అన్ని దేహములందుగల ప్రజ్ఞానము బ్రహ్మమే.

పం ప్ర. ధ్యానదీపము. 9 వ ప్రకరణము.

వర్ణాశ్రమవయోవస్థాభిమానో యస్య విద్యతే ।
తస్యైవచ నిషేధాశ్చ విధయస్సకలా అపి ॥ 100 ॥

తా॥ బ్రాహ్మణాది వర్ణములును, బ్రహ్మచర్యాద్యాశ్రమములును, వయస్సును, అవస్థలును మొదలగువానియందు అభిమానమును గలవానికే సకలవిధినిషేధములును కలిగియున్నవి ఏ అభిమానము నుండకూడదని తాత్పర్యము.

వర్ణాశ్రమాదయో దేహే మాయయా పరికల్పితాః ।
నాత్మనో బోధరూపస్యేత్యేవం తస్య వినిశ్చయః ॥ 101 ॥

తా॥ మాయచేత దేహమందు వర్ణాశ్రమాదులన్నియు కల్పించబడినవి. బోధరూపుడగు ఆత్మకు అవిలేవు. అని జ్ఞానికి నిశ్చయము కలుగవలయును.

సమాధిమథ కర్మాణి మాకరోతు కరోతువా ।
హృదయేనాస్త సర్వాస్థో ముక్తఏవోత్తమాశయః ॥102॥

తా॥ సకలకోరికలను నిశ్శేషముగా విడిచి నిర్మలజ్ఞానము గలవాడు కర్మములను చేసినను చేయకున్నను ముక్తుడేయగును. కనుకనే అతనికర్మములన్నియు సమాధిచేత నాశమును పొందుచున్నవి.

## అష్టావక్రగీత- 1 ప్రకరణము.

నత్వం విప్రాదికో వర్ణో నాశ్రమీ నాక్షగోచరః।
అసంగోఽసి నిరాకారో విశ్వసాక్షీ సుఖీభవ ॥ 4 ॥

తా॥ నేను బ్రాహ్మణుడను, సన్యాసిని మొదలగు వర్ణాశ్రమభేదములు దేహధర్మములుగాని ఆత్మధర్మములుకావు. ఆత్మవగు నీవు సర్వోపాధిసంగరహితుడవు నిరాకారుడవు ప్రపంచమునకు సాక్షిమాత్రుడవు. ఈదేహముతోను, ప్రపంచముతోను నీకు సంబంధమును లేదు. కనుక కర్మాసక్తినివిడిచి చిదేకాగ్రతవలన గలుగు పరమానందప్రాప్తినొంది సుఖింపుము.

ధర్మాధర్మౌ సుఖం దుఃఖం మానసాని నతే విభో।
నకర్తాసి నభోక్తాసి ముక్తఏవాసి సర్వదా ॥ 5 ॥

తా॥ ధర్మాధర్మములును, సుఖదుఃఖములును, మనోధర్మములుగాని చిన్మాత్రుడవగు నీవికావు. వానికి నీవు కర్తవుకావు. భోక్తవును కావు. అజ్ఞానమువలనకలిగిన సుఖదుఃఖములు అజ్ఞానముతొలగగానే అజ్ఞానకార్యములును తొలగును

## అష్టావక్రగీత-18 ప్రకరణము.

శుద్ధస్ఫురణరూపస్య దృశ్యభావమపశ్యతః।
క్వవిధిః క్వచ వైరాగ్యం క్వత్యాగః క్వశమోపివా ॥71

తా॥ కేవలచిద్రూపస్ఫురణమాత్రస్వరూపుడై దృశ్యపదార్థమెద్దియు గోచరింపని జ్ఞానికి కర్మానుష్ఠానవిధిగాని, విరక్తిని పొందతగిన విషయముగాని, చేయతగినదిగాని, విడువతగినదిగాని యేదియును లేదు.

జ్ఞః సచింతోఽపి నిశ్చింతః సేంద్రియోఽపి నిరింద్రియః।
సుబుద్ధిరపి నిర్బుద్ధిః సాహంకారోఽనహంకృతిః ॥ 95 ॥

తా॥ జ్ఞాని చింతాదులతో నింద్రియవ్యాపారము చేయుచున్నట్లు లోకదృష్టికి కనుపించినను అతడు అహంకారశూన్యుడుగనుక నట్టి చింతాది వ్యాపారస్ఫురణము లేనివాడు.

ముక్తో యథాస్థితిస్వస్థః కృతకర్తవ్యనిర్వృతిః।
సమఃసర్వత్ర వైతృష్ణా న్నస్మరత్యకృతం కృతం ॥ 98 ॥

తా. ముక్తుడు ప్రారబ్ధవశముచేత సుఖదుఃఖాదుల ననుభవించుచున్నను స్వస్థచిత్తుడై యుండును. ఇది చేయవలెను ఇది చేయరాదు అనెడి పట్టుదలగాని సంకల్పముగాని లేనివాడు.

నప్రీయతే వంద్యమానో నవిద్యమానో నకుప్యతి।
నైవోద్విజతి మరణే జీవనే నాభినందతి ॥ 99 ॥

తా॥ చిద్రూపుడు తనను ఇతరులుచేసిన నిందాస్తుతులకు శోకమోదముల నొందడు. ఆత్మ నిత్యమని తెలిసినవాడుగనుక మరణమాసన్నమైనను దుఃఖపడు. జీవించియున్నందుకానందమొందడు.

నధావతి జనాకీర్ణం నారణ్యముపశాంతధీః।
యథాతథా యత్రతత్ర సమఏవావతిష్ఠతే ॥ 100 ॥

తా॥ బ్రహ్మజ్ఞానముగలవాడు జనసంమర్దమగు పట్టణమందును, జనములేని అరణ్యమందును భేదములేకుండ సమదృష్టితో స్వస్థమానసుడై యుండును. అని జనకమహారాజుతో అష్టావక్రముని చెప్పెను.

అ॥ గీ॥ 20 ప్రకరణము.

క్వ ప్రారబ్ధాని కర్మాణి జీవన్ముక్తిరపి క్వవా।
క్వ తద్విదేహకైవల్యం నిర్విశేషస్య సర్వదా। 4॥
క్వ కర్తా క్వచవా భోక్తా నిష్క్రియం స్ఫురణం క్వవా।
క్వాపరోక్షం ఫలంవాక్వ నిఃస్వభావస్య మే సదా। 5॥
క్వ లోకః క్వముముక్షుర్వా క్వ యోగీ జ్ఞానవాన్క్వవా।
క్వ బద్ధః క్వచవా ముక్తః సస్వరూపేఽహమద్వయే॥ 6॥

తా॥ కేవలసచ్చిదానందరూపుడనగు నాకు ప్రారబ్ధము, కర్మము, జీవన్ముక్తి, విదేహముక్తి మొదలగు కల్పితధర్మములులేవు. కర్తృత్వ భోక్తృత్వ నిష్క్రియత్వములును, స్ఫురణము, అపరోక్షజ్ఞానమును, చైతన్యజ్ఞానమును లేదు. నేను, ఇది అది యీ మొదలగు రూపములు నాకు లేనందున మిథ్యాకల్పితలోకము, ముముక్షువు, యోగి, జ్ఞాని, బద్ధుడు, ముక్తుడు మొదలగు సంకేతములును నాకు లేవు.

పూర్వజన్మవాసన ననుసరించి జన్మాదులు కలుగుననుట.

పం. ప్ర. చిత్రదీపము 6 ప్రకరణము.

యథాయథోపాసతే తం ఫలమీయుస్తథాతథా।
ఫలోత్కర్షాపకర్షౌతు పూజ్యపూజ్యానుసారతః॥ 209॥

తా॥ పరమేశ్వరుని నేవిధముగా నుపాసించెదరో అట్టివిధమగు ఫలమును పొందుచున్నారు. పూజింపబడు దేవతయొక్కయు, పూజయొక్కయు, పూజకునియొక్కయు, సాత్వికాది గుణభేదముచేత ఫలభేదము కలుగుచున్నది.

యథాత్ర కర్మవశతః కాదాచిత్కం సుఖాదికం।
తథా లోకాంతరే దేహే కర్మణేచ్ఛాని జన్యతే ॥ 92 ॥

తా॥ కర్మవశమువలన ఒకానొకప్పుడు సుఖదుఃఖాదికము కలుగునట్లే మరియొకలోకమందు దేహముకలుగుచు కర్మముచేత నిచ్ఛాదికము కలుగుచున్నది. ఇట్లు ఆత్మకు ఔపచారికమగును.

జ్ఞానులప్రవర్తనము అనేకవిధములుగానుండుననుట-

పం. ప్ర. చిత్రదీపము- 6 ప్రకరణము.

ఆరబ్ధకర్మనానాత్వాద్బుద్ధానామన్యథాన్యథా।
వర్తనం తేన శాస్త్రార్థే భ్రమితవ్యం న పండితైః ॥ 287॥

తా॥ ప్రారబ్ధకర్మమువలన జ్ఞానులకు నానావిధముగా ప్రవర్తనము కలిగియుండును. అందుచేత శాస్త్రార్థమందు పండితులు భ్రమింపకూడదు

స్వస్వకర్మానుసారేణ వర్తంతాం తే యథాయథా।
అవిశిష్టస్సర్వబోధ స్సమాముక్తిరితిస్థితిః ॥ 288 ॥

తా॥ జ్ఞానులు తమతమ ప్రారబ్ధకర్మానుసారముగా యిష్టమయిన వ్యవహారముచేయుదురు. నేను బ్రహ్మమున నెడి జ్ఞానము భేదములేనిదనియు, జ్ఞానఫలమగు ముక్తి సమానమనియు వేదాంతనిశ్చయము.

పం. ప్ర. తృప్తిదీపము- 7 ప్రకరణము.

ప్రారబ్ధకర్మప్రాబల్యాద్భోగేష్విచ్ఛా భవేద్యది।
క్లిశ్యన్నేవ తదాప్యేష భుంక్తే విష్టిగృహీతవత్ ॥ 143 ॥

తా॥ ప్రారబ్ధకర్మముచేత జ్ఞానికి విషయభోగేచ్ఛ కలిగినను ఆసుఖాదులయందాసక్తి లేక (వెట్టికిపట్టుకున్న కూలివాడు విధిలేక ఆపనిచేయునట్లే) ప్రారబ్ధక్షయమునే కోరుచు అనుభవించును.

పం. ప్ర. ధ్యానదీపము- 9 ప్రకరణము.

బ్రహ్మలోకాభివాంఛాయాం సమ్యక్సత్యాంనిరుధ్యతాం।
విచారయేద్యఆత్మానం నతు సాక్షాత్కరోత్యయం॥ 51॥

తా॥ బ్రహ్మలోకమును పొందవలయునని దృఢమయిన ఇచ్ఛతో ఏపురుషుడు ప్రత్యగాత్మను విచారించునో ఆపురుషునకు ఆత్మసాక్షాత్కారము కానేకాదు. అనగా బ్రహ్మము తానేయనియు, తనకంటె భిన్నమైన లోకాదులు లేవనియు, అనెడి జ్ఞానము లేనందువలన పూర్ణమైన జ్ఞానసిద్ధికాలేదని తాత్పర్యము.

మరణకాలమందును, బ్రహ్మలోకమునందును
సంపూర్ణజ్ఞానము కలుగుననుట.

ధ్యానదీపము- 9 ప్రకరణము.

ఉపాసనం నాతిపక్వమిహ యస్య పరత్ర సః।
మరణే బ్రహ్మలోకేవా తత్వం విజ్ఞాయముచ్యతె॥ 136॥

తా॥ నిర్గుణోపాసనము పరిపక్వముపొందకపూర్వము మరణముపొందెనేని మరణకాలమందైనను, బ్రహ్మలోకమందైనను, బ్రహ్మముతో ఏకత్వజ్ఞానము కలిగి మోక్షమును పొందుచున్నాడు.

యంయంవాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం ।
తంతమేవైతి యచ్చిత్త స్తేన యాతీతి శాస్త్రితః । 137 ।

తా॥ మరణకాలమందు స్మరించుచున్న దేవతను పొందు చున్నాడు. అని "యచ్చిత్తస్తేనైష ప్రాణమాయాతి ప్రాణ స్తేజసాయుక్తః సహాత్మనా యథా సంకల్పితలోకం నయతి" యను శ్రుతిచెప్పుచున్నది. తరుచు జపధ్యానములను చేయు వాడు మరణకాలమునందు అట్టిదేవతను స్మరించుచున్నాడు.

1 వ ప్రకరణము సమాప్తము.

---

# 2 వ ప్రకరణము

## సకామకర్మఫలము.

బ్ర. సూ. 3 అ. 1 పా. 9 సూ.

"చరణాదితి చేన్నోపలక్షణార్థేతి కార్ష్ణాజినిః"

తా॥ 'చరణాత్' ఆచారమువలన దేహప్రాప్తిని చూపు చున్నది. చరణమనగా-ఆచారము, శీలము, చారిత్రము అను నివి. అనుశయమనగా భుక్తమైన కర్మఫలముకంటె వ్యతిరిక్త కర్మము.

1 బృ. 6-4-5 యథాకారీ యథాచారీ తథా భవతి ॥

తా॥ సత్కర్మములు సదాచారమును కలవాడు సాధువగు ను. దుష్కర్మము దురాచారమును కలవాడు దురాత్ముడగు.

2 తై. 1-11-2 యాన్యనవద్యాని కర్మాణి తాని సేవి తవ్యాని నోఇతరాణి యాన్యస్మాకగ్ సుచరితాని, తాని

తమోపాస్యాని నోఇతరాణి ॥

తా॥ నిషిద్ధకర్మ్మములు మాని విహితకర్మ్మములు చేయవలె ను. మనయొక్క సదాచారములనే చేయుము. తదితరము చేయవలదు.

3. అ. 4 పా. 11 సూ. క్రింద చెప్పిన శ్రుతి ॥

బృ. 6-4-6 ఇతితు కామయమానః ॥

తా॥ కర్మ్మములు చేయువాడు పరలోకమునందు కర్మఫల మనుభవించి మరలవచ్చి కర్మములనే చేయును.

వేదమునందు "తద్యథేహ కర్మచితో లోక" ఇత్యాదిశబ్ద ములచేత అగ్నిహోత్రాది కర్మ్మములవలన కలుగు స్వర్గాది ఫలము అనిత్యమనియు, "బ్రహ్మవిదాప్నోతి పరం" ఇత్యా దులచేత జ్ఞానఫలమగు మోక్షము నిత్యమనియు చెప్పటవలన పరబ్రహ్మవిచారమే చేయవలెను.

"స్వర్గకామో యజేత" యను శ్రుతి స్వర్గలోకఫలమును కోరువాడు యజ్ఞాదిక్రతువులు చేయవలయునని చెప్పుచున్నది.

జ్ఞానముకలుగువరకును కర్మములు చేయుమనుట.

భ. గీ. 3 అధ్యాయము.

నియతః కురు కర్మ త్వం కర్మజ్యాయోహ్యకర్మణః ।
శరీరయాత్రాపిచ తే నప్రసిద్ధ్యేదకర్మణః ॥ 8 ॥

తా॥ సంధ్యావందనాది నిత్యకర్మములను తప్పక చేయుము కర్మములను మానుటకంటె చేయుటమేలు. కర్మలుచేయని చో నీశరీరస్థితియును చక్కగానడవనేరదు.

ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః।
అఘాయురింద్రియారామో మోఘం పార్థ సజీవతి॥

తా॥ పెద్దలునిర్ణయించిన కర్మములను చేయనివాడు పాపియగును. గనుక జ్ఞానముకలుగువరకును కర్మలు చేయక తీరదు.

తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥ 10॥

తా॥ జ్ఞానికూడ కర్మలు చేయవలసినదే. ఫలాపేక్షలేకుండ విహితకర్మములుచేయువాడున్ను సత్త్వశుద్ధికలిగి క్రమముగా మోక్షమును బొందును.

పం. ప్ర. 9 ధ్యానదీపము.

పామరాణాం వ్యవహృతేర్వరం కర్మాద్యనుష్ఠితిః।
తతోపి సగుణోపాస్తి ర్నిర్గుణోపాసనాతతః॥ 121॥

తా॥ పామరవ్యాపారముకంటె తీర్థయాత్ర, స్నాన, సంధ్య జప, యజ్ఞ, దానాది పుణ్యకర్మములును, దానికంటె సగుణోపాసనమును, దానికంటె నిర్గుణోపాసనమును శ్రేష్ఠము.

భ. గీ. 9 అధ్యాయము.

త్రైవిద్యామాం సోమపాః పూతపాపాః యజ్ఞైరిష్ట్వ
స్వర్గతిం ప్రార్థయంతే। తే పుణ్యమాసాద్య సురేంద్ర
లోకమశ్నంతి దివ్యాన్ దివిలోకభోగాన్॥ 20॥

తా॥ వేదత్రయవేత్తలయి సోమపానముచేసి పాపములను నశింపుచేసికొని అగ్నిష్టోమాది యజ్ఞములుచేసి కోరికచేత ఇంద్రలోకదేవతాసుఖము ననుభవించుచుందురు.

# 3 వ ప్రకరణము

నిష్కామకర్మఫలమనగా-

ఫలాపేక్షలేకుండ ఈశ్వరార్పణబుద్ధితో చేయు కర్మఫలము.

బ్ర. సూ. 3 అ. 4 పా. 11 సూ. క్రింద చెప్పిన

1 బృ. శ్రుతి॥ "అథా కామయమానః"

తా॥ ఫలాసక్తి లేకుండా కర్మములు చేయువాడు ముక్తిని పొందును. భ. గీ 6 అధ్యాయము.

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।
స సన్న్యాసీచ యోగీచ న నిరగ్ని ర్నచాఽక్రియః॥ 1॥

ఎవడు కర్మఫలమును కోరకుండా యగ్నిహోత్రాది కర్మములను చేయుచున్నాడో యతడు ఫలత్యాగమువలన సన్న్యాసియు, యోగియు నని యర్థము.

అష్టావక్రగీత- 8 ప్రకరణము.

తదా బంధో యదా చిత్తం కించిద్వాంఛతి శోచతి।
కించిన్ముంచతి గృహ్ణాతి కించిద్ధృష్యతి కుప్యతి॥ 1॥
తదా ముక్తిర్యదా చిత్తం నవాంఛతి నశోచతి।
నముంచతి నగృహ్ణాతి నహృష్యతి నకుప్యతి॥ 2॥

తా॥ మిథ్యాభూతమైన జగద్వస్తువులలో దేనినిగాని స్వల్పమైన కోరినను, గ్రహించినను, సంతోషించినను, కోపించినను, అవి చిత్తముయొక్క వికారములు గనుక ముక్తికి ప్రతిబంధకములు అట్టి చిత్తవికారములు కలుగకపోవుటయేముక్తి.

అ. గీ. 18 ప్రకరణము.

క్వ సంసారః క్వచాభావః క్వ సాధ్యం క్వచ సాధనం।
ఆకాశస్యేవ ధీరస్య నిర్వికల్పస్య సర్వదా ॥ 66 ॥

తా॥ ఆకాశమువలె నుపాధి మలశూన్యమై పరిపూర్ణమై యుండు జ్ఞానికి సంకల్పవికల్పములు లేనందున సంసారమనగా ప్రపంచసంబంధమే లేదు. ఇతడు సంసారివలె వర్తించినను దగ్ధపటముువలె సంసారి కాడు. సర్వోత్కృష్టమగు జీవన్ముక్తిదశతోనుండుటచేత వానికి యజ్ఞాదులతోను, స్వర్గాదులతోను పనిలేదు.

బుద్ధిపర్యంతసంసారే మాయామాత్రం వివర్తతే।
నిర్మమో నిరహంకారో నిష్కామః శోభతే బుధః ॥ 73॥

తా॥ ఆత్మజ్ఞానముచేత నంతరించు సంసారమునందు భ్రాంతిచేత త్రాడు సర్పముగా మారినట్లు మాయావిశిష్టచైతన్యము వివర్తరూపములో మాయామాత్రజగదాకారమును పొందుచున్నది. ఈజగత్తు భ్రమమాత్రస్వరూపమైనదే కాని సత్యముకాదు. కావున విద్వాంసులు ఇది నాశరీరము శరీరమే నేను అనెడి యభిమానమును, దారాపుత్రాదులందు నావి యను మమకారమును లేకుండ నిష్కాములై సచ్చిదానందఘనులై ప్రకాశింతురు.

నశాంతం స్తౌతి నిష్కామో న దుష్టమపి నిందతి।
సమదుఃఖసుఖస్తృప్తః కించిత్కృత్యం నపశ్యతి ॥ 82॥

తా॥ నిష్కాముడగు జ్ఞాని శాంత్యాది శుద్ధసత్వగుణాధికులను చూచి స్తుతిచేయడు. దుష్టులు తనను హింసించినను

వారిని నిందచేయడు. నిత్యతృప్తుడై సుఖదుఃఖముల రెండిటిని సమముగ చూచును.

కర్మలు ఫలాపేక్షలేకుండ చేయుమనుట.

భ. గీ. 2 అధ్యాయము.

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
మాకర్మఫలహేతుర్భూర్మాతె సంగోస్త్వకర్మణి ॥ 47 ॥
యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ।
సిద్ధ్యసిద్ధ్యో సమోభూత్వా సమత్వం యోగఉచ్యతే ॥ 48 ॥

తా॥ నేను ఈకర్మలకు కర్తననియు, ఈకర్మఫలములకు భోక్తననియు, దురభిమానమును పొందకుము. యోగము నవలంబించి సిద్ధికలిగినను, లేకున్నను, సమత్వబుద్ధితో ఈశ్వరార్పణముగ కర్మలను చేయుము. యోగమనగా ఫలముకలిగినను, కలగకున్నను సమత్వబుద్ధితో నుండుటయే.

భ. గీ. 12 అధ్యాయము.

యేతు సర్వాణి కర్మాణి మయి సన్యస్య మత్పరాః।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే ॥ 6 ॥
తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామి నచిరాత్పార్థ మయ్యావేశితచేతసా ॥ 7 ॥

తా॥ సర్వేశ్వరుడనైన నాయందు ఇతరాసక్తిలేని చిత్తముకలిగి ఫలమునుకోరక సర్వకర్మములను పరమేశ్వరార్పణబుద్ధితో చేయుచు నాయొక్క ధ్యానోపాసనలు చేయువారిని మృత్యుసంసారబంధమునుండి శీఘ్రముగ తొలగించెదనని శ్రీకృష్ణుడుచెప్పెను.

మనస్సునకు కోరికలు లేకపోవుటయే ముక్తి.

త్రిపురాతాపిన్యుపనిషత్తు.

అతో నిర్విషయం నిత్యం మనః కార్యం ముముక్షుణా ।
యతో నిర్విషయోనామ మనసో ముక్తిరిష్యతే ॥
మనోహి ద్వివిధం ప్రోక్తం శుద్ధంచాశుద్ధమేవచ ।
అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితం ॥
మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం మనః ॥

తా॥ మోక్షేచ్ఛగలవాడు తనమనస్సులో దేనినింకోరతగదు. అదియే ముక్తి. మనస్సు ద్వివిధము. కోరికలతోనుండు మనస్సు శుద్ధముకానిది. సంకల్పములులేని మనస్సు శుద్ధమయినది. మనస్సే విషయములందాసక్తికలిగియుండుట బంధము. అట్టిఆసక్తిలేకపోవుటయే ముక్తి. ఇచట "మోక్షోవిషయవైరస్యం బంధో వైషయికోరసః" అనెడి ఆచార్యవాక్యము ప్రమాణము.

జాగ్రిదవస్థయందును సుషుప్తియందువలె లీనమయిన వృత్తులతోనుండుటయే ముక్తి.

జీవన్ముక్తివివేకము.

సుషుప్తవత్ప్రశమితభావవృత్తినాస్థితం సదా జాగ్రతి తేన చేతసా। కలాన్వితో విధురివ యస్సదా బుధై ర్నిషేవ్యతే ముక్త ఇతీహ స స్మృతః ॥ 36 ॥ మాతరీవ శమం యాంతి విషమాణి మృదూనిచ। విశ్వాసమిహ భూతాని సర్వాణి శమ

శాలిని ॥ 62 ॥ తపస్విషు బహుజ్ఞేషు యాజకేషు నృపేషుచ ।
బలవత్సుగుణాఢ్యేషు శమవానేవ రాజతే ॥ 66 ॥

తా॥ సుషుప్తియందువలెనే జాగ్రదవస్థయందును వృత్తులు లేనివాడు పూర్ణచంద్రుడువలె జ్ఞానులచేత సర్వదా సేవింపబడుచు ముక్తుడనబడును. ఇతరులను బాధించునట్టి దుష్టమృగములుకూడ తల్లియందువలె జ్ఞానియందును శాంతముతో నుండును. తపశ్శాలులు, జ్ఞానవంతులు, యజ్ఞాదిక్రతువులు చేసినవారు, రాజులు, బలవంతులు, సుగుణవంతులు మొదలగు శ్రేష్ఠులకంటె వృత్తిశూన్యమైన శాంతుడే శ్రేష్ఠతరుడు.

భ. గీ. 5 అధ్యాయము.

సన్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః ।
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి ॥ 6 ॥
యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః ।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి నలిప్యతే ॥ 7 ॥

తా॥ కోరికలేకుండ నీశ్వరార్పణముగచేయు కర్మములచేత శీఘ్రముగా చిద్రూపమును పొందుచున్నాడు. కర్మలేనిదే కేవలజ్ఞానయోగము సులభముకాదు. వర్ణాశ్రమాది విహితకర్మములు చేయుటచేత చిత్తశుద్ధియును, మనోనిగ్రహమును కలిగి జితేంద్రియుడై సకలజగత్తును చిద్రూపముగా భావించును. అట్టిజ్ఞానికూడా లోకరక్షణముకొఱకు కర్మలను చేయవలయును. కాని శరీరాయాస ధనవ్యయాది కారణములచేత మానకూడదు. వేచినగింజలు మొలువనట్లు జ్ఞానిచేసినకర్మలు జన్మకారణములుకావు.

భ. గీ. 9 అ. 22 శ్లో॥

అనన్యాశ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం॥

తా॥ ఇతరాపేక్షలేకుండ ఆత్మస్వరూపముగా నన్ను భజించువారికి యోగక్షేమములు నావలననే కలుగును.

ఆత్మజ్ఞానములేనివారు జన్మములనే పొందుచుందురు.
కామ్యకర్మములనే చేయువారికికలుగు ఫలము.

పం. ప్ర. 1 ప్రత్యక్తత్వవివేకము.

కుర్వతే కర్మ భోగాయ కర్మకర్తుంచ భుంజతే।
నద్యాం కీటాఇవావర్తాదావర్తాంతరమాశుతే।
వ్రజంతే జన్మనో జన్మ లభంతే నైవ నిర్వృతిం ॥ 30 ॥

తా॥ ఆత్మజ్ఞానములేకుండ సకామకర్మములు చేయువారు దేవలోకఫలమనుభవించినపిమ్మట పురుగులు నదిలో ఒకసుడి నుండి మఱియొకసుడికి పోవునట్లు జీవులు ఒకజన్మమునుండి మఱియొకజన్మమును పొందుచుందురు.

నిష్కామకర్మఫలము.
భ. గీ. 2 అధ్యాయము.

కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః।
జన్మబంధవినిర్ముక్తాః పదంగచ్ఛంత్యనామయం ॥ 51 ॥
విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకార స్సశాంతి మధిగచ్ఛతి ॥ 71 ॥

తా॥ శతృమిత్రాది ద్వంద్వములందు సమబుద్ధికలిగి ఫలమును కోరకుండ కర్మములు చేయుచు కోరికలును, అహం

కార మమకారములును లేనివారు జన్మరహితముగ ముక్తిని పొందుదురు సమబుద్ధియనగా- అన్నిజీవులయందును కల్పిత దేహాదిభేదమును విడిచి సత్యమగు ఆత్మనే అవలోకించుట. ఇచట 'సమతా సర్వభావేషు యాసా సత్యపరాస్థితిః' యను ఆచార్యవాక్యము ప్రమాణము.

అవ॥ లోకసంగ్రహముకొఱకు జ్ఞానియు కర్మములు చేయవలయు.

భ. గీ. 3 అధ్యాయము.

కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః ।
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి ॥ 20 ॥
యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః ।
సయత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే ॥ 21 ॥
న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్తఏవచ కర్మణి ॥ 22 ॥

తా॥ జనకాది రాజర్షులు నిష్కామకర్మముచేత చిత్తశుద్ధి కలిగి మోక్షమును పొందిరి. లోకసంగ్రహముకొఱకు నీవును అట్లుచేయుము. బ్రహ్మవిదుడు ఆచరించెడి లౌకిక వైదికకర్మలను పామరులును ఆచరింతురు. నాకు మూడులోకములయందును చేయవలసినదిగాని, పొందవలసినదిగాని లేకున్నను కర్మములను చేయుచున్నానని అర్జునునితో శ్రీకృష్ణుడు చెప్పెను.

భ. గీ. 3 అధ్యాయము.

యదిహ్యహం నవర్తేయం జాతుకర్మణ్యతంద్రితః ।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥ 23 ॥

తా॥ నేను కర్మములుచేయక మానితినేని అజ్ఞులందరును నావలెనే కర్మములనుమాని జ్ఞానములేమిచేత చెడుదురు. "మనుష్యాః" అనునపుడు అందరికిని వర్తించునుగాని కొందరికిమాత్రమే కాదు. పండితులకని కాదు. యజ్ఞాదిక్రతువులు చేసినవారికని కాదు.

ప్రకృతేర్గుణసంమూఢాస్సజ్జంతే గుణకర్మసు।
తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్నవిచాలయేత్॥

తా॥ కొందఱు మాయచేత మోహితులై తమతమగుణానుసారముగా సకామకర్మలను చేయుదురు. గాని వారినికూడా జ్ఞానిదూషింపకూడదు వారికి ఆకర్మలే క్రమక్రమముగా భక్తిజ్ఞానములను గలిగించును.

జ్ఞానిచేయు కర్మలవలన లోకమునకు ఉపకారమనుట.

లోకసంగ్రహమెట్టిదనగా-

శ్రీవిద్యారణ్యకృత జీవన్ముక్తివివేకము.

సంగ్రాహ్యశ్చ లోకస్త్రివిధః శిష్యో భక్తస్తటస్థశ్చేతి। తత్ర శిష్యస్యాంతర్ముఖే యోగిని గురౌ ప్రామాణిక బుద్ధ్యతిశయేన తదుపదిష్టే తత్త్వే పరమం విశ్వాసం ప్రాప్య చిత్తం సహసా విశ్రామ్యతి। శ్రుతి॥ "యస్య దేవే పరాభక్తిర్యథా దేవే తథా గురౌ। తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః" ఇతి॥ శ్రద్ధావాన్లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః। జ్ఞానం లబ్ధ్వా పరాంశాంతి మచిరేణాధిగచ్ఛతి॥

తా॥ గురువువలన గ్రహింపతగినవారు శిష్యుడు, భక్తుడు తటస్థుడు అని ముగ్గురు. వీరిలో శిష్యుని ఆచారము దేవత

యందును, గురువునందును, అధిక భక్తిగల మహాత్మునకు తెలియనియంశమేమియు నుండదు. గనుక అంతర్ముఖుడైన సద్గురువును నమ్మిన శిష్యుడు గురువుచెప్పిన తత్త్వమును నిరంతరమభ్యసించి అంతిర్ముఖుడై సుఖించును.

2 భక్తలక్షణము.

"అన్నప్రిదాన, నివాసస్థాన కల్పనాదినా యోగినం సేవమానో భక్తస్తదీయం తపః స్వయమేవాఽఽదత్తే" తథాచ శ్రూయతే- "తస్య పుత్రాదాయ ముపయంతి సుహృదః సాధుకృత్యాం ద్విషంతః పాపకృత్యాం" ఇతి ।

తా॥ జ్ఞానికి మంచినివాసస్థలమును, అహారమును ఇచ్చి శ్రద్ధతో సేవించిన ఉత్తమభక్తుడు వానియొక్క తపఃఫలమును పొందును. సొత్తును, పుత్రులును, తపఃఫలమును స్తుతిచేసినవాడును, పాపమును నిందచేసినవాడును పొందుదురని శ్రుత్యర్థము.

3 తటస్థలక్షణము

తటస్థోఽపి ద్వివిధః । ఆస్తికో నాస్తికశ్చేతి । తత్రాఽఽస్తికో యోగినః సన్మార్గాచరణం దృష్ట్వా స్వయమపి సన్మార్గే ప్రివర్తతే । తథాచ స్మృతిః । భ. గీ. 3 అ. 21 శ్లో॥

యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః ।
సయత్ప్రిమాణం కురుతే లోక స్తదనువర్తతే ।

తా॥ ఆస్తికుడు నాస్తికుడు అని తటస్థుడు రెండువిధములు శ్రేష్ఠుడాచరించినపనినే యితరులుచేయుచుందురు. ఆస్తికుడు జ్ఞానియొక్క సదాచారమును చూచి తానును అట్లేఆచరించును.

నాస్తికోపి యోగినా దృష్టః పాపాన్ముచ్యతే। తదుక్తం॥
యస్యానుభవపర్యంతా తత్త్వే బుద్ధిః ప్రవర్తతే। తద్దృష్టిగో
చరాస్సర్వే ముచ్యంతే సర్వపాతకైః॥

తా॥ పూర్ణజ్ఞానియొక్క దృష్టిలోపడిన నాస్తికులుసయితము పాపములనుండి తొలగుదురు.

అనేనప్రకారేణ సర్వప్రాణ్యుపకారిత్వం యోగినో విన ష్టిత్వాపత్యతే-

స్నాతం తేన సమస్తతీర్థసలిలే సర్వాఽపి దత్తావని ర్యజ్ఞా
నాం చ సహస్రమిష్టమఖిలా దేవాశ్చ సంపూజితాః। సంసా
రాచ్చ సముద్ధృతాః స్వపితర స్త్రైలోక్యపూజ్యోప్యసౌ య
స్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్॥
కులం పవిత్రం జననీ కృతార్థా విశ్వంభరా పుణ్యవతీచ తేన।
అపారసంవిత్సుఖసాగరేఽస్మింల్లీనం పరే బ్రహ్మణి యస్య చేతః॥

తా॥ సర్వప్రాణులకుపకారము జ్ఞానయోగివలన కలుగుచున్నది. మనస్సును క్షణమాత్రమైన బ్రహ్మవిచారమందు స్థిరముగనుంచిన పురుషుడు సమస్తపుణ్యతీర్థములందు స్నానముచేసినట్టియు, భూమినంతయు దానముచేసినట్టియు, అనేకవేలక్రతువులను చేసినట్టియు, సమస్తదేవతలను పూజించినట్టియు, పితృదేవతలను తరింపచేసినట్టియు, మూడులోకములయందును పూజింపబడునట్టి పుణ్యాత్ముల యొక్కయు ఫలమును బొందును. అపారచిదానందబ్రహ్మమునందు తనమనస్సును లయింపచేసినవానియొక్క కులము ,మిగులపవిత్రము. తల్లి ధన్యురాలు. ఆజ్ఞానియుండు దేశము పుణ్యక్షేత్రము.

# 4 వ ప్రకరణము

సగుణమంతయును కల్పితమనియు, ఆత్మ నిత్య
మనియును నిరూపణము.

బ్ర. సూ. 1 అధ్యాయము 2 పాదము.

9 సూ. 1 అత్తా 2 చరాచరగ్రహణాత్॥

తా॥ 2 చరాచరములుగల జగత్తును భక్ష్యముగా గ్రహించుటవలన 1 భక్షకుడు బ్రహ్మమే. గాని అగ్ని జీవులు కారు.

1 క 2-2-25 "యస్య బ్రహ్మచ క్షత్రంచ ఉభే భవత ఓదనం మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేదయత్రసః"

2 బృ. 3-4-6 "అగ్నిరన్నాదః"

3 ముం. 3-6-1 "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి"

తా॥ (1) జగత్తును లయముచేయు ఈశ్వరునకధిష్ఠానమగు చిద్వస్తువును ధ్యానాదిసాధనములు లేకుండగా తెలిసికొనలేడు. (2) ఎవడు అన్నమును భక్షించుచున్నాడో అతడు అగ్ని. (3) జీవేశ్వరులలో జీవుడు కర్మఫలమనుభవించును. ఈశ్వరుడు కర్మఫలమునొందక సాక్షియై చూచుచుండును.

పంచదశి చిత్రదీపము- 6 ప్రకరణము.

బ్రహ్మాద్యా స్తంబపర్యంతాః ప్రాణినోఽత్ర జడాఅపి।
ఉత్తమాధమభావేన వర్తంతే పటచిత్రవత్ ॥5॥

తా॥ బ్రహ్మదేవుడు మొదలు తృణపర్యంతముగల ప్రాణులును, పర్వతాది జడవస్తువులును, చిత్రపటమునందు వ్రాసిన నరనారీవృక్షపర్వతవిహగాదులవలె రూపమునుబట్టి హెచ్చుతగ్గులుగానున్నను అనేకచిత్తరువులుగల పటమునకును, ఆచిత్తరువులకును భేదములేనట్లే హెచ్చుతగ్గులుగల చేతనాచేతనములకును, వానికాధారమగు పరమాత్మకును భేదములేదు.

అచింత్య రచనారూపం మాయైవ సకలం జగత్ ।
ఇతి నిశ్చిత్య వస్తుత్వ మద్వైతె పరిశేష్యతాం ॥ 246 ॥

తా॥ నిరూపింపశక్యముకాని విచిత్రరచనగల జగత్తంతయు స్వప్నవస్తువువలె మాయాకల్పితమని నిశ్చయించి దీనికాధారమగు పరమాత్మయే నిత్యమని నిశ్చయింపుము.

అష్టావక్రగీత- 1 ప్రకరణము.

యత్ర విశ్వమిదం భాతి కల్పితం రజ్జుసర్పవత్ ।
ఆనందపరమానందః సబోధ స్త్వం సుఖంచర ॥ 9 ॥

తా॥ దృశ్యప్రపంచమంతయు త్రాటియందు సర్పమువలె భ్రాంతిచే మాయాకల్పితమని తెలిసికొని కల్పనాధిష్ఠానమగు చిదాత్మయే నీవని నిశ్చయింపుము.

ముక్తాభిమానీ ముక్తోహి బద్ధో బద్ధాభిమాన్యపి ।
కింవదంతీహ సత్యేయం యామతిః సాగతిర్భవేత్ ॥ 10 ॥

తా॥ నేను ముక్తుడను యనెడి నిశ్చయాభిమానముగలవాడు ముక్తుడు. అట్లే బద్ధుడును. బంధమోక్షములు, అభిమానకల్పితములు గాని వాస్తవములు కావు. జ్ఞానికి బంధమోక్షములు లేవు. ఆత్మమాత్రమే సత్యము. మిగిలినవి కల్పి

తములు. దేహమును విడుచు కాలమందు స్మరించుదానినిబట్టి మరల జన్మాదులు కలుగునని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి.

అష్టావక్రగీత- 3 ప్రకరణము.

మాయామాత్రమిదం విశ్వం పశ్యన్విగతకౌతుకః ।
అపి సన్నిహితే మృత్యౌ కథం త్రస్యతి ధీరధీః ॥ 11 ॥

తా॥ ఈప్రపంచము మాయాకల్పితమైనది. సద్రూపము కాదు. ఈశరీరాదిక మెచటినుండివచ్చి యెచట లయమగునని విచారమునయితము లేనట్టి విజ్ఞానియే చలనములేని స్వస్వరూపానుసంధానపరుడు. అట్టివాడు మృత్యువు సమీపించినను భయమునొందడు. మరణాది వికారములు దేహములకే గాని ఆత్మకు లేవు.

అ. గీ. 1 ప్రకరణము.

సాకారమనృతం విద్ధి నిరాకారంతు నిశ్చలం ।
ఏతత్తత్త్వోపదేశేన నపునర్భవసంభవః ॥ 17 ॥

తా॥ ఆకారములతోనున్న దేహాది సర్వప్రపంచమును మిథ్యయని తెలిసి దానియందభిమానమును విడువుము. ఆకారములేని ఆత్మస్వరూపమును అన్నికాలములయందును సాక్షిగానున్నదని తెలియుము. అందువలన మరల జన్మములేని ముక్తి కలుగును

యథైవాదర్శమధ్యస్థే రూపేఽంతఃపరితస్తు సః ।
తథైవాస్మిన్ శరీరేఽంతః పరితః పరమేశ్వరః ॥ 18 ॥

తా॥ అద్దమునందు కనుపించు శరీరముయొక్క ప్రతిబింబమునకు చుట్టును, లోపలను, వెలపలను అద్దమున్నట్లే యా

స్థూలశరీరముయొక్క లోపలను, వెలపలను, నలుతట్టులను చిదాత్మయగు పరమేశ్వరుడున్నాడు.

అ. గీ. 2 ప్రకరణము.

యథా ప్రకాశయామ్యేకో దేహమేనం తథా జగత్ ।
అతో మమ జగత్సర్వమథవా నచ కించన ॥ 2 ॥

తా॥ ఏకాత్మనై నేనీశరీరమును ప్రకాశింపచేయునట్లే యీ ప్రపంచమునుగూడ ప్రకాశింపచేయుచున్నాడు. దేహమువలె ప్రపంచమునయితము జడముగాని ఆత్మకాదని భావము.

అహో జనసమూహేఽపి నద్వైతం పశ్యతో మమ ।
అరణ్యమివ సంవృత్తం క్వ రతిం కరవాణ్యహం ॥ 21 ॥

తా॥ నాకు ద్వైతభ్రాంతిలేనందున జనసమూహమునయితము జనమువలె కనిపింపక అరణ్యమువలెనున్నది. గనుక మిథ్యాకల్పితప్రపంచములో దేనిని ప్రేమింతును అనగా దృశ్య వస్తువులయందు ప్రీతిలేదని భావము.

అహో భువనకల్లోలై ర్విచిత్రైర్ద్రాక్ సముత్థితం ।
మయ్యనంతమహాంభోధౌ చిత్తవాతే సముద్యతే ॥ 23 ॥

తా॥ సముద్రమునందుపుట్టిన తరంగములు సముద్రముకంటె వేఱుకానట్లే పరిపూర్ణ చిదాత్మయగు నాయందు చిత్తమనెడి వాయువుచేత పుట్టిన ప్రపంచవిషయవాసనలును చిదాత్మకంటె వేఱుకావు. అనగా ఆత్మకు చిత్తవైకల్యము కలిగినప్పుడే మిథ్యయగు జగత్తు స్ఫురించును. చిత్తము ఆత్మకాదు. గనుక చిత్తమందుకలిగిన సంకల్పవికల్పరూపమగు జగత్తు మిథ్యయే. అని జనకమహారాజు చెప్పెను.

అ. గీ. 9 ప్రకరణము.

అనిత్యం సర్వమేవేదం తాపత్రితయదూషితం ।
అసారం నిందితం హేయమితి నిశ్చిత్య శామ్యతి ॥ ౫ ॥

తా॥ అనిత్యమైన జగత్తు చిదాత్మయందారోపితమయినది. జగత్తు తాపత్రయముల చేత దూషితమై సారములేని తుచ్ఛమైన అసద్వస్తువుగనున్నది. ఆత్మసత్తకంటె వేఱగు స్వసత్తలేనిది. జ్ఞాని యిట్టిదృఢనిశ్చయముతో దేనియందును ఇచ్ఛలేక యేయుండును. తాపత్రయములనగా- (1) దేహేంద్రియ సంబంధమగు వ్యాధులవలన గలుగు బాధలననుభవించుట ఆధ్యాత్మిక తాపము. (2) నర పశు పక్షి మృగాదులవలనపీడింపబడుట అధిభౌతిక తాపము. (3) దైవికముగసంభవించుఅతివృష్టి అనావృష్టి ప్రళయాగ్నివాయువులు మొదలగువానివలన బాధలను పొందుట అధిదైవిక తాపము.

అ. గీ. 10 ప్రకరణము.

రాజ్యం సుతాః కళత్రాణి శరీరాణి సుఖానిచ ।
సంసక్తస్యాపి నష్టాని తవ జన్మనిజన్మని ॥ 6 ॥

తా॥ ప్రతిజన్మమందును అత్యంతాసక్తితో నార్జించిన రాజ్యాదిసంపదలు, పుత్రకళత్రాది బంధువులు మొదలగువాని యందలి సుఖము ఈజన్మములోనిది మఱియొకజన్మములోనికి సంప్రాప్తముకాదు. కనుక నీనటనమంతయు అసత్యము, అసత్తును, స్వప్నమువలె మిథ్యయునగును. ఆత్మమాత్రము నిత్యము. మాతా పితృ పుత్రకళత్రాదులతోకూడిన గతజన్మములలోని సంబంధమించుకయైనను ఇప్పుడు నీకు లేదుగదా యని

జనకమహారాజుతో అష్టావక్రమహాముని చెప్పెను.

అ. గీ. 18 ప్రకరణము.

మహదాది జగద్ద్వైతం నామమాత్రవిజృంభితం ।
విహాయ శుద్ధబోధస్య కింకృత్యమవశిష్యతే ॥ 69 ॥

తా॥ కడవలు, మూకుళ్లు మొదలగు నామవికారములు మృత్తునుండికలిగినవే. వీనిలో మృదంశముమాత్రముసత్యము కల్పితమగు నామరూపములన్నియు నసత్యము. అట్లే మహదహంకారము మొదలు శబ్దస్పర్శరూపరసగంధముల నెడిపంచతన్మాత్రలును, వానికధిష్ఠానములగు పృథివి జలము అగ్ని వాయువు ఆకాశముల నెడి పంచమహాభూతములతోడను కల్పితమైన యీజగత్తంతయు నామమాత్రవిజృంభితమేకాని వాస్తవమైనదికాదు. అని తెలిసికొని దీనికధిష్ఠానమగు చిద్రూపుడై యున్న విద్వాంసునకు చేయతగిన కృత్యమేదియును లేదని తాత్పర్యము.

భ్రమభూతమిదం సర్వం కించిన్నాస్తీతి నిశ్చయీ ।
అలక్ష్యస్ఫురణః శుద్ధః స్వభావేనైవ శామ్యతి ॥ 70 ॥

తా॥ సర్వమును భ్రమమాత్రకల్పితమేయని నిశ్చయము గల ఆత్మజ్ఞాని దృశ్యప్రపంచము కల్పితమని యుపేక్షించి మలసంబంధవికారములులేకుండ శాంతుడగును. గనుక జ్ఞానముకంటె నితరమగువానికొఱకు ప్రయత్నమెద్దియు చేయనక్కఱలేదు.

4 వ ప్రకరణము సమాప్తము.

# 5 వ ప్రకరణము

బ్రహ్మమునకును, చిచ్ఛక్తికిని అభేదమనుటకును, అట్టి నిర్గుణపరమాత్మవిమర్శమే శ్రేయముగాని యితరముకాదనుటకును ప్రమాణములు.

శ్రీశంకరాచార్యకృత సూత్రభాష్యమునందలి అధ్యాస భాష్యముయొక్క ముఖ్యతాత్పర్యము.

సచ్చిదానందరూపమే నిర్గుణబ్రహ్మస్వరూపము. అది ఆది మధ్యాంతములు లేనిది. అదియే ఈశ్వరశబ్దవాచ్యమును సృష్టిస్థితిలయములుగల యీచరాచరజగత్తునకు అధిష్ఠానమును, జగత్తునందలి నామరూపములుగలవి అన్నియును జీవసంజ్ఞకలవి. జీవులు అనంతము. బ్రహ్మమొకటియే. జీవేశ్వరులకు భేదములేదు గాని ఉపాధినాశ్రయించుటచేత భేదముకలిగినది జగత్తు జీవేశ్వరమిశ్రమమైనది. ఉపాధినాశ్రయించిన జీవులకు బ్రహ్మరూపమును తెలియకుండ చేయునది అవిద్య యను మాయాశక్తియే. నిర్గుణబ్రహ్మమే పరబ్రహ్మము. అది స్వయంప్రకాశముగలది. ఇంద్రియములకు గోచరించు పదార్థములన్నియు చీకటివంటివి. చీకటికిని వెల్తురునకును ఐక్యము కుదరనట్లే పరబ్రహ్మమునకును, జడములయిన జగత్పదార్థములకును ఐక్యముకుదరదనియు, సత్తాస్ఫూర్తిసంతోషములు ఆత్మధర్మములును; అనృత జడదుఃఖాదులు దేహాది జడసంబంధధర్మములును గనుక ఆత్మధర్మములు జడములకుగాని, జడధర్మములు ఆత్మకుగాని సంభవింపవనియు, పరబ్రహ్మమునందుజగద్వస్తువులయొక్క అనృత జడదుఃఖాదులుగాని, జగద్వస్తువు

లందు ఆత్మధర్మములగు సచ్చిదానందాదులును కల్పింపశక్య ముకాదనియును పూర్వపక్షమురాగా

సిద్ధాంతము- ఒకదానియందు వేఱొకదాని ధర్మములను భ్రమచేత నారోపించి అవివేకముచేత సత్యాసత్యములనుకలిపి నేను, ఇది, ఇది నాది, యనెడి లోకవ్యవహారము కలిగినది. ఈభ్రమచేత కలిగిన ఆరోపణమునకే శాస్త్రములందుఅధ్యాసమని పేరుకలిగినది. ముత్యపుచిప్పను వెండిగతలచుట, కన్నులుతిరుగునపుడు ఒకచంద్రుని అనేకచంద్రులనుగా తలచుట, మొదలగు ఒకవస్తువునందు మఱియొకవస్తుధర్మము నారోపించుటయే అధ్యాస. పరబ్రహ్మము దేనికిని విషయము కాదు గదా? దానియందు జగత్తునందలి విషయధర్మముల నెట్లుఆరోపింపతగునందు వేని పరబ్రహ్మము కేవలము విషయముకాదు. ఆస్వరూపము తానేయగుటచేత పరోక్షముకానేరదు. కనుబడుచున్న వస్తువునందే మఱియొకవస్తువు నారోపింపవలయునను నియమములేదు. ఇంద్రియగోచరముకాని ఆకాశమునందు భూమియందలి మాలిన్యమును బాలురారోపించునట్లే ఇంద్రియగోచరముకాని పరబ్రహ్మమందును జడపదార్థధర్మములను అవివేకులారోపింతురు. దీనినే అవిద్యయనియు, వివేకముచేత కలుగు వస్తుస్వరూపనిశ్చయమునే విద్యయనియు చెప్పుదురు అయినను ఎండమావులనీటిచేత మరుభూమి తడియనట్లే మిథ్యాజగద్వస్తుధర్మములు పరబ్రహ్మమునంటవు.

ప్రమాణములును, శాస్త్రములును అవిద్యావంతులకొఱకే ప్రవర్తించినవి. ఎట్లనగా- దేహేంద్రియాదులు నేనే అనువానికే కర్తృత్వాదిధర్మములు కలవు. గాని అవి తాను కాన

నేవానికి లేవు. ఈదేహాభిమానముచేతనే నరులకును, పశువులకును, ప్రవృత్తి నివృత్తులు సమానముగనున్నది. ఎట్లనగా— మృదువాక్యములతో ఆహారము మొదలగువాని నిచ్చువాని దగ్గఱకు చేరుటయు, క్రూరవాక్యములతో కొట్టబోయినవాని దగ్గఱకు చేరకుండుటయును, నరులకును, పశువులకును సమానమే.

"బ్రాహ్మణో యజేత" మొదలగు విధివాక్యములచేత స్వర్గాదిఫలముకొఱకు యాగాద్యధికారమునుకోరుదురు. గాని వర్ణాశ్రమాదిభేదములును, సంసారబంధమును లేని ఆత్మతత్త్వమనెడి జ్ఞానమును కోరరు. కర్మకాండమందు చెప్పిన అధికారము తత్త్వజ్ఞానమునకు విరోధియగును. కర్మకాండము అసంగాత్మయందు వర్ణాశ్రమాదులనుబట్టి ప్రవర్తించినది. త్రాడునుచూచి పాము అని తలచినట్లు దేహమే ఆత్మయని తలచి నేను శ్రేష్ఠుడను, క్రత్వధికారముకలవాడను అని యాగమునారంభించును. కాని తత్త్వజ్ఞానమునకు ఆనియమములులేవు. కర్మాపేక్షయుంచుకయినను లేదు. క్రిందినాలుగువిధములయిన ధర్మములను అధ్యాసయని చెప్పుదురు.

(1) తనపుత్రకళత్రాదులకు సంతోషముకలిగినపుడు సంతోషిననియు, వారికి దుఃఖముకలిగినపుడు దుఃఖిననియు మొదలగునవి బాహ్యధర్మములు.

(2) నేను బలిసినాను, చిక్కినాను, ఎఱ్ఱనివాడను, నిలుచున్నాను మొదలగునవి దేహధర్మములు.

(3) నేను మూగవాడను, గ్రుడ్డివాడను, నపుంసకుడను, మొదలగునవి ఇంద్రియధర్మములు.

(4) కామ, సంశయ, సంకల్పాదులు అంతఃకరణధర్మము లు. వీనిని తనయందారోపించుకొని క్లేశపడుటయే అవివేకము ఈఅధ్యాస కర్తృత్వ భోక్తృత్వాది దుఃఖకారణమయినది. గనుక దీనిని వారించుటకు జ్ఞానశాస్త్ర మారంభింపబడుచు న్నది.

వి॥ జీవేశ్వరులకు భేదములేదు జీవులు అనంతము. ఉపా ధినాశ్రయించినపుడు స్త్రీపురుషభేదము కలిగినది. సర్వము బ్రహ్మమేయని శ్రుతులు చెప్పుచున్నవి. జీవేశ్వరసంజ్ఞ కలిగి నట్లే ప్రకృతి పురుషులనెడి నామభేదము కలిగినది. కాని చంద్ర చంద్రికలవలె నభేదమే. ఉపాధినాశ్రయింపనపుడు నిర్గుణమగు చిద్రూపమొకటియే.

ఉత్తమపురుషార్థములకొఱకు పరమాత్మవిమర్శమే
ముఖ్యమనుట.

బ్రహ్మసూత్రములు. శ్రీశంకరాచార్యభాష్యము నను సరించి తాత్పర్యము వ్రాయబడుచున్నది.

1 జిజ్ఞాసాధికరణము.

1 సూ. అథాతో బ్రహ్మజిజ్ఞాసా ।

పద। 1 అథ 2 అతః 3 బ్రహ్మజిజ్ఞాసా।

తా। 2 వేదమందుచెప్పిన కర్మఫలము నిత్యమైనది కానం దున 1 సాధనచతుష్టయసంపత్తికలిగి జన్మరాహిత్యమగు కై వల్యముక్తికొఱకు 3 బ్రహ్మముయొక్క విమర్శము చేయవల యును.

సాధనచతుష్టయమనగా-

1 నిత్యానిత్యవస్తువివేకము=బ్రహ్మము నిత్యము, జగత్తు అనిత్యము (మిథ్య) యను తెలివి.

2 ఇహాముత్రార్థఫలభోగవిరాగము= భూలోక స్వర్గాది లోకములందుగల భోగములయందు వైరాగ్యము. (ఆసక్తి లేకపోవుట)

3 శమాది సాధనసంపత్తి=అనగా-

1 శమము=అంతరింద్రియనిగ్రహము.

2 దమము=బాహ్యేంద్రియనిగ్రహము (జగత్పదార్థములందాసక్తి లేకపోవుట.)

3 ఉపరతి=విహితకర్మములను విధిపూర్వకముగ విడుచుట.

4 తితిక్ష=శీతోష్ణాది ద్వంద్వములను సహించుట.

5 సమాధానము=మనస్సు విషయాదులయందుపోవుటచేత కలుగు దోషములను తెలిసికొని వాని నుండి వైరాగ్యముచేత మనస్సును మఱలించుట.

6 శ్రద్ధ=గురువాక్య వేదాంతవాక్యములందు నమ్మకముకలుగుట.

4 ముముక్షుత్వము=మోక్షమునందు కోరిక.

వివరణము- ఈసాధనచతుష్టయసంపత్తిలో ఉపనయన, వేదాధ్యయన, యజ్ఞాదికర్మములుగాని, జాతిభేదాశ్రమ భేదములుగాని చెప్పలేదు. ఈజ్ఞానవిద్యకు అవివేళ్ళియు నక్కరలేదని 8 ప్రకరణములో 3 అ. 4 పాదమునందును చెప్పబడినది.

అవ॥ ఆబ్రహ్మము ఎట్టిదనగా-

2 జన్మాద్యధికరణము.

2 సూ. జన్మాద్యస్య యతః॥

పద॥ 1 జన్మాది 2 అస్య 3 యతః॥

తా॥ (1-2) ఈజగత్సృష్టి స్థితిలయములు (3) దేనినుండి జరుగునో అదియే బ్రహ్మము, ఆనందస్వరూపమును.

శ్రుతి॥ యతోవా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి। యత్ప్రయంత్యభిసంవిశంతి। తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి। "ఆనందాద్ధ్యేన ఖల్విమాని భూతాని జాయంతే। ఆనందేన జాతాని జీవంతి। ఆనందంప్రయంత్యభిసంవిశంతీతి"

తా॥ భృగువుతో తండ్రియగు వరుణుడు చెప్పుచున్నాడు సగుణబ్రహ్మ మొదలు సర్వజీవులు దేనివలనపుట్టి పెరిగినశిం చుచున్నవో అదియే బ్రహ్మమనెడి ఆనందస్వరూపము. అది నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావమును , సర్వజ్ఞత్వాదిధర్మములును కలది.

అవ॥ మఱియు వేదములకే నిత్యత్వమని పూర్వపక్షము రాగా— 3 శాస్త్రయోనిత్వాధికరణము.

3 సూ. 1 శాస్త్ర, 2 యోనిత్వాత్॥

తా॥ దేవతలు, మనుష్యులు, జాతులు, ఆశ్రమములు మొదలగు విభాగమునకు కారణమయిన (1) ఋగ్వేదాది శాస్త్రములయొక్క (2) ఉత్పత్తికి కారణమగుటవలన నిత్యత్వము బ్రహ్మమునకే కలదు.

అని బృ. 4-4-10 "అస్య మహతో భూతస్య నిశ్వసిత మేవైతద్యదృగ్వేదో యజుర్వేదస్సామవేద" యను శ్రుతి చెప్పుచున్నది.

లేక, బ్రహ్మముయొక్క స్వరూపమును తెలిసికొనుటకు ఋగ్వేదాదిశాస్త్రమే ప్రమాణము.

అవ॥ వేదములకు కర్మపరత్వము చెప్పుటచేత బ్రహ్మము వేదప్రమాణముకాదనియు, వేదాంతములు కర్మలను బోధింప సందున కర్మాంగమనియు, జైమినిచేసిన పూర్వపక్షము రాగా.

4 సమన్వయాధికరణము.

4 సూ. తత్తు సమన్వయాత్ ।

పద॥ 1 తత్ 2 తు 3 సమన్వయాత్ ॥

తా॥ 2 పూర్వపక్షము సరికాదు. 3 వేదశ్రుతుల సమన్వయమువలన 1 బ్రహ్మమే ప్రతిపాదింపబడుచున్నది. ఎట్లనగా

1 ఛాం. 6-2-3 "సదేవ సోమ్యేదమగ్రఆసీత్ ।

తా॥ ఘటాదులు చేయకపూర్వము మట్టి ముద్దగానున్నట్లే, ఈజగత్తు పుట్టుటకుపూర్వము బ్రహ్మముగానేయున్నది.

2 ఛాం. "ఏకమేవాద్వితీయం"

3 ఐ. 2-1-1 "ఆత్మావా ఇదమేకఏవాగ్రఆసీత్ "

4 బృ. 4-5-19 "తదేతద్బ్రహ్మ పూర్వమనపరమనంతరమబాహ్యమయమాత్మా బ్రహ్మ సర్వానుభూః"

తా॥ ఏకరసము, అద్వితీయము నగు కార్యకారణములు లేని బ్రహ్మమే అన్నిటిని యనుభవించునట్టి ద్రష్టయు: శ్రోతయు, మంతయు, బోద్ధయు, విజ్ఞాతయు, నగు ప్రత్యగాత్మ.

5 ముం. 2-2-11 "బ్రహ్మైవేద మమృతం పురస్తాత్"

తా॥ అజ్ఞానులు బ్రహ్మముకాదని తలచునదంతయును శాశ్వతమగు బ్రహ్మమే.

కర్మములు స్వర్గాదులకు సాధకమగునట్లే బ్రహ్మజ్ఞానము మోక్షమునకు సాధకమగును.

1 బృ. 6-5-6 "ఆత్మావారే ద్రష్టవ్యః"

2 ఛాం. 8-7-1 "యఆత్మాపహిత పాప్మానో న్వేష్టవ్య స్సవిజిజ్ఞాసితవ్యః"

3 బృ. 3-4-7 "ఆత్మేత్యేవ ముపాసీత"

4 బృ. 3-4-15 "ఆత్మాన మేవ లోకముపాసీత"

తా॥ ఆత్మయే చూడతగినది. తెలియతగినది. తనతోఁగూడిన లోకమును ఆత్మగా నుపాసింపవలెను. ఇతరమగు జడమునుపేక్షింపవలెను.

5 ముం. 3-2-9 "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి"

6 "నిత్యస్సర్వజ్ఞస్సర్వగతో నిత్యతృప్తో నిత్యశుద్ధ బుద్ధ ముక్తస్వభావో విజ్ఞానమానందం బ్రహ్మ"

తా॥ పరబ్రహ్మము అపరోక్షసుఖస్వరూపమును, అన్నికాలములయందును, అన్నిఅవస్థలయందు నున్నదియును, అజ్ఞానముగాని, బంధముగాని లేనిదియును.

కర్మఫలముకంటె మోక్షము శ్రేయము.

1 క 2-22 "అశరీరం శరీరేష్వనవస్థేష్వవస్థితం। మహాంతం విభుమాత్మానం మత్వా ధీరో నశోచతి"

తా॥ పండితుడు ఆత్మస్వరూపము తానేయని తెలిసికొని దుఃఖింపడు.

బృ. 6-3-15 "అప్రాణో హ్యమనాశ్శుభ్రః అసంగో హ్యయం పురుషః"

తా॥ పరబ్రహ్మము దేహేంద్రియాదులతోను, పుణ్యపాపములతోను సంబంధములేనిది.

బ్రహ్మోపదేశము జ్ఞానాంగము కాని కర్మాంగము కాదు.

1 ముం. 2-2-9 "బ్రహ్మవేదబ్రహ్మైవ భవతి" క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే।

తా॥ బ్రహ్మము తానేయని తెలిసికొనినవానికి ప్రారబ్ధము తప్ప తక్కినకర్మలు నశించును.

2 తై. 2-9 'ఆనందం బ్రహ్మణో విద్వాన్నబిభేతి కుతశ్చన'

తా॥ బ్రహ్మానందము తెలిసినవాడు దేనినుండియు భయపడడు.

3 బృ. 6-2-4 'అభయంవై జనక ప్రాప్తోసి'

తా॥ ఓజనకుడా బ్రహ్మమును తెలిసి భయములేనివాడవైతివి.

4 ఈ. 7 'తత్ర కోమోహః కశ్శోక ఏకత్వమనుపశ్యత'

తా॥ తాను బ్రహ్మమునని తెలిసినవానికి అజ్ఞానముగాని శోకముగాని లేదు. [జ్ఞానమునకు ఫలము.

మోక్షమునకుగల ప్రతిబంధమును నశింపచేయుటయే

1 బృ. 3-4-9 'తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదే అహం మనురభవం సూర్యశ్చ'

తా॥ బ్రహ్మమును ప్రత్యగాత్మయని తెలిసికొని వామదేవఋషి పరబ్రహ్మమును పొందెను. నేను మనువునైతిని సూర్యుడనైతిని అని సర్వాత్మత్వమును దెలుపు మంత్రములను కనిపెట్టెను.

2 గౌతమాచార్యకృతం॥ 'దుఃఖజన్మప్రవృత్తిదోషమిథ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే తదనంతరాపాయాదపవర్గః'

తా॥ దుఃఖము, జన్మము, ధర్మాధర్మములయందలి ప్రవృత్తి, రాగద్వేషాదులు, మిథ్యాజ్ఞానము నను నివి కడనుండి మొదటివరకు క్రమముగా నశింపగా దుఃఖనాశరూపమగు అపరోక్షజ్ఞానము కలుగును.

మోక్షమునకు జ్ఞానమొకటియేకాని ఇతరక్రియా సాధనములు లేవు.

1 ఏకోదేవస్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా। కర్మాధ్యక్షః స్సర్వభూతాధివాసస్సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ।

తా॥ పరబ్రహ్మము స్వప్రకాశమైనదియును, మాయకులోబడనిదియును, అంతటను, అన్నిజంతువులయందును ఆత్మగానున్నదియును, సర్వకర్మములకు సాక్షియును, చేతనమును, కర్తృత్వాదులును గుణదోషములును లేనిదియును.

2 ఈ. 8 'సపర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరం శుద్ధమపాపవిద్ధం'

తా॥ పరబ్రహ్మము రాగద్వేషాదులును, లింగశరీరమును పుండ్లును, నరములును, పుణ్యపాపములును లేనిదై దీప్తిమంతమై అంతటను వ్యాపించియుండెను.

వివరణము- అవిద్య, మాయ, అనెడి జడప్రకృతియే కలదుగాని చిత్ప్రకృతి లేదని కొందరిమతము. గాని మూలప్రకృతియనెడి చిచ్ఛక్తిని, బ్రహ్మమునకును, చంద్రచంద్రికలవలె నభేదమే. ఈచిచ్ఛక్తియనెడి ప్రకృతినే బ్రహ్మవిష్ణుశివాదిదేవతలు, యక్ష, రాక్షస, గంధర్వ, వసిష్ఠ, శౌనక, సనకసనందనాది మహర్షులును బ్రహ్మముగ విమర్శించిరి. దీనినే చిత్తు, పరబ్రహ్మము, పరమాత్మ, శివుడు, చిచ్ఛక్తి, నారాయణుడు, కృష్ణుడు, రాముడు మొదలగు నామములుచేత శాస్త్రములు చెప్పుచున్నవి. గాని నామరూపములన్నియు కల్పితములు. నాశములేని నిత్యమగు నిర్గుణతత్త్వమును తెలిసికొనుటయే శ్రేయము. ఈపరబ్రహ్మమునే శక్తిపరముగా త్రిశతిభాష్యము, వేదపాదస్తవము, సౌందర్యలహరి మొదలగువానియందు చెప్పినట్లే పురుషపరముగా చెప్పుచు రెండింటికిని అభేదమునే శ్రీశంకరాచార్య, విద్యారణ్య, వసిష్ఠ, శ్రీకృష్ణవ్యాసాదులు సూత్రభాష్యాదిగ్రంథములందు చెప్పియున్నారు. వానిలో కొన్నిప్రమాణములిచట వ్రాయబడినవి.

చిత్తుఅని, జడముఅని రెండువిధములుగనున్న ప్రకృతి అన్నిశరీరములందును కలదనుట.

భ. గీ. 7 అధ్యాయము.

భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ ।
అహంకార ఇతీయంమే భిన్నా ప్రకృతిరష్టధా ॥ 4 ॥

అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరాం ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥5
ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా ॥ 6 ॥

తా॥ నాయొక్క జడప్రకృతియే భూమి, ఉదకము, అగ్ని వాయువు, ఆకాశము, చిత్తము, బుద్ధి, అహంకారము లనెడి ఎనిమిది సూక్ష్మభూతములుగనున్నది. బుద్ధి శబ్దముచేత అహంకారమునకు కారణమైన మహత్తత్త్వమును, అహంకారశబ్దముచేత అవిద్యతోకూడిన అవ్యక్తమును చెప్పబడును. ఈప్రకృతికంటె నారెండవప్రకృతి ఉత్తమమైనది. అదియే పరాశక్తియు, నాశుద్ధరూపమును. అది తానుపుట్టించిన జగత్తును ధరించుచు బ్రహ్మాది తృణపర్యంత జగత్తును నియమించుచున్నది. దీనివలస ముక్తియును, జడశక్తివలన సంసారబంధమునుకలుగునని శ్రీకృష్ణుడు చెప్పెను.

భ. గీ. 7 అధ్యాయము.

నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః ।
మాయయాపహృతజ్ఞానాః ఆసురం భావమాశ్రితాః ॥15

తా॥ కొందఱు మూఢులు మాయకు బద్ధులై హింసాది రాక్షసకృత్యములనే చేయుచుందురు గాని భగవంతుడనగు నన్ను సేవింపలేరు.

అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః ।
పరంభావమజానంతో మమాఽవ్యయమనుత్తమం ॥ 24 ॥

తా॥ అల్పబుద్ధిగలవారు నన్ను రాజపుత్రుడనగు కృష్ణుడ ననేగాని శాశ్వతనిర్గుణబ్రహ్మమని తెలిసికొనలేరు.

కర్మయజ్ఞముకంటె జ్ఞానయజ్ఞము శ్రేయము.

భ. గీ. 4 అధ్యాయము.

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే ॥ 33 ॥

తా॥ పుణ్యకర్మములు చిత్తశుద్ధిని కలిగించుటచేత జ్ఞానమునకును, జ్ఞానము మోక్షమునకును సాధనములు. గనుక జ్ఞానయజ్ఞము శ్రేయము.

శ్రీకృష్ణుడు చిచ్ఛక్తియగు లలితాత్రిపురసుందరిరూపమనుట
త్రిశతి 154 శాంతాయను నామభాష్యమునందలి
త్రిపురా తాపినీశ్రుతి ॥

కదాచిదాద్యా లలితా పుంరూపా కృష్ణవిగ్రహా।
వంశనాదవినోదేన కరోతి వివశం జగత్ ॥

తా॥ ఒకానొకప్పుడు ఆదిశక్తియగు లలితాత్రిపురసుందరి కృష్ణుడనెడి పురుషరూపమును ధరించి వేణునాదముచేత జగత్తును మోహపెట్టెను.

వివరణము— దశావతారములలో కృష్ణుడు చిద్రూపశక్తియగు లలితయొక్క రూపమగుటచేత జననము మొదలు భగవద్రూపచర్యలనే గావించెను. లోకమునకు జ్ఞానబోధచేసెను. అస్ఖలితబ్రహ్మచారి యనెడి పేరును పొందెను. "త్రిపుర" అనగా— జాగ్రత్స్వప్నసుషుప్తులనెడి మూడుపురములయందును,

భూతభవిష్యద్వర్తమానకాలములు మూడింటియందునుఉన్న నిత్యమగు సత్యస్వరూపమని తాత్పర్యము. గనుకనే శక్తిపరముగా దేవీభాగవతమును, పురుషపరముగా కృష్ణభాగవతమును జ్ఞానబోధతో నిర్మింపబడెను.

బ్రి. సూ. 2 అధ్యాయము 3 పాదము.

9 సూ. అసంభవస్తు సతోఽనుపపత్తేః ॥

శం॥ భా॥ (సతః-అసంభవః) బ్రిహ్మమునకు దేనినుండియు ఉత్పత్తిసంభవింపదు. (అనుపపత్తేః) ఉత్పత్తికి ప్రిమాణము లేనందువలనను ఉల్పత్తిలేదు.

కథం "అసతస్సజ్జాయేతే"తి చాక్షేపశ్రివణాత్ ॥ "సకారణం కరణాధిపాధిపో నచాస్య కశ్చిజ్జనితా నచాధిపః" ఇతిచ బ్రిహ్మణో జనయితారం వారయతి। వియత్పవనయోః పునరుత్పత్తిః ప్రిదర్శితా నతు బ్రిహ్మణస్యాస్తీతి వైషమ్యం। నచ వికారేభ్యో వికారాంతరోత్పత్తిదర్శనా ద్బ్రిహ్మణోపి వికారత్వం భవితుమర్హతీతి। మూలప్రికృత్యనభ్యుపగమేఽనవస్థాప్రిసంగాత్ । యామూలప్రికృతిరభ్యుపగమ్యతే తదేవచనో బ్రిహ్మేత్యవిరోధః ।

తా॥ పరమేశ్వరుడే జగత్కారణము. అగ్ని మొదలగువానికి ప్రిభువు. ఇతనినిపుట్టించు జనకుడులేడు. అని శ్రుతి చెప్పుచున్నది. వికారమగు మృత్తునుండి వికారాంతరములైనఘటాదులకుత్పత్తి కనిపించుటవలన బ్రిహ్మమున్ను వికారమేకావచ్చుననీ యనతగదు. సత్పదార్థమునకుత్పత్తిలేదు.

జగదుత్పత్తివిషయమై మూలప్రకృతిని యంగీకరింపనపుడు అనవస్థకలుగును. కాని అంగీకరించినపుడు అనవస్థలేదు. ఆమూలప్రకృతియే మాకు బ్రహ్మము.

కనుక సమన్వయవిరోధములేదు అని శంకరాచార్యులు చెప్పెను. అవస్థయనగా- బ్రహ్మము (చిచ్ఛక్తి) నకు కారణమొకటికలదని చెప్పగా దానికేమికారణము అనియు, కారణముండెనేని దానికేమికారణమనియు, హద్దులేకపోవుట.

1 అధ్యాయము 4 పాదము.

7 ప్రకృత్యధికరణము॥

అవ॥ జగత్తునకు ఉపాదానకారణము బ్రహ్మముకాదని పూర్వపక్షమురాగా- సిద్ధాంతము-

23 సూ. ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్

పద॥ 1 ప్రకృతిశ్చ 2 ప్రతిజ్ఞా: 3 దృష్టాంతః 4 అనుపరోధాత్ ।

తా॥ కుండకు మట్టి ఉపాదానకారణమును, దానినిచేయు కుమ్మరి నిమిత్తకారణము నగును. (2) ఒకవస్తువు తెలిసినపుడు అన్నియును తెలియబడుననెడి ప్రతిజ్ఞకును (3) మట్టి తెలిసినపుడు ఆపాత్రలు తెలిసికొనబడుననెడి దృష్టాంతమునకును (4) విరోధములేకుండుటవలన పరబ్రహ్మమే (1) ఉపాదానకారణమగుచున్నది.

శ్రుతులు-

1 ప్ర. 6-3 "సఈక్షాం చక్రే సప్రాణమసృజత"

తా॥ ఓభారద్వాజుడా షోడశకళలుగల పురుషుడు సమష్టి ప్రాణమును సృజించెను.

2 శ్వే. 6-19 "నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం"

తా॥ అవయవములు, చలనము, దోషములును లేని పరిణమింపని సోపాధిక బ్రహ్మమును కైవల్యముక్తికొఱకు శరణు పొందుచున్నాను.

3 ఛాం. 6-1-2 "ఉతతమాదేశ మప్రాక్ష్యో యేనా శ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతం" ఇతి ప్రతిజ్ఞ ॥

తా॥ ఏది వినినప్పుడు వినబడనిది వినబడినదియు, మననము చేయబడనిది, చేయబడినదియు, ఆలోచింపబడనిది ఆలోచింపబడినదియు, తెలియబడనిది, తెలియబడినదియు నగునో అట్టిబ్రహ్మమును చెలుపుమని గురువును అడిగితివా యని శ్వేతకేతువును తండ్రి ఉద్దాలకుడడిగెను.

దీనికుత్తరము క్రింది 4 వ శ్రుతియే ॥

3 తై. 3-1 "యతోవా ఇమాని భూతాని జాయంతే"

తా॥ చతుర్ముఖుడు మొదలుకొని స్తంబపర్యంతముగల యెల్లజంతువులును దేనియందుపుట్టి పెరిగి లయమగుచున్నవో యదియే బ్రహ్మమని భృగునకు వరుణుడుపదేశించెను.

4 ఛాం. 6-1-4 "యథా సోమ్యైకేన మృత్పిండేనసర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం"

తా॥ ఓబాలుడా కారణమగు మట్టిముద్ద తెలిసినపుడు మృత్కార్యములగు ఘటాదులు తెలియబడును. అట్లే జగత్కారణమగు బ్రహ్మమొకటి తెలియగా జగత్కార్యములన్నియు తెలియును. కార్యము కారణముకంటె వేఱుకాదు. దానియందు సత్యముగానున్నది కారణమే.

5 ముం 1 1-2 "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతి" ఇదియును ప్రతిజ్ఞ॥

తా॥ ఏది తెలియగా యీజగత్తు స్పష్టముగా తెలియబడునని ఆంగిరసుని శౌనకుడడిగెను.

6 ముం. 1-1-7 "యథా పృథివ్యామోషధయస్సంభవంతి" దృష్టాంతము॥

తా॥ భూమియందు సస్యములు పుట్టునట్లే పరమాత్మనుండి జగత్తు పుట్టుచున్నది.

అవ॥ బ్రహ్మమునకే నిమిత్తోపాదానకారణములు రెండును చెప్పుట విరోధముకాదాయని యనగా—

24 సూ. అభిధ్యోపదేశాచ్చ॥

తా॥ 'సోకామయత బహుస్యాం ప్రజాయేయ' యను శ్రుతిలోని 'సోకామయత' యని సంకల్పపూర్వకమైన స్వతంత్రప్రవృత్తివలన కర్తృత్వమును 'బహుస్యాం' యను బహువచనము ప్రత్యగాత్మవిషయమగుటవలన ప్రకృతిత్వమును తెలియును. అనగా కర్త నిమిత్తకారణమును, ప్రకృతి ఉపాదానకారణమును అని తాత్పర్యము.

25 సూ. సాక్షాచ్చోభయామ్నానాత్ ।

పద। 1 సాక్షాత్ చ 2 ఉభయామ్నానాత్ ।

తా॥ (1) ప్రత్యక్షముగా బ్రహ్మమును కారణముగా స్వీకరించి (2) సృష్టిలయములు చెప్పుటచేత బ్రహ్మము ఉపాదానకారణమే. పగిలినకుండ మట్టియేయగునట్లును, కరిగిన సువర్ణకడియము కనకమేయగునట్లును, ప్రకృతివలన కలిగిన జగత్తు లయమందు ప్రకృతియేయగును.

26 సూ. 1 ఆత్మకృతేః 2 పరిణామాత్ ।

తా॥ (1) జగత్తు ఆత్మనుండియే పుట్టుటవలనను, బ్రహ్మము (2) జగదాకారముగా పరిణమించుటవలనను నది ఆత్మకృతియే.

1 తై. 2-7 'తదాత్మానగ్ం స్వయమకురుత'

తా॥ బ్రహ్మము తనను తానే సృజించెను. ఆత్మానం అను దానిచేత కర్మత్వమును, 'స్వయమకురుత' యను దానిచేత కర్తృత్వమును చెప్పబడినది.

27 సూ. యోనిశ్చ హి గీయతే ।

తా॥ యోనియనగా కారణము. బ్రహ్మము జగద్యోని యని శ్రుతి చెప్పుచున్నది.

1 ముం. 3-1-3 'కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం'

తా॥ విద్వాంసులు క్రియాశక్తియు, నియమించుశక్తియు నగు ప్రత్యగాత్మను జగత్తునకు ప్రకృతిగా తెలిసికొనిరి.

ప్రకృతి యనగా కారణము.

2 ముం. 3-1-6 'యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః'

తా॥ జ్ఞానులు ఎల్లభూతములకును కారణముగా దేనినితల తురో యదియే పరవిద్య.

బ్రహ్మము యోనిశబ్దముచేత చెప్పబడుటవలన ప్రకృతియే ఉపాదానకారణము. యోనిశబ్దము ప్రకృతివాచకము. స్త్రీయోనియు ఉపాదానకారణమే.

ఈక్షతిశబ్దము ఈశ్వరునకు ప్రకృతిత్వమును చెప్పుచున్నది.

8 సర్వవ్యాఖ్యానాధికరణం ॥

28 సూ. ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః ॥

పద॥ 1 ఏతేన 2 సర్వే 3 వ్యాఖ్యాతాః ॥

తా॥ (1) ప్రధానవాదమును నిరాకరించుటచేత (2) ప్రధానమువలె అశబ్దములు, శబ్దవిరుద్ధములు నగు పరమాణువు మొదలగు జగత్కారణవాదములన్నియు నిరాకరింపబడినట్లు (3) చెప్పబడినది.

కనుక నెల్లవేదాంతములును కారణబ్రహ్మమునే బోధించును.

బ్ర. సూ. 1 అ. 1 పాదము.

10 జ్యోతిశ్చరణాధికరణము.

అవ॥ జగత్కారణము భూతాగ్నియని చేసిన పూర్వపక్షముపైని సిద్ధాంతము.

24 సూ. 1 జ్యోతి 2 శ్చరణాభిధానాత్ ।

తా॥ (1) జ్యోతిశ్శబ్దముకంటె పూర్వము ఛాం. 3-12 6 "పాదోస్య విశ్వాభూతాని । త్రిపాదస్యామృతం దివి" అని (2) నాలుగుపాదములు చెప్పుటచేతను క్రిందిశ్రుతిలో "దివో జ్యోతిః" అను శబ్దముచేతను జ్యోతిశ్శబ్దము బ్రహ్మమేగాని పంచభూతములలోని అగ్ని కాదు.

ఛాం. 3-13-7 "అథ యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేష్వనూత్తమేషూత్తమేషు లోకేష్విదం వావ తద్యదిదమస్మిన్నంతః పురుషే జ్యోతిః"

తా॥ ఎల్లజంతువులకంటెను, ద్యు, భూరాది లోకముల కంటెను మీదనున్న ఉత్తమలోకమందుగల అతీతమైన తేజస్సును జఠరాగ్నియందారోపించెదరు.

25 సూ. ఛందోభిధానా న్నేతిచేన్న తథా
చేతోర్పణనిగదా త్తథాహి దర్శనం ।

పద॥ 1 ఛందోభిధానాత్ 2 న 3 ఇతిచేత్ 4 న 5 తథా 6 చేతోర్పణనిగదాత్ 7 తథాహి 8 దర్శనం ।

తా॥ (1) 'గాయత్రీవా ఇదగ్ం సర్వం భూతం యదిదం కించ' యను శ్రుతి ప్రపంచమంతయు గాయత్రి గా ఛందస్సు చెప్పుటవలన (2-3) బ్రహ్మమునకు వర్తింపదందువేని (5-6) గాయత్రియందలి బ్రహ్మమునందు మనస్సు నేకాగ్రతచేయు మనుటవలన (4) దోషములేదు. (7) గాయత్రి బ్రహ్మో పాసనముగా (8) క్రింది శ్రుతి చెప్పుటవలన ఛందస్సుగచెప్పి నను అది బ్రహ్మమే.

1 ఐ. 3-2-3 'ఏతం హ్యేవ బహ్వృచామహత్యుక్థేమీమాగ్ంసంతె ఏతమగ్నావధ్వర్యవఏతం మహా వ్రతేఛందోగాః'

తా॥ ఈపరబ్రిహ్మమునే ఋగ్వేదులు ఉక్థమను శస్త్రిమందును, యజుర్వేదులు అగ్నిరహస్యమందును, సామవేదులు క్రితువునందును బ్రిహ్మోపాసనముగా చెప్పుచున్నారు.

అవ॥ కారణ మేమనగా—

26 సూ. 'భూతాది పాదవ్యపదేశోపపత్తేశ్చైవం'

పద॥ 1 భూతాదిపాద 2 వ్యపదేశ 3 ఉపపత్తేః చ 4ఏవం॥

తా॥ (1) పృథివి, శరీరము, హృదయము, మొదలగు భూతములు పాదములుగా "సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ' యను శృతి (2) చెప్పుటచేత (3) బ్రిహ్మమే గాని కేవల ఛందస్సునకు భూతాదులు పాదములు కాజాలవు.

అవ॥ బ్రిహ్మమును గాయత్రిపదముచేత చెప్పినను జ్యోతిశ్శబ్దముచేత చెప్పతగదు మూడుపాదములు ద్యులోకమందున్నవనుటచేత ద్యులోకము బ్రిహ్మమునకు ఆధారముగాను, ద్యులోకమునకు పైనున్న జ్యోతి అని ద్యులోకము హద్దుగాను చెప్పుటచేత భేదముకలదు. బ్రిహ్మమును పూర్వవాక్యము చెప్పినను ఉత్తరవాక్యము చెప్పలేదని పూర్వపక్షమురాగా—

27 ఉపదేశభేదాన్నేతిచేన్నోభయస్మిన్నప్యవిరోధాత్ ।

పద॥ 1 ఉపదేశభేదాత్ 2 న 3 ఇతిచేత్ 4 న 5 ఉభయస్మిన్ 6 అపి 7 అవిరోధాత్ ।

తా॥ (1) దివి, దివ యను సప్తమీ పంచమీ విభక్తిభే

దమువలన జ్యోతిర్వాక్యమంను బ్రహ్మజ్ఞానము (2-3) కలుగదంను వేని (4) అట్లుకాదు. (5) రెండువిధములయందును (7) విరోధములేనందువలన దోషమునులేదు. జ్యోతిశ్శబ్దము బ్రహ్మపరమే.

1 అ. 2 పాదము.

2. సూ. "వివక్షిత గుణోపపత్తేశ్చ"

పద॥ 1 వివక్షితాః 2 గుణాః 3 ఉపపత్తేః చ॥

తా॥ (1-2) ఉపాసనార్థము సత్యసంకల్పాదిగుణములకర్హ్మడగుటవలన మనోమయత్వాదిగుణములు బ్రహ్మమునకు (3) తగును.

1 శ్వే. 4-3 "త్వం స్త్రీ త్వం పుమానిత్యాది"

తా॥ బ్రహ్మమును నీవే స్త్రీవి నీవే పురుషుడవులని చెప్పెను

1 అ. 4 పా. 9 సూ.

"జ్యోతిరుపక్రమాత్ తథా హ్యధీయత ఏకే"

తా॥ తేజోన్నజలములు మొదలగు జరాయుజాది జంతుసముదాయమునకు ప్రకృతియను పేరు కలదు. ఆవస్తువునకే అజ యను పేరు. అది భూతత్రియలక్షణయగు అవాంతర ప్రకృతి. గాని సాంఖ్యులుచెప్పెడి సత్వరజస్తమో గుణత్రియ లక్షణ ప్రకృతి కాదు. ఏలయనగా- సామశాఖవారు తేజోబన్నములకు పరమాత్మవలన నుత్పత్తినిచెప్పి వానికే 1 శ్రుతి చేత రోహితాదిరూపములను చెప్పుటవలన నది భూతత్రియ లక్షణావాంతరప్రకృతియనబడును. 1-2-3 శ్రుతులు పరమేశ్వరికి జగత్సృష్టిశక్తి కలదనియు, 4-5 శ్రుతులు మాయావే

అనియు చెప్పుటవలన ప్రధానమనెడి ప్రకృతియే అజామంత్ర వాచ్యమనతగదు. పరమేశ్వరశక్తియేఅని చెప్పవలయును.

1 ఛాం. 6-4-1 "యదగ్నేరోహితగ్ంరూపం తేజసస్త ద్రూపం యచ్ఛుక్లం తదపాం యత్కృష్ణం తదన్నస్య"

2 శ్వే. 1-1 "బ్రహ్మవాదినో వదంతి కింకారణం బ్రహ్మ" యని యుపక్రమించి-

3 శ్వే. 1-1-3 "తే ధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాం"

4 శ్వే. 4-10 "మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం"

5 శ్వే. 4-11 "యో యోనిం యోనిమధితిష్ఠత్యేక"

తా॥ (1) జలభూములతో కలపబడిన అగ్నియొక్కరూపము ఎఱుపు. జలముయొక్కరూపము తెలుపు. భూమియొక్క రూపము నలుపు. (2) వేదవేత్తలు సృష్ట్యాదియందు బ్రహ్మము దేనిసహాయముతో సృజించునని శంకించి (3) ధ్యానించి సత్త్వాదిగుణాత్మక మాయాశక్తిసహాయముతోనని తెలిసికొనిరి (4) మాయాశక్తిని ప్రకృతిగాను, అధిష్టాత పరమేశ్వరుడుగాను తెలియుము. (5) జీవోపాధులందు మాయాంశములను ప్రేరేపించు ఈశ్వరుని తెలిసినవాడు సంసారశాంతినిపొందును

8 అధికరణము. 2 అ. 1 పా.

24 సూ. "ఉపసంహారదర్శనాన్నేతి క్షీరవద్ధి"

తా॥ క్షీరము దధియగునట్లే బ్రహ్మము శక్తివలన జగద్రూపపరిణామమగును.

1 శ్వే. 6-8 "నతస్య కార్యం కరణంచ విద్యతే నతత్స మశ్చాభ్యధికశ్చ దృశ్యతే। పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బలక్రియాచ"

టీసితా॥ గౌడపాద 3 సూత్రముక్రింద కలదు.

25 సూ. "దేవాదివదపి లోకే" 8 అధి.

తా॥ శ్రీరము బాహ్యసాధనము లేక యే దధియగును. కుమ్మరి మొదలగువారు బాహ్యసాధనములతో ఘటాదులను చేయుదురు. బ్రహ్మము బాహ్యసాధనసామగ్రిలేనిదే యట్లు చేయగలడందు వేని (దేవాదివత్) దేవాదులువలెనే (లోక. లోకమునందు మంత్రార్థవాద ఇతిహాస పురాణాదులందును (అపి) వృద్ధవ్యవహారమందును, దేవతలు, పితరులు, ఋషులు మొదలగువారు బాహ్యసాధనములు లేకుండ సంకల్పమాత్రముచేత నానావిధశరీరములను, ప్రాసాదాదులును, రథాదులును నిర్మించునట్లు బ్రహ్మము తనసంకల్పముచేతనే జగత్సృష్టిని చేయును.

9 కృత్స్నప్రసక్త్యధికరణము॥

అవ॥ సహాయములేనిదే పాలు పెరుగు అయినట్లు బ్రహ్మము జగత్కారణము కావచ్చుననుటచేత పరిణామియని పూర్వపక్షము.

26 సూ. కృత్స్నప్రసక్తిర్నిరవయత్వశబ్దకోపో వా॥

తా॥ బ్రహ్మము జగత్కారణమును నడల (కృత్స్నప్రసక్తిః- అవయవములు లేని బ్రహ్మమునకు పృథివ్యాదులు అవయవములు కానలయును. లేక (నిరవయత్వశబ్దకోపోవా) బ్రహ్మ

మునకు అవయవములు లేవని చెప్పు శ్రుతులకు విరోధమును నిత్యత్వమునకు భంగమును కలుగవలయును. గనుక బ్రహ్మము జగత్కారణమనుట సరికాదు అని పూర్వపక్షము.

శ్రుతులు—

1 శ్వే. 6-19 'నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం'

2 ముం. 2-1-2 'దివ్యో హ్యమూర్తః పురుష స్సబాహ్యాభ్యంతరో హ్యజః'

3 బృ. 4-4-12 'ఇదం మహద్భూత మనంత మపారం విజ్ఞానఘనవేవ'

4 బృ. 5-9-26 'సఏష నేతి నేత్యాత్మా గృహ్యః అస్థూలమనణు'

తా॥ బ్రహ్మమునకు అవయవములు, క్రియలు, రాగద్వేషాదులు, దోషములు, తమస్సు, ఆకారములు లేవు. అంతము లేదు.

2 అధ్యాయము 1 పాదము.

27 సూ. శ్రుతేస్తు శబ్దమూలత్వాత్ ।

26 సూత్రముచేత రాబడిన పూర్వపక్షమును ఖండించుచున్నారు.

తా॥ పరబ్రహ్మముయొక్క స్వరూపస్వభావములు తెలిసికొనుటకు వేదమే ప్రమాణమగుటవలన శ్రుతులు చెప్పినట్లు ఒప్పుకొనవలయును.

1 సేయం దేవతైక్షత హంతాహమిమా స్తిస్రో దేవతా అనేన జీవేనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి।

2 ఛాం. 3-12-6 'ఏతావానస్య మహిమా తతోజ్యాయాగ్ంశ్చ పురుషః। పాదోస్య సర్వాభూతాని త్రిపాదస్యామృతం దివి'

అను నీశ్రుతులు జగత్తు బ్రహ్మమువలన పుట్టినదనియు, బ్రహ్మము మాయాతత్కార్యములకంటె వేఱనియు బోధించుచున్నవి. గనుక బ్రహ్మము వివర్తోపాదానమని సిద్ధాంతము.

2 అ. 1 పా. 30 సూ. 'సర్వోపేతాచ తద్దర్శనాత్'

తా॥ పరయగు దేవత సర్వశక్తులు కలదని శ్రుతులు చెప్పుచున్నవి.

1 ఛాం. 3-14-4 'సర్వకర్మా సర్వకామ స్సర్వగంధ సర్వరస స్సర్వమిదమభ్యాత్తో౽వాక్యనాదరః'

అభ్యాత్తః= అభితోవ్యాప్తః। అవాకీ= వాగింద్రియశూన్యః। అనాదరః=నిష్కామః॥

తా॥ సర్వవ్యాపియగు పరమేశ్వరుడు సుఖకరమగు గంధరసములు కలిగి దోషకామ్యేంద్రియాసక్తి లేనివాడై జగత్తును పుట్టించును.

31 సూ. 'వికరణత్వాన్నేతిచేత్తదుక్తం'

తా॥ పరదేవత సర్వశక్తులు కలదైనను దేహేంద్రియాదులు లేనందున కార్యమును చేయలేదనియందు వేని చేయగలదని శ్రుతులే చెప్పుచున్నవి.

1 బృ. 5-8-8 'అచక్షుష్క మశ్రోత్ర మవాగమనా'
2 శ్వే. 3-19 'అపాణిపాదోజవనోగ్రహీతా పశ్యత్య
చక్షుస్సశృణోత్యకర్ణ'

తా॥ (1) ఓగార్గి ఆయక్షరము ఇంద్రియములును, అంతః కరణములును లేనిది. (2) పరమేశ్వరుడు కాళ్లులేకున్నను త్వరగాపోవువాడును, చేతులు లేకున్నను పట్టుకొనువాడును, కన్నులు చెవులు లేకున్నను చూచువాడును వినువాడును.

37 సూ. 'సర్వధర్మోపపత్తేశ్చ'

తా॥ సర్వజ్ఞ, సర్వశక్తి, మహామాయాది సర్వధర్మములును గల ప్రకృతి బ్రహ్మమునందేయుండును. గనుక ఈ రెండింటికిని నిస్సంశయముగ భేదములేదు.

దేవీపురాణము.

గాయనాద్గమనాద్వాపి గాయత్రీ త్రిదశాశ్రితా ।

తా॥ గానమువలనను లేక నృత్యమువలనను దేవతలవలన ధ్యానింపబడుచు రక్షించునది గనుక గాయత్రి యనబడును.

ఛాందోగ్యము- 'గాయతిచ త్రాయతేచేతి'

తా॥ మననముచేయువారిని రక్షించునదిగనుక గాయత్రి యనబడును.

మహావాసిష్ఠరామాయణము.

'గాయత్రీ గాయనాత్మత్వాత్'

తా॥ గానముచేత తెలిసికొనబడునది గనుక గాయత్రి యనబడును.

చిచ్ఛక్తియే ఆత్మస్వరూపమనుట.

శ్రీగౌడపాదసూత్రములు.

3 సూ. 'చైతన్యస్వరూపా చిచ్ఛక్తిః'

శ్రీవిద్యారణ్యభాష్యం॥ చైతన్యస్య బ్రహ్మణః స్వరూపా చిత్ శక్తిస్సామర్థ్యం। 'సైషానందస్య మీమాగ్ంసాభవతి' ఆనందస్య బ్రహ్మణః సైషా స్వరూపా చిత్ మీమాగ్ంసా తేజోమయస్వరూపత్వేన శక్తిత్వేన విచారితా భవతీతి వాక్యస్యాభిప్రాయః।

శైవశాక్తపురాణేషు వేదేషు వేదాంతేషుచ చిదేవ శక్తిరితి గృహ్యతే।

శ్వే. 6-8 'నతస్య కార్యం కరణంచ విద్యతే నతత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే। పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ।' శక్తిరిత్యభిన్నత్వే నసందేహః

తా॥ శుద్ధబ్రహ్మస్వరూపమే చిత్తు. శక్తియనగ సామర్థ్యము. ఆచిత్తు ప్రకాశరూపముతోను, శక్తిరూపముతోను ఉన్నదని 'సైషానందస్య=' శ్రుతి చెప్పుచున్నది.

అద్వితీయబ్రహ్మము మాయయందు ప్రతిబింబించుట వలన ఈశ్వరసంజ్ఞనుబొందినట్లు బింబప్రతిబింబభావముచేత చిత్తే శక్తియనదగును. పురాణములు, వేదములు, వేదాంతములు నిట్లే బోధించుచున్నవి. చంద్రచంద్రికలకువలె బ్రహ్మమునకును శక్తికిని భేదములేదు. ఈయంశము సవిస్తరముగా నాచేతప్రకటింపబడిన శివశక్త్యైక్యదర్పణము 15 ప్రకరణమునందుకలదు.

4 సూ. 'సైవేయం అనామాఖ్యా శ్రీవిద్యేతి'

వి॥ భా॥ సా తేజఃపుంజాకృతి శ్శక్తిరేవ అనామాఖ్యా శ్రీవిద్యా। 'ఇయమేవ సాయా ప్రథమా వ్యాచ్ఛదంతరస్యాం చరతి ప్రవిష్టా' ఇతిశ్రుతేః॥ అస్యార్థః। యా ఇయం ఇయమేవ చిత్ సా అనామాఖ్యా ప్రథమా విద్యా వ్యాచ్ఛన్। స్వచ్ఛా నిర్మలా। ఏతావతా మాయా తత్కార్యసంబంధరహితా। అంతరస్యాం ప్రవిష్టాసతీ చరతి। ఏతావతైవ అనామాఖ్యవిద్యాయా అపరిచ్ఛిన్నత్వం సర్వకారణత్వముక్తం॥

తా॥ తేజఃపుంజరూపమగు చిచ్ఛక్తియే అనామాఖ్య (నిర్గుణ) యను శ్రీవిద్య. ఈశక్తియే చిత్తు. ఇదిమొదటివిద్య నిర్మలమయినది. మాయతోను మాయాకార్యములతోను సంబంధములేనిదై అంతరమందు ప్రవేశించి ప్రకాశించుచున్నది అని 'ఇయమేవ సా' యను శ్రుతి చెప్పుచున్నది.

గౌడపాదసూత్రం.

'కైవల్యం స్వరూపప్రతిష్ఠా చితిశక్తేః'

తా. చిచ్ఛక్తి కేవలమోక్షస్వరూపము.

త్ర్యక్షరీ శుద్ధవిద్యా కుమారీచ।

తా॥ మూడుఅక్షరములుగలది శుద్ధవిద్యయు, బాలాత్రిపురసుందరీబ్రహ్మవిద్యయును.

బృహదారణ్యము

తదేతత్త్ర్యక్షరం హృదయమితి తదేతత్త్ర్యక్షరం సత్యమితిచ।

తా. ఆమూడక్షరముగలవిద్య హృదయరూపము, సత్యరూపమును.

## ఈశ్వరప్రత్యభిజ్ఞసూత్రములు

1 సూ. చితిస్స్వతంత్రా విశ్వసిద్ధిహేతుః॥

తా॥ చిచ్ఛక్తి యితరాపేక్షలేకయే సకలప్రపంచముయొక్క సృష్ట్యాదులను చేయుచుండును.

13 సూ. చిద్వహ్ని రవరోహపదే చ్ఛన్నోఽపి చిన్మాత్రయా మేయేంధనం ప్లుష్యతి॥

తా॥ భస్మముచేత అగ్నివలెనే జీవులయందు అజ్ఞానముచేత కప్పబడిన చిదగ్ని సూక్ష్మరూపముతోనుండి జ్ఞానవిమర్శముచేత క్రమముగ సుఖదుఃఖాదులను నశింపచేయుచు ఆత్మసాక్షాత్కారము చేయుచున్నది. సుషుప్త్యవస్థలోనున్నట్లే జాగ్రదాదిఅవస్థలోకూడా వృత్తులులేకుండుటయే చిద్రూపావస్థ.

14 సూ. బలలాభే విశ్వమాత్మసాత్కరోతి॥

తా॥ వృద్ధిపొందిన అగ్ని కట్టెలనువలెనే చిదగ్నివృద్ధిపొంది మాయాకార్యములను దహించును. ప్రపంచము చిద్రూపమని ఒకానొకప్పుడు స్ఫురించినను అనంతరము తాను చిద్రూపుడనని చేయు నిరంతరాభ్యాసమువలన అన్నిఅవస్థలయందును చిద్రూపసిద్ధికలుగును. ఇట్లే ఈశ్వరసిద్ధాంతము.

15 సూ. చిదానందలాభే దేహప్రాణాదిష్వవభాసమానేష్వపి చిదైకాత్మ్యప్రతిపత్తిదార్ఢ్యం జీవన్ముక్తిః॥

తా॥ చిద్రూపసిద్ధికలిగినవానికి మరల దేహప్రాణాదులు స్ఫురించినను జగత్తు కల్పితమనెడి జ్ఞానముచేత నేకాగ్రవృత్తితో సర్వదా చిద్రూపమును చూచుటవలన నిస్సంశయముగ జీవన్ముక్తుడగును.

16 సూ. మధ్యమవికాసాచ్చిదానందలాభః ॥

తా॥ మధ్యమయనెడి సుషుమ్నానాడియొక్క వికాసము వలన చిద్రూపసిద్ధికలుగును. చిచ్ఛక్తి మాయాదశయందు జగత్తునందలి ఉత్తమాధమ, దేవాదిజీవులయందు తనయొక్క చిద్రూపమును సూక్ష్మముగచేసి వానిని విడువకయుండును. మోదుగఆకునకుగల రేఖలలో నడిమిరేఖకంటె దానిననుసరించిన తక్కినరేఖలు వేఱుకానట్లు జగత్తునకాధారమయి సమస్తజీవులయొక్క హృత్పద్మమందు సూక్ష్మరూపముగనున్న చిచ్ఛక్తికంటె ప్రపంచము వేఱుకాదు.

చిద్రూపసిద్ధికి ఉపాయములు.

I సుషుమ్నానాడీరూప విమర్శముచేత వికల్పములు నశించును.

II వది ప్రాణాయామము, భైరవాదిముద్రలు, స్వస్తికా ద్యాసనములు మొదలగునవి.

వీనిలో స్వస్తికాసనవిమర్శనముచేత బాహ్యచిత్తవృత్తులు శాంతించి దేహాదులయందుగల పుర్యష్టకమునకుచిత్సంబంధము దృఢమగును. వీనికి ప్రమాణములు.

I ఏకాగ్రతచేత వికల్పములు నశించి ఈశ్వరతత్వము స్ఫురించునని ఈశ్వరప్రత్యభిజ్ఞయందును,

II చిత్తవృత్తులన్నియు నశించుటయే ముక్తియని స్పందశాస్త్రమునందును,

III ఓపరమేశ్వరీ సమస్తవికల్పములను విడిచి ముక్తిసాధనములననుసరించిన నీభక్తులు మోక్షమునుఅవు

వేపొందుదురని విజ్ఞానగర్భస్తోత్రిమందును,

IV ఇళ్లే ఈశ్వరసిద్ధాంతమందును,

V బ్రిహ్మముయొక్క ధ్యానమువలననే మోక్షముకలుగునని 'ప్రిత్యగాత్మానమైక్షత తదావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్' అనెడి శృతియందును, చెప్పబడినవి.

వి॥ భైరవముద్రియనగా- "అంతర్లక్ష్యం బహిర్దృష్టిః నిమేషోన్మేషవర్జితః"

తా॥ లోపలకు లక్ష్యమున్ను, వెలుపలకు దృష్టియున్ను, కలిగి ఉచ్ఛ్వాస నిశ్వాసలులేకుండ నుండుటయే భైరవముద్ర యనబడును.

ఏకాగ్రితచేత బాహ్యవృత్తులయందు మనస్సును పోకుండచేయుట ముఖ్యోపాయము,

వి॥ మిగిలిన శక్తిసూత్రిములన్నియు భాష్యముతో శివశక్త్యైక్యదర్పణమునందు కలదు.

షోడశీభాష్యం.

హేదేవి త్వాంవినా లోకె మాంభజంతో విచేతనాః।
నార్హంతి మమ సాయుజ్యం బ్రిహ్మకల్పశతైరపీతి భాష్యోక్తస్మృతేః ।

తా॥ ఓదేవీ! నిన్నువిడిచి కేవలము నన్ను భజించినవారు నూరు బ్రిహ్మకల్పములయినను నాసాయుజ్యమును పొందలేరు.

శబ్దాదేవార్థోనుసంధేయః। అతఏవ "యథా హంసో, నాదె, లీనో భవతి। తత్తురీయాతీత మిత్యాది శృతేశ్చ"

నాదానుసంధానద్వారా బ్రహ్మానుసందధతి యోగినః॥

తా॥ శబ్దమువలననే అర్థముగ్రహింపబడును. హంసయనెడి పరమాత్మ నాదమందు లీనమగుటయే తురీయాతీతము.

షోడశీభాష్యే- ఇత్థం నిరూపితశబ్దార్థయో రాద్యాశక్తిరంత్యశ్శివః సంబంధశ్చానయోరవినాభావః। తదుక్తంభాష్యే శబ్దస్య శక్తిరూపత్వాదర్థస్య శివరూపతః। అవినాభావసంబంధశ్శివశక్త్యోరితి స్మృతఇతి॥

తా॥ మొదటిదగు శబ్దము శక్తిస్వరూపము. రెండవదగు అర్థము శివస్వరూపము. కనుక శబ్దార్థములకు భేదములేనట్లే శివశక్తులకును భేదములేదు.

చిచ్ఛక్తిర్జీవరూపోఽయం కామరాజేన కథ్యతే।
నాదో వాగ్భవబీజేన సర్గేణ మహదుచ్యతే॥
ఔకారేణ తథా వ్యక్తం బిందునా శబలం స్మృతం।
సకారేణ పరంబ్రహ్మ అభేదోఽయం సమీరితః॥

శ్రీసచ్చిదానందయోగికృత వ్యా॥ చిచ్చ సా శక్తిశ్చ చిచ్ఛక్తిః। అథవా చితం పరిణామినం కర్తుంశక్నోతి సమర్థా భవతీతివా చిచ్ఛక్తిః। అథవా-చితిశక్తిర్నిరుద్ధో అవినాభావ సంబంధేన స్థిరావా-చితం జీవం శం సుఖం ఆనందస్వరూపిణం కరోతీతివా చిచ్ఛక్తిః। 'చిచ్ఛక్తిర్జీవలోకేస్మిన్ జీవ ఇత్యభిధీయతే' ఇతి అధ్యాత్మరామాయణాత్॥

తా॥ గురు, మంత్రి, దేవతలకును, తనకును అభేదమును చెప్పుచున్నాడు. చిచ్ఛక్తి అనగా చిదాకారమైన శక్తిఅనియు లేక ఆత్మను జగదాకారముగచేయు సమర్థతకలదనియు లేక

చిదాత్మయందలి శక్తి చంద్రిచంద్రికలవలె పరస్పరము విడు వకనుండునది అనియు, (లేక చిత్-శక్తి=) చిచ్ఛక్తి ఉపాసకు నకు ఆనందమును కలిగించునది అనియు అర్థము.

చిచ్ఛక్తియే జీవలోకమునందు జీవుడుగా పరిణమించె నని అధ్యాత్మరామాయణమునందు చెప్పబడినది.

వ్యా॥ జీవరూపః- జీవత్వాభిమానః అయం దృశ్యమాన శరీరనివిష్టః కామరాజేన మంత్రిమధ్యవర్త్యగ్నీషోమాత్మకః మి శ్రిబీజేన కథ్యతే। ఉచ్యతే। (నాదో వాగ్భవబీజేన=నాదః అవ్యక్తధ్వనిలక్షణః। వాగ్భవబీజేన-ఐంకారేణ।) (సర్గేణ= విసర్గద్వయేన। మహత్=మహత్తత్వం। ఉచ్యతే। (ఔకా రేణ=సకారాత్పరవర్తినా అవ్యక్తం విలీన సత్వరజస్తమోగు ణాత్మక పరిచ్ఛిన్నకారణబిందురూప ఘనీభూత పారిభాషిక విమర్శాపరపర్యాయ మాయాప్రతిబింబితం చైతన్యం। తథా ఉచ్యతఇతి పూర్వేణాన్వయః। బిందునా=అజ్వలిప్త సకారస్య బిందుత్రియాత్మక శ్వేన అకారాత్మక తృతీయబిందునా శబలం అంతర్లీనవిమర్శకం చైతన్యం। స్వాత్మసాక్షాత్కృతాఖిలప్రపంచ కమిత్యర్థః। స్మృతం ఉచ్యతే। సకారేణ బిందుద్వయాత్మక సకారేణ పరబ్రహ్మ నిశ్చలతరంగవద్వ్యావృత్తిశూన్యం అంతర్లీన మాయికం సచ్చిదానందాత్మకం బ్రహ్మ లక్ష్యతఇతి శేషః। సకారేణ పరంబ్రహ్మేతి వాక్యే కథ్యత ఇత్యాది శబ్దాభావాత్ 'యతో వాచో నివర్తంతే' ఇత్యాది శ్రుతిశ్చ। అభేదోయం సమీరితః పంచదర్శనానాం ఏవంరూపేణేత్యర్థః। అతః అంగ త్వం సిద్ధం।

తా॥ చిచ్ఛక్తియే శరీరములయందు జీవత్వాభిమానము తోనున్నట్లు బాలాత్రిపురసుందరీమంత్రమునందలి మధ్యబీజమై అగ్నీషోమాత్మక (అగ్నిచంద్రులమిశ్రిమ) బీజమగు క్లీం కారముచేతను, నాదమనగా- వ్యక్తముకాని ధ్వనిలక్షణము వాగ్భవబీజమగు ఐంకారముచేతను, సర్గ అనగా సౌః యందలి సకార ఔకార విసర్గలలో విసర్గయనెడి రెండుబిందువులచేత మహత్తత్వముగాను, ఔకారముచేత లీనమై అణిగియున్న సత్వరజస్తమోగుణాత్మకమై కారణబిందురూపముగ ఘనీభవించి మాయారూపములో జగద్రూపముగా ప్రతిబింబించిన చైతన్యముగాను, మూడుబిందువులస్వరూపమైన సకారము లోని అచ్చు అనెడి అకారబిందువుచేత సూక్ష్మమును బొందిన విమర్శమనెడి చైతన్యముతో నఖిలప్రపంచమును వ్యాపించిన మాయావిశిష్టబ్రహ్మముగాను, మిగిలిన హల్లుఅనెడి రెండు బిందువులచేత తరంగములులేని సముద్రమువలె వృత్తులులేని సచ్చిదానందపరబ్రహ్మముగాను, చెప్పబడుచున్నది, 'యతో వాచో నివర్తంతే' ఇత్యాది శ్రుతులు బ్రహ్మమును చెప్పలేకపోయెననుటచేతను, సకారేణ పరబ్రహ్మమను వాక్యములో కథ్యతే అనుపదము లేకపోవుటచేతను, విసర్గ (బిందుద్వయాత్మక) సకారముచేత పరబ్రహ్మము తోచునని లక్ష్యపదమున కర్థము. కనుక బ్రహ్మమునకును, జగత్తునకును అభేదము సిద్ధించినది. ఇట్లే మిగిలిన పంచదర్శనమంత్రములకును తాత్పర్యము. కనుక అంగత్వము సిద్ధించినది. ఇది శాక్తదర్శనము.

గాయత్రిమొదలగు శ్రీవిద్య పరబ్రహ్మమనుట.

షోడశీమంత్రబీజోద్ధారభాష్యే।

త్రిభ్యఏవతు పాదేభ్య స్త్రిఖండా సమపద్యత।
త్రిభ్యఏవతు ఖండేభ్య స్త్రిబీజా సమపద్యత।
త్రిభ్యఏవతు బీజేభ్య స్త్ర్యక్షరః ప్రణవోభవత్।
ప్రణవస్యాక్షరత్రో బిందుత్రయీ కామకలాభవత్॥
స్వాంతర్లీనకలామిశ్రో వష్టభ్య మహదాదికం।
సృజతీదం సంహరతి స్వస్వరూపేణ తిష్ఠతీత్యాహుః॥

తా॥ గాయత్రియొక్క- మూడుపాదములనుండి, పంచదశీ మహామంత్రముయొక్క- మూడుఖండములును, దానినుండి బాలామంత్రముయొక్క- మూడుబీజములును, దానినుండి ప్రణవమును, దానినుండి మూడుబిందువులుగల కామకళయనెడి ఈకారమును కలిగెను. అంతర్లీనమైన కళలతోకూడిన పరమాత్మ మహత్తత్వము మొదలగువాని సృష్టిస్థితిలయములను చేయుచున్నాడు.

నాగరలిపియందు ఈకారము మూడుబిందువులనుసూచనచేయుచున్నది.

ఏకవింశతిసాహస్ర షట్ఛతశ్వాససంఖ్యయా।
సోహమిత్యుచ్చరత్యాత్మ మంత్రః ప్రత్యహమాయుషే।
సకారంచ హకారంచ లోపయిత్వా ప్రయోజయేత్।
సంధిర్వై పూర్వరూపాఖ్యం తతోసౌ ప్రణవోభవతీత్యాది

తా॥ 21600 శ్వాసలచేత సోహం అనెడి ఆత్మమంత్రమును ప్రతిదినమందును జపించవలయును. సోహం అనుబీజములలో సకారహకారములు తీసివేయగా ఓంకారమే మిగులును.

వేదాత్మనో మస్తకీభూత యజుస్సంహితోపనిషన్మహావాక్యం। 'యోసావసౌ పురుషస్సోహమస్మీతి' తత్రసోహమిత్యాత్మమంత్రః తతఉద్ధృతస్య సర్వమూలత్వం యుక్తమిత్యాశయః।

తా॥ ప్రకాశస్వరూపమైన పరమాత్మ సోహం అని చెప్పబడుచున్నది. ఆపరమాత్మయే నేను. సోహం అనునది ఆత్మమంత్రము. ఇది సమస్తమునకు బీజము.

పరశురామునితో దత్తాత్రేయులు చెప్పిన
త్రిపురారహస్యం జ్ఞానఖండం.
7 అధ్యాయము.

ఈశ్వరోహి జగజ్జాలప్రలయోత్పాదకృద్భవేత్ ।
సవిష్ణుః సశివో ధాతా ససూర్యః సోమఏవచ ॥ 77 ॥
సఏవ సర్వథా సర్వైః సర్వైరపి నిరూపితః ।
నశివో నాపి విష్ణుర్వా నధాతా నాన్యఏవచ ॥ 78 ॥

తా॥ జగత్సృష్టి స్థితి లయములకు అంతర్యామియగు పరమేశ్వరుడే కర్త. అయినను అట్టివాడు విష్ణువని, శివుడని, సూర్యుడు, చంద్రుడు, బ్రహ్మ మొదలగువారని ఆయామతస్థులు చేత కల్పింపబడిన నామములుకాని అవి వాస్తవముకావు.

భగవాంస్తు జగత్కర్తా పూర్ణస్వాతంత్ర్యయోగతః ।
అనపేక్ష్యైవ యత్కించి త్సృజత్యవికలం జగత్ ॥ 84 ॥

తా॥ పరమేశ్వరుడు తనపూర్ణస్వాతంత్ర్యశక్తివలన నితరాపేక్షలేకుండ జగత్సృష్ట్యాదులను చేయుచున్నాడు.

మోహాదేవ సముద్భూతో మోహకోపి మహేశ్వరః।
మోహి సర్వజగత్కర్తా తస్మాత్సర్వేపి మోహితాః॥25

తస్మాదారాధయేదాఢా మహేశం విశ్వకారణం।
భక్త్యా ససాధయేదాశు యోగాన్మోహవినాశనాన్॥ 33॥

తా॥ పరమేశ్వరుడు కలిగించిన మోహముచేత నందరును కాంతాశనకాదులయందు మోహితులైరి. భక్తిచేత పరమేశ్వరుని నారాధించువారికి ఆ మోహము తప్పక నశించును.

పరమేశో దయాసింధుః కృతజ్ఞః సువ్యవస్థితః।
అన్యథానాది సంసారే కుతోఽనింద్యత్వమాప్నుయాత్॥

తా॥ పరమేశ్వరుడు దయాసముద్రుడును, కృతజ్ఞుడును, భక్తులయెడ దయగలవాడును. అట్లుకాడేని అనాదియగు సంసారమునందీశ్వరుని భయభక్తులతో నెవరును పూజింపరు.

ప్రారబ్ధం నియతిర్వాపి మహేశవిముఖే భవేత్।
ఏతిన్నకండుతనమేత్యంత మీశ్వరతత్పరె॥ 60॥
సర్వైర్విజ్ఞాతం మహేశస్య నియత్యారబ్ధలంఘనం।

తా॥ ప్రారబ్ధమును, నియతి (నొసటివ్రాత) యును, ఈశ్వరభక్తులకే మారునుగాని యితరులకుమారదు. దీనికి మార్కండేయులే నిదర్శనము.

నియతిః స్యాదీశశక్తిః సంకల్పైకస్వరూపిణీ।
సత్యసంకల్పవేశో నుల్లంఘ్యా హ్యతఏవ సా॥ 65॥

తా॥ నియతియను శక్తియే ఈశ్వరునియొక్క సత్యసంకల్పస్వరూపము కనుక పరమేశ్వరభక్తి లేనివారు నొసటివ్రాత నతిక్రమింపలేరు.

భక్తియుక్తాశ్చ త్వైర్థ్యాత్తో యతియతి యథాయథా ।
తథా ధత్తే౽నేకరూపం భక్తచింతామణిస్స్వయం ।
అతశ్చేతనప్రవేశ స్తద్దేహః స్యాచ్చితిఃపరా ॥ 90 ॥
చితి రేవ మహాసత్తా సామ్రాజ్ఞీ పరమేశ్వరీ ।
త్రిపురా భాసతే యస్యా మవిభిన్నం విభిన్నవత్ ॥ 91 ॥
ఆదర్శనగరప్రఖ్యం జగదేతచ్చరాచరం ।
తద్రూపైకత్వత స్తత్ర నోత్తమాధమభావనా ॥ 92 ॥
అపరేతు స్వరూపేహి కల్పితా ముఖ్యతా నహి ।
తస్మాత్ప్రాజ్ఞ ఉపాసీత పరంరూపం హి నిష్కలం ॥ 93 ॥
అసమర్థః స్థూలరూపం యచ్ఛ్రద్ధా సంగతం దృఢం ।
తదుపాస్యా౽హేతుతస్తు శ్రేయః ప్రాప్నోత్యనుత్తమం ॥94
నాన్యథాస్యగతిః క్వాపి భవేద్వై కోటిజన్మభిః ।

తా॥ పరమేశ్వరుడు ఏదేవతనారాధించిన భక్తునకు ఆదేవతారూపమునకోరికలనిచ్చును. అతని దేహము చిత్స్వరూపము ఆచిత్తు త్రిపురాపరమేశ్వరిగా భాసించుచున్నది. ఈచరాచర జగత్తు అద్దమునందు ప్రతిబింబములవలె చిత్తుయొక్క ప్రతిబింబముగనున్నది. చిత్తు ఏకరూపమయినను జగద్రూపముచేత ననేకరూపములుగభాసించుచున్నది. సగుణరూపము కల్పితము కనుక నిష్కలంకమగు చిద్రూపమునే సేవింపుము. అట్టిసమర్థతలేనపుడు సగుణరూపముగ దేవతనారాధించుము. సోపానమువంటి దీనిచేత నుత్తమశ్రేయస్సు కలుగును. అట్లుకూడ చేయనిదే కోటిజన్మములకైన నుత్తమగతి కలుగదు. అని హేమలేఖ తనభర్తతో చెప్పెను.

త్రి॥ ర॥ జ్ఞా॥ 9 అధ్యాయము.

త్రిపురా పరమేశానీ ప్రసాదమకరోద్ధృది ।
విషయాద్వ్యసుఖాం చిత్తం విచార పరమం బభౌ ॥ 4 ॥
ఏతావద్దుర్లభం లోకె పరానుగ్రహమంతరా ।
విచార ప్రవణం చిత్తం యన్ముఖ్యం మోక్షకారణం ॥ 5 ॥
రామ యావన్నజాయేత విచార పరమం మనః ।
న తావచ్ఛ్రేయసాం యోగఉపాయానాం శతైఃక్వచిత్ ॥
స్వరూపం స్వాత్మనా పశ్య శుద్ధబుద్ధిసమాశ్రయం ।
దేవాది తిర్యగంతానాం భాంతం భానైరభాసితం । 8 ॥
భాంతం సర్వత్ర సర్వస్య సర్వదా మానవర్జితం । 9 ॥

తా॥ పరాశక్తియొక్క అనుగ్రహములేనిదే చిద్రూపవిమర్శ ముకలుగదు. అట్టివిమర్శములేనిదే ఇతరోపాయముల చేత మోక్షముకలుగదు. దేవతలు మొదలు తిర్యగ్జంతువులవరకునుగల సమస్తమును ప్రకాశింపచేయునది చిద్రూపమే. అన్యముచేత ప్రకాశింపనేరదు. అట్టిచిద్రూపమును శుద్ధబుద్ధితో చూడుము.

అహోబాద్యయావదాత్మాన మవిదిత్వైవ వైకృతం ।
వ్యర్థం స్వప్నె కృతమివ తదద్య విమృశామి తం । 27 ।
గృహధాన్యరాజ్యధనయోషిత్పశ్వాది కించన ।
నమే స్వరూపం భవతి త్వనహంతాశ్రయత్వతః । 28 ।
మనోబుద్ధిశ్చ నాహంస్యాం యతఏతన్మమేరితం ।
అతో దేహాది బుద్ధ్యంతాదన్యఏవ నసంశయః ॥ 34 ॥
అహం కదాచిన్నాస్మీతి భాసనాభావహేతుతః ।
సర్వదాహం భాసమానః స్థితఏవ నసంశయః । 35 ।

తా॥ ఆత్మస్వరూపముకొఅటకాని మిగిలిన అన్నివ్యాపారములును స్వప్నతుల్యములు. జాగ్రదాది సకలావస్థలయందును కనబడు వస్తువులన్నియు నశించునవియే కాని వానిశాకపోకలనుఅన్నిటిని చూచుచున్న తెలివిఅనెడి చిద్రూపమే నేను. గృహ, రాజ్య, ధన, ధాన్య, పశు, కళత్రాదులును, మనస్సు, బుద్ధి, మొదలగునవిన్నావియనియే కాని నేనేయని యెవరును తలపరు. అవిఅన్నియు నశించునవి వానియొక్కస్థితి నాశాది సకలావస్థలయందును నేను సాక్షినై చిద్రూపముగనున్నవాడనే

నిద్రాజాగన్మధ్యభాగే సంవిద్భేదాంతరే తథా ।
మధ్యే సంవిద్వేద్యయోశ్చ సూక్ష్మబుద్ధ్యాభిలక్షయ ॥94॥

తా॥ సుషుప్త్యవస్థకును, స్వప్న జాగ్రదవస్థలకును, మధ్యను భాసించునదియే చైతన్యమనెడి చిద్రూపము.

అంతఃకరణముకంటె వేఱుగనున్న స్థూలేంద్రియముల చేత బాహ్యవిషయములను గ్రహించుట జాగ్రదవస్థ.

మనస్సుతో నైక్యమును బొందినట్లున్న ఇంద్రియములచేత మానసపదార్థములను గ్రహించుట స్వప్నావస్థ.

ఇంద్రియసంబంధములేకుండ మనస్సు తనకు కారణమయిన ప్రకృతియందు లయమును పొందుట సుషుప్త్యవస్థ.

సుషుప్తియందు ఈప్రకృతి సత్త్వరజోగుణములను కప్పివేశి అధికతమోగుణముతో నుండుటచేత మేఘముక ప్పిన సూర్యునివలె ఆత్మస్వరూపము మందముగను, మూఢత్వముగ నున్నట్టుతోచును. కాని యెన్నడును సూర్యకాంతివలె ఆత్మతేజస్సు తగ్గదు. ఘటమును గోచరించు చైతన్యమున

కును, పటమును గోచరించు చైతన్యమునకును నడుమను నిరాకారచైతన్యము కలదు. జ్ఞానమునకును విషయవస్తువులకును మధ్యను నిర్విషయకజ్ఞానముండును. ఆజ్ఞానము బుద్ధితో నేకీభవించినపుడు అహంకారాత్మకదృష్టమై ఇంద్రియములగుండా దృశ్యజ్ఞానముతో నేకీభవించి అనేకవృత్తులతో నుండును.

చిద్రూపసిద్ధికలిగినపుడు జగద్వ్యాపారములవలన
భయదుఃఖములు కలగవు.

ఏతత్పదం నిజంరూపం యత్ప్రాప్య నవిముహ్యతి ।
ఏతదజ్ఞానమాత్రేణ ప్రవృత్తం జగదీదృశం ॥ 95 ॥

తా॥ జగత్తునందలి అన్నిటియొక్క నామరూపములనుతీసివేయగా మిగులునదియే ఆత్మరూపము. అదియే తానని దృఢజ్ఞానముకలిగినపుడు సంసారదుఃఖముకలుగదు. అట్టివానికిజగద్వ్యాపారములు కల్పితమని తోచి చిత్తరువునందలి పెద్దపులివలె భయమును కలిగింపవు. అట్టిశుద్ధచైతన్యప్రాప్తియే అభయస్థానము.

నాత్రరూపం రసోవాపి నగంధస్పర్శశబ్దనం ।
నదుఃఖం నసుఖంవాత్ర నగ్రాహ్యం గ్రాహకంచన ॥ 96 ॥
సర్వాశ్రయం సర్వరూపమపి సర్వవివర్జితం ।
ఏషసర్వేశ్వరో ధాతా విష్ణురీశః సదాశివః ॥ 97 ॥

తా॥ ప్రతిబింబములయొక్క అధిష్ఠానమగు అద్దము తెలియగా ప్రతిబింబములు మిథ్యయగునట్లే జగత్తునకు ఆత్మస్వరూపమధిష్ఠానమని తెలియగా జగత్తునందలి శబ్ద స్పర్శ రూప రస గంధాదులును, వీనినిగ్రహించెడి శ్రోత్ర త్వక్చక్షురాదు

లును, వీనివలనకలిగెడి సుఖదుఃఖములును మిథ్యయగును. కాని వాస్తవములు కావు. ఆభాసమాత్రముగనుండును. శుద్ధ చైతన్యమే జగత్తునకు ఆధారము. దీనినే పరబ్రహ్మమని, పర చిత్తు అని చెప్పుదురు. ఇదియే తుర్యమగు మాత్మస్వరూపము దీనినుండియే జగత్తిరోధానమగును. దీనినే సర్వేశ్వరుడుగను ధాతగను, విష్ణువుగను, రుద్రుడుగను, సదాశివుడుగను చెప్పు దురు. వీరిలో సదాశివుడే అనుగ్రహముచేయును. సమాధి కాలమందును, జాగ్రత్సుషుప్తులమధ్యకాలమందును, సర్వా ధిష్ఠానచైతన్యమాత్రమే స్ఫురించును. అదియే పంచకృత్య ములను చేయునది.

పశ్యేషదంతఃసంరుధ్య స్వాత్మానం స్వాత్మనా సతా।
త్యక్త్వా బహిః ప్రసరతామంతః ప్రసరణోద్యతః ॥ 98 ॥
త్యక్త్వా పశ్యామీతి భావ మంథవన్నిశ్చలాత్మనా।
దర్శనాదర్శనే త్యక్త్వా యోసి సోసి దృఢం భజ॥ 99 ॥

తా॥ పంచకృత్యములను విసర్జించి మనస్సును క్షణమాత్ర ము శ్రద్ధతో నిరోధించినవానికి ఆత్మవస్తువు చూడబడును. మనస్సును బాహ్యవ్యాపారములనుండి మరలించి అంతర్ముఖ ముచేయుటయే చిత్తవృత్తినిరోధము. బాహ్యవస్తువులు మిథ్య యని త్రోసివేయుటచేత చిత్తము రాగద్వేషాదులులేనిదై అంతర్ముఖమగును. నేను ఆత్మను చూచుచున్నానని నెడి అభిమా నముకూడా లేకుండా గ్రుడ్డివానివలె నుండవలయును. జాగ్ర త్స్వప్న సుషుప్తిరూపములను విడిచి వానికిసంధియందలి నిరా కార తురీయచైతన్యరూపుడవై సుఖయింపుము.

చితిశ్చైత్యం చితిరహం చితిః సర్వంచరాచరం।
యతః సర్వం చితిమనుభాతి సాతు స్వతంత్రితిః। 100।
అతశ్చితిం జనాస్సర్వే భాసినీం సర్వసంశ్రియాం।
భజధ్వం భ్రాంతిముత్సృజ్య చితిమాత్రసుదృష్టయః 101

తా॥ చరాచరజగత్తును నేనును అంతఃకరణమును చైతన్యమే. కాబట్టి మీరందరును భ్రాంతినివదలి అట్టిచైతన్యమునే నిరంతరదృష్టితో సేవింపుడు

సర్వజ్ఞానాప్యకించిజ్జ్ఞా సర్వకర్త్ర్యపి నిష్క్రియా।
సర్వాశ్రియాప్యనాధారా సర్వాధారాప్యనాశ్రితా ।109
సర్వరూపా ప్యరూపాసా సర్వయుక్తా ప్యసంయుతా।
సర్వత్రభాసమానాపి నజ్ఞేయా కేనచిత్క్వచిత్ । 110।
మహానందాప్యనానందా మాతాపితృవివర్జితా।
మాదృశ్యస్తనయాస్తస్యాః సంతి సంఖ్యావివర్జితాః। 111

తా॥ ఆజగన్మాత సకలచరాచరముయొక్క సృష్టిస్థితిలయములకు సాక్షియై యెఱుగుచున్నను పరమార్థదృష్టిచేత తనకంటె వేరగు వస్తువు మరియొకటిలేనందున యేమియునెఱుగనిదే తాను ఉపాధివశమున సకలమును చేయుచున్నను, అంతటనునిండియుండుటచేత నేమియుచేయనిదే. సగుణపక్షమున సకలమునకు ఆధారమయినను పరమార్థదశయందు ఆధారాధేయభావములు లేకుండ, యేకమైనది. రూపములేనిదైనను సకలరూపములను దాల్చినదే అన్నిటిని గలిసియున్నను దేనిని గాని అంటనిది. అంతటను భాసించుచున్నను ఎవరిచేతనుగాని తెలియబడనిది. మహానందరూపమైనను విషయానందములు లేనిది. అని భర్తతో హేమలేఖ చెప్పెను.

భావితం తీవ్రవేగేన యద్వస్తు నిశ్చయాత్మనా ।
పుమాం స్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమరకీటవత్ ॥140
అదృశ్యం భానరూపంచ సర్వమేవ చిదాత్మకం ।
సావధానతయా నిత్యం స్వాత్మానం భావ యేద్బుధః ॥141
దృశ్యం హ్యదృశ్యతాం నీత్వా బ్రహ్మాకారేణచింతయేత్
విద్వాన్ నిత్యసుఖే తిష్ఠేత్ ధియా చిద్రసపూర్ణయా॥142

తా॥ తుమ్మెద మఱియొకపురుగును దెచ్చి తానుండెడి బిలములోనుంచి దానిపైని రొదచేయుగా ఆపురుగు భయముతో తుమ్మెదనే తలచుచు కొంతకాలమునకు తుమ్మెదయగును. అట్టి భ్రమరకీటకన్యాయమువలె పురుషుడు తానునిరంతరము భావించెడి రూపమును బొందును. కనుక చిత్తవృత్తికి గోచరించు ప్రపంచమున్ను గోచరముకాని ఆత్మయును పరమార్థదశయందు చిద్రూపమేయని భావింపుము.

అహో భగవతీ మాయా పశ్యంతోపి మహత్పదం ।
చింతామణిం హస్తగతం త్యజంతిహా కుకల్పనైః ॥

తా॥ మాయాశక్తిమహిమచేత పండితాభిమానులును, శాశ్వతసుఖమునిచ్చు పరతత్త్వమును వినియును చేతిలోని చింతామణిని గాజుకాయఅని పారవేసినట్లు కుతర్కములచేత దానిను పేక్షింతురు.

యోగవా॥ 2 ముముక్షుప్ర॥ 4 సర్గ.

మోక్షద్వారే ద్వారపాలా శ్చత్వారః పరికీర్తితాః ।
శమో విచారః సంతోష శ్చతుర్థః సాధుసంగమః ॥ 47 ॥

ఏతే సేవ్యాః ప్రియత్నేన చత్వారో ద్వ్యౌత్రియోథవా ।
ద్వారముద్ఘాటయంత్యేతే మోక్షే రాజగృహే యథా ॥ 48
ఏకంవా సర్వయత్నేన సర్వముత్సృజ్య సంశ్రియేత్ ।
ఏకస్మిన్ వశగేయాంతి చత్వారోఽపి వశంయతః ॥ 49 ॥
శాస్త్రైః సజ్జనసంసర్గపూర్వకైః సతపోదమైః ।
ఆదౌ సంసారముక్త్యర్థం ప్రజ్ఞామేవాభివర్ధయేత్ ॥ 50 ॥

తా॥ మోక్షసాధనములగు శమము, విమర్శము, సంతోషము, సత్సాంగత్యము అను వానిలో కొన్నిటిని సేవించినను ద్వారపాలకులనాశ్రియముచేత రాజగృహప్రవేశ మగునట్లు ముక్తిమార్గమందు ప్రవేశముకలుగును. ఒకటివశమైనను తక్కినమూడును సులభమగును. కనుక సత్సాంగత్య, తపో, విద్యాభ్యాసాదులచేత ముక్తికొఱకు యత్నింపవలయును.

యోగవా॥ 3 ఉత్పత్తిప్ర॥ 10 సర్గ.

సంతోషోహి పరంశ్రేయః సంతోషః సుఖముచ్యతే ।
సంతుష్టః పరమభ్యేతి విశ్రామ మరిమర్దన ॥ 73 ॥
సంతోషామృతపానేన యేశాంతాస్తృప్తిమాగతాః ।
భోగశ్రీ రతులాశేషా మేషా ప్రతివిషాయతే ॥ 74 ॥
ఆశావైవశ్యవివశే చిత్తే సంతోషవర్జితే ।
గ్లానే వక్త్రమివాదర్శే నజ్ఞానం ప్రతిబింబతి ॥ 76 ॥
నాభివాంఛత్యసంప్రాప్తం ప్రాప్తం భుంక్తే యథాక్రమం ।
యస్తు సౌమ్యసమాచారః సంతుష్టఇతి కథ్యతే ॥ 77 ॥

తా॥ గొప్పశ్రేయస్సును, సుఖము నిచ్చునట్టి సంతోషామృతపానముచేత శాంతిగలవానికి భోగములు విషమువలె

నుండును. మలినమగు అద్దమునందు ముఖము ప్రతిబింబించన ట్లు, దురాశతోనున్నవానికి జ్ఞానము ప్రకాశింపదు. తనకుప్రాప్తమైనది అనుభవించుచు ప్రాప్తముకానివానికొఱకు దుఃఖింపక యథాసంతుష్టితోను, సౌమ్యమైన ఆచారముతోను ఉండుటయే సంతోషము.

యోగవా॥ నిర్వాణప్ర॥ 29 సర్గ.

నిర్దగ్ధవాసనాబీజః సత్తా సామాన్యరూపవాన్ ।
సదేహావాపి దేహోవానభూయోదుఃఖభాగ్భవేత్ ॥ [40
చిచ్ఛక్తిర్వాసనాబీజరూపిణీ సర్వదేహినాం।
అస్ఫూర్తిస్త్వదర్శనం యత్తదవిద్యేత్యుచ్యతే బుధైః ॥ 41॥
అవిద్యాయాస్తు భోగేన ప్రధానే నేతరం దహేత్ ।
తావద్యావన్మిథోఘర్షాద్ద్వయం శామ్యేచ్ఛివం భవేత్ ॥

తా॥ వాసనాబీజములు నశించినపుడు మఱల జన్మింపడు. అన్ని దేహములయందును చిద్రూపవాసనాబీజరూపముగనున్న చిచ్ఛక్తి స్ఫురింపకపోవుటయే భోగప్రధానమైన అవిద్య విమర్శముచేత ముందుగా అజ్ఞానవాసనలును, అనంతరము జ్ఞానవాసనలును నశింపగా చిద్రూపుడగును.

ఏతావదేవావిద్యాత్వం నేదం బ్రహ్మేతి నిశ్చయః ।
ఏషఏవ క్షయోఽస్యా యద్బ్రహ్మేదమితి నిశ్చయః॥ 43॥

తా॥ జగత్తు సత్యమనియు, దీనికాధారము బ్రహ్మము కాదనియు తలచుటయే అవిద్య. అది జగత్తుకల్పితమనియు, దీనికాధారమగు బ్రహ్మము సత్యమనియు భావించుటచేత నశించును.

యోగవా॥ 3 ఉత్పత్తి ప్ర 13 సర్గ.

నాహం బ్రహ్మేతి సంకల్పా త్సుదృఢాద్బధ్యతే మనః ।
సర్వం బ్రహ్మేతి సంకల్పా త్సుదృఢాన్ముచ్యతే మనః॥56

తా॥ నేను దేహిని జీవుడ ననెడి దృఢసంకల్పమే బంధము తనతో కూడిన యీ జగత్తంతయును బ్రహ్మమనెడి దృఢసంకల్పమే మోక్షము.

4 స్థితిప్ర॥ 15 సర్గ.

ఆత్మానమితరంచైవ దృశా నిత్యాఽవిభిన్నయా ।
సర్వం చిజ్జ్యోతిరేవేతి యఃపశ్యతి సపశ్యతి ॥ 10 ॥
సర్వశక్తిరనంతాత్మా సర్వభావాంతరస్థితః ।
అద్వితీయశ్చిదిత్యంతర్యః పశ్యతి సపశ్యతి ॥ 11 ॥
నాహం నచాన్యదస్తీతి బ్రహ్మైవాస్తి నిరామయం ।
ఇత్థం సదసతోర్మధ్యం యః పశ్యతి సపశ్యతి ॥ 12 ॥

తా॥ తానును జగద్వస్తువులన్నియును చిద్రూపమని సర్వదా భావించువాడును, చిద్రూపము సర్వశక్తులతోను, సర్వభావములలోపల నిండియున్నదనియు, అదియే తాననియు, తెలిసినవాడును, జగత్తు నిత్యముకాదనియు, నిర్గుణబ్రహ్మమే నిత్యమనియు భావించువాడును ముక్తినిపొందును.

2 ముముక్షుప్రకరణము.

యథాక్షణం యథాదేశం ప్రవిచారయతాసుఖం ।
యథాసంభవసత్సంగమిమం మోక్షకథాక్రమం ॥ 94 ॥
ఆసాద్యతే మహాన్ జ్ఞానబోధః సంసారశాంతిదః ।
నభూయో జాయతే యేన యోనియంత్రప్రపీడనం ॥ 95 ॥

తా॥ ప్రతిదేశమందును, ప్రతిక్షణమందును, సంభవించి నంత సత్సంగముతో మోక్షక్రమమును విమర్శించువానికి జ్ఞానముచేత మోక్షముకలుగును. గాని మఱల జన్మములేదు.

తావద్విచారయేత్ప్రాజ్ఞో యావద్విశ్రాంతిమాత్మని ।
సంప్రయాత్య పునర్నాశాం శాంతిం తుర్యపదాభిదాం॥98॥
యుక్తియుక్తముపాదేయం వచనం బాలకాదపి ।
అన్యత్తృణమివ త్యాజ్యమప్యుక్తం పద్మయోనినా ॥ 102॥
గుణాః శమాదయో జ్ఞానాచ్ఛమాదిభ్యస్తథాజ్ఞతా ।
పరస్పరం వివర్ధంతే ద్వే పద్మసరసీ ఇవ ॥ 107 ॥

తా॥ చిద్రూపమందు విశ్రాంతికలుగునరకును ఆత్మవిమర్శము చేయవలయును. 98 యుక్తియుక్తమైన వాక్యము బాలుడుచెప్పినను గ్రహింపతగును. అన్యవాక్యము చతుర్ముఖబ్రహ్మచెప్పినను గడ్డిపరకవలె విడువవలెను. 102 పద్మములచేత సరస్సును, సరస్సుచేత పద్మములును, పరస్పరము వృద్ధిపొందునట్లు జ్ఞానమువలన శమాదిషట్కసంపత్తియును, శమాదులవలన జ్ఞానమును వృద్ధిపొందును.

జీవన్ముక్తివివేకము.

గవాం సర్పిః శరీరస్థం నకరోత్యంగపోషణం ।
తదేవ కర్మరచితం పునస్తస్యైవ భేషజం ॥
ఏవం సర్వశరీరస్థః సర్పిర్వత్పరమేశ్వరః ।
వినాచోపాసనాం దేవో నకరోతి హితం నృషు ॥

తా॥ గోవులగర్భమునందు నెయ్యి ఉన్నట్లే అన్నిశరీరములందును పరమేశ్వరుడున్నాడు. కాని పాలు పితుకుట మొదల

గుకర్మలేనిదే ఘృతము సిద్ధింపనట్లు ఉపాసనయను కర్మములే నిదే నరులకు పరమేశ్వరుడు హితవును చేయడు

అపరోక్షానుభూతి.

ఉక్తసాధనయుక్తేన విచారః పురుషేణ హి ।
కర్తవ్యో జ్ఞానసిద్ధ్యర్థ మాత్మనః శుభమిచ్ఛతా ॥ 10 ॥
నోత్పద్యతే వినాజ్ఞానం విచారేణాన్యసాధనైః ।
యథా పదార్థభానంహి ప్రకాశేనవినా క్వచిత్ ॥ 11 ॥

తా॥ జ్ఞానసిద్ధిని కోరువాడు విమర్శమనెడి సాధనము నపే క్షింపవలయును. దీపములేనిదే చీకటిలోనివస్తువు తెలియనట్లు విమర్శములేనిదే జ్ఞానము కలుగదు

నిమేషార్థం నతిష్ఠంతి వృత్తిం బ్రహ్మమయీం వినా ।
యథా తిష్ఠంతి బ్రహ్మద్యాః సనకాద్యాః శుకాదయః 13

తా॥ బ్రహ్మదులు, సనకాదులు, శుకాదులు, అరనిముష మైన ఇతరవృత్తిలేకుండ బ్రహ్మనుసంధానముతో నున్నట్లే క్షీణపాపులును ఉందురు. ఇది రాజయోగలక్షణము.

బ్రహ్మది స్థావరాంతేషు వైరాగ్యం విషయేష్వను ।
యథైవ కాకవిష్టాయాం వైరాగ్యం తద్ధి నిర్మలం ॥ 4 ॥
నిత్యమాత్మస్వరూపంహి దృశ్యం తద్విపరీతగం ।
ఏవం యో నిశ్చయః సమ్యగ్వివేకో వస్తునః సవై ॥ 5 ॥

తా॥ కాకిమలమునందువలెనే బ్రహ్మది స్థావరాంతమువర కుగల జగత్తునందిచ్ఛలేకపోవుటయే దృఢవైరాగ్యము. ఆత్మే నిత్యమనియు, జగత్తు కల్పితమై నశించునవనియు నిశ్చయ దార్ఢ్యమే వస్తువివేకము.

రజ్వజ్ఞానాత్ క్షణేనైవ యద్వద్రజ్జుర్హి సర్పిణీ ।
భాతి తద్వచ్చితి స్సాక్షాద్విశ్వాకారేణ కేవలా ॥ 44 ॥
ఉపాదానం ప్రపంచస్య బ్రహ్మణో న్యన్నవిద్యతే ।
తస్మాత్సర్వప్రపంచోయం బ్రహ్మైవాస్తి నచేతరత్ ॥ 46 ॥

తా॥ జగత్కారణము చితియనియు, బ్రహ్మమనియు, అభేదముగా నీప్రకృతిపురుషులను రెండుశ్లోకములయందును చెప్పబడినది.

బ్రహ్మైవ సర్వనామాని రూపాణి వివిధానిచ ।
కర్మాణ్యపి సమగ్రాణి బిభర్తీతి శ్రుతిర్జగౌ ॥ 50 ॥
యస్మిన్ సర్వాణి భూతాని హ్యాత్మత్వేన విజానతః ।
నవై తస్య భవేన్మోహో నచ శోకోఽద్వితీయతః ॥ 54 ॥
అయమాత్మాహి బ్రహ్మైవ సర్వాత్మకతయాస్థితః ।
ఇతి నిర్ధారితం శ్రుత్యా బృహదారణ్యసంస్థయా ॥ 55 ॥

తా॥ సమస్తనామరూపములును, సమస్తకర్మములును, బ్రహ్మయని శ్రుతి చెప్పుటచేత తనతోకూడిన యీజగత్తును ఆత్మగా చూచువానికి శోకమోహములు లేవు.

ఇక్లే-1 ఈశావాస్యోపనిషత్తు- "యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః । తత్ర కో మోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః ॥" యను శ్రుతియు, అందఱియందును గల విజ్ఞానాత్మయే బ్రహ్మమని "సవా అయమాత్మా బ్రహ్మ విజ్ఞానమయః" యను బృహదారణ్యశ్రుతియునుచెప్పుచున్నవి

దధీచిసంహిత॥

భువనేశ్వరీబీజమగు (హ్రీం) కారము బ్రహ్మవిద్యయనుట.

జగదేతత్పూర్వమాసీదవ్యక్తం ప్రకృతౌ ప్రియె ।
జగతోఽవ్యక్తరూపాయా మవస్థానాహ్యుదాహృతా ॥
ప్రకృత్యవస్థా దేవేశీ సాచ శక్తిశ్శివస్యతు ।
విశ్వాత్మికాద్య జననీ చిద్రూపా భువనేశ్వరీతి ॥

తా॥ ఈజగత్తు సృష్టికిపూర్వము వ్యక్తముకాకుండ ప్రకృతియందు లీనమైయున్నది. ఆప్రకృతియే పరమేశ్వరుని శక్తి. అదియే చిద్రూపమును, భువనేశ్వరియును, అని మహావిష్ణువు చెప్పెను.

ఓం హ్రీం శ్రీం క్లీం ఐం అను నివి పంచప్రణవములు వీనిలో ఓంకారము బ్రహ్మప్రణవము. మిగిలినవి శక్తిప్రణవములు. బ్రహ్మప్రణవమునకును, శక్తిప్రణవమునకును భేదములేదనుటకు.

త్రిశతినామము 98 హ్రీంకారచింత్యా ॥

శంకరభాష్యం॥ హ్రీంబీజస్య పంచప్రణవాంతర్గతత్వేన ఓంకారభేదే బ్రహ్మప్రతీతత్వావిశేషాత్ । ప్రణవే యథా పరా పరబ్రహ్మోపాసన హేతుత్వవదస్మిన్ వా ప్రతీకే తద్భవతీతి వికల్పః । యథా భక్తిపార్థక్యేన మంత్రవిశేషేషుభవతీతి యోగవేదమార్గరహస్యం । నవాదజల్పాద్యవకాశః ॥ హ్రీంకారే ఉభయవిధబ్రహ్మస్వరూపతయా చింతితుం యోగ్యా ధ్యానస్య సాక్షాత్కారం ప్రత్యాకారాదుపకారకత్వేన ధ్యాతవ్యేత్యర్థః ॥

తా॥ హ్రీంకారము ఓంకారమువలెనే బ్రహ్మోపాసనకు సన్నిహితకారణము. భక్తివిశేషముచేత మంత్రములయందు

ఫలభేదముగలదని యోగవేదమార్గరహస్యము. కనుక వాద దోషములకవకాశములేదు. సాక్షాత్కారమునుగురించిధ్యాన ముపస్థానకారణము. కనుక హ్రీంకారమును సగుణముగను, నిర్గుణముగను ధ్యానింపవలయును.

త్రిశతి 149 కలానాథముఖీ ।

"కలాః చతుష్షష్టికలాః నాథయతి ప్రేరయతీతి కలానాథః" శ్రుతి॥ నిశ్వసితమేతదృగ్వేదో యజుర్వేదః సామవేద ఇత్యాది॥ బ్రహ్మముయొక్క నిట్టూర్పులే వేదములు ।

వ్యాససూత్రం "శాస్త్రయోనిత్వాత్"

తా॥ బ్రహ్మము శాస్త్రములకు కారణము. పరమేశ్వరి యీవిధముగా వేదాదిసర్వకళలను 64 విద్యలను ప్రకాశింప చేయునట్టి ముఖముకలది.

త్రిశతి 186 లంఘ్యేతరాజ్ఞా ॥

ఇతరేషాం జీవభ్రాంతికల్పితానాం గుణమూర్త్యాదీనాం ఉపాసనావిధిరూపావా । కర్మవిధిరూపావా । ఆజ్ఞా ప్రేరణా లంఘ్యా అవిషయీకృతా యయా సా తథా । శుద్ధచైతన్యస్య విశిష్టక్రియాద్యాత్మకత్వాభావేన విధ్యవిషయత్వాదితి యావత్ । అథవా కింకరీత్వాభావేన ఇతరేషాం ఆజ్ఞా ప్రేరణా లంఘ్యా ఉపేక్షణీయా యయా సా తథా- శ్రుతిః॥ 'సర్వస్యాధిపతిః సర్వస్యేశానః ఇతి' ఈశ్వరస్య సర్వనియంతృత్వేన స్వేతరా నియమ్యత్వాదితి జ్ఞాతవ్యం ।

తా॥ బ్రహ్మవిష్ణ్వాదిదేవతలు కల్పింపబడినవారు. జీవభ్రాంతికల వీరు ఈశక్తియొక్క ఆజ్ఞనుమీరక పాలించుచుందురు.

శుద్ధచైతన్యరూపయగు లలిత ఇతరుల ఆజ్ఞకు లోబడునది కాదు.

త్రిశతి 217 సచ్చిదానందా ॥

సత్తు చిత్తు ఆనందము । కాలత్రియాబాధ్యత్వం సత్త్వం స్వేతరప్రకాశాప్రకాశత్వం చిత్త్వం । పరమప్రేమాస్పదత్వ మానందత్వం । "సత్యం జ్ఞానమనంతం । విజ్ఞానమానందం । సదేవ సోమ్యేదమగ్రఆసీత్ । ప్రజ్ఞాప్రతిష్ఠా । ప్రజ్ఞానం బ్రహ్మ ఆనందోబ్రహ్మేతి వ్యజానాత్ । ఆనందం బ్రహ్మణో విద్వాన్నబిభేతి కుతశ్చన" ఇత్యాది శ్రుతిభ్యః తే స్వరూపం యస్యాః సా తథోక్తా । వేదాంతశాస్త్రోక్త బ్రహ్మస్వరూప లక్షణలక్షితేత్యర్థః ॥

తా॥ 1 భూత భవిష్య ద్వర్తమానకాలములు మూడింటి యందును బాధింపబడనిది సత్త్వము. 2 ఇతరప్రకాశాపేక్ష లేకుండ తనంతటతానే ప్రకాశించునది చిత్తు. 3 మిగులప్రేమస్థానము ఆనందము. పైశ్రుతులచేత చెప్పబడు బ్రహ్మమునకు లక్షార్థము ఈచిచ్ఛక్తియే.

త్రిపురాసిద్ధాంతము॥

నారాయణం నమస్యామి అన్నాధిపతిమాశ్రయే ।
పరాం విద్యాం నమస్యామి భజామి భువనేశ్వరీం ।

తా॥ నారాయణుని నమస్కరించుచున్నాను. ఈశ్వరుని నాశ్రయించుచున్నాను. పరావిద్యయగు చిచ్ఛక్తికి నమస్కారము. భువనేశ్వరిని భజించుచున్నాను. అనుటచేత నన్నిటికిని అభేదమే.

జ్ఞానార్ణవము॥

సదాశివో మహాప్రేతః కేవలో నిశ్చలః ప్రియే।
శక్త్యావినా కృతోదేవి కథంచిదపి నక్షమః॥

తా॥ మహాప్రేతయగు సదాశివుడు శక్తి లేనికాలమునందు నిశ్చలుడు కనుక నేకార్యమును చేయలేడు.

శ్వేతాశ్వతరోపనిషత్తు॥

తమీశ్వరాణాం పరమం మహేశ్వరం। తం దైవతానాం పరమంచ దైవతం॥ ఇత్యాది॥

తా॥ పరబ్రహ్మమే దేవతలలో నుత్కృష్టము.

తైత్తిరీయశ్రుతి॥ 'తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి'

తా॥ బ్రహ్మము స్వేచ్ఛతో చూచుటవలన జడశక్తి జగత్తును పుట్టించెను. చూచుటకుగల శక్తియే చిచ్ఛక్తియనబడును.

శ్రుతి॥ "ఏకో రుద్రస్సర్వభూతేషు గూఢో మాయారుద్రస్సకలో నిష్కళశ్చ। సఏవ దేవీ నచ తద్విభిన్నా హ్యేతజ్జ్ఞాత్వావాఽమృతత్వం వ్రజంతి"

తా॥ సర్వభూతములయందు నంతర్యామిగనున్న ఈశ్వరుడే సగుణుడును, నిర్గుణుడును, శక్తిస్వరూపుడును. శక్తి అతనికంటె వేరుకాదు. ఇట్లు అభేదమని తెలిసికొనినవారు ముక్తినిపొందుదురు.

శ్రుతి॥ "మాయాచావిద్యాచ స్వయమేవ భవతి"

తా॥ చిచ్ఛక్తియే మాయగను, అవిద్యగను పరిణమించి

నట్లు చెప్పుటవలన జడములగు మాయాఽవిద్యలయొక్క ప్రకాశము చిచ్ఛక్తివలన కలిగినదే.

శివసూత్రము-"చైతన్యమాత్మా"

తా॥ చైతన్యమే చిద్రూపము.

భావనోపనిషత్తు-"జ్ఞానమర్ఘ్యం"

తా॥ చిద్రూపధ్యానమే ఉత్తమార్ఘ్యము.

స్మృతి॥ స్త్రీరూపాం చింతయేద్దేవీం పుంరూపామథ వేశ్వరీం।
అథవా నిష్కళాం ధ్యాయే త్సచ్చిదానందవిగ్రహాం॥

తా॥ బ్రహ్మముచు స్త్రీరూపముగాను, లేక పురుషరూపముగాను, లేక నిర్గుణముగాను ధ్యానింపవలెను.

"స్త్రీపుమాదిభేదో ఉపాధికృతఏవ"

నైవస్త్రీ నపుమానేషః నచైవాయం నపుంసకః।
యద్యచ్ఛరీరమాధత్తే తేన తేన సయుజ్యత। ఇతి శ్రుతిః

తా॥ బ్రహ్మము స్త్రీకాదు పురుషుడునుకాదు నపుంసకుడును కాదు. యేయేఉపాధులను పొందినపుడు ఆయారూపములుగా చెప్పబడును. స్త్రీపురుషభేదములు ఉపాధికృతములు కాని వాస్తవము కావు.

దేవీభాగవతము సప్తమస్కందము 32 అధ్యాయము.

దేవీగీత ప్రారంభః।

శృణ్వంతు నిర్జరాస్సర్వే వ్యాహరన్త్యా వచో మమ।
యస్య శ్రవణమాత్రేణ మద్రూపత్వం ప్రపద్యతే। 1।

అహమేవాస పూర్వంతునాన్యత్కించిన్నగాధిప।
తదాత్మరూపం చిత్సంవిత్పరబ్రహ్మైకనామకం॥ 2॥
అప్రతర్క్యమనిర్దేశ్య మనౌపమ్య మనామయం।
తస్య కాచిత్స్వతస్సిద్ధా శక్తిర్మాయేతి విశ్రుతా॥ 3॥
నసతీ సా నాసతీ సానోభయాత్మా విరోధతః।
ఏతద్విలక్షణా కాచిద్వస్తు భూతాస్తి సర్వదా॥ 4॥
పావకస్యోష్ణతేవేయ ముష్ణాంశోరివ దీధితిః।
చంద్రస్య చంద్రికేవేయం మమేయం సహజాధ్రువా॥5
తస్యాం కర్మాణి జీవానాం జీవాః కాలాశ్చ సంచరే।
అభేదేన విలీనాస్స్యు స్సుషుప్తౌ వ్యవహారవత్॥ 6॥

తా॥ జగత్సృష్టికి పూర్వమున్నది నేనుమాత్రమే అనగా ఆత్మరూపము, చిద్రూపము, సంవిద్రూపము అనెడి పరబ్రహ్మము. అది ఉపమానములేనిదియు, నిర్దేశింపశక్యముకానిదియును. ఆబ్రహ్మమునందు స్వతస్సిద్ధమైన మాయయను శక్తి కూడా కలదు. అది సతి కాదు అసతి కాదు. పరస్పరవిరోధము వలన సదసత్తునుకాదు. దీనికి విలక్షణమైన వస్తువు సర్వదా బ్రహ్మమునందు కలదు. అది అగ్నికి వేడివలెనే చంద్రునికి వెన్నెలవలెనే బ్రహ్మమునందు భేదములేకుండ సహజముగా నున్నది. దానినుండియే జీవుల కర్మానుసారము సృష్టియగుచు సుషుప్తియందు జీవులు పరబ్రహ్మమును పొందునట్లే భేదము లేకుండ లయకాలమునందు చిద్రూపమునందు లీనమగుదురని హిమవంతునితో పార్వతీదేవి చెప్పెను.

సుషుప్తియందు అజ్ఞానముచేత లీనము గనుక
మరల జన్మము కలదు.

వర్తతే సర్వభూతేషు శక్తిస్సర్వాత్మనా నృప।
శవవచ్ఛక్తిహీనస్తు ప్రాణీభవతి సర్వదా॥
చిచ్ఛక్తి స్సర్వభూతేషు రూపం తస్యాస్తదేవహి।

తా॥ సర్వభూతములయందును సర్వరూపములచేతనున్న శక్తియే చైతన్యమనెడి చిచ్ఛక్తి. శక్తి లేనికాలమునందు అన్ని ప్రాణులును శవములవలె నుండుదురు.

దేవీభాగవతము- 5 స్కందము 19 అధ్యాయము.

వ్యాసః॥ అథ ప్రముదితాస్సర్వే దేవాఇంద్రపురోగమాః।
మహిషం నిహతం దృష్ట్వా తుష్టువుర్జగదంబికాం॥1

దేవాః॥ ఇత్యాది శివశక్త్యైక్యదర్పణము 4 వ ప్రకరణము నందు కలదు.

తా॥ జనమేజయునితో వ్యాసముని చెప్పుచున్నారు. మహిషాసురసంహారానంతరము ఇంద్రాది దేవతలు పరదేవతనుచేయుస్తోత్రమెట్లనగా- కలియుగమునందు మనుష్యులు నిన్ను సేవింపలేక నీవలన నిర్మింపబడిన హరిహరాదులను సేవించుచుందురు. రాక్షసులచేత హరిహరాది దేవతలు పీడపెట్టబడి నీవలన సుఖించిరని తెలిసియు, ఆదేవతలనే సేవింతురు. ఇట్లు సేవించుట నిర్మలమైన దీపమును చేతిలోనుంచుకొనియును పాడునూతిలోపడుటవంటిదేగదా? సేవించుభక్తులకు సుఖమునిచ్చు విద్యాస్వరూపురాలవు నీవే. నిన్ను సేవింపకుండ మోహపరచి దుఃఖమునిచ్చు అవిద్యాస్వరూపురాలవు నీవే. నరులకు

జననమరణాది దుఃఖములను హరించుదానవును నీవే మోక్షమును కోరువారేకాని అజ్ఞులు నిన్ను ఆరాధింపలేరు హరిహరాదిదేవతలే నీపాదపద్మమును సర్వదా సేవించుచుండగా అల్పబుద్ధిగల నరులు సుఖమునిచ్చు నీసేవను మానదగునా? భృగుమహర్షి శపింపగా విష్ణుమూర్తి మత్స్యకూర్మాద్యవతారములను బొందెను. ఈశ్వరునియొక్క లింగము దారుకావనమందు తెగిపడెను. అట్టివానిని సేవించుటచేత నిహపరసుఖములుకలుగునా? నరులు కొందఱు సకలార్థములనిచ్చు నిన్ను సేవింపలేక యితరులను సేవించి తమకార్యములను వ్యర్థపర్చుకొనుచున్నారు.

సూతసంహిత-యజ్ఞవైభవఖండము 7 అధ్యాయము.

ఆత్మమంత్రవిచారము.

శాంతాంతం శక్తిరస్యోక్తా తదంతం బీజముచ్యతే।
విద్యాశక్తిర్భవేద్బీజం శివఏవ నచాన్యథా॥
తేనాయం పరమోమంత్ర శ్శివశ్శక్త్యాత్మక స్స్మృతః।

శ్రీవిద్యారణ్యవ్యా। శకారస్యాంతః షకార స్తస్యాంతః సకారః సఇతి శక్తిరిత్యర్థః। తదంతమితి। తచ్ఛబ్దేన సకారః పరామృశ్యతే। తస్యాంతో హకారః। హమిత్యస్య మంత్రస్య బీజమిత్యర్థః। ఏవం బీజశక్త్యాత్మనా విభక్తస్య మంత్రస్య శివశక్తివాచకత్వేన తదాత్మకతాం ప్రతిపాదయితుం అర్థాత్మిక బీజశక్తీ ఆహ। విద్యాశక్తిరితి। యాపరశివస్వరూపసంవిద్రూపిణీ సైవ శక్తి స్తత్ప్రతిపాద్యం నిష్కలపరశివస్వరూపం బీజం। అర్థరూపమేతదుభయం శబ్దాత్మకేన శక్తిబీజరూప

భాగద్వయేన ప్రతిపాద్యతే। తథాహి- సత్యజ్ఞానాదిలక్షణం నిరస్తసమస్తోపాధికం స్వప్రతిష్ఠం సర్వప్రత్యగ్భూతం చైతన్యంహి పరశివస్వరూపం। తత్ప్రత్యగర్థవాచినాహంశబ్దేన ప్రతిపాదయితుం శక్యతే। తదేవ శివస్వరూపం స్వమాయా వశాచ్ఛక్తిప్రతియోగిత్వేన నిరూప్యమాణం తత్పరాగ్భూతం శక్తిః సాపి పరాగర్థవాచినా సఇతి పదేన ప్రతిపాద్యతఇత్యుక్తం। బీజశక్త్యోశ్శివశక్తిస్వరూపప్రతిపాదకత్వం। తస్మాదయం బీజశక్తిసముదాయరూపో మంత్రశ్శివశక్త్యాత్మక ఇత్యర్థః తదుక్తమాచార్యైః- శ్లో॥ హకారః పురుషః ప్రోక్తస్సఇతి ప్రకృతిర్మతా। పుంప్రకృత్యాత్మకో హంసస్తదాత్మకమిదం జగదితి॥

తా॥ శవర్ణముయొక్క అంతము 'ష' కారము దానికంతము 'స' కారము ఇదియే శక్తిగాను, సకారమునకంతముననున్న 'హ' కారమును బిందువుతో చేర్చి 'హం' అనునది బీజముగాను, ఈమంత్రమునకు చెప్పబడినది, ఇట్టి బీజశక్తులతో కూడి విభక్తముకాని యీహంసమంత్రమునకు శివశక్తివాచకత్వముచేత ఆత్మరూపముగాను, విద్యాశక్తిఅనగా పరశివస్వరూపమను సంవిద్రూపమే శక్తియనియు చెప్పబడుచున్నది. నిష్కల పరశివస్వరూపమే బీజము. ఈరెండును శబ్దార్థములవలె నున్నది. సత్యజ్ఞానాదిలక్షణములుకలిగి ఉపాధిశూన్యమై స్వప్రతిష్ఠితమై సర్వమునకు ప్రత్యక్బ్రహ్మమగు చైతన్యమే పరశివస్వరూపము. అట్టిశబ్దార్థములచేత అహంశబ్దము చెప్పబడుచున్నది. బ్రహ్మమే పరశివరూపమును, పరాశక్తిరూపమును పరాశక్తి సకారముచేత చెప్పబడుచున్నది. గనుక నిది శివశక్త్యా

త్మక మంత్రమని అర్థము. ఆచార్యులవారిచేతకూడా హకారము పురుషుడనియు, సకారము చిత్ప్రకృతియనియు, ఈపురుష ప్రకృత్యాత్మకమైనదే హంసమంత్రమనియు, ఈజగత్తు ఆస్వరూపమేఅనియు చెప్పబడినది.

బ్రహ్మవా ఇదమగ్రఆసీత్। తదాత్మానమేవావేదహం బ్రహ్మాస్మి 3-4-16 ఇతి బృహదారణ్యకే।

త్వంవా అహమహం వై త్వమిత్యైతరేయకే।

కస్త్వమిత్యహమితి హోవాచ త్వమేవేదం సర్వం తస్మాదహమితి సర్వాభిధానం ఇతి తాపనీయే. యను శ్రుతులయందు ప్రపంచము అహంశబ్దముచేత చెప్పబడినది.

తా॥ అహంశబ్దమునకర్థమైన బ్రహ్మముయొక్క యుపాసన పూర్ణమగు అహంభావనారూపమయినదని 'హంసస్సోహం' మొదలగువానిచేత చెప్పబడినది.

సూతసంహిత॥

జపిత్వా దశసాహస్రం మంత్రం చైతన్యవాచకం।
మహాపాతకసంఘైశ్చ ముచ్యతే పాతకాంతరైః॥

వ్యా॥ చైతన్యవాచకం=భువనేశ్వరీబీజం।

తా॥ హ్రీంకారమును పదివేలు జపించినవానికి మహాపాతకములు అయినను బాధింపనేరక దూరముగ తొలగిపోవును.

సూ॥ యజ్ఞవైభవఖండము 13 అధ్యాయము.

చిన్మాత్రాశ్రయమాయాయాం శక్త్యాకారే ద్విజోత్తమాః
అనుప్రవిష్టా యాసంవిన్నిర్వికల్పా స్వయంప్రభా।

సదాకారా పరానందా సంసారోచ్ఛేదకారిణీ ।
సా శివా పరమాదేవీ శివాభిన్నా శివంకరీ ॥
నశివేనవినాశక్తిర్నశక్తిరహితశ్శివః ।

వి॥ భా॥ శివశక్త్యుభయరూపసాధారణం చిన్మాత్రిమాశ్రి తా-పరమేశ్వరః స్వశక్తివశాత్ఖలు ముముక్షూన్ సంసారాన్మోచయతి । శక్త్యా యయా సశంభుర్భుక్తా ముక్తాచ పశుగణస్యాన్యేత్యుక్తత్వాత్ । అస్యాః శివస్యచ పరమార్థతః పూర్వోక్తచిన్మాత్రరూపత్వాద్భేదో నాస్తీత్యర్థః । తథాచ శివశక్త్యోర్భేదావభాసఏవ మిథ్యా నతు ప్రపంచవత్స్వరూపమపీత్యర్థః ॥

తా॥ పరమశివుడు ఈపశుసమానులకందఱకును శక్తితో గూడియే భుక్తిముక్తులనిచ్చుటచేతను, చైతన్యము శివశక్తులకు సామాన్యరూపమగుటచేతను, శివశక్తులకు భేదముతోచుటయే మిథ్యకాని దృశ్యమగు ప్రపంచము మిథ్యయగువిధమున సకలకారణమగు శివశక్తులస్వరూపమెన్నడును మిథ్యకానేరదు. శివశక్తులకు భేదములేదు.

మహావాసిష్ఠము.

సైషా చితిరితిప్రోక్తా జీవనాజ్జీవితైషిణాం ।

తా॥ జీవులకు జీవనాధారమగుటచేత చిత్తు అనబడును.

స్మృతి॥ సచ్చిన్మయశ్శివస్సాక్షాత్తస్యానందమయీ శివా ।

తా॥ సత్తు చిత్తు శివరూపము ఆనందము శక్తిరూపము.

భోజరాజవృత్తి.

చితిశక్తేః ర్వృత్తిసారూప్యనివృత్తౌ స్వరూపమాత్రేణావస్థా

నం కైవల్యముచ్యతే।

తా॥ సృష్టి స్థితి లయ తిరోధాన అనుగ్రహములనెడి పంచవృత్తులను విడిచి స్వరూపమాత్రముగనుండు చిచ్ఛక్తియే మోక్షమనబడును.

సౌరసంహితే.

బ్రహ్మణోఽభిన్నశక్తిస్తు బ్రహ్మైవఖలు నాపరా।
తథాసతి వృథా ప్రోక్తం శక్తిరిత్యవివేకిభిః॥
శక్తిశక్తిమతోర్విద్వన్ భేదాభేదస్తు దుర్ఘటః।

తా॥ బ్రహ్మముతో అభిన్నమైన శక్తిని బ్రహ్మముకంటె వేరని అవివేకులచేత వృథాగాచెప్పబడినది. చంద్రచంద్రికలవలె శక్తికిని శక్తిగలవానికిని భేదాభేదము దుర్ఘటము. అనగా భేదములేదని అర్థము.

పద్మపురాణము.

చిత్తేషు చిత్కలానాను శక్తిస్సర్వశరీరిణాం।

తా॥ సర్వజీవులయొక్క చిత్తమునందు చిత్కలయను శక్తి కలదు.

విశేషాత్పుష్కరే స్నాత్వా జపేన్మాం వేదమాతరం।
అష్టాక్షర్యాస్థితాచాపి జగద్వ్యాప్తం మయాత్విదం।

దత్తాత్రేయసంహిత.

సమస్తవిద్యా సామ్రాజ్ఞీ మహాసింహాసనేశ్వరీ।
చిద్విద్యైవ పరాజ్ఞేయా నాన్యాం విద్ధి పరాంశివే॥
ఏకేనజన్మనా ముక్తిం పుమానిచ్ఛేద్యది ప్రియే।
చిద్బ్రహ్మవిద్యాధాతారం పరమాచార్యమాశ్రయేత్।

తా॥ ఒకేజన్మమునందు ముక్తిని పొందఁగోరినవారు చిద్వి ద్యనుపదేశించునట్టి పరమగు గురువునాశ్రయింపవలెను.

ద॥ సం॥ 5 అధ్యాయము.

చిద్విద్యా బ్రహ్మవిద్యాద్యా హాదికాదిసమన్వితాః।
షోడశార్ణముఖా స్తద్వదానందమనవః స్మృతాః॥
సచ్చిదానందమనుషు నిష్ఠా యేషాం స్థిరీభవేత్।
తే ప్రాకృతేన దేహేన ముక్తా బ్రహ్మమయాః స్మృతాః॥

తా॥ చిద్విద్య బ్రహ్మవిద్య యనెడు హాదిపంచదశియు, కాదిపంచదశియు, వీనితోఁకలసిన షోడశాక్షరియు ఆనంద మంత్రములని చెప్పబడుచున్నవి. వీనియందు దృఢనిష్ఠగలవా రు కల్పితదేహమునువదలి బ్రహ్మరూపులగుదురు.

మార్కండేయపురాణము.

త్వమక్షరం పరం దేవి యచ్చ సర్వం ప్రతిష్ఠితం।
అక్షరం బ్రహ్మ పరమం జగచ్చైతత్క్షరాత్మకం॥
దారుణ్యవస్థితో వహ్నిర్భౌమాశ్చ పరమాణవః।
తథా త్వయి స్థితం బ్రహ్మ జగచ్చేదమశేషతః॥

తా॥ ఓదేవీ నాశములేని స్వరూపముగల నీయందు సర్వ జగద్వస్తువులునున్నవి. అక్షరమనగా పరబ్రహ్మము జగత్తు క్షరాత్మకమనగా నశించునది. కర్రయందు అగ్నివలెనే భూమి యందు పరమాణువులువలెనే నీయందు జగత్తున్నది.

ద. సం. 62 అధ్యాయము.

తనుత్రితయసంపత్తిం యది హాతు మిహేచ్ఛసి।
శ్రీవిద్యా భజనం కార్యం శశ్వద్బుంధవిముముక్షుభిః॥

మనసా కర్మణా వాచా ప్రాప్తవ్యం సుకృతంచ యత్ ॥ 23
శ్రీవిద్యాస్మరణం కృత్వా సర్వం ప్రాప్నోతి సాధకః ।
కృత త్రేతా ద్వాపరేషు తథా కలియుగే శివే ॥ 24 ॥
దేవాలపి జనిం భూమౌ వాంఛంత్యాత్మవిముక్తయే ।
దేవానామపి సర్వేషాం విద్యేయం దుర్లభోదితా ॥ 25 ॥
శ్రీయః ప చదశార్ణేయం చరమేజన్మనీశ్వరి ।
లభ్యతే గురువక్త్రేణ తురీయస్యాధికారిణః ॥ 26 ॥
సాక్షాన్న శంకరో యస్తు పశ్చిమం జన్మ యస్య నో ।
నలభ్యతే తేన విద్యా శ్రీయః పంచదశాక్షరీ ॥27॥ ఇత్యాది

తా॥ మోక్షేచ్ఛగలవారు శ్రీవిద్యను సేవింపవలెను. మనోవాక్కాయకర్మములచేత పొందబడు సుకృతము శ్రీవిద్యాస్మరణవలన కలుగును. కృత త్రేతా ద్వాపర కలి యుగముల యందును దేవతలుగూడ మోక్షము (ఆత్మస్వరూపము) ను పొందుకొరకు భూలోకమునందు జన్మమును కోరుచున్నారు. దేవతలకుకూడ ఈవిద్య దుర్లభము. మోక్షాధికారులకు గురుముఖమువలన పొందబడదగు ఈశ్రీవిద్య సాక్షాత్తు శంకరుడగు నాడును, పునర్జన్మములేనివారును గాని యితరులు పొందలేరని పార్వతితో నీశ్వరుడు చెప్పెను.

బృహదారణ్యము.

"ఆత్మైవేదమగ్రఆసీదితి ప్రక్రమ్య సఇమమేవాత్మానం ద్వేధా ఆపాయత్తతః పతిశ్చ పత్నీచాభవతామితి"

తా॥ ఈజగత్సృష్టికి పూర్వము ఆత్మమాత్రముండెను. ఆ యాత్మయే పురుషుడనియు, శక్తియనియు, రెండుగా భార్యాభర్తలరూపమై ఈజగత్తును సృజించెను.

లలితాసహస్రనామభాష్యే

425 తస్మై నమః

వ్యా॥ తత్పదస్య బుద్ధివిపరివృత్తివిషయే శక్తిః భగవత్యాపి చ సర్వేషాం బుద్ధ్యా విపరివర్తతఏవేతి భవతి తత్పదవాచ్యా॥ ఏవమేవచోక్తం యత్తత్పదమనుత్తమమితి విష్ణుసహస్రనామభాష్యే ఆచార్యభగవత్పాదైః॥

తా॥ తత్పదమునకు అర్థమైన బ్రహ్మమునకు బుద్ధ్యాదులతోకూడిన జగత్సృష్టివిషయమునందు శక్తికలదు. అదియును బ్రహ్మమే సర్వజంతువులయొక్క బుద్ధ్యాదులతో పరివర్తనమగుచున్నది. ఇట్లే తత్పదము ఏదికలదో అది మిక్కిలి ఉత్తమమని విష్ణుసహస్రనామభాష్యమునందు శ్రీశంకరాచార్యులవారివలన చెప్పబడినది.

సత్యమువలన ముక్తి కలుగుననుట.

కఠవల్లి-ఉపనిషత్తు.

అనుపశ్య తథా పూర్వే ప్రతిపశ్య తథా పరే।
సస్యమివ మర్త్యః పచ్యతే సస్యమివాజాయతే॥

తా॥ నరుడు సస్యమువలె నశించుచు మరల పుట్టుచున్నాడు. అసత్యవాదమెఱుగని నీపూర్వులవలెను, వర్తమానకాలసాధువులవలెను సత్యమునే పలుకుచుండుము.

అట్లుండిన జరామరణములు లేనివాడవగుచున్నావు.

జీవన్ముక్తివివేకము.

పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః।
నపాపఫలమిచ్ఛంతి పాపం కుర్వంతి యత్నతః॥

తా॥ నరులు పుణ్యఫలమును కోరుదురుగాని పుణ్యకర్మము లుచేయనిచ్ఛయింపరు. పాపఫలమును కోరరుగాని యత్నము చేత పాపకార్యములనే చేయుచుందురు,

బ్రహ్మాండపురాణము.

ధ్యానైకదృశ్యా జ్ఞానాంగీ విద్యాత్మా హృదయాస్పదా।
ఆత్మైక్యాన్ముక్తిమాయాతి చిరానుష్ఠానగౌరవాత్ ॥

తా॥ చిచ్ఛక్తి జ్ఞానస్వరూపముగుటచేత ధ్యానముచేతనే తెలిసికొనతగును. ఆచిత్తు బ్రహ్మవిద్యాస్వరూపము. హృదయమందుండునది. అట్టి చిచ్ఛక్తిని చిరకాలము సేవించి ఆత్మైక్యమును పొందినప్పుడు ముక్తి కలుగును.

త్వమేవానాదిరఖిలా కార్యకారణరూపిణీ।
త్వామేవహి విచిన్వంతి యోగిన స్సనకాదయః॥

తా॥ అంబా నీకు ఆదిలేదు సకలకార్యములును నీవే. వీని యొక్క కారణమును నీవే. సనకాది మహామునులు నిన్నే వెదకుచుందురు.

వామకేశ్వరతంత్రము–4 పటలము.

పరోహి శక్తిరహితి శ్శక్తః కర్తుం నకించన।
శక్తస్తు పరమేశాని శక్త్యాయుక్తో యదా భవేత్ ॥
శక్త్యావినా శివే సూక్ష్మే నామ ధామ నవిద్యతే।
జ్ఞాతేనాపి మహాదేవి శర్మకర్మ నకించన ॥

తా॥ పరమేశ్వరుడు శక్తిలేనపుడు ఏమియు చేయలేడు. శక్తితోనున్నపుడు సమస్తమును చేయగలడు. శక్తిలేనికాలమునందు పరశివునకు నామరూపములే లేవు. నామరూపములు

లేని యీస్వరూపము తెలిసినను పురుషునకు ప్రియోజనము లేదు. అందుకుచేయతగిన కర్మమును లేదు.

త్రిపురాతాపిన్యుపనిషత్తు 80

గ్రంథమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్పరః ।
పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రంథమశేషతః ॥
గవామనేకవర్ణానాం క్షీరస్యాప్యేకవర్ణతా ।
క్షీరవత్పశ్యతి జ్ఞానం లింగినస్తు గవాం యథా ॥
జ్ఞాననేత్రం సమాధాయ సమహాత్పరమంపదం ।
నిష్కళం నిశ్చలం శాంతం బ్రహ్మాహమితి సంస్మరేత్ ॥

తా॥ ధాన్యమును గ్రహించి పొల్లుకాయలను విడుచునట్లే పూర్ణజ్ఞానముకలిగినపిమ్మట గ్రంథాభ్యాసమును విడువవలయును. గోవులకు రంగులభేదమున్నను పాలకు భేదములేనట్లే జగత్పదార్థములు భేదములుగనున్నను వానియందుగల జ్ఞానమునకు భేదములేకుండ నొకటిగనుండును. జ్ఞాననేత్రముచే నుత్తమపదమును పొంది అఖండబ్రహ్మపదార్థము తానేయని భావింపవలయును.

శ్రుతి-"ఆసుప్తే రామృతేః కాలం నయేద్వేదాంత చింతయా"

తా॥ ప్రతిదినము సుషుప్తివఱకును ఇట్లు మరణమువఱకును వేదాంత (జ్ఞాన) విమర్శనమేచేయువలయును.

బ్ర॥ సూ॥ 4అ॥ 1పా॥ 1సూ.

"ఆవృత్తిరసకృదుపదేశాత్"

తా॥ వినవలెను, విమర్శింపవలెను, అని అనేకసారులు

బోధించుటవలన ఆత్మసాక్షాత్కారమువలుకును విమర్శింపవల
యును. లలితాసహస్రనామము

అభ్యాసాతిశయజ్ఞాతా।

తా। తరుచుగ చేయునట్టి అభ్యాసముయొక్క అతిశయము
చేత చిచ్ఛక్తి తెలియబడును.

త్రి। ర। జ్ఞానఖండం 20 అధ్యాయము.

అప్యస్ఖలితవర్ణాయా పఠితా శ్రుతిరుత్తమా।
సమాహితస్య వ్యాపారే సమాహితస్య చాన్యథా ॥117॥
పూర్వవద్వ్యాప్యస్ఖలితా పఠితా మధ్యమా శ్రుతిః।
యా సదా హ్యనుసంధానయోగాదేవ భవేత్తదా ॥118॥
పఠితా శ్రుతిరత్యంతాస్ఖలితా త్వధమాహి సా।
ఏవమేవాత్మవిజ్ఞానసిద్ధిరుక్తా త్రిధర్షయః ॥119॥

తా। ధారణశక్తిగల బుద్ధితో అభ్యాసాతిశయముచేత
బహువ్యాపారములుచేయుచున్నను స్వరవర్ణలోపములులేకుం
డ శ్రుతి నుచ్చరించుట ఉత్తమము. అన్యవ్యాపారముచేయు
నపుడు సావధానచిత్తముగలిగియు, అన్యవ్యాపారములేనిసమ
యమున ప్రమాదముతో శ్రుతినుచ్చరించుట మధ్యమము.
సావధానముకలిగియున్నను ఎప్పుడును తప్పునేమోఅని భయ
పడుచు పఠించుట అధమము. ఇట్లే జ్ఞానసిద్ధియు త్రివిధము.
కావున స్వరవర్ణలోపములులేకుండ నుచ్చరించుట శ్రేయము.

పంచదశి తృప్తిదీపము–7 ప్రకరణము.

అహం బ్రహ్మేతి వాక్యార్థబోధో యావద్దృఢీభవేత్ ।
శమాదిసహిత స్తావదభ్యసేచ్ఛ్రవణాదికం ॥ 98 ॥

తా॥ నేను బ్రహ్మమైతినని నెడి యాకారముగల మహావాక్యార్థవిచారజనితమగు అపరోక్షజ్ఞానము దృఢమగువఱకును శమాదులతోఁకూడినవాఁడై వేదాంతశ్రవణ మననాదికమును అభ్యసింపవలెను.

క్రిందచెప్పబోవువారికి జాతాశౌచ మృతాశౌచములు లేవనుట. గరుడపురాణము.

వ్రతినః మంత్రపూతస్య సాగ్నికస్య ద్విజస్యచ।
యతినః బ్రహ్మనిష్ఠస్య నషిం రాజ్ఞాంచ సూతకం॥

వ్యాఖ్యానమునను సరించి తాత్పర్యము. సదా బ్రహ్మచర్య వ్రతముగలవానికిని, మహామంత్రజపము చేయువానికిని, నిత్యాగ్ని హోత్రముగలవానికిని, సన్యాసికిని, బ్రహ్మనిష్ఠగలవానికిని, నిత్యమున్ను షోడశమహాదానములు చేయు మహారాజునకును, పురుడుగాని, మయిలగాని లేదు. వారు ఎప్పుడును అనగా సర్వకాలమున్ను వారివారికృత్యములు చేయవచ్చును మఱియు దేహములు నశించునవి జీవుడు పరమాత్మతోఁతుల్యమైనవాడు జీవునకు పుట్టుకగాని, మరణముగాని లేదు. గనుక జాతాశౌచ మృతాశౌచములు లేవు.

శ్రీవిద్యయందును పూర్ణదీక్షగలవానికి యిట్లే చెప్పబడినది.

లింగపురాణము.

యథా శివస్తథా దేవీ యథా దేవీ తథా శివః।
తస్మాదభేదబుద్ధైవ శివేతి కథయంత్యుమాం॥
ఉమాశంకరయోర్భేదో నాస్త్యేవ పరమార్థతః।
ద్విధాసౌ రూపమాస్థాయ సితిపకో నసంశయః॥

పరమాత్మా శివః ప్రోక్తః శివాసైవ ప్రకీర్తితా।

తా॥ శివశక్తులు చంద్రచంద్రికలవలె నొకస్వరూపమే. పరమాత్మయే శివుడనియు, శక్తియనియు చెప్పబడును.

శంకరః పురుషాస్సర్వే స్త్రియఃసర్వా మహేశ్వరీతి॥

తా॥ పురుషులందఱును ఈశ్వరస్వరూపములును, స్త్రీలందఱును మహేశ్వరీస్వరూపులును.

విష్ణుపురాణము.

దేవతిర్యఙ్మనుష్యాదౌ పున్నామా భగవాన్ హరిః।

స్త్రీనామ్నా లక్ష్మీర్మైత్రేయనానయోర్విద్యతే పరమితి॥

తా॥ దేవతలు, తిర్యగ్జంతువులు, మనుష్యులు మొదలగు వానిలో పురుషవాచకమన్నియు విష్ణుస్వరూపము. స్త్రీవాచకమన్నియు లక్ష్మీస్వరూపమును వీరికంటె పరమైనది లేదు.

బ్రహ్మకైవర్తే॥

యత్కించిత్త్రిషు లోకేషు స్త్రీరూపం దేవి దృశ్యతే।

తత్సర్వం త్వత్స్వరూపంస్యాదితి శాస్త్రేషు నిశ్చయఇతి॥

తా॥ మూడులోకములయందును స్త్రీరూపముగలవి అన్నియు ఓపరమేశ్వరీ నీరూపమే. అని శాస్త్రనిశ్చయము.

హరివంశే- దేవీంప్రతి విష్ణువాక్యం॥

నృణాం బంధం వధం రోధం పుత్రనాశం ధనక్షయమిత్యాదినా। ఆపత్సు నిఖిలాసు త్వం రక్షస్యేవ నసంశయ ఇత్యంతేన॥

తా॥ భక్తులను సంసారదుఃఖము, మరణము, రాజబాధ,

సంతాననాశము, ధననాశము మొదలగు సమస్తాపదలనుండి నీవు రక్షించెదవని పరమేశ్వరితో శ్రీమహావిష్ణువు చెప్పెను.

వరాహపురాణే-బ్రహ్మాదికృతస్తోత్రః॥

శరణం త్వాం ప్రపద్యంతే యే దేవి పరమేశ్వరి।
న తేషామాపదః కాశ్చిజ్జాయంతే క్వాపి సంకట ఇత్యాది॥

తా॥ ఓ దేవీ నిన్ను సేవించువారికి నేకాలమందును, ఏయాపదలును కలగవని బ్రహ్మాదులు స్తుతిచేసిరి.

కూర్మపురాణే దేవీవాక్యం॥

యేతు సంగాన్పరిత్యజ్య మామేవ శరణం గతా।
ఉపాసతే సదా భక్త్యా యోగమైశ్వర్యమాశ్రితాః॥
సర్వభూతదయావంతః శ్శాంతా దాంతా విమత్సరాః।
అమానినో బుద్ధిమంత స్తాపసా స్సంయతవ్రతాః॥
మచ్చిత్తా మద్గతప్రాణా మజ్జ్ఞానకథనే రతాః।
సన్న్యాసినో గృహస్థాశ్చ వనస్థా బ్రహ్మచారిణః॥
యే చోక్తైర్లక్షణైర్హీనా అపి మన్నామజాపకాః।
తేషాం నిత్యాభియుక్తానామాపదాం పర్వతానపి॥
నాశయామి తరాం జ్ఞానదీపేన నచిరాదిహేతి॥

తా॥ ఎవరు విషయసుఖములను విడిచి నన్ను శరణుపొంది సర్వభూతములయందు దయకలిగి కోపమును విడిచి ఇంద్రియనిగ్రహముకలిగి, అసహనాది దోషములులేకుండగ జ్ఞానముకలిగి తపస్సుచేయుచు నియమవ్రతముకలిగి చిత్తము, ప్రాణములు నాయందేయుంచి నన్ను తెలియగోరుదురో అట్టి సన్న్యాసికిగాని, గృహస్థునకుగాని, వానప్రస్థునకుగాని, బ్రహ్మచారికి

గాని వారికిచెప్పబడిన లక్షణములు లేకున్నను వారియొక్క సర్వాపదలను జ్ఞానముచేత శీఘ్రముగా నాశముచేసెదను అని పరమేశ్వరిచెప్పెను.

మామనాదృత్య పరమం నిర్వాణమమలం పదం ।
ప్రాప్యతె నహి శైలేంద్ర తతోమాం శరణం వ్రజ ॥

తా॥ ఓహిమవంతుడా నన్ను విడిచి నిర్గుణకైవల్యమును పొందలేవు. కనుక నన్ను సేవింపుము.

యత్తు మే నిష్కళం రూపం చిన్మాత్రం కేవలం శివం ।
సర్వోపాధివినిర్ముక్త మనంతమమృతం పదం ॥
జ్ఞానేనైకేన తల్లభ్యం క్లేశేన పరమంపదం ।
జ్ఞానమేవ ప్రపశ్యంతో మామేవ ప్రవిశంతి తే ॥

తా॥ చిద్రూపానందామృతము జ్ఞానముచేతనే లభింపవలయును. కనుక జ్ఞానసిద్ధికొఱకు నన్ను సేవింపుమని పరమేశ్వరిచెప్పెను.

అహం నారాయణో గౌరీ జగన్మాతా సనాతనీ ।
విభజ్య సంస్థితో దేవ స్వాత్మానం పరమేశ్వరః ॥

తా॥ పరమేశ్వరుడు తనస్వరూపమును శివుడనియు, విష్ణువనియు, జగన్మాతయగు శక్తియనియు విభజించెను.

వి॥ పరమాత్మ సగుణమందు భగవద్గీత, విష్ణుభాగవతము భారతము, రామాయణము మొదలగు గ్రంథములయందు నారాయణుడుగను, దేవీభాగవతము, త్రిశతి, వామకేశ్వర తంత్రము, సౌందర్యలహరి, దేవీవేదపాద స్తవము, గౌడపాద

సూత్రములు మొదలగు గ్రంథములయందు పరాశక్తిగను, స్కాందము, సూతసంహిత, సూత్రభాష్యము, గౌడపాదకారిక లు మొదలగువానియందు శివుడుగను చెప్పబడెను. కానినిర్గుణమందు భేదములేదు. కేవలచిద్రూపమొకటియే. ఇచట శ్రుతి స్మృతులే ప్రమాణము. నిర్గుణమగు చిద్రూపమును పొందుమనియు, దానికిసాధనముగా ధ్యానాదులకొఱకు సగుణమునందు నారాయణుడుగాను, శివుడుగాను, శక్తిగాను మూడురూపములుగా కల్పింపబడినవనియు, సర్వశాస్త్రముల యొక్క తాత్పర్యము. ఈమూడుడుపాసనములే లోకమునందు తరుచుగనున్నది. గనుక వీనిలోనేదియైనను చిద్రూపముగా తెలిసి ధ్యానించువాడు ముక్తిని పొందును.

'అహం' అనునది ప్రకాశవిమర్శలస్వరూపము. వరివస్యారహస్యమునందు "అకారస్సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమశ్శివః। హకారోంత్యః కలారూపో విమర్శాఖ్యః ప్రకీర్తితః" తా॥ సర్వవర్ణములకు మొదటిదగు అకారము పరమశివుడనెడి ప్రకాశరూపము. అంత్యమైన హకారము కలారూపమై చిచ్ఛక్తియను విమర్శరూపము. లకార ళకారములకు భేదములేదు. క్షకారము సంయోగాక్షరము. గనుక ఆద్యంతములు అకార హకారములేయగును. విమర్శలేనిదే యేదియును తెలియదు. ప్రకాశవిమర్శలు చంద్రచంద్రికలవలె భేదములేదు. ఈవిమర్శచేత జ్ఞానసిద్ధికలుగును.

## మహావాక్యార్థవివరణము.

"ఓం ప్రజ్ఞానం బ్రహ్మ। అహం బ్రహ్మాస్మి। తత్త్వమసి।

అయమాత్మా బ్రహ్మ। బ్రహ్మైవేదగ్ం సర్వం। ఆత్మైవేదగ్ం సర్వం। శివోహం బ్రహ్మైవాహమస్మి। ఓం తత్సత్। జీవపరమాత్మైక్య మహావాక్య శ్రీపాదుకాం పూజయామి॥" ఇతి మహాపాదుకే॥

తా॥ వృత్తిరహితము, వృత్తిసాక్షియు నగు ఉత్కృష్టజ్ఞానమే బ్రహ్మ. ఆబ్రహ్మమే నేనైతిని. (ఇది అభ్యాసవాక్యము) ఆబ్రహ్మమే నీవుఐతివి (ఇది గురువుచెప్పెడి వాక్యము) నేనే ఆత్మయనెడి బ్రహ్మమును (ఇది సిద్ధాంతవాక్యము) ఈసర్వము అనగా జగత్తంతయు బ్రహ్మమే. లేక ఆత్మయే. పరశివ స్వరూపము నేనే, బ్రహ్మమును నేనే. ఇట్లు జీవునకును, పరమాత్మకును ఐక్యముచేయు మహావాక్యమును పూజించుచున్నాను. అని ఇతరాధ్యాసలేకుండగ ఇట్లు నిరంతరము మనన ధ్యానములు చేయువాడు కైవల్యముక్తిని పొందును. ఇట్లు శివతత్త్వసుధానిధియందు చెప్పబడినది. అప్పుడప్పుడు బాహ్యవ్యాపారముచేయుచున్నను మరణకాలమునందీదృష్టిగలవాడు ముక్తినిపొందును. అట్టిదృష్టిలేనివాడు మఱల జ్ఞానవాసనతో నుత్తమజన్మమును పొందును. ఇదియే సర్వశాస్త్రసారము. గనుకనే సర్వకాలము అభ్యాసముచేయవలెను. అర్థమును గ్రహించుశక్తి ప్రతిజాతిలోను ఉండవచ్చును. అర్థముతెలియనిశబ్దముచ్చరించినను ముఖ్యఫలములేదు.

## వరివస్యారహస్యము.

నార్థజ్ఞానవిహీనం శబ్దస్యోచ్చారణం ఫలతి। భస్మని వహ్నివిహీనే। నప్రక్షిప్తం హవిర్జ్వలతి॥ అర్థమజానానానాం నానావిధశబ్దమాత్రపాఠవతాం। ఉపమేయశ్చక్రీవాన్మలయజభార

స్య వోఢేవ। పురుషార్థానిచ్ఛద్భిః పురుషైరర్థాః పరిజ్ఞేయాః। అర్థానాదరభాజాం నైవార్థాః ప్రత్యుతానర్థాః ॥

తా॥ అర్థజ్ఞానములేని శబ్దములయొక్క ఉచ్చారణవలన అగ్ని లేనిభస్మమునందు హోమముచేసినట్లే ఫలములేదు. అర్థమునెఱుగక శబ్దములను పఠించువారు మంచిగంధపుకర్రలను మోయు గాడిదె వానిసారమును గ్రహింపలేనట్లే శబ్దార్థమును గ్రహింపలేరు. పురుషార్థములను కోరిన పురుషులు అర్థమును తెలిసికొనవలెను. అర్థమునందు అనాదరణచేసినవారికి అనర్థములుకూడా సంభవించును. వేదమును, ఉపనిషత్తులను ఉచ్చరించుటయే ముఖ్యముకాదు. అర్థము తెలిసినప్పుడే ఆచరణలోపెట్టును. అనుభవమగును. అగ్నిని ఎఱుగకముట్టినను కాల్పకమాననట్లు అర్థము తెలియని ఉచ్చారణవలనకూడా ఫలముకలదని చెప్పుదురుగాని అట్టిఫలము సామాన్యముగాని విశేషమైనదికాదు. "జ్ఞాత్వా కర్మాణి కుర్వీత" యను వాక్యముచేత కర్మలను అర్థమును తెలిసి చేయవలయుననియే చెప్పుచున్నది. ఉచ్చారణకూడా కర్మసంబంధమే. ఇట్లే 'యన్మనసా ధ్యాయతి। తద్వాచా వదతి। తత్కర్మణా కరోతి' మనస్సుచేత ధ్యానించు పరమాత్మను వాక్కుచేత ఉచ్చరించుమనియు దానినే కర్మచేతననగా లిఖించుట మననముచేయుట మొదలగువానిని చేయుమనియు శ్రుతి చెప్పుచున్నది. గనుక నీమూడును పరస్పరసంబంధముగలవి. కావున పురుషార్థము సిద్ధించుటకిది ఉత్తమమార్గము.

దేవీ వేదపాద స్తవము॥

దేవతాంతరమంత్రౌఘ జపశ్రీఫలభూతయా।
జాపక స్తవ దేవ్యంతే విద్యయా విందతేఽమృతం॥

తా॥ అనేకజన్మములందుచేసిన యితర దేవతోపాసనయొక్క ఫలముచేత కడపటిజన్మమునందు చిచ్ఛక్త్యుపాసనము కలిగి ముక్తులగుదురు.

శంకరాచార్యకృత పంచదశీ స్తవము.

కల్పోపసంహారణకల్పిత తాండవస్య దేవస్య ఖండపరశోః పరభైరవస్య। పాశాంకుశైక్షవ శరాసన పుష్పబాణైః స్సా సాక్షిణీ విజయతే తవ మూర్తిరేకా॥

తా॥ పరమేశ్వరుడు శతృవులకు భయంకరుడై ప్రళయకాలమునందుచేయు తాండవమునకు ఓతల్లీ పాశాంకుశములు చెరుకువిల్లు పుష్పబాణములు గలిగిన నీస్వరూపమొకటియే సాక్షిగనున్నది. దీనివలన సగుణమందు రెండునామములును నిర్గుణమందు చైతన్యరూపమొక్కటిగను కనబడును.

అవిజ్ఞాయ పరాశక్తిం స్వాత్మభూతాం మహేశ్వరీం।
అహో పతంతి నిరయే హ్యేకే చాత్మహనో జనాః॥

తా॥ కొందఱు తమయందున్నాత్మరూపమగు పరాశక్తిని తెలిసికొనలేక ఆత్మహత్యచేసిన పాపమును పొందుచున్నారుగదా? ఇంతకంటె ఆశ్చర్యమేమికలదు.

ముఖ్యము బ్రహ్మతేజస్సేకాని యితరతేజస్సులు కావనుట.

శ్రీశంకరాచార్యకృత ఏకశ్లోకీ॥

కింజ్యోతిస్తవ భానుమానహని మే రాత్రౌ ప్రదీపాదికం।
స్యాదేవం రవిదీపదర్శనవిధౌ కింజ్యోతిరాఖ్యాహి మే।

చక్షుస్తస్య నిమీలనాదిసమయే కింధీర్ధియోదర్శనే।
కింతత్రాహమతో భవాన్ పరమకం జ్యోతిస్తదస్మిప్రభో॥

ఈశ్లోకమునకును, మనీషాపంచకశ్లోకములకును, స్వయం ప్రకాశయోగీంద్రవిరచిత వ్యాఖ్యానమునను సరించి తాత్పర్యము వ్రాయబడును.

శంకరుడు ప్రశ్నము:—వత్సా! నీవు ఏ తేజస్సుచేత సర్వమును తెలిసికొనుచున్నావు.

శిష్యుని ఉత్తరవు:—పగలు సూర్యతేజస్సుచేత చూచుచున్నా [ను.

శం:—రాత్రి యే తేజస్సుండును?

శిష్యుడు:—చంద్రుడు, నక్షత్రములు, దీపము మొదలగునవి యుండును.

శం:—సరే, ఈసూర్యచంద్రాదులను, దేనిసహాయమున చూచుచున్నావు.

శిష్యుడు:—నేత్రసహాయమున చూచుచున్నాను.

శం:—ఆనేత్రము లోపించినపుడో?

శిష్యుడు:—నాబుద్ధిచేతనే.

శం:—బుద్ధిరహితమగు సుషుప్తియందేది ఉండును?

శిష్యుడు:—అపుడు నేనుమాత్రమే యుందును.

శం:—పిమ్మట తేజస్సు ఏది?

శిష్యుడు:—స్వామీ! నీయుపదేశమువలన నిత్యజ్యోతిస్స్వరూపబ్రహ్మలక్ష్యార్థము అగు నీవే నేను.

శ్రీశంకరాచార్యులు ఎనిమిదవ వత్సరమున నాలుగు వేదములను, పండ్రెండవవత్సరమున సర్వశాస్త్రములను చదివి పదియారవవత్సరమున బ్రహ్మసూత్రభాష్యములను

రచించి ముప్పదిరెండవ వత్సరమున నాయవతారమును చాలించిరి. దుర్మతములను ఖండించి నరులను సంసారసాగరమునుండి దాటింపతలచి జగత్కారణమగు తేజస్సు ఏది యను ప్రశ్నయు, దానికుత్తరము పరబ్రహ్మ (ఆత్మ) తేజస్సనియు చెప్పిరి. ఎట్లనగా– సూర్యాది తేజస్సులు ఆత్మతేజస్సుచేత ప్రకాశించుచున్నవని "తమేవ భాంతమనుభాతి సర్వం, తస్య భాసా సర్వమిదం విభాతి" యను శ్రుతియును, సూర్యచంద్రాగ్నిమొదలగువాని తేజస్సు ఆత్మతేజస్సును ప్రకాశింపచేయ నేరదని "నతద్భాసయతే సూర్యో నశశాంకో నపావకః। తదేవ జ్యోతిషాం జ్యోతి రాయుర్హోపాసతేఽమృతం" యను శ్రుతియును చెప్పుచున్నవి. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" యను శ్రుతి పరబ్రహ్మమునే చెప్పుటచేతను, అది నేనే యని "త్వంహి నః పితా యోఽస్మాకమవిద్యాయాః పరంపారం తారయసి" యను శ్రుతియందు శిష్యుడు గురువుతో చెప్పుటచేతను, ఆత్మతేజస్సే జగత్కారణము కాని యితరము కాదు. స్థూల సూక్ష్మ కారణ శరీరత్రయభావమును విడిచి చైతన్యభావముగలవారికి సాక్షాత్కారము స్పష్టము. కర్మములచేత చెప్పబడునట్టి తుచ్ఛమగు స్వర్గాదిలోకములను విద్వాంసుడు ఆదరింపడు.

వైరాగ్యబోధోపరతులలో బోధ (జ్ఞానప్రాప్తి) వలనను వైరాగ్యమును, ఉపరమమువలనను జ్ఞానమును, సంపాదింపవలెను. ఉపరమము సప్తమభూమికయందు కలదు. గనుక ప్రారబ్ధభోగకాలమునందును వేత్త తనకు ప్రాప్తించిన బ్రహ్మాదిలోకములను తృణీకరించును, ఒకమారుకలిగినను సాక్షాత్కార

మునకు భంగములేదు. దేహము తానని దృఢజ్ఞానమున్నట్లే దేహము తాను కానని దృఢజ్ఞానముకలిగినపుడు కోరకున్నను ముక్తికలుగును. జ్ఞానముచేత నశించిన ద్వైతజ్ఞానము మరల కలుగుననుటకు ప్రమాణములేదు. కావున బ్రహ్మముతానే యని దృఢజ్ఞానముగలవాడు ముక్తుడు.

మనీషాపంచకశ్లోకవ్యాఖ్యానమునందు॥

సదాకాశచిదానంద సదేకరసరూపిణే।
నిత్యశుద్ధనిరాభాస కూటస్థాయాత్మనే నమః॥ 1 ॥

తా॥ ఆకాశమువలె సంతటను నిండియుండి సత్యజ్ఞానానందరసరూపమై నిత్యపవిత్రమై మాయాకార్యసంబంధములేనిదై జగత్తునందు నిండియున్న పరబ్రహ్మముకొరకు నమస్కారము

ఆనందఘనమద్వంద్వం నిర్వికారం నిరంజనం।
భజేహం భగవత్పాదం భజతామభయప్రదం॥ 2 ॥

తా॥ పరమానందమై ద్వైతభావము, వికారములు, మాయాకార్యములు మొదలగునవి లేనిదై భక్తులకు అభయము నిచ్చునట్టి శంకరాచార్యరూపమగు సగుణబ్రహ్మమును సేవించుచున్నాను.

అవ॥ శ్రీకాశీలో శంకరాచార్యసమీపమునకువచ్చిన చండాలవేషముతోనున్న మహేశ్వరునితో ఓచండాలాధమ దూరముగా పోవుమనగా మహేశ్వరుడిట్లు చెప్పుచున్నాడు. అన్నమయమగు శరీరమునుండే అన్నమయశరీరము పుట్టినది. లేక చైతన్యమువలననే చైతన్యము పుట్టినది. ఓయతిశ్రేష్ఠా నీశరీరమును, నాశరీరమును, అన్నమయకార్యమై యేకమగుటవ

లన అట్లనతగదు. ఇట్లే "శరీరస్యాన్న కార్యత్వేం సవాపేషపురు షోన్నరసమయః" యను శ్రుతి చెప్పుచున్నది. జగత్తు మాయాకార్యమగుటచేత ఆధారబ్రహ్మమునకు ఏకత్వమేగాని రెండవదిలేదు. చైతన్యము ఒకటియేయని "ఏకోదేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" యను శ్రుతి చెప్పుచున్నది. శరీరమాత్రభేదమువలన చైతన్యమునకు భేదము సంభవింపదు. "పరస్వభావకర్మాణి నప్రశంసే న్నగర్హయేత్ । విశ్వమేకాత్మకం పశ్యన్ ప్రకృత్యా పురుషేణ చ॥" అను వాక్యమువలన జగత్తు మాయాకార్యమగుటచేతను, అన్ని శరీరములందునున్న ఆత్మ యొక్కటే అగుటవలనను పరులను నిందింపతగదనుచు చైతన్యము ఏకమని క్రిందిశ్లోకమును చెప్పుచున్నాడు.

శ్లో॥ ప్రత్యగ్వస్తుని నిస్తరంగసహజానందావబోధాంబుధౌ విప్రోయం శ్వపచోయమిత్యపి మహాన్ కోయం విభేదభ్రమః। కిం గంగాంబుని బింబితేంబరమణౌ చండాలవీథీపయః పూరేవాంతరమస్తి కాంచనఘటీ మృత్కుంభయోర్వాంబరే ।

తా॥ అనృతజడదుఃఖాహంకారములకు ప్రతికూలమై ప్రకాశించు సద్రూపమనెడి బ్రహ్మమునందు నదులయందుఉదకములవలె సర్వత్ర ఒకటేరసమగుటవలన సచ్చిదానందరూపలక్షణము చెప్పబడినది. సత్యజ్ఞానానందభేదమున్ను ఉపాధినాశ్రయించినదే. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ । ఆనందో బ్రహ్మేతి" యను శ్రుతులనుబట్టి సమస్తఉపాధులయందును గల కూటస్థుడు, పూర్ణుడు, సచ్చిదానందైకరసము నగు బ్రహ్మమునందు వీడు బ్రాహ్మణుడు, వీడు చండాలుడు అని

ఉత్తమాధమభావము చెప్పతగదు. 'ఏకమేవాద్వితీయం' అను శ్రుతియందు సజాతీయ, విజాతీయస్వగత భేదము లేదని చెప్పుటవలనను, 'మృత్యోస్సమృత్యుమాప్నోతి' యదాహ్యేవైష ఏతస్మిన్ అథ తస్య భయం భవతీత్యాది శ్రుతులచేత భేదమును చూచువానికి నిందయే ప్రాప్తించుచున్నది. గనుక అంతటను నిండియున్న బ్రహ్మమునందు కొంచమైనను భేదము చెప్పుటకు అవకాశము లేదు. ఉత్కృష్ట నికృష్టభేదము ఉపాధులకేగాని చైతన్యమునకు లేదు. ఎట్లనగా- భాగీరథిగంగయందున్న, చండాలవీధిని ప్రవహించుగంగయందును ప్రతిబింబించు సూర్యునకు భేదము లేనట్లే నీచోత్తమశరీరములందున్న ప్రత్యగాత్మకును భేదము లేదు. "ఏక ఏవహి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః। ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్॥" చంద్రుడు ఒకడేయైనను జలమందు అనేకచంద్రులుగా నున్నట్లును, 'కాంచనఘటీ మృదితి' ఆకాశము ఒకటేయైనను బంగారుఘటమందును, మృద్ఘటమందును వేఱువేఱుగా నున్నట్లును, పరబ్రహ్మము ఉపాధులను గ్రహించుటచేతఅనేకులుగానున్నట్లు కనిపించినను ఆత్మరూపమొకటియే. ఇట్లే ఘటాకాశము ఘటము నశించినపుడు ఆకాశమునందే లీనమైనట్లు జీవులున్న ఉపాధులు నశింపగా బ్రహ్మమునందే లీనమగునని 'ఘటసంవృతమాకాశం నీయమానే ఘటె యథా' యను శ్రుతి చెప్పుచున్నది. 'ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః' యను శ్రుతిప్రకారము బ్రహ్మమందు భేదము చెప్పుటకు అవకాశము లేదు. అనిన ఈశ్వరవాక్యమును విని శంకరాచార్యు

లు ఆత్మవిచారణ చేసి క్రింది ఆ ఱుదుశ్లోకముల చేత తన అను భవమును చెప్పుచున్నాడు.

జాగ్రదాద్యవస్థలయందు ప్రకాశించుచున్న సగుణబ్రహ్మమునకు నిర్గుణబ్రహ్మముతో అభేదమును చూపుచున్నాడు. బ్రహ్మజ్ఞానముకలవాడు ఏజాతివాడైనను బ్రహ్మమేయనుట

జాగ్రత్స్వప్నసుషుప్తిషు స్ఫుటతరా యా సంవిదుజ్జృంభతే। యా బ్రహ్మాది పిపీలికాంతతనుషు ప్రోతా జగత్సాక్షిణీ। సైవాహం నచ దృశ్యవస్త్వితి దృఢప్రజ్ఞాపి యస్యాస్తిచే చ్చండాలోస్తు సతు ద్విజోస్తు గురురిత్యేషా మనీషా మమ ॥ 1 ॥

పద 1 జాగ్రత్స్వప్నసుషుప్తిషు 2 స్ఫుటతరా 3 యాసంవిత్ 4 ఉజ్జృంభతే 5 యా 6 బ్రహ్మాదిపిపీలికాంతతనుషు 7 ప్రోతా 8 జగత్సాక్షిణీ 9 సాఏవ 10 అహం 11 న చ 12 దృశ్యవస్తు 13 ఇతి దృఢప్రజ్ఞాపి 14 యస్య 15 అస్తిచేత్ 16 సః 17 చండాలః 18 అస్తు 19 ద్విజః 20 అస్తు 21 గురుః 22 ఇతి 23 ఏషా 24 మనీషా 25 మమ ॥

(1) జాగ్రత్స్వప్న సుషుప్తి యను మూడుకాలముల యందును (3) ఏజ్ఞానము (2) స్పష్టముగా (4) ప్రకాశించు చున్నదో (5) ఏజ్ఞానము (8) లోకమునకు సాక్షియై (6) బ్రహ్మమొదలు చీమవఱకునుగల ప్రాణులశరీరములలో (7) కూర్పబడినదో (9) అట్టి సంవిత్తనెడి జ్ఞానమే (10) నేనైతి ని (12) కనబడు ఈశరీగపదార్థము (11) నేనుకాను (13) ఇట్లు ఉపదేశమక్కరలేకుండా కామక్రోధాదులు జీవులకు

పుట్టినట్లే బహుజన్మములనుండి నిత్యనిరంతరదృఢజ్ఞానసంస్కా రముచేత ఈజన్మమునందు గురూపదేశము, శ్రవణమననాదులును, అక్కరలేకుండా యెదుటనున్న ఘటమువలె ఆత్మస్ఫురించునట్టి జ్ఞానదార్ఢ్యము అనగా తత్వజ్ఞానము (14) ఎవనికి (15) కలిగియుండునో (16) వాడు (17-18) నీచజాతివాడైనను (19-20) బ్రాహ్మణుడైనను, వాడే (25) నాకు (21) జ్ఞానాచార్యుడు (22-23) అని (24) నాబుద్ధికినిశ్చయముగానున్నది. నిత్యశుద్ధమైన ఆత్మజ్ఞానముచేత జాతికులాదులందు అభిమానములేకుండ బ్రహ్మము తానేయను జ్ఞానముకలవాడు చండాలుడైనను విశుద్ధుడే.

అవ! అయితే 'యతో వా ఇమాని భూతాని జాయంతే' త్యాది శ్రుతియందు బ్రహ్మమునకు జగత్కారణత్వమును, 'ప్రతీచ స్తదభావాత్' యను వాక్యముచేత ప్రత్యక్బ్రహ్మ (సగుణబ్రహ్మ) మునకది లేదనియును చెప్పుటవలన నీరెండింటికి ఐక్యము ఎట్లందు వేని సత్వరజస్తమముల నెడి త్రిగుణాత్మకమైన అవిద్యతో కూడిన ప్రత్యక్బ్రహ్మముచేత సృష్టింపబడిన స్వప్నప్రపంచమువలెనే ఆత్మయందు ఈశ్వరభావమును, జగద్భావమును కల్పింపబడినది. "యథా స్వప్నప్రపంచో యం మయి మాయా విజృంభితః। ఏవం జాగ్రత్ప్రపంచోపి మయి మాయా విజృంభితః।" యనువాక్యమందు, నాయందు స్వప్నప్రపంచమువలె జాగ్రత్ప్రపంచముకూడా మాయచేత కల్పింపబడినదని చెప్పబడుటచేత సగుణబ్రహ్మమునకు జగత్కారణము సంభవించుటవలన పరబ్రహ్మత్వముకూడా సిద్ధించినది. ఇంతేకాదు. "తత్సృష్ట్వా తదేవానుప్రావిశ"

దిత్యాదిశ్రుతి। బ్రహ్మమే జగత్తును సృజించి దానియందు తాను ప్రవేశించెనని చెప్పుటయేకాక తత్త్వమస్యాది మహా వాక్యశ్రుతులు జీవభావమును పొందినవానికి స్వాభావికమైన పరబ్రహ్మత్వము చెప్పుచున్నది. ఇట్లు సగుణబ్రహ్మమునకును, నిర్గుణబ్రహ్మమునకును ఐక్యము చెప్పుటచేత బాధకము లేదు.

బ్రహ్మైవాహమిదం జగచ్చ సకలం చిన్మాత్రవిస్తారితం
సర్వం చైతదవిద్యయా త్రిగుణయా నేశం మయా కల్పితం।
ఇత్థం యస్య దృఢామతిస్సుఖతరే నిత్యే పరే నిర్మలే చండా
లోస్తు సతు ద్విజోస్తు గురురిత్యేషా మనీషా మమ ॥ 2 ॥

పద॥ 1 బ్రహ్మ 2 ఏవ 3 అహం 4 ఇదం 5 జగత్ 6 సకలం 7 చిన్మాత్రవిస్తారితం 8 సర్వం చ 9 ఏతత్ 10 అవిద్యయా 11 త్రిగుణయా 12 నేశం 13 మయా 14 కల్పితం 15 ఇత్థం 16 యస్య 17 దృఢా 18 మతిః 19 సుఖతరే 20 నిత్యే 21 పరే 22 నిర్మలే 23 చండాలోస్తు 24 ద్విజోస్తు 25 గురురితి 26 ఏషా 27 మనీషా 28 మమ॥

తా॥ (2-3) నేనే (1) బ్రహ్మమును (సర్వవ్యాపకచైతన్యమును) (4-6) ఈసమస్తమైన (5) ప్రపంచము (7) జ్ఞానముచేతనే విస్తృతంబైనది. అనగా నీజగత్తు బ్రహ్మమందు అధ్యస్తమగుటవలన సకలజగంబును బ్రహ్మాత్మకమే (12) జీవేశ్వరరూపమగు (8-9) ఈభేదప్రపంచము (11) సత్త్వరజస్తమోగుణాత్మకమైన (10) అజ్ఞానోపాధిచేత (13) నావలన (14) కల్పింపబడినది. (15) ఇట్లు (16 ఎవనికి (19)

ఉత్తమానందాత్మకమై (20) నాశరహితమై (22) స్వచ్ఛమైన (21) పరబ్రహ్మమునందు (18) బుద్ధి (17) స్థిరముగాకలదో వాడు (23) చండాలుడైనను (24) బ్రాహ్మణుడైనను (25) గురువని (26) ఎఱుగునట్టిదైన (27) బుద్ధి (28) నాకు కలిగియున్నది. గనుక సగుణబ్రహ్మమునకును, నిర్గుణబ్రహ్మమునకును ఐక్యము సులభమే. అయితే నిర్గుణబ్రహ్మమునందు జగత్తు కల్పింపబడినదని యెట్లందువేని అజ్ఞానముచేత ముత్యపుచిప్పను వెండిఅని తలచినట్లే ద్వైతము స్వతః జడత్వమై బ్రహ్మచైతన్యముచేత ప్రకాశించుటవలనను ద్వైతమునకు అధ్యాససంభవముచేత అద్వైతబ్రహ్మమందు అధ్యస్తమై సత్యముకానందువలనను, సత్యజ్ఞానానందరూప పరబ్రహ్మమే మిగులును. గనుక ఒకానొకప్పుడును అనుపపత్తిలేదు.

శశ్వన్నశ్వరమేవ విశ్వమఖిలం నిశ్చిత్య వాచాగురోర్నిత్యం బ్రహ్మ నిరంతరం విమృశతా నిర్వ్యాజశాంతాత్మనా ।
భూతం భావిచ దుష్కృతం ప్రదహతా సంవిన్మయె పావకే ప్రారబ్ధాయ సమర్పితం స్వవపురిత్యేషా మనీషా మమ ॥ 3 ॥

పద॥ 1 శశ్వత్ 2 నశ్వరం 3 ఏవ 4 విశ్వమఖిలం 5 నిశ్చిత్య 6 వాచా 7 గురోః 8 నిత్యం 9 బ్రహ్మ 10 నిరంతరం 11 విమృశతా 12 నిర్వ్యాజశాంతాత్మనా 13 భూతం 14 భావి చ 15 దుష్కృతం 16 ప్రదహతా 17 సంవిన్మయె 18 18 పావకె 19 ప్రారబ్ధాయ 20 సమర్పితం 21 స్వవపుః 22 ఇతి 23 ఏషా 24 మనీషా 25 మమ ॥

తా॥ (7) స్వస్వరూపసాక్షాత్కారమునిచ్చునట్టి వారియొక్క

(6) వాక్కు చేత (4) ఈప్రపంచమంతయును (2-3) అనిత్యమైనదని (1) మాటిమాటికి (5) నిశ్చయించి (10) ఎల్లప్పుడును (8) నాశములేని (9) పరమాత్మను (11) విమర్శించువాడును, (12) దంభము, దర్పము, అసూయ మొదలగు అసురవాసనలను క్షయింపుచేసి వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానములు కలిగి చైతన్యమాత్రావశిష్టుడై నిలిచినవాడును; (17-18) జ్ఞానాగ్నియందు (13) జ్ఞానోత్పత్తికిపూర్వమునందలి సంచితమును, (14) బ్రహ్మసాక్షాత్కారమునకుతరువాత దేహేంద్రియాదులచేత కలుగు ఆగామి (15) పాపములను (16) నశింపుచేసినవాడగుటచేతను బ్రహ్మవేత్తకు (19-20) ప్రారబ్ధఫలము (21) తన దేహమున్నంతవరకును ఆభాసమాత్రముగానుండుననుటచేతను, (22-23) అట్టివాడైన విద్వాంసుడు ఏజాతివాడైనను గురువని (24-25) నాబుద్ధి నిశ్చయము.

విమర్శమనగా భావన, "సతు దీర్ఘకాలనైరంతర్య సత్కారాసేవితో దృఢభూమిః" యను పతంజలిసూత్రముచేత శాస్త్రప్రకారము సర్వకర్మములను త్యజించి చిరకాలమునుండి నిరంతరసంస్కారముచేత దృఢమగు అఖండచిద్రూపబ్రహ్మము నేనైతినని భావనచేయుట ఇట్లే "దృశిస్వరూపం గగనోపమం సర్వగతం యదద్వయం తదేవ చాహం సతతం విముక్తోం" నిరంతరము బ్రహ్మభావనయే చేయుమని ఆచార్యులవారిచేత చెప్పబడినది.

వాసనలనగా- పూర్వాపరవిమర్శలేకుండ హఠాత్తుగాపుట్టిన దంభాదులకు హేతుభూతమైన చిత్తసంస్కారమే వాసన

యనబడును. విమర్శముచేత అమానిత్వాది దైవవాసనకలిగి నపుడు బాహ్యవాసనలును, దంభాదులును నశించుటచేత వాసనాక్షయమగును. మనస్సునందు యేవృత్తులున్ను లేకపో వుటయే మనోనాశము. మనోనాశముకానపుడు వృత్తులుపు ట్టుచు దంభాదులుకలుగుటచేత వాసనాక్షయము కానేరదు. ఇట్లే వాసిష్ఠమునందు– "యావద్విలీనం నమనో నతావద్వా సనాక్షయః। నక్షీణా వాసనా యావచ్చిత్తం తావన్నశా మ్యతి" అని చెప్పుచున్నది.

వి॥ మఱియు "వాసనాక్షయ విజ్ఞాన మనోనాశా మహా మతే। సమకాలం చిరాభ్యస్తా భవంతి ఫలదా ఇమే ॥ త్రి యఏతే సమంయావన్నస్వభ్యస్తా ముహుర్ముహుః। తావన్న పదసంప్రాప్తి ర్భవత్యపి సమాశతైః ॥ ఏకైకశో నిషేవ్యంతే యద్యేతే చిరమప్యలం। తన్నసిద్ధిం ప్రయచ్ఛంతి మంత్రాః సంకలితాఇవ ॥ జన్మాంతరశతాభ్యస్తా రామ సంసారసంస్థితిః। సా చిరాభ్యాసయోగేన వినా నక్షీయతే క్వచిత్ ॥ తత్వజ్ఞా నం మనోనాశో వాసనాక్షయఏవచ। మిథః కారణతాం గత్వా దుఃసాధ్యాని స్థితానిహి ॥ యావన్న తత్వవిజ్ఞానం తావచ్చిత్తశమః కుతః। యావన్న చిత్తోపశమో నతావ త్త త్వవేదనం ॥"

తా॥ తత్త్వజ్ఞాన మనోనాశవాసనాక్షయములు మూడు న్ను ఏకకాలమునందు అభ్యసింపనియెడల ఎంతకాలము య త్నించినను ముక్తికలుగదు. వేలువేలుకాలములయందు అభ్యా సించుటచేత ఫలములేదు. ఓరామా చిరకాలమునుండి అభ్యా సింపబడిన సంసారస్థితి పైమూడింటిని చిరకాలమభ్యసింపక

నశింపదు. ఆమూలాకును వేలువేలుగా చేయుటకు సాధ్యము కాదు. తత్త్వజ్ఞానము కలుగనిది చిత్తము నశింపదు. చిత్త శాంతిలేకుండ తత్త్వజ్ఞానము కలుగదు.

తత్త్వజ్ఞానమునకు వాసనాక్షయము సాధనమని 'శాంతో దాంత' ఇత్యాది శ్రుతియును, 'అమానిత్వమదంభిత్వం। అజ్ఞానం యదతో౽న్యథేతి' యను స్మృతులును, మనోనాశము సాధనమని 'తతస్తు తం పశ్యతి నిష్కళం ధ్యాయమానః। అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వేతి' యను శ్రుతియును, 'యం వినిద్రాజితశ్వాసాః' ఇత్యాది శ్రుతియును చెప్పుచున్నవి.

బ్రహ్మజ్ఞానికి సంచితపాపము నశించునని 'తద్యథేషీకా ఏవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతె' యను శ్రుతిచెప్పుచున్నది.

ప్రారబ్ధము అనుభవింపనిదే క్షయింపదని చెప్పిన 'నాభుంక్తం క్షీయతే కర్మ' యను వాక్యము బ్రహ్మజ్ఞానములేనివాని విషయము గనుక జ్ఞానికివర్తింపదు దుష్కృతపదముచేత దుష్కృతసుకృతములు రెండింటికి అన్వయము అని 'ఉభే హ్యైష ఏతే తరతీతి' యను శ్రుతిచెప్పుచున్నది.

ప్రారబ్ధము దేహము నశించువరకును ఉండునని 'తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేథ సంపత్స్యే' యను శ్రుతిచెప్పుచున్నది. మఱియు విడిచిన బాణమును మరలించుటకు స్వాతంత్ర్యములేనట్లును, కుండలు చేయుటకు త్రిప్పిన చక్రము దాని వేగమున్నంతవరకును తగ్గిపోనట్లును, ప్రారబ్ధము ఆదేహపాతమువరకునుండును.

అయితే అహంశబ్దార్థమయిన బ్రహ్మము స్వయముగా ప్రకాశించునెడల అహంబుద్ధి ఏలక్షముకొఱకు అని యందుః చేసి ఆత్మను ఆవరించిన అజ్ఞాననివృత్తికొఱకని చెప్పుచున్నా ము. అట్లే 'బ్రహ్మణ్యజ్ఞాననాశాయ వృత్తి వ్యాప్తిరపేక్షితా' అని చెప్పబడినది. చిన్మాత్రరూపముచేత అజ్ఞాననివృత్తికాతగి నదే. అట్లే 'అధిష్ఠానావశేషోహి నాశః కల్పితవస్తునః' అని చెప్పుటచేత కల్పితవస్తువు నశింపగా అధిష్ఠానమే మిగులును. గనుక చిదేకరసమయిన ప్రత్యగాత్మ అహంశబ్దమునకు అర్థ ము. అదియే పరబ్రహ్మమని చెప్పుచున్నారు. 3

యా తిర్యఙ్నరదేవతాభిరహమిత్యంతః స్ఫుటాగృహ్యతే యద్భాసా హృదయాక్షదేహవిషయా భాంతి స్వతోఽచేత నాః । తాం భాస్యైః పిహితార్కమండలనిభాం స్ఫూర్తిం సదా భావయన్ యోగీ నిర్వృతమానసో హి గురురిత్యేషా మనీషా మమ ॥ 4॥

పద॥ 1 యా 2 తిర్యఙ్నరదేవతాభిః 3 అహమితి 4 అంతః 5 స్ఫుటా 6 గృహ్యతే 7 యద్భాసా 8 హృదయాక్షదేహ విషయాః 9 భాంతి 10 స్వతః 11 అచేతనాః 12 తాం 13 భాస్యైః 14 పిహితార్కమండలనిభాం 15 స్ఫూర్తిం 16 సదా 17 భావయన్ 18 యోగీ 19 నిర్వృతమానసః 20 హి 21 గురురితి 22 ఏషా 23 మనీషా 24 మమ ।

తా॥ (1) ఏది (5) స్పష్టముగా (3) నేనైతినని (2) పశు పక్షిమృగాదులచేతను, మనుష్యులచేతను, దేవతలచేతను, (4) లోపల చిదేకరసము (6) గ్రహింపబడుచున్నదో అట్టి

బ్రహ్మముయొక్క ప్రకాశచేత (8) అంతరింద్రియ బాహ్యేంద్రియములతో చేరిన దేహవ్యాపారము (10) తానుగానే (11) చైతన్యస్వరూపముగా నున్నను (7) ఏఆత్మస్ఫూర్తియొక్క ప్రకాశమువలన (9) 'తస్య భాసా సర్వమిదం విభాతి' యను శ్రుతిప్రకారము భాసించుచున్నదో అట్టివాడును, అయితే అహంప్రత్యయజ్ఞానము అందరికినున్నప్పుడు అందుచేత నందరును ఎందుకు ముక్తులుకాలేదని శంకకలుగగా- సూర్యుని చేత ప్రకాశింపబడునట్టి మేఘముల చేత సూర్యుడు ఆవరింపబడినప్పుడు మేఘముల చేత కప్పబడినవానిగాను, కాంతిలేనివానిగాను తలతురు. అట్లే అహంప్రత్యయముతో కూడిన ఆత్మను గుర్తించినవారైనను చిత్తుచేత ప్రకాశించునట్టి, అజ్ఞానముచేత నావరింపబడిన యింద్రియములుగలవారగుటచేత సచ్చిదానందాత్మక పరబ్రహ్మమును కనిపెట్టలేక అజ్ఞానముచేత మోహితులై అహంకారరూపముగా చూచుచున్నారు గాని ఆత్మరూపమని గుర్తెరుగరు. గనుక ముక్తులు కానేరరు. అట్లే 'త్వమహం ప్రత్యయవ్యాజాత్సర్వే జానంతి జంతవః । తథాపి శివరూపేణ నవిజానంతి మోహితాః॥' అను వాక్యమందు చెప్పబడినది. (13) ప్రకాశములేని మేఘముల చేత (14) కప్పబడిన సూర్యమండలముతో తుల్యమైన (12. 15) బ్రహ్మచైతన్యస్ఫురణమును (16) ఎల్లప్పుడును అన్యవ్యాపారములేకుండా ఆబ్రహ్మమే తానని ఏకాకారవృత్తితో (17) అనుసంధానముచేయుచుండుటయే సంప్రజ్ఞాతసమాధి యనబడును. 'తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమితి' యను పతంజలిసూత్రమునందిట్లే చెప్పుచున్నది. సంప్రజ్ఞాతసమాధి

ధ్యానమనియు, సమాధియనియు రెండువిధములు. ఈ రెండును చిత్తైకాగ్రితవలన చూడబడును. బ్రహ్మాకారమనోవృత్తిప్రవాహమైన అహంబుద్ధిలేనిదే సంప్రజ్ఞాతసమాధియొక్క ధ్యానాభ్యాసము కలుగదు. (18) చిత్తవృత్తినిరోధమే యోగము. అదిగలవాడే యోగి. యోగము మౌనాదులకుపలక్షణము. 'మౌనం యోగాసనం యోగ స్తితిక్షైకాంతశీలతా। నిస్పృహత్వం సమత్వంచ సప్తైకాన్యేకదండినఇతి' అను వాక్యమునందు మౌనము, యోగాసనము, యోగము, తితిక్ష, ఏకాంతశీలత్వము, నిస్పృహత్వము, సమత్వము అను ఏడును యోగిలక్షణములుగా చెప్పబడినవి. అట్టివాడగుచు (19) సర్వవ్యాపారములయందును నిరోధింపబడిన మనస్సుతో నిరంతరము విఘ్నములేకుండా భావనచేయుటచేత చిదేకరసబ్రహ్మానందము పుట్టుచున్నది. ఇట్లే 'పరిపాక్తవివేకస్య త్యక్తసంసారసంస్థితేః। చేతిస స్త్వజరామూప మానందోహం వివర్ధతి ఇతి' అను వాక్యమునందు పరిపక్వమైన మనస్సుగల వివేకునకు సంసారబంధమును, ముసలితనమును లేకుండుట బ్రహ్మానందవృద్ధియగునని చెప్పబడినది. పైనిచెప్పిన గుణములుకలిగి చిద్భావభావనచేయువాడు ఎవడుగాని (మమ=నాకు (21) పూజ్యుడని (22-23-24) నాబుద్ధినిశ్చయము.

యత్సౌఖ్యాంబుధిలేశలేశతఇమే శక్రాదయో నిర్వృతాః
యచ్చిత్తే నితరాం ప్రశాంతకలనే లబ్ధ్వా మునిర్నిర్వృతః।
యస్మిన్ నిత్యసుఖాంబుధౌ గళితధీ ర్బ్రహ్మైవ సబ్రహ్మవి
ద్యఃకశ్చిత్సనురేంద్రవందితపదో నూనం మనీషా మమ ॥5॥

పద॥ 1 యత్సౌఖ్యాంబుధి లేశ లేశతః 2 ఇమేశక్రాదయః 3 నిర్వృతాః 4 యత్ 5 చిత్తే 6 నితరాం 7 ప్రశాంతకలనే 8 లబ్ధ్వా 9 మునిః 10 నిర్వృతః 11 యస్మిన్ నిత్యసుఖాంబుధౌ 12 గళితధీః 13 బ్రహ్మైవ 14 సః 15 బ్రహ్మవిత్ 16 యః కశ్చిత్ 17 సురేంద్రవందితపదః 18 నూనం 19 మనీషా 20 మమ॥

తా॥ (2) ఈ యింద్రాది దేవతలు (1) ఏపరబ్రహ్మము యొక్క అనందసాగరములోని అణుమాత్రసుఖమువలన (3) 'ఏతస్యైవానందస్యమాత్రాముపజీవంతి' యను శ్రుతిప్రకారము నిత్యనిరతిశయానందైకరసమగు బ్రహ్మమునందు సంతృప్తులై యున్నారో (9) మననశీలుడైన యోగీంద్రుడు (6) మిక్కిలి (7) సంకల్పాదిరహితమైన (5) హృదయమందు (4-8) ఏబ్రహ్మనందమును పొందినవాడై (10) సంతృప్తుడై యున్నాడో అట్టి (15) ఆత్మజ్ఞాని (11) త్రికాలికాబాధ్యంబును అపారంబునైన సహజానందమగు దేనియందు (12) స్వప్రకాశచిద్ఘన సదానందైకరసవస్తువునందు మునిగినమనస్సుగలవాడై యున్నాడో (ఇదియే సంప్రజ్ఞాతసమాధియని చెప్పబడినది.) ఇట్లే పతంజలిసూత్రము- 'తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః' అనియు, 'మనసో వృత్తిశూన్యస్య బ్రహ్మకారతయా స్థితిః। యా సంప్రజ్ఞాతనామాసౌ సమాధిరభిధీయతే॥' వృత్తిశూన్యమైన మనస్సుగలవాడై బ్రహ్మకారముగనుండుటయే సంప్రజ్ఞాతసమాధియని చెప్పబడినది. ఈప్రకారము (16) ఎవ్వడో యొకడు (18) నిశ్చయముగా పరమానందమునందే మునిగిన మనస్సుగలవాడగు

నో (14) అట్టివాను పూర్ణపరమానందస్వరూపుడగుటవలన (13) బ్రహ్మముతో భేదములేనివాడు. అట్లే 'బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి' యను శ్రుతియు, 'దర్శనాదర్శనేహిత్వా స్వయం కేవలరూపతః। యస్తిష్ఠతి సతు బ్రహ్మన్ బ్రహ్మ సబ్రహ్మవిత్స్వయం' యను స్మృతియు చెప్పుచున్నవి. గనుక నే (17) ఇంద్రాదిదేవతలచేత పూజింపబడు పాదములుగల వాడగును. అట్లే, 'తస్మాదాత్మజ్ఞం హ్యర్చయేద్భూతికామః' యను శ్రుతి మనుష్యులచేతకూడా పూజింపబడువాడని చెప్ప బడుచున్నది. మఱియు 'విచారేణ పరిప్రాప్తవివేకస్యాదితా త్మనః। అనుకంప్యా భవంత్యేతే బ్రహ్మవిష్ణ్వాదిశంకరాః' యను వాక్యముచేత బ్రహ్మాదులచేతకూడా పూజింపబడువా డును, 'అహం బ్రహ్మాస్మి' అనెడి అపరోక్షానుభూతమయిన బ్రహ్మరూపముగలవాడును, గనుకనే ఇంద్రవాక్యం 'ప్రాణో స్మి ప్రజ్ఞాత్మా' యను శ్రుతియు, నారదునిగూర్చి బ్రహ్మ వాక్యం 'ప్రశాంతమమలమద్వయానంద విజ్ఞానఘనఏవాస్మి, తదేవ పరంధామేతి' యను శ్రుతియు, 'సమేష్యాఠం నతిష్ఠంతి వృత్తిం బ్రహ్మమయీం వినా। యథా తిష్ఠంతి బ్రహ్మాద్యా స్సనకాద్యాశ్శుకాదయః' యను శ్రుతియు చెప్పుచున్నవి. ఇతి=ఇట్టిగుణములుగలవాడు (20) నాకు గురువని (19) బుద్ధికలిగియున్నది.

మనీషాపంచక వ్యాఖ్యానాంతమునందలి శ్లోకములు.

ఆనందరూపోహ మఖండబోధః పరాత్పరోహం ఘనచి త్ప్రకాశః। మేఘా యథా వ్యోమ నచ స్పృశంతి సంసార దుఃఖాని నమాం స్పృశంతి ॥ 1 ॥

తా॥ నేను ఆనందరూపుడను, కొఱతలేని తేజస్స్వరూపుడను, మాయకతీతుడను, మాయాకార్యములకంటెను, అతీతుడను, ఘనమైన చిత్తునై అంతెను ప్రకాశింపచేయువాడను. గనుక మేఘములు నిర్మలమగు ఆకాశమును బాధింపలేనట్లు నిత్యానందరూపుడనగు నాకు సంసారదుఃఖములు బాధింపనేరవు.

సత్యచిద్ఘనమఖండమద్వయం సర్వదృశ్యరహితం నిరామయం। చిద్వివర్తజగతోస్యకారణం తత్సదాహమితి మానమాశ్రియ ॥ 2 ॥

తా॥ సత్యమై జ్ఞానఘనమై కొఱతలేనిదై రెండవదిలేనిదై సర్వప్రపంచశూన్యమై మాయాకార్యసంబంధరహితమై చిద్వివర్తమైన జగత్తునకు కారణమైన ఆబ్రహ్మము నేనని సర్వదా మానమునాశ్రయించుచు.

ఆనందమంతన్నిజమాశ్రియంతం ఆశాపిశాచీమవమానయంతం। ఆలోకయంతం జగదింద్రజాలం ఆపత్కథం మాం ప్రవిశేదసంగం ॥ 3 ॥

తా॥ అంతరంగమైన సహజానందము నాశ్రయించినట్టిన్ని ఆశయనెడి పిశాచమును పారదోలుచున్నట్టిన్ని జదత్తును ఇంద్రజాలమాయగా చూచుచున్నట్టిన్ని అసంగోదాసీనచిద్రూపుడనగు నాయందు ఆపత్తులు ఎట్లు ప్రవేశింపగలవు? ప్రవేశింపలేవని అర్థము.

శ్రీశంకరాచార్యకృత దశశ్లోకి।

నభూమిర్న తోయం న తేజో నవాయుర్నఖం నేంద్రియం

వా నచేషాం సమూహః। అనైకాంతికత్వా త్సుషుప్త్యైకసి
ద్ధస్తదేకోవశిష్టః శివః కేవలోహం॥ 1॥

తా॥ నేను పంచమహాభూతములును కాను సర్వదా ఉండని యింద్రియములును కాను దానిసముదాయమును కాను గాఢసుషుప్తియందు ఏకాకారముతో ఆనందస్వరూపమైమిగిలియున్న సజాతీయ విజాతీయాది భేదములు లేని శివుడే నేను.

నవర్ణా నవర్ణాశ్రమాచారధర్మా నమే ధారణా ధ్యాన
యోగాదయోపి। అనాత్మాశ్రయాహం మమాధ్యాసహానా
త్తదేకోవశిష్టః శివః కేవలోహం॥ 2॥

తా॥ నాకు వర్ణాశ్రమాదులుగాని వానిఆచారములుగాని వానిధర్మములుగాని వానితోసంబంధించిన ధ్యాన ధారణ యోగాదులుగాని నాకు లేవు. దేహమునందుకలిగెడి అహంకార మమకారాధ్యాసను విడుచుటవలన కేవల బ్రహ్మభిన్నమై మిగిలియున్న శివుడనే నేను.

నమాతా పితావా నదేవా నలోకా నవేదా నయజ్ఞా న
తీర్థం బ్రువంతి। సుషుప్తౌ నిరస్తాతిశూన్యాత్మకత్వా త్తదేకో
వశిష్టః శివః కేవలోహం॥ 3॥

తా॥ తల్లిదండ్రులు, దేవతలు, లోకములు, యజ్ఞములు మొదలగునవి పరమాత్మను వర్ణించి చెప్పలేవు. గాఢసుషుప్తియందు దృశ్యవస్తువులకు సమానాధికదోషములు లేనందున వానిభావాభావములకు సాక్షియగు శివస్వరూపమే నేను.

నసాంఖ్యం నశైవం నతత్పాంచరాత్రం నజైనం నమీ
మాంసకాదేర్మతంవా। విశిష్టానుభూత్యా విశుద్ధాత్మకత్వా
త్తదేకోవశిష్టః శివః కేవలోహం॥ 4॥

తా॥ సాంఖ్య శైవ పాంచరాత్రి బౌద్ధ పూర్వమీమాంసాది మతములేవియు నాకు లేవు. అన్నిమతములను అనుభవించుచు విశుద్ధస్వరూపుడగు శివుడనే నేను.

నచోర్ధ్వం నచాధో నచాంతర్నబాహ్యం నమధ్యం నతిర్యక్ నపూర్వాపరాదిక్ । వియద్వ్యాపకత్వాదఖండైకరూపస్తదేకో౽వశిష్టః శివః కేవలో౽హం ॥ 5 ॥

తా॥ నాకు పైని క్రింద లోపల వెలపల అడ్డము పొడవు తూర్పు పశ్చిమము మొదలగు భేదమేమియునులేదు. ఈ బాహ్యాంతరాదిభేదములు కల్పితపదార్థములకే కాని ఆకాశమువలె పూర్ణమైనట్టి పరశివస్వరూపమైన నాకు లేవు.

నశుక్లం నకృష్ణం నరక్తం నపీతం నకుబ్జం నపీనం నహ్రస్వం నదీర్ఘం । అరూపం తథా జ్యోతిరాకారకత్వాత్తదేకో౽వశిష్టః శివః కేవలో౽హం ॥ 6 ॥

తా॥ కేవలచిద్రూపుడనగు నాకు తెలుపు నలుపు ఎఱుపు పసపు మొదలగు రంగులును, పొడవు, పొట్టి, లావు, సన్నము మొదలగు గుణములును లేవు. ఏరూపమునులేని జ్యోతిస్వరూపమగు శివుడనే నేను.

నశాస్తా నశాస్త్రం నశిష్యో నశిక్షా నచత్వం నచాహం నచాయం ప్రపంచః । స్వరూపావబోధో వికల్పాసహిష్ణుస్తదేకో౽వశిష్టః శివః కేవలో౽హం ॥ 7 ॥

తా॥ మాయాకల్పితములగు గురువు, శాస్త్రము, శిష్యుడు, శిక్ష, తత్త్వము, ప్రపంచము మొదలగునవి నేను కాను బోధస్వరూపమైనట్టి వికల్పములులేని శివుడనే నేను.

నజాగ్రన్న మే స్వప్నకోవా సుషుప్తిర్న విశ్వో నవా తైజసః ప్రాజ్ఞకోవా। అవిద్యాత్మకత్వాత్త్రయాణాం తురీయ స్తదేకోవశిష్టః శివః కేవలోహం ॥ 8 ॥

తా॥ జాగ్రత్స్వప్నసుషుప్తులు నాకు లేవు. వానికభిమానులగు విశ్వ తైజస ప్రాజ్ఞులును నేను కాను. ఈమూడును అవిద్యాస్వరూపములే గనుక వానికి అతీతమైన తుర్యస్వరూపుడగు శివుడనే నేను.

అపి వ్యాపకత్వాద్ధితత్వప్రయోగా త్స్వతస్సిద్ధభావా దనన్యాశ్రయత్వాత్ । జగత్తుచ్ఛమేతత్సమగ్రం తదన్యత్తదేకో వశిష్టః శివః కేవలోహం ॥ 9 ॥

తా॥ వ్యాపకము, తత్త్వమస్యాది మహావాక్యలక్ష్యము, స్వతస్సిద్ధము, అనితరాశ్రయము (ఇతరాశ్రయములేని?) ఏకమునై మిగిలియున్న శివస్వరూపమే నేను. దృశ్యమంతయు నశించునది. ఈసమస్తదృశ్యమునకు సాక్షినై నిత్యమగు బ్రహ్మమే నేను.

నచైకం తదన్యద్ద్వితీయం కుతస్స్యాత్ నవా కేవలత్వం నచాకేవలత్వం। నశూన్యం నచాశూన్యమద్వైతకత్వాత్కథం సర్వవేదాంతసిద్ధం బ్రవీమి ॥ 10 ॥

తా॥ సర్వమహావాక్యలక్ష్యమగు ఆపరమాత్మ ఒక్కటి యని వాక్కుచేత చెప్పశక్యముగాదు. అట్లుచెప్పతగనిదానికి రెండవవస్తువుండునా? ఆవస్తువు కేవలమనిగాని, అన్యసమేతమనికాని, వాక్కుచే చెప్పతగినదికాదు. ద్వితీయవస్తురహితమగుటచేత నిది శూన్యమనికాని, పూర్ణమనికాని చెప్పతగిన

దియునుకాదు. ఉపనిషద్వాక్యములకు లక్ష్యార్థమగు బ్రహ్మ
ము 'యతో వాచో నివర్తంతే' అనెడి శ్రుతినిబట్టి ఇదమిత్థ
మ్మని వాక్కుచేత చెప్పశక్యముకాదు.

దశశ్లోకసర్యా ఇమే సమ్యగుక్తా త్వాహెూ శంకరాచా
ర్యవక్త్రారవిందాత్ । అజస్రం పఠంతీహ సంతోషబుధ్యా
ప్రియాంత్యేవ తే సచ్చిదానందరూపం ॥ 11 ॥

తా॥ శ్రీశంకరాచార్యులుచెప్పిన యీపదిశ్లోకములను
నిత్యము సంతోషముతో పఠించువారు సచ్చిదానందరూపులై
విలసిల్లుదురు. తపస్స్వరూపము.

జీవన్ముక్తివివేకము.

యోగభూమీనాం దేవలోకప్రాప్తిహేతుత్వం తావత్తా
తపస్త్వం కుతఇతిచేచ్ఛ్రితేఽతి బ్రూమః ॥

తథాచ తైత్తిరీయా ఆమనంతి–

"తపసా దేవా దేవతా అగ్రఆయన్ ।
తపసర్షయః సువరన్ స్వవిందన్" ఇతి ।

తత్త్వజ్ఞానాత్ప్రాచీనస్య భూమికాత్రయస్య తపస్త్వేసతి
తత్త్వజ్ఞానస్యోత్తరకాలీనస్య నిర్వికల్పసమాధిరూపస్య పంచ
మ్యాది భూమికాత్రయస్య తపస్త్వం కైముత్తికన్యాయ
సిద్ధం । అతఏవ స్మర్యతే ।

మనసశ్చేంద్రియాణాంచ ఏకాగ్ర్యం పరమం తపః ।
తజ్జ్యాయః సర్వధర్మేభ్యః సధర్మః పరఉచ్యతే ॥

యద్యప్యనేన న్యాయేన తపసా ప్రాప్యం జన్మాంతరం
నాస్తి । తథాపి లోకసంగ్రహమేదం తపఉచ్యతే ॥

స్మృతి-'లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి'

తా॥ దేవతలు తపస్సుచేతనే ఉత్తములయిరి. ఋషులు తపస్సుచేతనే సువర్లోకమును బొందిరి. తత్త్వజ్ఞానమునకు ముందున్న ఒకటి రెండుమూడు భూమికలు వైరాగ్యాదిశుభముల నిచ్చుటవలన తపస్సు అనబడును. జ్ఞానబలముచేత ఇంద్రియమనస్సులకు ఆత్మయందేకాగ్రతతో నుండుట గొప్ప తపస్సుఅగుచుండగా జ్ఞానానంతరము ఉత్తమపదవినిచ్చెడి ఉత్తరభూమికలు తపస్సు కాకపోవు. ఉత్తరభూమికల నుచ్చరించెడివారికి ముక్తికంటె వేఱగుఫలము లేకున్నను, లోకుల నుద్ధరించుటకై వీరు శుభేచ్ఛాదిభూమికలననుసరింపవలయును.

అహమి ప్రళయం కుర్వన్నిదమః ప్రతియోగినః।
పరాక్రమపరో భుంక్తే స్వాత్మానమశివాపహం ॥

తా॥ అహమునకు వ్యతిరిక్తమగు ఇదంశబ్దముచేత చెప్పబడునవి అన్నియు అహమందు ప్రళయముచేయుచు జన్మరాహిత్యమైన చిదూ్రపానందమును భుజించుచున్నాడు.

నిందవలన హానిలేదనుట.

జీవన్ముక్తివివేకము.

ఆత్మానం యది నిందంతి స్వాత్మానం స్వయమేవహి।
శరీరం యది నిందంతి సహాయాస్తే జనామమ ॥

తా॥ నాయాత్మను నిందచేసినట్లయితే తనది నాది ఒకే ఆత్మకనుక తనఆత్మను తానే నిందచేసికొనినవాడు. నాశరీరమును నిందచేసినట్లయితే తుచ్ఛమయినట్టి ఈదేహము నేను

శానని భావించుచున్న నాకు సహాయుడే కనుక జ్ఞానికి నిందా స్తుతులు సమానమే.

కేవలం పరమాత్మాహం కేవలజ్ఞానవిగ్రహః।
సత్తామాత్రస్వరూపో యో విదేహో ముక్తఏవ సః॥
శివోహం సర్వమేవాహం నాన్యత్కించిజ్జగత్పృథక్।
ఇత్యేవ నిశ్చయో భావో విదేహో ముక్తఏవ సః॥

తా॥ నేను కేవలపరబ్రహ్మమును, జ్ఞానవిగ్రహమును, సత్స్వరూపమును నేనే. ఈశ్వరుడను నేనే. సర్వమును నేనే. జగత్పదార్థములన్నియు నేనే. నాకంటె భిన్నమైనదేదియు లేదు. ఇట్టి నిశ్చయభావనగలవాడు విదేహముక్తుడు.

స్మృతి॥ మృత్యోర్బిభేషి కిం మూఢ భీతం ముంచతి నో యమః। అజాతం నైవ గృహ్ణాతి కురు యత్నమజన్మని॥

తా॥ ఓమూఢుడా? మృత్యువుకొరకు భయమొందుకు? భయపడినను యముడు విడువడుగదా? పుట్టనివానిని గ్రహింపడు గనుక మరలపుట్టుకలేని జ్ఞానముకొరకు యత్నింపుము.

సంశయవిపర్యయములున్నంతవరకు జ్ఞానము
పూర్ణము కానేరదు.

జీవన్ముక్తివివేకము-శ్రీవిద్యారణ్యకృతము.

విదితతత్త్వేపి చిత్తవిశ్రాంతిరహితస్య శుకరాఘవయోరివ సంశయఉత్పద్యతే। సచాజ్ఞానమివ మోక్షస్య ప్రతిబంధకః। అతఏవ భగవతోక్తం-

భగవద్గీత-4 అధ్యాయము।

అజ్ఞశ్చాఽశ్రద్ధధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోఽస్తి నపరో నసుఖం సంశయాత్మనః ॥40

వ్యా॥ అశ్రద్ధా విపర్యయః। అజ్ఞానవిపర్యయౌ మోక్ష మాత్రవిరోధినా। సంశయస్తు భోగమోక్షయోరుభయోరపి విరోధీ। సంశయాత్మనో నకించిత్సుఖమస్తీతి ముముక్షుణా సర్వదా సంశయాశ్ఛేత్తవ్యాః॥ "ఛిద్యంతె సర్వసంశయాః" ఇతి శ్రుతిః॥

తా॥ తత్వము తెలిసినను చిత్తవిశ్రాంతిలేనపుడు శుక రాఘవులకువలె సంశయముపుట్టును. అది అజ్ఞానమువలె మోక్షమునకు ప్రతిబంధకము. విపర్యయమనగా గురువుచెప్పిన వాక్యమందు విశ్వాసములేక అన్యమునే నమ్మట. అజ్ఞానవిపర్యయములు మోక్షమునకును, సంశయము భోగమోక్షములకును ప్రతిబంధకములు. సంశయమువలన లేశమైనను సుఖము లేదు. కనుక దానిని సర్వదా విడువవలయును. పరతత్త్వము తెలిసినవానికి సంశయములు పోవునని శ్రుతిచెప్పుచున్నది.

విపర్యయము.

ఋభుః పరమకరుణయా నిదాఘస్య గృహమేత్య బహుధా తం బోధయిత్వా నిర్జగామ। బుద్ధేఽపి తదుపదిష్టవస్తున్యశ్రద్ధధానో నిదాఘః కర్మాణి పరమపురుషార్థహేతురితి విపర్యయం ప్రాప్య కర్మానుష్ఠానే యథాపూర్వం ప్రవృత్తః। సోఽపి శిష్యస్య పరమపురుషార్థభ్రంశో మాభూదితి కృపయా గురుః పునరాగత్య బోధయామాస। తదాపి విపర్య

యం నజహౌ। తృతీయేనతు బోధనేశ విపర్యయం పరిత్యజ్య విశ్రాంతిమలభత్॥

తా॥ ఋభుమహర్షి పరమకరుణతో నిదాఘుని గృహము నకుబోయి అతనికి తత్త్వమును బోధించెను. గాని దానియం దుశ్రద్ధలేక కర్మములవలననే మోక్షముకలుగునని విపర్యయ మును బొందుటచేత కృపతో మఱల తత్త్వమును బోధించెను అపుడును విపర్యయము (విరుద్ధజ్ఞానము) ను వదలలేదు. కాని మూడవసారి గురువుగారి బోధచేత విపర్యయమును విడిచి విశ్రాంతినిపొందెను.

## జ్ఞానప్రతిబంధకము.

మణీమంత్రౌషధైర్వహ్నిః సుదీప్తోఽపి యథేంధనం।
ప్రదగ్ధుం నైవ శక్తః స్యాత్ప్రతిబద్ధస్తథైవచ॥
జ్ఞానాగ్నిరపి సంజాతః ప్రదీప్తః సుదృఢోపిచ।
ప్రదగ్ధుం నైవ శక్తః స్యాత్ప్రతిబద్ధస్తు కల్మషం॥
భావనా విపరీతాయా యాచా సంభావనా శుక।
కురుతే ప్రతిబంధం సా తత్త్వజ్ఞానస్య నాపరం॥

తా॥ సర్వమును దహించెడి అగ్ని మణిమంత్రౌషధులచేత ప్రతిబంధము కలిగినపుడు కొంచమైనను కాల్పలేదు. అట్లే సంశయ విపరీతభావనలనెడి ప్రతిబంధములున్నపుడు తత్త్వజ్ఞానము కలుగదు. సంశయభావన తత్త్వమసీత్యాది వాక్యశ్రవణముచేతను, విపరీతభావన విద్యామననముచేతను తొలగును. దేవుడు లేడనుట అసంభావన, ఉన్నాడో లేడోయనుట సంశయభావన, ఈ రెండును సమానమే. గురువుబోధించిన చిద్రూ

పము కనుపించలేదనియు, కనబడుచున్న జగత్తే శాశ్వతమని యు, తలచుట విపరీతభావన.

జ్ఞానభూమికలలో 5,6,7 భూమికలయందున్నవారికి ప్రపంచభానములేనందున సంశయ విపర్యయములు నశించి తత్త్వజ్ఞానము ప్రతిబంధములేనిదై యుండును.

జీవన్ముక్తి వివేకము– 2 వాసనాక్షయప్రకరణము.

యం వినిద్రాజితశ్వాసాః సంతుష్టాః సంయతేంద్రియాః।
జ్యోతిః పశ్యంతి యుంజానా స్తస్మై విద్యాత్మనే నమః॥

వ్యాఖ్యానము శివశక్త్యైక్యదర్పణము 3వ ప్రకరణమునందు కలదు. దానిననుసరించి–

తా॥ జ్ఞానవిద్యార్థులు ఉపాసనచేసినవారు, చేయనివారు అని రెండువిధములు. వీరిలో తాను ఉపాసించు దేవతాసాక్షాత్కారపర్యంతము ఉపాసనచేసి జ్ఞానమందుప్రవర్తించినపుడు వాసనాక్షయ మనోనాశములు దృఢతరమగుటచేత జ్ఞానానంతరము విద్వత్సంన్యాసరూప జీవన్ముక్తి స్వతస్సిద్ధముగ కలుగుచున్నది. అట్టివాడే జ్ఞానవిద్యకు ముఖ్యమైన అధికారి. అని జ్ఞానశాస్త్రము చెప్పుచున్నది.

ఇప్పటివారైతే తరుచుగ ఉపాసనచేయనివారే ఔత్సుక్య (వేడుకమాత్ర)ముచేత జ్ఞానవిద్యయందు సాహసముగ ప్రవేశించుచున్నారు. శ్రవణ మనన నిధిధ్యాసల నిపుడు సంపాదించుచున్నారు. వాసనాక్షయ మనోనాశములనుకూడా అప్పుడే అభ్యసించుచున్నారు. వారుచేయునట్టి దృఢాభ్యాసముచేత అజ్ఞాన సంశయ విపర్యయములు నశించి తత్త్వజ్ఞానము కలు

గుచున్నది. పుట్టినజ్ఞానమును బాధించెడి ప్రమాణములులేనం దునను, నశించిన అవిద్యకు పునరుత్పత్తికారణములేనందునను కలిగినజ్ఞానము నశింపనేరదు. వాసనాక్షయ మనోనాశములు దృఢతరమైన అభ్యాసములేనపుడు భోగప్రదమగు ప్రారబ్ధము చేత అప్పుడప్పుడు బాధింపబడుటవలన గాలిలోవుంచిన దీప మువలె త్వరగా నశించుచుండును.

జీవన్ముక్తి వివేకము.

తా॥ సన్యాసో ద్వివిధః। జన్మాపాదక కామ్యకర్మాది త్యాగమాత్రాత్మకః। ప్రైషోచ్చారణపూర్వక దండధార ణాద్యాశ్రమరూపశ్చ। త్యాగశ్చ తైత్తిరీయాదా శ్రూయ తే॥ "నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః" ఇతి।

బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థానాం కేనచిన్నిమిత్తేన సంన్యాసాశ్రమస్వీకారే ప్రతిబద్ధేసతి స్వాశ్రమధర్మేష్వను ష్ఠీయమానేష్వపి వేదనార్థో మానసః కర్మాదిత్యాగో నవిరు ధ్యతే। శ్రుతిస్మృతీతిహాసపురాణేషు లోకేచ తాదృశా తత్త్వవిదాం బహూనాముపలంభాత్ ।

అస్మింశ్చత్యాగే స్త్రియోఽప్యధిక్రియంతే। యాజ్ఞవ ల్క్యే మైత్రేయీంప్రతి సంన్యాసం చకార। ఏతత్ మైత్రే యీ బ్రాహ్మణస్యాద్యంతయోః ఆమ్నాయతే। జీవతః పురు షస్య కర్తృత్వ భోక్తృత్వ సుఖదుఃఖాదిలక్షణ శ్చిత్తధర్మః క్లేశరూపత్వాద్బంధో భవతి। తస్య నివారణం జీవన్ముక్తిః।

కింబహునా ప్రారబ్ధకర్మణ్యేవాత్యంతభక్తేన భవతా యోగాభ్యాసరూపస్య పురుషప్రయత్నస్య వైయర్థ్యం మనసాఽపి చింతయితుమశక్యం। అథవా ప్రారబ్ధం కర్మ యథా తత్త్వజ్ఞానాత్ప్రబలం తథా తస్మాదపి కర్మణో యోగాభ్యాసః ప్రబలోఽస్తు। తథాచ- యోగినాముద్దాలకవీతహవ్యాదీనాం స్వేచ్ఛయా దేహత్యాగఉపపద్యతే॥

యది శాస్త్రీయస్య ప్రయత్నస్య ప్రాబల్యం నాఽఙ్గీక్రియతే తదా చికిత్సామారభ్య మోక్షశాస్త్రపర్యంతానాం సర్వేషాం ఆనర్థక్యం ప్రసజ్యేత ఇత్యాది॥

తా॥ సన్యాసము రెండువిధములు. వీనిలో ఒకటి జన్మకు కారణమగు కామ్యకర్మములను త్యజించుటమాత్రమే. రెండవది ప్రైషోచ్చారణముచేయుచు దండమును ధరించుట మొదలగు ఆశ్రమరూపము. మొదటి సన్యాసమునుగూర్చి 'నకర్మణా నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః' యను తైత్తిరీయశ్రుతి చెప్పుచున్నది. దీనితాత్పర్యము 27 పేజీలోనున్నది. బ్రహ్మచారి, గృహస్థ, వానప్రస్థులకు ఒకానొకకారణముచేత ఆశ్రమసన్యాసము లభింపకున్నను తమతమ ఆశ్రమధర్మములనాచరించుచు మనస్సుచేత కర్మఫలమును త్యజించుట విరుద్ధముకాదు. ఇట్టి తత్త్వవేత్తలనేకులున్నట్లు శ్రుతి స్మృతి పురాణేతిహాసములు చెప్పుటయేకాక లోకమందును చూడబడుచున్నది. యాజ్ఞవల్క్యుడు తనభార్యయగు మైత్రేయికి మొదటివిధమగు సన్యాసమిచ్చినట్లు మైత్రేయీబ్రాహ్మణమునందు చెప్పుటచేత స్త్రీలకును అట్టిఅధికారము కలదు. చిత్తధర్మములగు కర్తృత్వభోక్తృత్వాది

లక్షణములు క్లేశరూపమగుటవలన దానిచేతకలుగు బంధము ను నివారించుటయే జీవన్ముక్తి. ప్రారబ్ధకర్మము యోగాభ్యా సరూప పురుషప్రయత్నముచేత నశించును. కాని వ్యర్థము కాదు. తత్త్వజ్ఞానముకంటె ప్రారబ్ధకర్మము ప్రబలముగానుం డునేని దానికంటె ప్రబలముగా యోగాభ్యాసము, చేయుము. అట్లు ఉద్దాలక వీతహవ్యాది యోగులు ప్రారబ్ధముకంటె వ్యతిరిక్తముగా స్వేచ్ఛగా యోగాభ్యాసముచేత దేహత్యా గముచేసినట్లు శాస్త్రముచెప్పుచున్నది. శాస్త్రీయమైన పురు షప్రయత్నము లేదనునెడల వైద్యశాస్త్రము మొదలు సర్వ శాస్త్రములును వ్యర్థముకావలయును. సన్యాసములలో కర్మ ఫలత్యాగముచేయని ఆశ్రమసన్యాసముకంటె ఫలత్యాగ రూప సన్యాసమే శ్రేయము.

౬॥ ద్విజాతి స్త్రీలకును, శూద్రులకును, ఓంకారస్వాహాకా రములందు సమానాధికారమనియు, స్త్రీలకు పైవిధముగా సన్యాసముకలదనియు శాస్త్రము చెప్పుటవలన స్త్రీపురుషు లందరికిని కర్మఫలత్యాగరూపమయిన సన్యాసమందు అధి కారము కలదు.

అద్వైతసుధాసారము—త్రిపురారహస్యము

జ్ఞానఖండము. 5 అధ్యాయము.

వ్యాఖ్యానమునననుసరించి తాత్పర్యము—

హేమలేఖ తనభర్తకుచేసిన జ్ఞానోపదేశము ఎట్లనగా—

శుద్ధచిత్తు నాతల్లి. నేను జీవుడనెడి చిత్తును. బుద్ధియను దానిని నాకు (జీవునకు) చెలికత్తెగా నాతల్లి (చిచ్ఛక్తి) షే

ర్పరచినది. బుద్ధి సత్త్వగుణప్రధానమైనదే. కాని అవిద్యతో చేసిన స్నేహమువలన జగదాకారమయ్యెను. అవిద్య శుద్ధ చిత్తునకు తెలియకుండ బుద్ధితో గలిసినది. జీవుడు బుద్ధియందలి ప్రతిబింబమాత్రుడే. బుద్ధివలననే జీవేశ్వరభేదము కలిగినది. అవిద్య వేశ్యవంటిది. దానికి మహామోహుడను కుమారుడుదయించెను. వాడు బుద్ధితో క్రీడించుటచేత అస్థిరుడను (మనస్సు) కుమారుడు కలిగెను. ఆమనస్సు సంకల్పమనెడి (చపల) భార్యను పొంది దానియందు ప్రేమతో క్రీడించుచుండగా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లనెడి అయిదుగురు కొడుకులు పుట్టిరి. వీరివద్దకు పోవుచు వచ్చుచునుండుటచేత మనస్సునకు సుఖదుఃఖములు కలుగుచున్నవి. కాని సంకల్పమునందును, శబ్దస్పర్శాదులయందును, ఆసక్తిలేనపుడు మనస్సు దేనినిగాని గ్రహింపక నిర్మలముగనుండును. మఱియు సంకల్పమునకు చెల్లెలగు 'ఆశ' యను దానిని మనస్సు భార్యగాగ్రహించి అనురాగముంచుటచేత దానికి క్రోధము లోభము అనెడి యిద్దరు పుట్టిరి. వీరిద్దరియందును ప్రేమనుంచుటచేత కలిగెడి లోకనిందకు మనస్సు సహింపలేక మృతప్రాయముగనుండును. మనస్సునందధిక ప్రేమతోనున్న బుద్ధియును ఈసుఖదుఃఖములను పొందుచుండును. నేనుమాత్రము ఇట్టి దుస్సాంగత్యములతోనున్న బుద్ధిననుసరింపక మనస్సు మొదలగువారిని ఆభాసముగచూచుచు పరచిత్తుయొక్క మంత్రిసామర్థ్యమువలన దుష్టసాంగత్యదోషములను పొందక నిర్మలముగనుండి సంసారమును ఆభాసముగ చూచుచున్నాను. మనస్సు అలసినపుడు బుద్ధియందు లీనమగుటయే గాఢ

నిద్రయు, సుషుప్తియును. గనుక నీవును నావలెనే పరచిత్తు నాశ్రయించి అవిద్య (అజ్ఞానము) ను, దానివలన కలిగిన మహామోహమును, దానివలన కలిగిన అస్థిరమగు మనస్సు ను, దానిచేత గ్రహింపబడిన సంకల్పమును, దానివలనకలిగి న శబ్దస్పర్శరూపరసగంధములయందలి ప్రేమను, సంకల్పము నకు సోదరియగు ఆశను, దానివలనపుట్టిన క్రోధమును, లో భమును, దూరముగా విసర్జించి వానియందాసక్తిని విడిచి చిద్రూపమునే విమర్శింపుము. అందువలన ముక్తి కలుగును. అని చెప్పిన సంగతులను పరశురామునితో దత్తాత్రేయులు చెప్పెను.

5 వ ప్ర॥ సమాప్తము.

---

# 6 వ ప్రకరణము

---

పురుషప్రయత్నముయొక్క ప్రయోజనము.

శ్రీరామమూర్తితో వసిష్ఠమహాముని చెప్పుచున్నాడు.

యోగవాసిష్ఠము 3 ఉపశమప్ర॥ 13 సర్గ,

విబోధైకానుసంధానా చ్చిదంశాత్మతయా మనః।
చిదేకతాముపాయాతి దృఢాభ్యాసవశాదిహ ॥ 30 ॥
పౌరుషేణ, ప్రయత్నేన తస్మిన్నేవ పదే మనః।
యోజ్యతే తత్పదం ప్రాప్య భవత్యభ్యాసతోహి యత్॥
అతః పౌరుషమాశ్రిత్య చిత్తమాక్రమ్య చేతసా।
విశోకం పదమాలంబ్య నిరాంతంకః స్థిరోభవ ॥ 32 ॥

మనఏవ సమర్థంహి మనసో దృఢనిగ్రహే ।
అరాజా కింసమర్థః స్యాద్రాజ్ఞో రాఘవ నిగ్రహే ॥ 33 ॥
భోగైకవాసనాం త్యక్త్వా త్యజ త్వం భేదవాసనాం ।
భావాభావౌ తతస్త్యక్త్వా నిర్వికల్పః సుఖీభవ ॥ 37 ॥

తా॥ మనస్సు చిద్రూపమైనదే. కాని పురుషప్రయత్నముచేత సదా బ్రహ్మాత్మైక్యానుసంధానముద్వారా చిద్రూపమందుంచినపుడే, మనస్సు చిద్రూపమగును. కనుక చిత్తమును జగద్రూపవాసనలనుండి మరలించి చిద్రూపముచేత నాక్రమించి ఆత్మపదమును బొంది స్థిరుడవగుము. రాజును నిగ్రహించుటకు రాజే సమర్థుడగునట్లు మనోవాసనలను జయించుటకు శుద్ధమైన మనస్సే సమర్థమయినది.

వాసనాసంపరిత్యాగే యది యత్నం కరోష్యలం ।
తాస్తే శిథిలతాం యాంతి సర్వాధివ్యాధయః క్షణాత్ ॥
పౌరుషేణ ప్రయత్నేన బలాత్సంత్యజ్య వాసనాః ।
స్థితిం బధ్నాసి చేత్తర్హి పదమాసాదయస్యలం ॥

తా॥ పురుషప్రయత్నముచేత బలాత్కారముగ సంసార వాసనలను విడిచి బ్రహ్మపదమందు మనస్సు నిలిపితివేని మనోవ్యాధులున్ను, శరీరవ్యాధులున్ను నశించి మోక్షమును పొందగలవు.

వాసిష్ఠము-ముముక్షుప్రకరణము.

సర్వదా సర్వమేవేహ సంసారే రఘునందన ।
సమ్యక్ప్రయుక్తాత్సర్వేణ పౌరుషాత్సమవాప్యతే ॥

తా॥ శ్రీరామా పుత్ర విత్త స్వర్గలోక బ్రహ్మలోక కైవల్యాది ఫలములను, పుత్రికామేష్టి, కృషి, వాణిజ్య, జ్యోతిష్టోమ, బ్రహ్మోపాసనాది పురుషప్రయత్నమువలననే నరుడు పొందును.

ఉచ్ఛాస్త్రం శాస్త్రితంచేతి పౌరుషం ద్వివిధం స్మృతం।
తత్రోచ్ఛాస్త్రమనర్థాయ పరమార్థాయ శాస్త్రితం ॥2॥

తా॥ ఉచ్ఛాస్త్రం, శాస్త్రితం అని పౌరుషము రెండువిధములు. వీనిలో మొదటిది పరద్రవ్యాపహార పరస్త్రీగమనాదులు। దీనివలన నరకముకలుగును. రెండవదగు నిత్యనైమిత్తికానుష్ఠానాదులువలన స్వర్గాది పరమార్థమోక్షముకలుగును.

ఆబాల్యాదలమభ్యస్తైః శాస్త్రసత్సంగమాదిభిః।
గుణైః పురుషయత్నేన స్వార్థః సంపాద్యతే హితః॥

తా॥ బాల్యమునుండి పూర్ణాభ్యాసముచేత శాస్త్రసత్సంగాదులు కలవాడు మోక్షమును సాధించునని వసిష్ఠమహాముని చెప్పగా-

శ్రీరామః:-

ప్రాక్తనం వాసనాజాలం నియోజయతి మాం యథా।
మునే తథైవ తిష్ఠామి కృపణః కింకరోమ్యహం॥

తా॥ నాపురాకృతవాసనననుసరించి యుండగలను. కాని అంతకంటె నేమిచేయగలను. అని శ్రీరామమూర్తియడుగగా

వసిష్ఠః:-

అతిఏవహి హేరామ శ్రేయః ప్రాప్నోషి శాశ్వతం।
స్వప్రయత్నోపనీతేన పౌరుషేణైవ నాన్యథా॥5॥

తా॥ రామా! నీవు వాసనాపారతంత్ర్యము కలవాడవగుటచేతనే అట్టివాసనలు నీమనోవాక్కాయజన్యమయిన పురుషప్రయత్నముచేతనే తొలగును కాని మఱియొకవిధముగ తొలగదు.

ద్వివిధో వాసనావ్యూహః శుభశ్చైవాశుభశ్చ తే।
ప్రాక్తనో విద్యతే రామ ద్వయోరేకతరోథవా ॥ 6 ॥
వాసనౌఘేన శుద్ధేన తత్రచేదపనీయసే।
తత్క్రమేణాశు తేనైవ పదం ప్రాప్స్యసి శాశ్వతం ॥ 7 ॥
అథచేదశుభో భావస్త్వాం యోజయతి సంకటే।
ప్రాక్తనస్తదసౌ యత్నాజ్జేతవ్యో భవతా స్వయం ॥ 8 ॥

తా॥ పురాకృతకర్మముచేత శుభవాసనలే నిన్ను పొందునేని యత్నములేకయే క్రమముగ ముక్తిని పొందగలవు. అశుభవాసనలు పొందినపుడు వానిని నీవు పురుషప్రయత్నముచేత జయింపవలెను. కాని యుద్ధములోవలె నితరులసహాయముచేత జయింపశక్యముకాదు.

శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహంతీ వాసనా సరిత్ ।
పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి ॥ 9 ॥
అశుభేషు సమావిష్టం శుభేష్వేవావతారయేత్ ।
స్వమనః పురుషార్థేన బలేన బలినాంవర ॥ 10 ॥

తా॥ పైరెండువాసనలును నీయందుండెనేని అశుభవాసనలగు పరస్త్రీ పరద్రవ్యాదులయందలి కోరికను ప్రయత్నముచేత నివారించి శాస్త్రార్థములయందును, దేవతాధ్యానాదులయందును నియోగింపుము.

అశుభాచ్చాలితం యాతి శుభం తస్మాదపీతరత్ ।
జంతోశ్చిత్తంతు శిశువత్తస్మాత్తచ్చాలయేద్బలాత్ ॥ 11 ॥

తా॥ పిల్లవానిని మన్నుతినకుండ ఫలభక్షణచేయించినట్లు పిల్లవానివంటిదగు చిత్తమును శుభవాసనలనెడి సత్సాంగత్యముచేత అశుభవాసనలనుండి బలాత్కారముగ మరలింపతగును.

సమతా సాంత్వనేనాఽశు నదాత్రిగితి శనైశ్శనైః ।
పౌరుషేణ ప్రియత్నేన లాలయేచ్చిత్తబాలకం ॥ 12 ॥

తా॥ మంచివాక్యములచేత చపలపశువుకూడ దగ్గిరకుచేరునట్లే శత్రుమిత్రులయందు సమబుద్ధియుంచుటచేత నీచిత్తము స్వాధీనమగును. ఇది శ్రేష్ఠము. బెదిరించుట మొదలగు పనులచేత చపలపశువు ఆలస్యముగ చేరునట్లే ప్రాణాయామప్రత్యాహారాది హఠయోగముచేత నీచిత్తము ఆలస్యముగ స్వాధీనమగును.

ప్రాగభ్యాసవశాజ్జాతో యదా తే వాసనోదయః ।
తదాఽభ్యాసస్య సాఫల్యం విద్ధి త్వమరిమర్దన ॥ 13 ॥

తా॥ శత్రుమిత్రులయందు సమత్వాభ్యాసముచేత మంచివాసనలు కలిగెనేని అభ్యాసము సఫలమగును.

సందిగ్ధాయామపి భృశం శుభామేవ సమాహర ।
శుభాయాం వాసనావృద్ధౌ తాత దోషో నకశ్చన ॥ 14 ॥

తా॥ సందేహమున్నంతవరకును శుభవాసనల నభ్యసించుటచేత దోషములేదు.

అవ్యుత్పన్నమనా యావద్భవానజ్ఞాతతత్పదః ।
గురుశాస్త్రప్రమాణైస్తు నిర్ణీతం తావదాచర ॥ 15 ॥

తా॥ పూర్ణజ్ఞానము కలుగువరకును గురువును, శాస్త్రమును చెప్పినట్లే అభ్యసింపుము.

తతః పక్వకషాయేణ నూనం విజ్ఞాతవస్తునా ।
శుభోప్యసౌ త్వయా త్యాజ్యో వాసనౌఘో నిరోధినా ॥

తా॥ పూర్ణజ్ఞానము కలిగినపుడు జన్మకు కారణమగు సద్వాసనలనుకూడ విడువుము.

యదతి శుభగమార్యసేవితం తచ్ఛుభమనుసృత్య మనోజ్ఞభావబుద్ధ్యా । అధిగమయ పదం యదద్వితీయం తదను తదప్యవముచ్య సాధు తిష్ఠ ॥ 17 ॥

తా॥ శాస్త్రీయశుభమార్గములననుసరించి మోక్షమార్గమునందు నిశ్చలముగనుండుమని వసిష్ఠుడు చెప్పెను.

త్రి॥ ర॥ 7 అధ్యాయము.

శ్రద్ధయా పౌరుషపరో నవిహన్యేత సర్వథా ।
దృఢం పౌరుషమాశ్రిత్య నప్రాప్యేత కథం ఫలం ॥ 12 ॥
పౌరుషాత్కర్షకా ధాన్యం వణిజోధనమేవచ ।
రాజ్యలక్ష్మీం నృపా విప్రా విద్యాం సర్వసుఖాశ్రయాం ॥

తా॥ శ్రద్ధతో పురుషప్రయత్నముచేయువానికి కోరినది ఫలింపకపోదు. దృఢమైనపౌరుషము నాశ్రయించినవానికి ఫలము ఎందుకు పొందబడదు? 12 పురుషప్రయత్నముచేతనే వ్యవసాయదారులు ధాన్యమును, వర్తకులు ధనమును, క్షత్రి

యులు రాజ్యలక్ష్మినని, బ్రాహ్మణులు సుఖాశ్రయమైన జ్ఞాన విద్యను పొందుదురు. 13

అవ॥ నాల్గవపురుషార్థమునకు సాధనము ఎట్లనగా-

అష్టావక్రగీత-1 ప్రకరణము.

కథం జ్ఞానమవాప్నోతి కథం ముక్తిర్భవిష్యతి।
వైరాగ్యంచ కథం ప్రాప్తమేతద్బ్రూహి మమ ప్రభో ॥1
ముక్తిమిచ్ఛసి చేత్తాత విషయాన్విషవత్త్యజ।
క్షమార్జవదయాతోషసత్యం పీయూషవద్భజ ॥ 2 ॥

తా॥ జ్ఞాన, వైరాగ్య, ముక్తులెట్లుకలుగునో బోధింపుమని జనకమహారాజు అడుగగా అనర్థములగు అర్థముల నన్నిటిని నుపేక్షించి నిత్యపరమానందసుఖము నిచ్చు ముక్తియందిచ్ఛకలదేని అనర్థమూలమగు దేహాదివిషయములయందాసక్తిని విడువుము. దేహము మొదలు అహంకారమువరకు గల దృశ్యములన్నియు దేహాదివిషయములే. గనుక వీనిని విషమువలె త్యజింపుము. బాహ్యపదార్థములయందాశలేకపోవుట (దమము) క్షమార్జవాద్యంతరింద్రియనిగ్రహమనెడి (శమము) ను, కలిగియుండుము. క్షమయనగా సకలవికారములకు సాక్షియగు ఆత్మను సదాభావించుట. ఆర్జవమనగా- మాయాసంబంధవికారములు కలుగకుండుట. దయయనగా- హేతువులేనిదే పరులకు హితవునుగోరుట. తోషమనగా- సర్వదా ఆనందమయుడై ఆత్మసుఖము కలిగియుండుట. సత్యమనగా- కాలత్రయమందును మార్పులేని ఆత్మయే. ఇవి ఆత్మజ్ఞునికి ధర్మములు. వీనిని అమృతమువలె ప్రీతితో స్వీకరింపుమని అష్టావక్రముని చెప్పెను.

నపృథ్వీ నజలం నాగ్నిర్నవాయుర్ద్యౌర్నవా భవాన్ ।
ఏషాం సాక్షిణమాత్మానం చిద్రూపం విద్ధి ముక్తయే ॥

తా॥ పంచమహాభూతములలో నేదియు నీవుకావు. అవిగాని వానిగుణములుగాని ఆత్మధర్మములు కావు. గనుక వానినాదరింపకుము. తెలుపు, నలుపు, పొడవు, పొట్టి మొదలగు రూపములు దేహధర్మములు, కాని ఆత్మధర్మములు కావు. దేహాదులకు సాక్షిమాత్రుడవగు ఆత్మయే నీవని దృఢముగ నమ్మి దేహముకంటె వేఱుగనున్న చిద్రూపుడవయి, కర్తృత్వ భోక్తృత్వాద్యనర్థములను విడువుము.

గురువు పరబ్రహ్మముతో భేదములేనివాడు.

గురుగీత-స్కాందము.

హంసాభ్యాం పరివృత్తపత్రకమలై ర్దివ్యైర్జగత్కారణం ।
విశ్వోత్తీర్ణమనేకదేహనిలయం స్వచ్ఛంద మానందకం ।
ఆద్యంతైకమఖండచిద్ఘనరసం పూర్ణం హ్యనంతంశుభం ।
ప్రత్యక్షాక్షరవిగ్రహం గురుపదంధ్యాయేద్విభుంశాశ్వతం।
విశ్వవ్యాపినమాదిదేవమమలం నిత్యం పరం నిష్కలం ।
నిత్యోద్బుద్ధసహస్రపత్రకమలే లుప్తాక్షరే మంటపే ।
నిత్యానందమయం సుఖైకనిలయం నిత్యంశివంస్వప్రభం।
ధ్యాయేద్ధం సపరం పరాత్పరతరం స్వచ్ఛందతస్సర్వదా ॥

తా॥ హంసం అనెడి బీజములతో మూలాధారాది షట్కోణములందు సంచరించుచు సకలదేహవర్తియు, విశ్వాతీతము, భూతభవిష్యద్వర్తమానకాలములు మూడింటియందును చిదేకరసమయి ప్రత్యక్షగురురూపమగు పరమాత్మను ధ్యా

నింపుము. సహస్రారకమలమందు నిత్యముగ అవయవములు లేని స్వయంప్రకాశమగు చిదానందరూపమనెడి పరమాత్మ ను గురుమూర్తితో నభిన్నముగ భావింపవలయును. 1-2.

ఊర్ధ్వామ్నాయగురోః పదం త్రిభువనోంకారాఖ్య సింహాసనం । సిద్ధాచారసమస్తవేదపఠితం షట్చక్రసంచారిణం ।
అద్వైతస్ఫురదగ్నిమేకమమలం పూర్ణప్రభాశోభితం। శాంతం శ్రీగురుపంకజం భజ మనశ్చైతన్యచందోదయం ॥ 3 ॥

తా॥ సర్వోపనిషత్సారభూతము, గురుపదము, మూడు లోకములయొక్క స్వరూపమునై ఓంకారసింహాసనమందుండి సమస్తవేదములచే చెప్పబడుచు, షట్చక్రములందును సంచరించుచు, అద్వైతముచేత ప్రకాశించుచు, చిదగ్నిరూపముతో మాలిన్యములేని పూర్ణప్రకాశముకలిగి సర్వశాంతమగుచు చైతన్యచందోదయమును గలిగించెడి గురుపాదములను ఓమనస్సా సర్వదా ధ్యానింపుము.

నమామి సద్గురుం శాంతం ప్రత్యక్షశివరూపిణం।
శిరసా యోగపీఠస్థం ముక్తికామార్థసిద్ధిదం ॥ 4 ॥
ప్రాతఃశిరసి శుక్లాస్యం ద్వినేత్రం ద్విభుజం గురుం। ·
వరాభయకరం శాంతం స్మరేత్తం నామపూర్వకం ॥ 5 ॥

తా॥ యోగపీఠస్థుడు, శాంతుడు, పరమేశ్వరుడు, నగు సద్గురువును ముక్తికొఱకు శిరసా నమస్కరించుచున్నాను. బ్రహ్మముహూర్తమందు తెల్లనిముఖము, రెండు నేత్రములు రెండుభుజములు, వరమును, అభయమును నిచ్చు హస్తములు

శాంతస్వభావము; గల గురువును దీక్షానామపూర్వకముగ శిరస్సునందు ధ్యానింపవలయును.

ప్రసన్నవదనాక్షంచ సర్వదేవస్వరూపిణం ।
తత్పాదోదకజాధారా నిపతంతీ స్వమూర్ధని ॥ 6 ॥
తయా సంక్షాళయేద్దేహ స్యాంతర్బాహ్యగతం మలం ।
తత్క్షణాద్విరజోభూత్వా జాయతే స్ఫటికోపమః ॥ 7 ॥

తా॥ సమస్తదేవతాస్వరూపమున్ను ప్రసన్నమయిన ముఖమున్ను నేత్రములున్ను గల గురువుయొక్క పాదములనుండి పుట్టిన ఉదకధారచేత తనశిరస్సున్ను దేహమంతయును క్షాళితముచేయుము. అందువలన బాహ్యాంతరమలములు తక్షణమే నశించి స్ఫటికముతో సమానమగు తేజస్సు కలుగును.

తీర్థాని దక్షిణేపాదే వేదాస్తన్ముఖమాశ్రితాః ।
పూజయేదర్చితం తంతు తదభిధ్యానపూర్వకం ॥ 8 ॥

తా॥ గురువుయొక్క దక్షిణపాదమందు సమస్తతీర్థములున్ను, ముఖమందు వేదములున్ను ఆశ్రయించియుండును. గనుక వానిని ధ్యానపూర్వకముగ పూజింపవలయును.

సహస్రదళపంకజే సకలశీతరశ్మిప్రభం। వరాభయకరాంబుజం విమలగంధపుష్పాంబరం। ప్రసన్నవదనేక్షణం సకలదేవతారూపిణం । స్మరేచ్ఛిరసి హంసగం తదభిధానపూర్వంగురుం॥

తా॥ సహస్రారపద్మమందు చల్లనికిరణములున్ను, వరమును, అభయమును ఇచ్చు హస్తములున్ను, సుగంధపుష్పములతోకూడిన అంబరమున్ను, ప్రసన్నమయిన ముఖము, నేత్రములున్ను, కళిగి సమస్తదేవతాస్వరూపమున్ను, హంసస్వ

రూపమున్ను అయిన గురుదేవతను శిరస్సునందు ధ్యానింపవల యును.

పార్వత్యువాచ॥

ఓంనమో దేవదేవేశ పరాత్పర జగద్గురో।
సదాశివ మహాదేవ గురుదీక్షాం ప్రయచ్ఛ మే॥
కేనమార్గేణ భోస్స్వామిన్ దేహీ బ్రహ్మమయో భవేత్।
తత్కృపాం కురు మే స్వామిన్ నమామి చరణౌ తవ॥

తా॥ దేవతలకుకూడ ప్రభువును, పరాత్పరుడవును, మహాదేవుడవునగు ఓసదాశివుడా! గురుదీక్షయందు నాకు ఇచ్ఛకలదు దేహధారులు బ్రహ్మస్వరూపము కాదగినమార్గమును నాయందుకృపతో చెప్పుమని పార్వతి అడుగగా-?

సదాశివఉవాచ॥

మమరూపాసి దేవిత్వం త్వద్భక్త్యర్థం వదామ్యహం।
లోకోపకారకఃప్రశ్నః నకేనాపి కృతఃపురా॥
యో గురు స్సశివః ప్రోక్తో యశ్శివస్స గురుస్స్మృతః।
వికల్పం యస్తు కుర్వీత సనరో గురుతల్పగః॥
దుర్లభం త్రిషు లోకేషు తచ్ఛృణుష్వ వదామ్యహం॥
గురుః బ్రహ్మవినా నాన్య స్సత్యం సత్యం వరాననే॥

తా॥ సదాశివుడు చెప్పుచున్నాడు. ఓదేవీ! నీవు నారూపమే కనుక నీభక్తిచేత మెచ్చి చెప్పుచున్నాను. నీప్రశ్న లోకులకుపకారమయినది. ఇంతకుముందు నన్నెవరును దీనిని కోరలేదు. నేను చెప్పలేదు. గురుస్వరూపమే పరమశివుడు. పరమశివుడే గురుస్వరూపము. ఇట్లు తలంపక గురువు పరబ్రహ్మము కాడని తలంచువాడు మహాపాపి అయి గురుభార్య

తో ప్రవర్తించినవానివలె మహాదోషమును పొందును. ఓదేవి మూడులోకములయందును దుర్లభమయినదానిని చెప్పెదను విన్నుము. పరబ్రహ్మస్వరూపమనునది గురుస్వరూపమే కాని అన్యముకాదు. ఇది సత్యము. నమ్మ్ముము.

ఇతి శ్రీస్కాందపురాణే ఉత్తరఖండే ఉమామహేశ్వర సంవాదె గురుగీతా సమాప్తః

శృతి-

"తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేదితి శృతేః" సర్వ విద్యాధిపతిరేవ గురుర్భవితుమర్హతీతి భావః। 'రుద్రస్తారకం బ్రహ్మ వ్యాచష్టే' ఇతి శృతౌ రుత్సంసారదుఃఖం ద్రావయతి విద్యోపదేశద్వారా జ్ఞానప్రకాశక ఇత్యర్థ ఇతి తద్వ్యాఖ్యానాచ్చ।

"శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః" ఇతి మాండూక్యే। 'ప్రజ్ఞానం బ్రహ్మేతి। సగురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణి శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమితిచ శృతేః' శ్రోత్రియమిత్యధ్యయన శృత్యర్థసంపన్నః బ్రహ్మనిష్ఠః హిత్వా సర్వకర్మాణి కేవల అద్వయే బ్రహ్మణి నిష్ఠాయస్య సోయం బ్రహ్మనిష్ఠః। స్వతోఽశరీరత్వేపి నివృత్తిమార్గోపదేశద్వారా శిష్యానుగ్రహార్థం గృహీతదివ్యశరీరఇతి భావః॥

తా॥ సంసారదుఃఖమును తొలగించెడి బ్రహ్మజ్ఞానోపదేశముచేయు గురువు నాశ్రయించుమని శృతులు ఘోషించుచున్నవి.

శివమద్వైతం అనెడి శ్రుతిచేత కైవల్యమే పరబ్రహ్మ స్వరూపమనియు, ప్రజ్ఞానం బ్రహ్మ అనెడి మహావాక్యము చేత ధీవృత్తిసాక్షియగు శుద్ధజ్ఞానమే బ్రహ్మస్వరూపమనియు చెప్పబడినది.

మఱియు 'సగురు=బ్రహ్మనిష్ఠం' అనెడి శ్రుతి వేదాధ్యయనముగలిగి శ్రుత్యర్థమును తెలిసినవాడును, సమస్తకర్మఫలములను విడిచి బ్రహ్మనిష్ఠయందున్నవాడును నగు శ్రోత్రియమయిన గురువునాశ్రయించుమని చెప్పుటచేత సమస్తవిద్యలను తెలిసినవాడే గురుశబ్దమునకర్హుడు. అట్టిగురువు పరమశివుడే. అతడు శరీరములేని నిర్గుణుడైనను శిష్యానుగ్రహము కొఱకు సగుణరూపమును గ్రహించెను.

యోగవాసిష్ఠము-స్థితిప్ర॥ 16 సర్గ॥

నతపాంసి నతీర్థాని నశాస్త్రాణి జపో నహి ।
సంసారసాగరోత్తారే సజ్జనాసేవనం వినా ॥ 12 ॥

తా॥ సజ్జనసాంగత్యములేనిదే తపస్సు, తీర్థయాత్రలు, జపము మొదలగువానివలన సంసారబంధము తొలగదు.

యోగవాసిష్ఠము-ముముక్షుప్ర॥ 4 సర్గ॥

విశేషేణ మహాబాహో సంసారోత్తరణే నృణాం ।
సర్వత్రోపకరోతీహ సాధుః సాధుసమాగమః ॥ 79 ॥
శూన్యమాకీర్ణతామేతి మృత్యురప్యుత్సవాయతే ।
ఆపత్సంపదివాభాతి విద్వజ్జనసమాగమే ॥ 80 ॥
యః స్నాతః శీతసితయా సాధుసంగమగంగయా ।
కిం తస్య దానైః కిం తీర్థైః కిం తపోభిః కిమధ్వరైః ॥ 81

విచ్ఛిన్నగ్రంథయస్సజ్జాః సాధవః సర్వసంమతాః ।
సర్వోపాయేన సంసేవ్యా స్తైహ్యుపాయా భవాంబుధౌ ॥

తా॥ సత్సాంగత్యము సంసారబంధనివృత్తికి ముఖ్యకారణము. అందువలన శూన్యము పూర్ణముగను, మృత్యువు ఉత్సవప్రాయముగను, ఆపత్తు సంపత్తుగను, మారుచున్నవి. సత్సాంగత్యమనెడి పరమామృతగంగయందు స్నానముచేసినవానికి దాన, తపో, యజ్ఞాదులవలన ప్రయోజనములేదు. స్థూల సూక్ష్మ కారణశరీరములు తానని తలచుటయే గ్రంథి. ఈదేహత్రయసాక్షియగు పరబ్రహ్మము తానని తెలిసినపుడు ఈగ్రంథులు (ముళ్లు) విడును. ఇట్లు స్వరూపసాక్షాత్కారము గలవారే సజ్జనులు. సంసారసాగరములో మునుగువారుసర్వదుఃఖశాంతికై అట్టిసజ్జనులను భక్తితో సేవింపవలయును.

త్రిపురారహస్యం- 3 అధ్యాయము॥

సత్సాంగత్యమే సమస్తదుఃఖములను తొలగించి సకలశ్రేయస్సులనిచ్చు పరమార్థబీజము. అదిలేనిదే శ్రేయస్సు కలుగదు. సంవర్తక మహాత్మునియొక్క సాంగత్యమువలననే నీకు జ్ఞానావస్థకలిగినది. లోకమునందు తాను సాంగత్యముచేయువాని గుణములే తనకును కలుగును. హేమలేఖయొక్క సాంగత్యమువలన ఆమెయొక్క భర్త మొదలగు పురవాసులందరును ముక్తులైరి. కనుక సకలశ్రేయస్సులకు మూలము సత్సాంగత్యమే. అని పరశురామునితో దత్తాత్రేయులు చెప్పుచున్నాడు.

శృణు రామ ప్రవక్ష్యామి నిదానం శ్రేయసః పరం ।
సద్భిః సంగం పరం మూలం సర్వదుఃఖనిబర్హణం । 7 ।

పరమార్థఫలప్రాప్తిబీజం సత్సంగఉచ్యతె।
త్వంచాపి తేనహి సతా సంవర్తేన మహాత్మనా। 8 ॥
సంగతః సన్నిమాం ప్రాప్తో దశాం శ్రేయః ఫలోదయాం।
సంతఏవహి సంయాతా దిశంతి పరమం సుఖం। 9 ।
వినాసత్సంగతః కేన ప్రాప్తం శ్రేయః పరంకదా।
శ్లో॥ కేపి యాదృశం సంగం యోయః ప్రాప్నోతి మానవః॥
తత్ఫలం స సమాప్నోతి సర్వథా నహి సంశయః॥ 10 ॥

4 అధ్యాయము.

సంగేన హేమలేఖాయాః సర్వే విద్యావిదో భవన్।
తస్మాత్సంగః పరం మూలం రామ జానీహి శ్రేయసః॥ 10
అని చెప్పిరి.

శ్రద్ధవలన శ్రేయము కలుగును.

త్రి॥ ర॥ 6 అధ్యాయము.

శ్రద్ధాహి జగతాం ధాత్రీ శ్రద్ధా సర్వస్య జీవనం।
అశ్రద్ధో మాతృవిషయే బాలో జీవేత్కథం వద ॥ 25 ॥
తా॥ శ్రద్ధయే సమస్తమునకు జీవనాధారమున్ను, జగత్తునుధరించిన తల్లిన్నీ. కనుక తల్లివిషయమై శ్రద్ధలేని బాలునికివలె అశ్రద్ధగలవానికెట్లు క్షేమమగునో చెప్పుము.

తస్మాచ్ఛ్రద్ధామృతే లోకోఽవసీదేదశ్వసన్ ధ్రువం।
తస్మాచ్ఛ్రద్ధాం దృఢాం ప్రాప్య సుఖమాత్యంతికం వ్రజ॥
తా॥ దృఢమయినశ్రద్ధతో మోక్షమును బొందుము. శ్రద్ధవలననే కోరినఫలమును బొందుదురు. కాని శ్రద్ధలేనియెడల ఏపనియు సిద్ధింపదు.

కుతశ్శ్రద్ధా విధాతవ్యా కుత్రహా సా నశస్యతే।
అనంత్వాదాగమానాంవై విరుద్ధార్థసమాశ్రయాత్ ।62
ఆచార్యమతిభేదాచ్చ వ్యాఖ్యాతృమతభేదతః।
స్వబుద్ధేరనవస్థానాత్కిమాదేయం నవాపి కిం। 63।

తా॥ శాస్త్రము పరస్పరవిరుద్ధార్థములతో అనంతముగను న్నది. ఆచార్యులకును, వ్యాఖ్యాతలకును మతభేదములు కలవు. తనబుద్ధికే అనవస్థగా అనేకసంకల్ప వికల్పములు కలుగుచుండును. కనుక శ్రద్ధచేత దేనిని గ్రహింపవలయునని హేమచూడుడడుగగా చిచ్ఛక్తి సేవ ముఖ్యమని భార్యయగు హేమలేఖ చెప్పినట్లు త్రిపురారహస్యము జ్ఞానఖండమునందు చెప్పబడెను.

పురుషప్రయత్నము చేయనివాని జీవితము వ్యర్థమనుట.

స్మృతి॥ ప్రథమే నార్జితా విద్యా ద్వితీయే నార్జితం ధనం।
త్రుతీయే న తపస్తప్తం చతుర్థే కిం కరిష్యతి॥

తా॥ నరునకు బాల్య, యౌవన, కౌమార, వార్థకములనెడి నాలుగు అవస్థలును, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, యత్యాశ్రమములనెడి నాలుగు ఆశ్రమములును కలవు.

(ప్రథమే న ఆర్జితా విద్యా=మొదటిదగు బాల్యమనెడి బ్రహ్మచర్యమందు విద్యను ఆర్జింపలేదు.) (ద్వితీయే న ఆర్జితం ధనం=రెండవదగు యౌవనమనెడి గృహస్థాశ్రమమందు ధనమును సంపాదింపలేదు.) (త్రుతీయే న తపః తప్తం=మూడవదగు కౌమారమనెడి వానప్రస్థాశ్రమమునందు తపస్సు చేయలేదు.) (చతుర్థే కిం కరిష్యతి=నాల్గవదగు వార్థకావస్థయందు ఏమిచేయగలడు.)

మొదటిఅవస్థలో విద్యను, రెండవఅవస్థలో ధనమును, మూడవవయవస్థలో తపస్సును, ఆర్జింపనివాడు నాల్గవవయవస్థలో సుఖింపలేడని భావము.

6 వ ప్ర॥ సమాప్తము.

---

# 7 వ ప్రకరణము

అధ్యయన యజ్ఞ దానాది కర్మములు జ్ఞానసాధనములై జ్ఞానమునకు అంగమని నిరూపణము.

4 అధ్యాయము 1 పా॥ 12 అగ్నిహోత్రాద్యధిక॥

1 అగ్నిహోత్రాదితు 2 తత్కార్యాయైవ
3 తద్దర్శనాత్ ॥ 16 సూ॥

(1) అగ్నిహోత్రాది నిత్యనైమిత్తిక కర్మములు (2) జ్ఞానముకొరకు సాధనములని (3) శ్రుతులవలన కనుబడుచున్నది.

బృ='తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి। యజ్ఞేన దానేన తపసా నాశకేన'

దీనితాత్పర్యము 3వ ప్రకరణములో 3అ. 4 పాదము 26 సూత్రముక్రింద కలదు.

7 వ ప్ర॥ సమాప్తము.

---

# 8వ ప్రకరణము

జ్ఞానము అధ్యయనాదికర్మము లీజన్మమునందు లేకున్నను, పూర్వజన్మవాసనాదులచేత కలుగునని నిరూపణము.

బ్రహ్మవిద్య స్వతంత్రమైనదని 3 అధ్యాయము 4 పాదము మొదటిఅధికరణమందును, అందుకుగల కారణములు 2,3,4 అధికరణములందును, కర్మాపేక్ష లేకనే స్వాతంత్ర్యఫలము నిచ్చునని 5 వ అధికరణమునందును, ఆశ్రమకర్మములు జ్ఞాన సాధనములే కాని స్వతంత్రముగా మోక్షమునియ్యచాలవని 6 వ అధికరణమునందును, ప్రాణమే తానౌనెడి ప్రాణోపాస కుడు ప్రాణముపోవునను సమయమున వర్ణాశ్రమాదిభేదము లేకనే సర్వాన్న భక్షణచేయవచ్చునని 7 వ అధికరణమునందు ను, నిత్యములగు ఆశ్రమకర్మములు జ్ఞానసాధనమని 8 వ అధి= నందును, విధురునకును, (భార్యచనిపోయినవానికి) చెవుడు, గుడ్డి, మూగ గలవారలకును, బ్రహ్మవిద్యాధికారము కలదని 9 వ అధికరణమునందును, సన్యాసాశ్రమమునుండి మరల పూర్వాశ్రమమునకు రాకూడదని 10 వ అధికరణము నందును, బ్రహ్మచారి, వానప్రస్థు, భిక్షుకుడు మొదలగువా రికి ప్రాయశ్చిత్తము కలదని 11 వ అధికరణమునందును, ప్రాయశ్చిత్తముచేత పరిశుద్ధుడైనవానితో శిష్టులు భుజింప రాదు, అధ్యయనముచేయరాదు అని 12 వ అధికరణమునం

దును, ఉద్గీథాది కర్మాంగోపాసనములు ఋత్విజుడే చేయవల యునని 13 వ అధికరణమునందును, ముముక్షువునకు మౌన ము, నిదిధ్యాసమును విధియని 14 వ అధికరణమునందును, ముముక్షువు తనధర్మములను ప్రకటింపని చిహ్నములతో నుండునని 15 వ అధికరణమునందును, జ్ఞానసిద్ధి ఈజన్మమునం దుగాని, రాగలజన్మమందుగాని కలుగునని 16 వ అధికరణ మునందును, అట్లే ముక్తికలుగుటకును అని 17 వ అధికరణ మునందును చెప్పబడుచున్నది.

3అ. 4పా. పురుషార్థాధికరణము.

సూ. 1 పురుషార్థోఽతః శబ్దాదితి బాదరాయణః॥

పద॥ 1 పురుషార్థః 2 అతః 3 శబ్దాత్ 4 ఇతి 5 బాద రాయణః ॥

తా॥ ఆత్మజ్ఞానము స్వతంత్రముగా మోక్షము నిచ్చుచు న్నదా? లేక కర్మసహితమై యిచ్చుచున్నదా యని సంశయ ము కలుగగా సిద్ధాంతము. (2) వేదాంతవిహితము, స్వతంత్ర మునగు ఆత్మజ్ఞానమువలననే (1) పురుషార్థమగు మోక్షము సిద్ధించుచున్నది. (4-5) అని బాదరాయణాచార్యుడు (3) శ బ్దమనగా శ్రుతిప్రమాణమువలన తలచుచున్నాడు.

1 ఛాం. 7-13 'తరతి శోకమాత్మవిత్'

తా॥ ఆత్మనెఱిగినవాడు మనస్తాపమును పొందడు.

2 ముం. 3-29 'సయోహవై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి'

తా॥ సర్వోత్కృష్టమగు బ్రహ్మము తానేయని తెలిసికొనినవాడు బ్రహ్మమే అగును.

3 తై. 2-1 'బ్రహ్మవిదాప్నోతి పరం'

తా॥ బ్రహ్మమునెఱిగినవాడు బ్రహ్మమే యగును.

4 ఛాం. 6-14-2 'ఆచార్యవాన్ పురుషో వేద తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యేఽథ సంపత్స్యే'

5 ఛాం. 8-1-5 'యఆత్మాపహతిపాప్మా'

తా॥ బ్రహ్మమునకు ధర్మాధర్మములు లేవు.

6 బృ. 6-5-6 'ఆత్మావారే ద్రష్టవ్యః'

తా॥ ఆత్మనే చూడవలెను అనగా ఆత్మకంటె నితర వస్తువునందు దృష్టియుంచకూడదని తాత్పర్యము.

7 బృ. 6-5-15 'ఏతావదరేఖల్వమృతత్వం'

తా॥ ఓమైత్రేయీ ఇదికాదు ఇదికాదు అని అంతను నిషేధింపగా మిగులునదే ఆత్మజ్ఞానము.

2 వ సూత్రము మొదలు 7 వ సూత్రమువఱకును పూర్వపక్షము-

సూ.2 శేషత్వాత్పురుషార్థవాదో యథాన్యేష్వితి జైమినిః॥

పద॥ 1 శేషత్వాత్ 2 పురుషార్థవాదః 3 యథా 4 అన్యేషు 5 ఇతి 6 జైమినిః।

తా॥ (1) కర్తయగు బ్రహ్మము కర్మములకు అంగమగును. (3-4) యాగాదులయందు ధాన్యప్రోక్షణము అంగమగు

నట్లే 'యస్య పర్ణమయీ జుహూర్భవతి । నసపాపగ్ంశ్లోకం శృణోతి' అనెడివాక్యమువలె (2) విజ్ఞాసముసైతము ఆత్మజ్ఞాన మందు స్తుతియగును. (5-6) అని జైమిన్యాచార్యుని పూర్వ పక్షము.

3 ఆచారదర్శనాత్ ॥

తా॥ కొన్నిశ్రుతులు బ్రహ్మవిదులకును కర్మములను విధించుచున్నవి. అట్లే యుద్దాలకాదులకు పుత్రానుశాసనాది కమువలన గార్హస్థ్యసంబంధము కనిపించుచున్నది. గనుక బ్రహ్మవిద్యకు కర్మాపేక్షకలదని పూర్వపక్షము.

1 బృ. 5 1-1 'జనకోహ వైదేహో బహుదక్షిణేన యజ్ఞేనేజే'

తా॥ జనకమహారాజు బహుదక్షిణలుగల అశ్వమేధయాగమును చేసెను.

4 తచ్ఛ్రుతేః ।

ఛాం. 1-1-10 'యదేవ విద్యయా కరోతి శ్రద్ధయా చోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి'

యను శ్రుతివలన బ్రహ్మవిద్య కర్మశేషమగును.

5 సమన్వారంభణాత్ ।

బృ. 6-4-2 'తం విద్యాకర్మణీ సమన్వారభేతే' పరలోకమునకుపోవు జీవునితో కర్మోపాసనలు రెండును పోవుచున్నవి. ఇందువలన కర్మసహాయము లేకుండా విద్య మోక్షహేతువు కాదు.

6 తద్వతో విధానాత్ ।

ఛాం. 8-15-1 'ఆచార్యకులాద్వేదమధీత్య యథా విధా

నం గురోః కర్మాతిశేషేణాభిసమావృత్య కుటుంబే శుచౌ దేశే స్వాధ్యాయమధీయానః'

గురువువద్ద వేదమును చదివి పెండ్లిచేసికొని విహితకర్మములను చేయుచు బ్రహ్మమునందు ఇంద్రియములను నిలిపినవాడు అర్చిరాదిమార్గముచేత బ్రహ్మలోకమును పొందుచున్నాడు. ఇత్యాది శ్రుతులు (తద్వతః) సమస్తవేదార్థమునెఱిగినవానికి (విధానాత్) కర్మాధికారమును చూపుటవలన విద్య స్వతంత్రహేతువు కాజాలదు.

7 నియమాచ్చ ॥

క్రిందిశ్రుతులు యావజ్జీవము కర్మములను చేయుమనుట వలన విద్య కర్మాంగమే.

1 ఈ. 2 'కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతంసమాః। ఏవం త్వయి నాన్యథేతో஽స్తి నకర్మ లిప్యతే నరః'

తా॥ ఆత్మజ్ఞానములేనివాడు అగ్నిహోత్రాదికర్మములు చేయుచుండునేని వానిని పాపకర్మములు పొందవు. వేఱొకవిధముగా శ్రేయస్సు కలుగదు.

2 'ఏతద్వై జరామర్యం సత్రం యదగ్నిహోత్రం జరయా హ్యేవాస్మాన్ముచ్యతే మృత్యునావా'

తా॥ అగ్నిహోత్రకర్మము జరామరణావధికమగు సత్రము. ఈకర్మముచేత ముసలితనమును, మృత్యువును జయించెదరు. 2 మొ 7 వఱకును పూర్వపక్షమే.

సిద్ధాంతము:--

8 అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం తద్దర్శనాత్

పద॥ 1 అధికోపదేశాత్ 2 తు 3 బాదరాయణస్య 4 ఏవం 5 తద్దర్శనాత్ ॥

తా॥ (2) తుశబ్దము రెండవసూత్రమునందలి పూర్వపక్షమును వారించుచున్నది. (1) పై అర్థవాదశ్రుతి జీవునకు చెప్పవచ్చును. కాని జీవునికంటె నధికుడగు పరమాత్మయందు వర్తింపదు. పరమాత్మజ్ఞానమునకు కర్మాంగత్వము సంభవింపదు. (3) బాదరాయణాచార్యునియొక్క మొదటిసూత్రమునందలి మతము (4) అట్లేయుండునుగాని మారదు. (5) అట్లే అనేకశ్రుతులు చెప్పుచున్నవి.

1 ముం. 1-i-9 'యస్సర్వజ్ఞ స్సర్వవిత్'

తా॥ ఎవడు సామాన్యముగా నన్నిటినెఱుగునో ప్రత్యేకముగా నన్నిటిని తెలియునో యతడే హిరణ్యగర్భాది జగత్తును పుట్టించువాడు.

2 'భీషాస్మాద్వాతః పవతే। భీషోదేతి సూర్యః। భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమః॥'

తా॥ ఈశ్వరాజ్ఞ చేతనే వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు, యముడు మొదలగువారు తమతమకార్యములను చేయుచున్నారు.

3 బృ. 5-8-9 'ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి'

తా॥ ఓగార్గీ సూర్యచంద్రాదులు రాజాజ్ఞయందువలెనే బ్రహ్మముయొక్క ఆజ్ఞయందు నిలుచుచున్నారు.

4 క. 2-6-2 'మహద్భయం వజ్రముద్యతం'

తా॥ ఎత్తబడిన వజ్రాయుధమువలె సూర్యాదిజగత్తునకు బ్రహ్మము భయకారణము.

5 ఛాం. 6-2-3 'తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజో సృజత'

తా॥ సత్పదార్థమే తాను అనేకాకారములగుదునని సంకల్పించి అగ్ని మొదలగువానిని సృజించెను.

6 బృ. 4-4-5 'ఆత్మావారే ద్రష్టవ్యః'

తా॥ ఆత్మస్వరూపమే చూడతగినది.

7 బృ. 4-4-10 'యఎషోక్షిణి పురుషో దృశ్యతే'

తా॥ కంటియందుచూడబడుచున్నపురుషుడు పరబ్రహ్మమే

8 బృ. 5-5-1 'యోశనాయా పిపాసే శోకం మోహం జరాం మృత్యుమత్యేతి'

తా॥ ప్రాణధర్మములగు క్షుత్పిపాసలను, మనోధర్మములగు శోకమోహములను, దేహధర్మములగు జరామరణములను అతిక్రమించినవాడు సర్వాంతరుడగు పరమాత్ముడే.

9 ఛాం. 8-12-2-3 'పరంజ్యోతిరుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే స ఉత్తమః పురుషః॥'

తా॥ విద్వాంసుడగు జీవుడు ఈశరీరమును విడిచి పరమా

త్మలక్షణమగు తేజోరూపమును పొందుచున్నాడు. అతడే ఉత్తమపురుషుడు.

ఈశ్రుతులచేత జీవేశ్వరులకు అభేదమనియు, జీవుని కంటె ఈశ్వరుడధికుడు అనియు చెప్పబడుచున్నది.

అన॥ 3 సూత్రమునందలి పూర్వపక్షఖండనము.

1 తుల్యం తు 2 దర్శనం 9

తా॥ (2) ఆచారదర్శనము (1) సమానమే గనుక విద్య కర్మశేషమనతగదు.

1 ఏతద్ధస్మవై తద్విద్వాంస ఆహుర్ఋషయః కావషేయాః కిమర్థావయమధ్యేష్యామహే కిమర్థావయం యక్ష్యామహే ఏతద్ధస్మవై తత్పూర్వే విద్వాంసోగ్ని హోత్రం నజుహవాం చక్రిరే।'

తా॥ ఆత్మజ్ఞానులైన కావషేయఋషులును, ప్రాచీనబ్రహ్మవిదులును, మనము దేనినికోరి చదువుకొందుము; ఏమికోరి దేవతలను పూజింతుము; అని తలచి అగ్నిని పూజింపరైరి.

2 బృ. 5-5-2 'ఏతంవై తమాత్మానం విదిత్వా బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి।'

తా॥ సంసారధర్మములచేత స్పృశింపబడని యాత్మతత్త్వమును తెలిసికొని బ్రహ్మము తానని దృఢనిశ్చయముగల బ్రాహ్మణులు లోకమును జయింపగల పుత్రునిని, కర్మముచేత పితృలోకజయమును, విద్యతోకూడిన కర్మముచేత దేవలోకమును, కేవలవిద్యచేత బ్రహ్మలోకమును పొందనిచ్చను

విడిచి పరమహంసపరివ్రాజ్యమును పొంది భిక్షార్థము సంచారముచేసిరి. కనుక జ్ఞానవిద్య కర్మాంగము కాదు.

అవ॥ 4 సూత్రమునందలి పూర్వపక్షఖండనము.

10 అసార్వత్రికీ ।

ఛాం. 1-1-10 శ్రుతి॥ ఓంకారము నెఱుగక కర్మముచేయువానికంటె నెఱిగిచేసిన కర్మ గొప్పఫలము నిచ్చుననుటచేత విద్యతో సంబంధించినది. (అసార్వత్రికీ) సర్వవిద్యావిషయమైనది కాదు. 'ఓమి త్యేతదక్షరముద్గీథ ముపాసీత' యను వాక్యముచేత నుద్గీథవిద్యనుగూర్చి చెప్పబడినది గనుక శ్రుతి బలమువలన బ్రహ్మవిద్య కర్మాంగముకాదు.

అవ॥ 5 సూత్రమునందలి పూర్వపక్షఖండనము.

1 విభాగః 2 శతవత్ 11

బృ. 6-4-2 శ్రుతికి అర్థము. (1) విద్య ముముక్షువును గురించియు, కర్మము మఱియొకనిని గుఱించియు, ననిగాని సముచ్చయముచేత రెండును చెప్పతగదు. (2) 'శతమాభ్యాం దీయతా' మనువాక్యమునందు వీఱిద్దరికిని నూరు అని చేసిన యేర్పాటు చెరిసగము అగునట్లే సమన్వారంభణవాక్యము ముముక్షువిషయమే అని సూత్రకర్తఅభిప్రాయము.

గాని విచారింపగా—

1 బృ. 6-4-6 'ఇతితు కామయమానః'

తా॥ కర్మముచేయువాడు పరలోకమునందు ఫలమనుభవించి మరలవచ్చి కర్మములనే చేయుచుండును.

2 'అథాకామయమానః'

తా॥ ఫలాసక్తిలేక కర్మములుచేయువాడు ముక్తిని పొందుచున్నాడు.

గనుక సమన్వారంభణవచనము సంసారివిషయము. 11

అవ॥ 6 సూత్రమునందలి పూర్వపక్షఖండనము.

అధ్యయనమాత్రవతః ॥ 12

తా॥ 'ఆచార్యకులాద్వేదమధీత్య' యనుటచేత అధ్యయనముకలవానికే కర్మవిధికలదు. అతడు అర్థజ్ఞానములేనివాడు అధ్యయనమువలన కలిగిన కర్మజ్ఞానమును వారింపము. ఉపనిషత్తులచేత కలుగునది కేవలాత్మజ్ఞానము గనుక వీరికి కర్మ విధింపబడదు.

అవ॥ 7 సూత్రమునందలి పూర్వపక్షఖండనము.

నావిశేషాత్ ॥ 13

పద॥ 1 న 2 అవిశేషాత్ ॥

తా॥ 'కుర్వన్నేవేహ కర్మాణి' ఇత్యాది వాక్యములు (2) సామాన్యనియమమును చెప్పుచున్నవి గనుక విద్వాంసునకు (1) వర్తింపదు.

యద్వా–

స్తుతయేఽనుమతిర్వా ॥ 14

పద॥ 1 స్తుతయే 2 అనుమతిః 3 వా ॥

తా॥ 'కుర్వన్నేవేహ కర్మాణి' యను వాక్యము విద్వాంసులకే సంబంధించును. (2) ఈకర్మజ్ఞానము (1-3) విద్యాస్తుతికొఱకేయగును. 'నకర్మ లిప్యతే నరే' యని తరువాత చెప్పుటచేత యావజ్జీవము కర్మచేయుచున్నను విద్యాసామర్థ్య

మువలన కర్మలేపమగు సంసారబంధము కలుగదని స్తుతిచే యబడినది. మఱియు—

1 కామకారేణ 2 చైకే ॥ 15

తా॥ (2) కొందఱు విద్వాంసులు విద్యాబలమువలన కర్మసాధనములైన పుత్రధనాదులందు ప్రయోజనము లేదని తలచి (1) ఇచ్ఛచేతనే కర్మమును విడుచుచున్నారని

బృ. 6-4-22 'ఏతద్ధస్మవై తత్పూర్వే విద్వాంసః ప్రజాం నకామయంతే। కింప్రజయా కరిష్యామో యేషాం నోఽయ మాత్మాఽయం లోక ఇ' యను శ్రుతి చెప్పుచున్నది. గనుక విద్యకు కర్మాంగత్వములేదు. అర్థవాదమనుటకును శక్యము కాదు. ఉపమర్దంచ ॥ 16

బృ. 4-4-14 'యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్తత్కేన కం జిఘ్రేత్'

దీనితా॥ 9 ప్రకరణములో 4అ. 1పా. 3సూ. క్రిందకలదు ఇత్యాది శ్రుతులు విద్యాసామర్థ్యమువలన ప్రపంచమునకు నాశనమును చెప్పుచున్నవి.

ఊర్ధ్వరేతః సుచ శబ్దేహి ॥ 17

పద॥ 1 ఊర్ధ్వరేతః 2 సు చ 3 శబ్దేహి ॥

తా॥ కర్మములు లేని సన్న్యాసాశ్రమమందును జ్ఞానవిద్య కలదు. గార్హస్థ్యముగలవారికిని, లేనివారికిని, ఋణత్రయ మును అపాకరించినవారికిని, అపాకరింపనివారికిని సన్న్యాసా శ్రమము చెప్పబడినది. శ్రుతులట్లే చెప్పినవి. గనుక విద్యకు కర్మాంగత్వము లేదు.

1 ఛాం. 2.23-1 'త్రయోధర్మస్కంధాః'

తా॥ ధర్మప్రధానమగు ఆశ్రమములు మూడు. వీనిలో అగ్నిహోత్రాది కర్మములను చేయుచు దానమును ఇచ్చు గృహస్థాశ్రమమొకటి. కృచ్ఛ్ర చాంద్రాయణాదివ్రతముగల వానప్రస్థాశ్రమమొకటి. జీవితకాలమున్ను గురుగృహమందుండి దేహమునువిడుచు బ్రహ్మచర్యమొకటి. వీరందరును పుణ్యలోకముగలవారు. సన్యాసి మోక్షమును పొందుచున్నాడు.

2 ఛాం. 5-10-1 'యేచేమేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే'

తా॥ పంచాగ్నివిద్యగల గృహస్థులును, వానప్రస్థులును, సన్న్యాసులును, శ్రద్ధతో బ్రహ్మమునుపాసించువారు అర్చిరాదిమార్గమున పోవుదురు.

3 ముం. 1-2-11 'తపశ్శ్రద్ధే యేహ్యుపవసంత్యరణ్యే'

తా॥ సగుణబ్రహ్మోపాసకులును, వానప్రస్థులును, సంన్యాసులును, జ్ఞానులగు గృహస్థులును, జితేంద్రియులును, స్వాశ్రమధర్మకర్మములను, సత్యబ్రహ్మోపాసనముచేయువారును అర్చిరాదిమార్గముచేత సత్యబ్రహ్మలోకమును పొందుదురు.

4 బృ. 6-4-22 'ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛంతః ప్రవ్రజంతి'

తా॥ సన్యాసులు ఆత్మలోకమునుకోరి సర్వకర్మములను విడుచుచున్నారు.

5 జాబాల॥ 'బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్'

తా॥ బ్రహ్మచర్యాశ్రమమునుండి సన్యసింపవలెను.

2 అధికరణము.

1 పరామర్శం 2 జైమిని 3 రచోదనాచా 4 పవదతిహి ॥ 18

తా॥ వేదశబ్దములందు సన్యాసాశ్రమమునకు (1) విధి లేసందున 'త్రయోధర్మస్కంధాః' యను శబ్దములు ఊర్ధ్వ రేతస్సులను చెప్పసమర్థములు కావు (3) ఈశ్రుతియందు బ్రహ్మస్తుతిపరమేగాని దీనియందు ప్రత్యాయము లేదు.

'వీరహావా ఏష దేవానాం యోఽగ్నిముద్వాసయతే'

తా॥ అగ్నిహోత్రకర్మను విడిచి సన్యసించినవాడు దేవతావీరులను చంపినవాడగునని (4) సన్యాసమును నిషేధించుచున్నది (2) అని జైమినిమునియొక్క పూర్వపక్షము.

1 అనుష్ఠేయం 2 బాదరాయణః 3 సామ్యశ్రుతే ॥ 19

తా॥ (2) బాదరాయణాచార్యుడు (1) సన్యాసాశ్రమము గ్రహింపతగినదని తలచుచున్నాడు. (3) 'త్రయోధర్మస్కంధాః' మొదలగు శ్రుతులువలన గార్హస్థ్యముతో సమమైన యాశ్రమాంతరము కనిపించుచున్నదని సిద్ధాంతము.

1 విధిర్వా 2 ధారణవత్ ॥ 20

తా॥ (1) స్కంధశ్రుతి ఆశ్రమాంతరమునకు విధియేకాని అర్థవాదముకాదు. (2) 'అధస్తాత్సమిధం ధారయన్ననుద్రవేదుపరిహి వేదేభ్యో ధారయతి' యను శ్రుతిలో చెప్పినట్లే యిచటను ఆశ్రమపరామర్శ శ్రుతివిధియగును. రాగాదులున్నవారికి బ్రహ్మనిష్ఠకలుగదు. యతికి శమాదులు లేనపుడును తక్కిన యాశ్రమములకు స్వాశ్రమవిహితకర్మములు లేనప్పుడును ప్రత్యవాయము కలుగును.

1 ముం. 3-2-6 'వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థా స్సన్న్యాసయోగాద్యతయ శ్శుద్ధసత్త్వాః'

తా. వేదాంతార్థజ్ఞానముగలవారు సర్వకర్మములను విడుచుటవలన పరిశుద్ధాంతఃకరణులై ముక్తులగుచున్నారు.

1 స్తుతిమాత్ర 2 ముపాదానా 3 దితిచే 4 న్నాపూర్వ
5 త్వాత్ ॥ 21 (3 అధి)

తా॥ ఛాం. 1-1-3 'సఏష ఉద్గీథో రసానాం రసతమః పరమః పరార్ధ్యోఽష్టమో యదుద్గీథః' పృథివ్యాది రసపదార్థములలో 8 దనది యగు ఓంకారము (2) కర్మాంగములగునుద్గీథాదులను స్వీకరించుటవలన (1) స్తుత్యర్థమనుట యుక్తము (3) అనియందువేని (4) అట్లుకాదు. (5) ఉద్గీథాద్యుపాసనములును, రసతమత్వాదిగుణములును, ప్రమాణాంతరము లేకపోవుటవలన పీనికి పిధ్యర్థముచెప్పునపుడు అపూర్వమగు అర్థము (ఉపాసనము) విధింపబడినదియగును. గనుక నిట్టిశ్రుతులు ఉపాసనవిధులను చెప్పునవియే.

భావశబ్దాచ్చ ॥ 22

తా॥ 1 ఛాం. 1-1-1 'ఉద్గీథముపాసీత' ఓంకారము నుపాసింపవలయును. 2ఛాం 2-2-1 'సామోపాసీత' హింకారాది సామములందు లోకదృష్టి చేయుము. 3 అహముక్థమస్మీతి విద్యాత్' నేను ఉక్థమగుదునని యుపాసింపవలెను. ఈమొదలగు శ్రుతులవలన నివి స్పష్టమగు ఉపాసనావిధులే. 22

1 పారిప్లవార్థా 2 ఇతిచే 3 న్న 4 విశేషితత్వాత్ ॥ 23(4అధి)

తా॥ క్రిందిశ్రుతులలోని వాక్యములు (1) పారిప్లవార్థములే అనగా అశ్వమేధయాగమునందు రాజునకు చెప్పవలసిన వాక్యములే (2) అని యందువేని (3) కాదు. (4) పారిప్లవమాచక్షీత యని మొదటిదినమందును, మనుర్వైవస్వతోరాజా యని రెండవదినమందును, యామోవైవస్వత యని మూడవదినమందును, వరుణ ఆదిత్యకథలను చెప్పవలయునని కొన్నికథలుచెప్పి వాక్యశేషమందు చెప్పుటవలననివి విద్యయొక్క స్తుత్యర్థములే యగును.

1 తథాచైకవాక్యతో 2 పబంధాత్ । 24

తా॥ (1) ఈకథలకు పారిప్లవార్థము లేదు సరేకదా (2) సన్నిహితవిద్యలతో నేకవాక్యత్వముండుటవలన నదియేన్యాయము.

అవ॥ బ్రహ్మవిద్య స్వతంత్రమైనదని 1 అధికరణమునందు చెప్పబడినది. 2-3-4 అధికరణములందు అందుకుగల కారణములు చెప్పబడినవి. ఈఅధికరణమునందు కర్మాపేక్షలేకుండ స్వాతంత్ర్యముగ ఫలమునిచ్చునని చెప్పబడుచున్నది.

1 అతఏవ 2 చాగ్నీంధనాద్యనపేక్షా । 25 (5 అధి)

తా॥ మొదటిసూత్రమునందు విద్య కర్మాంగము కాదని చెప్పబడినది. (1) కేవల విద్యను అజ్ఞాననివృత్తిరూపమగు మోక్షమునకు హేతువుగాచెప్పుటవలన (2) దానికి అగ్నిహోత్రాది కర్మముల యపేక్షలేదు.

అవ॥ బ్రహ్మవిద్యకు కర్మములసంబంధము కొన్నివిషయములకైనను కలదా లేదా?

(6అధి) 1 సర్వాపేక్షాచ 2 యజ్ఞాదిశ్రుతే 3 రశ్వవత్. 26

తా॥ విద్యకు ఆశ్రమకర్మముల యపేక్ష లేదని చెప్పబడినది గాని (1) విద్యకు ఆశ్రమకర్మముల యపేక్షకలదు. (2) క్రిందిశ్రుతులు యజ్ఞాదికర్మములు విద్యాసాధనమని చెప్పుచున్నవి. (3 అశ్వవత్) గుఱ్ఱము రథచర్యయందేగాని దుక్కికి ఉపయోగింపనట్లు ఆశ్రమకర్మములు జ్ఞానసాధనములే కాని మోక్షమునకు ఉపయోగింపవు.

బృ. 6-4-22 'తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా నాశకేన'

తా॥ పరమాత్మను ద్విజులు స్వాధ్యాయము, ద్రవ్యము, యజ్ఞము, దానము, హితమితాశనరూపతపము మొదలగువానిచేత తెలియగోరుచున్నారు.

.2 క. 2-15 'సర్వే వేదా యత్పదమామనంతి। తపాంసి సర్వాణిచ యద్వదంతి। యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తేపదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్'

తా॥ సర్వవేదములును, సర్వతపస్సులును, బ్రహ్మచర్యాదివ్రతములును, బ్రహ్మమును పొందుటకు సాధనములుగా చెప్పుచున్నవి.

అవ॥ కర్మలకు జ్ఞానముతో సంబంధమున్నదనుటకు వీలులేదని యాక్షేపము రాగా సిద్ధాంతము—

శమదమాద్యుపేతః స్యాత్తథాపితు తద్విధే స్తదంగ
తయా తేషామవశ్యానుష్ఠేయత్వాత్ ॥ 27

పద॥ 1 శమదమాద్యుపేతః 2 స్యాత్ 3 తథాపి తు 4తద్విధేః 5 తదంగతయా 6 తేషాం 7 అవశ్యానుష్ఠేయత్వాత్॥

తా॥ యజ్ఞాదులు విద్యకు సాధనము కావని (3) తలచినను క్రిందిశృతి (5) విద్యకు సాధనముగా (4) శమదమాదులను విధించుటవలన (6) వానిని (7) అవశ్యము ననుష్ఠింపవలసి నవియగుటవలన విద్యనుకోరువాడు (1) శమదమాదులతో కూడినవాడు (2) కావలయును.

1 బృ. 6-4-23 'తస్మాదేవం విచ్ఛాంతో దాంత ఉపరత స్తితిక్షుస్సమాహితో భూత్వాత్మన్యేవాత్మానం పశ్యతి'

తా॥ ఆత్మ నెఱుగువాడు పాపకర్మములతో సంబంధింపడు. ఆత్మస్వరూపము కర్మఫలసంబంధశూన్యమని యెరిగినవాడు బాహ్యేంద్రియవ్యాపారమునుండియు, అంతఃకరణధర్మమగు తృష్ణనుండియు, సమస్తకోరికలనుండియు మఱలినవాడును, ద్వంద్వములను సహించువాడును ప్రత్యక్ చైతన్యమును చూచువాడు నగును.

(7 అధి) 1 సర్వాన్నానుమతిశ్చ 2 ప్రాణాత్యయే 3 తద్దర్శనాత్ ॥ 28

తా॥ ప్రాణమే తానని ధ్యానించు ప్రాణోపాసకునకు అన్ని పదార్థములును అన్నమే అనియు అవి శమాదులవలె విద్యాంగములనియు పూర్వపక్షము రాగా- సిద్ధాంతము- (2) ప్రాణము పోవునేమోనను సంశయముకలుగునపుడు విమర్శింపక అందరియన్నమును భుజింపవచ్చును. (3) అట్లే శ్రుతులు చెప్పుచున్నవి.

1 ఛాం. 1-10-1 'మటచీహతేషు కురుష్వి త్యాది' బ్రాహ్మణమునందు

తా॥ కురుదేశమునందలి సస్యములు నశింపగా యుషస్తి

యను బ్రాహ్మణుడు గుఱ్ఱపునవుకరువద్దనున్న గుగ్గిళ్ళుతి నెను ఉదకము యథేచ్ఛముగా దొరుకుటచేత నక్కఱలేద నెను. ఆపదయందు తనకుదొరకనిపదార్థమునుమాత్రము గ్రహింప వచ్చును.

ప్రాణోపాసకునకు భక్షింపరాని దేదియు లేదనిచెప్పిన ఛాం. 5-2-1 'నహవా ఏవం విదికించనాన్నం భక్షతి' యను శ్రుతి అర్థవాదము.

ఛాం. 2-13-2 'నకాంచన స్త్రియం పరిహరే త్తద్వ్రతం'

తా॥ వామదేవ్యసామోపాసకుడు స్వసమాగమమును కోరిన స్త్రీని విడువరాదు. దీనివలన నిషేధశాస్త్రము ఈయుపాసకునికంటె నితరులకుమాత్రము ప్రవర్తించునని శ్రుత్యర్థము. అబాధాచ్చ ॥ 29

తా॥ ఆహారశుద్ధిచేత నంతఃకరణశుద్ధికలుగునని ఆహారశుద్ధౌ సత్వశుద్ధియనునవి మొదలగునవి భక్ష్యాభక్ష్యవిభాగ శాస్త్రము బాధింపనందున నిది యర్థవాదము.

అపిచ స్మర్యతే ॥ 30

తా॥ మఱియు ఆపత్కాలమునందు విద్వాంసునకును, అవిద్వాంసునకును సర్వాన్నభక్షణము తగునని స్మృతివలన కనబడును. 1 శబ్దశ్చాతో౽ 2 కామకారే ॥ 31

తా॥ (1) తస్మాద్బ్రాహ్మణ స్సురాం నపిబేత్యాదికము అభక్ష్యవస్తువును భక్షణముచేయకూడదని (3) కఠసంహిత చెప్పుచున్నది. ఆనిషేధము 'నహవా ఏవంవిది' యను నిది అర్థవాదమైనపుడే కలుగును. (2) అందువలన నిట్టివి యర్థవాదములేకాని విధులుకావు.

(8 అధి) 1 విహితత్వా 2 చ్చాశ్రమకర్మాపి ॥ 32

తా॥ (2) పుత్రమిత్రాది ఫలము నీయని నిత్యములగు ఆశ్రమకర్మములు మోక్షేచ్ఛలేనివానికి (1) యావజ్జీవమగ్ని హోత్రం జుహోతీత్యాదులచేత విధికృతమగుటవలన నవశ్యము చేయవలసినవియే యగును.

సహకారిత్వే న చ ॥ 33

తా॥ తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతీ త్యాది శ్రుతులచేత చిత్తశుద్ధిద్వారా విద్యాసాధనముగనుక ఆశ్రమకర్మములు విద్యాసహకారమగుచున్నవి.

అవ॥ కర్మకాండలోని కర్మములు నిత్యములనుటచేత జ్ఞాన కాండలోని కర్మములు అనిత్యములనదగునుగదా యని సంశ యమురాగా సిద్ధాంతము-

1 సర్వథాపి 2 తఏవో 3 భయలింగాత్ ॥ 34

తా॥ (1) ఆశ్రమకర్మములు నిత్యములను పక్షమునందును అవి విద్యకు సహకారి యను పక్షమునందును, (2) ఆయగ్ని హోత్రాదులే యనుష్ఠేయములని (3) (ఉభయధాలిం గాత్) శ్రుతిస్మృతులవలన కనుబడుచున్నది. "తమేతం వేదా నువచనేనేత్యాది శ్రుతియును. భ॥ గీ॥ 6అ॥ 1శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః। స సన్న్యాసీచ యోగీ చ న నిరగ్నిర్నచాఽక్రియః॥" ఎవడు కర్మఫలమునుకోరకుం డా యగ్నిహోత్రాది కర్మములను చేయుచున్నాడో యత డు ఫలత్యాగమువలన సన్న్యాసియు, యోగియు నని చెప్పు చున్నవి.

1 అనభిభవం చ 2 దర్శయతి ॥ 35

తా॥ బ్రహ్మచర్యాది సాధనసంపన్నుడగువానికి (1) రాగాదిక్లేశములచేత నాశములేదని (2) శ్రుతిచూపుచున్నది.

1 ఛాం. 8-5-3 'ఏషహ్యాత్మా నసశ్యతి। యం బ్రహ్మచర్యేణానువిందతే'

తా॥ బ్రహ్మచర్యముచేత ఆత్మను తెలిసికొనినవాడు బ్రహ్మలోకమును పొందుచున్నాడు. గనుక ఆశ్రమకర్మములు విద్యాసాధనములగును.

(9 అధి.) 1 అంతరా చాపి తు 2 తద్దృష్టేః ॥ 36

తా॥ విధురాదులకును, కర్మాధికారములేని చెవుడు, మూగ, గ్రుడ్డి గలవారలకును, యేయాశ్రమమును పొందకుండా యంతరాళమున నున్నవారికిని బ్రహ్మవిద్యయందధికారములేదని పూర్వపక్షమురాగా- సిద్ధాంతము-

(1) ఏయాశ్రమమును బొందక నంతరాళముననున్న విధురాదులకును బ్రహ్మవిద్యాధికారము కలదు. (2) అట్టివారగు రైక్వవాచక్నవీ ప్రభృతులకు బ్రహ్మవిత్త్వము కలదని శ్రుతులు చెప్పుచున్నవి.

1 అపిచ 2 స్మర్యతే ॥ 37

తా॥ (1) దిగంబరులుగా సంచరించు సంవర్తుడు మొదలగు ఆశ్రమకర్మములు చేయనివారికి ఇతిహాసమునందుమహాయోగిత్వము (2) స్మరింపబడుచున్నది.

విశేషానుగ్రహశ్చ ॥ 38

తా॥ విధురాదులకును జపోపవాసదేవతారాధనాది ధర్మవిశేషములచేత విద్యకు విశేషానుగ్రహము కలుగుచున్నది.

1 మనుస్మృతి. 2-87 'జప్యేనైవ తు సంసిద్ధ్యేద్ బ్రాహ్మణో నాత్రసంశయః। కుర్యాదన్య న్నవా కుర్యాన్మైత్రో బ్రాహ్మణఉచ్యతే ॥'

తా॥ ఎల్లభూతములకు ప్రియుడగువాడు ఆత్మసంబంధియని ఆగమములు చెప్పుచున్నవి. గనుక బ్రాహ్మణుడు యాగాది కర్మములను చేసినను, చేయకున్నను, ప్రణవాద్యుపాసనము చేతనే మోక్షప్రాప్తికి యోగ్యుడగును. జన్మాంతరమునందు చేసిన కర్మముచేత జ్ఞానవిద్యపొందబడుచున్నదని భ. గీ. 6అ. 45 శ్లో॥ 'అనేకజన్మసంసిద్ధ స్తతోయాతిపరాంగతిం' అనేకజన్మములందు సంపాదించిన సంస్కారముచేత సమ్యగ్ధిపరిపాకము కలవాడై మోక్షమును పొందుచున్నాడు.

అతస్త్వితరజ్జ్యాయో లింగాచ్చ । 39

పద॥ 1 అతః 2 ఇతరత్ 3 జ్యాయః 4 లింగాత్ చ ।

తా॥ (1) అంతరాళమున నుండుటకంటె (2) ఆశ్రమవర్తిత్వము శ్రేయము. (4) బృ. 6-4-9 'తేనైతి బ్రహ్మవిత్పుణ్యకృత్తైజసశ్చ' పుణ్యకర్మలుచేయుచు ఈషణత్రయమును వదిలి పరబ్రహ్మమునందు ఆత్మసంయోగముగల బ్రహ్మవిదుడు బ్రహ్మమును పొందునని సిద్ధాంతము. ఈరీతియందు బ్రహ్మజ్ఞానమునకు పుణ్యకర్మలు సాధనమనుటవలనను ఏయాశ్రమమును స్వీకరింపని బ్రాహ్మణుడు ఒకరోజైనను నిలువరాదు. ఒకసంవత్సరమున్నపుడు మూడుకృఛ్రములను చేయవలయును. అని 'అనాశ్రమీ నతిష్ఠేత దినమేకమపి ద్విజః। సంవత్సరమనాశ్రమీస్థిత్వా కృఛ్రత్రయం చరేత్ ॥' అను వాక్యము చెప్పుటవలనను (3) బ్రహ్మవిద్యార్జనము శ్రేష్ఠము.

(10 అధి) తద్భూతస్యతు నాతద్భావో జైమినిరపి
నియమాతద్రూపాభావేభ్యః ॥ 40

పద॥ 1 తద్భూతస్య తు 2 న 3 అతద్భావో 4 జైమినిరపి
5 నియమాతద్రూపాభావేభ్యః ॥

తా॥ సన్న్యాసమును పొందినవారు గృహస్థాశ్రమకర్మములయందాసక్తికలిగి సన్న్యాసాశ్రమధర్మములను విడుచుటచేత విరోధము లేదని పూర్వపక్షము రాగా— విడువకూడదని సిద్ధాంతము— (1) ఉత్తమాశ్రమముగలవాడు (3) దానిని ఏ కారణముచేతనుగాని (2) విడువకూడదు. (5) నియమమువలనను, విడుచుటకు ప్రమాణముగాని, శిష్టాచారముగాని లేదని (4) జైమినిముని తలచుచున్నాడు.

1 జాబాల॥ 4 'బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్ గృహాద్వనీభూత్వా ప్రవ్రజేత్ యది వేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్'

తా॥ బ్రహ్మచర్యవ్రతముచేసి గృహస్థుడు కావలెను తరువాత వానప్రస్థుడై సన్న్యసింపవలెను. లేక బ్రహ్మచర్యమునుండియు, గృహస్థాశ్రమమునుండియు సన్న్యసింపవచ్చును.

భ. గీ. 3అ. 35శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పర
ధర్మాత్స్వనుష్ఠితాత్ ।

తా॥ తనవర్ణమునకును, ఆశ్రమమునకును, విహితమైన ధర్మములలో కొన్ని యంగములు లోపించినను తనకు విహితముకాని సర్వాంగములతో చేయుధర్మముకంటె విహితధర్మమే శ్రేష్ఠము గనుక ఉత్తమాశ్రమమునుండి జారుట నిష్ఫలమని జైమిని, వ్యాసులిద్దరును అంగీకరించిరి.

(11 అధి) నచాధికారికమపి పతనానుమానా
త్తదయోగాత్ ॥ 41

పద॥ 1 న చ 2 ఆధికారికమపి 3 పతనానుమానాత్
4 తదయోగాత్ ।

తా॥ వ్రతభ్రష్టుడైన బ్రహ్మచారికి పూ. మీ. సూ. 6-8-21 'అవకీర్ణి పశుశ్చ తద్వదాధానస్యాప్రాప్తకాల త్వాత్' అని చెప్పిన ప్రాయశ్చిత్తము (1) నైష్ఠికులకు కూడదు (3-4) అత్రిస్మృతి॥ 'ఆరూఢో నైష్ఠికం ధర్మం యస్తు ప్రచ్యవతే పునః। ప్రాయశ్చిత్తం నపశ్యామి యేన శుద్ధ్యేత్స ఆత్మహా ॥' బ్రహ్మచర్యవ్రతమునుండి జారినవానికి ప్రాయశ్చిత్తములేదని పూర్వపక్షము-

ఉపపూర్వమపి త్వేకే భావమశనవత్తదుక్తం ॥ 42

పద॥ 1 ఉపపూర్వం 2 అపితు 3 ఏకే 4 భావం 5 అశనవత్ 6 తత్ 7 ఉక్తం।

తా॥ (2) ప్రాయశ్చిత్తము లేదనరాదు. భార్యలకంటె వేలుచోట్లనుగల బ్రహ్మచర్యవ్రతలోపము గురుతల్పాది మహాపాతకములలో చెప్పకపోవుటవలన (1) ఉపపాతకమేకాని మహాపాతకముకాదని (3) కొందఱుతలచుచున్నారు. బ్రహ్మచారి నైష్ఠికునితో సమానమగుటవలన (4) ప్రాయశ్చిత్తము కలదు. (5) బ్రహ్మచారికి మధు మాంస భక్షణమునందువలెనే దీనియందును ప్రాయశ్చిత్తము కలదు అట్లు అవకీర్ణిత్వాది శ్రుతి కలదు. ఇట్లు ప్రాయశ్చిత్తమున్నదనుట యుక్తము. (6-7) ప్రమాణలక్షణమునందు చెప్పబడినది.

1 పూ. మీ. 1-3-7 'సమావిప్రతిపత్తిస్యాత్'

2 పూ. మీ. 1-3-8 'శాస్త్రస్థావా తన్నిమిత్తత్వాత్'

తా॥ పొడుగుముండ్లుగల ధాన్యములోను, ప్రియంగుధాన్యములోను దేనితో హవిస్సుచేయవలెనని జైమిని శంకించి మఱల పొడుగుముండ్లుగల ధాన్యపు హవిస్సే గ్రాహ్యమని చెప్పెను. ఇట్లే భిక్షు వానప్రస్థులకును—

3 వానప్రస్థో దీక్షాభేదే కృచ్ఛ్రం ద్వాదశరాత్రం చరిత్వా మహాకక్షం వర్ధయేత్ । భిక్షుర్వానప్రస్థవత్ । సోమవృద్ధివర్జం స్వశాస్త్రసంస్కారశ్చ । 42

తా॥ వానప్రస్థునకు ప్రమాదముచేత వ్రతలోపముకలిగినపుడు ప్రాజాపత్యకృచ్ఛ్రవ్రతము చేయవలయును. ఎట్లనగా—మూడుదినములు పగలొకమారును, మూడుదినములు రాత్రియొకమారును, మూడుదినములు యాచించి భుజించుచు మూడుదినములు ఉపవాసముచేసి తృణకాష్ఠరహితమగు దేశమును నీరుపోసి సోమలతను పెంచవలయును. వ్రతభ్రష్టుడగు సన్యాసి సోమలతను పెంచుటమాని వానప్రస్థునివలె కర్మలు చేయవలయునని సిద్ధాంతము.

అవ॥ ప్రాయశ్చిత్తముచేత పరిశుద్ధుడైనవానితో శిష్టులు భుజింపరాదు. అధ్యయనము చేయరాదు—

(12 అధి) బహిస్తూభయథాపి స్మృతేరాచారాచ్చ । 43

పద॥ 1 బహిః తు 2 ఉభయథాపి 3 స్మృతేః 4 ఆచారాచ్చ

తా॥ నైష్ఠికబ్రహ్మచారి మొదలగువారు స్వాశ్రమములనుండి జారుట (2) మహాపాతకమైనను, ఉపపాతకమైనను,

1 స్మృతి. 'ఆరూఢో నైష్ఠికం ధర్మం యస్తు ప్రచ్యవతే పునః। ప్రాయశ్చిత్తం నపశ్యామి యేన శుద్ధ్యేత్స ఆత్మహా॥' తా. 3-4-41

2 ఆరూఢపతితం విప్రం మండలాచ్చ వినిస్సృతం। ఉద్బద్ధం కృమిదష్టంచ స్పృష్ట్వా చాంద్రాయణం చరేత్ ॥

తా॥ భ్రష్టుడైన బ్రాహ్మణునిగాని, స్వదేశమునుండి వెడలగొట్టబడినవానినిగాని, ఉరివేసికొనినవానినిగాని, పాముకఱచినవానినిగాని తాకి చాంద్రాయణవ్రతము చేయవలయును. చాంద్రాయణవ్రతమనగా- చంద్రుని వృద్ధిక్షయములనుబట్టి ఆహారములను వృద్ధిక్షయములుగా భుజించుట. (3) ఈ మొదలగు నిందాస్మృతులవలనను (4) శిష్టాచారమువలనను (1) శిష్టులచేత బహిష్కరింపబడతగినవారు,

(13 అధి) 1 స్వామినః 2 ఫలశ్రుతే 3 రిత్యాత్రేయః ॥ 44

తా॥ ఉద్గీథము మొదలగు కర్మాంగోపాసనములు (1) యజమాని చేయవలసినవియే యని (2) ఛాం. 2-3-2 వర్షతిహాస్మై వర్షయతిహా యఏతదేవం విద్వాన్ వృష్టౌ పంచవిధం నామోపాస్తే। తా॥ హింకారము, ప్రస్తావము, నుద్గీథము, ప్రతిహారము, నిధనము నను నైదువిధములుగల సామము నందు కోరినపుడు వర్షము వర్షించునని శ్రుతిచెప్పుటచేత ఆకర్మములు యజమానివగుట న్యాయమని (3) ఆత్రేయునియొక్క పూర్వపక్షము.

1 ఆర్త్విజ్య 2 మిత్యౌడులోమి స్తస్మైహి 3 పరిక్రీయతే 45

తా॥ అంగోపాసనములు (1) ఋత్విజుడుచేయవలయునని

(2) ఔడులోమ్యాచార్యుడు తలచుచున్నాడు గనుక (3) సాంగమైన కర్మమును ఋత్విజుడే చేయవలెనని సిద్ధాంతము.

శ్రుతేశ్చ ॥ 46

తా॥ క్రిందిశ్రుతులవలన సంగోపాసనములు యజమానునికొఱకు ఋత్విక్కులు చేయవలయునని కనిపించుచున్నది.

1 'యాంవై కాంచన యజ్ఞ ఋత్విజ ఆశిష మాశాసత ఇతి యజమానాయైవ తామాశాసతఇతి హోవాచ.'

తా॥ ఋత్విజులు కోరునది యజమానునికొఱకే.

(14 అధి) 1 సహకార్యంతరవిధిః 2 పక్షేణ 3 తృతీయం 4 తద్వతో 5 విధ్యాదివత్ ॥ 47

తా॥ క్రిందిశ్రుతిలో చెప్పిన మౌనము విధికాదని పూర్వపక్షమురాగా- సిద్ధాంతము-

(1) విద్యకు సహకారియగు మౌనము(నిదిధ్యాసము)నకు బాల్యపాండిత్య (మననశ్రవణ) ములకువలె యాశ్రయింపతగినది. మునిశబ్దముచేత సన్యాసము గ్రహణము గనుక (3) బాల్యపాండిత్య మౌనములలో మూడవదియగు మౌనముచే జ్ఞానాతిశయరూపమగు నిదిధ్యాసము విధింపబడుచున్నది. (4) ఆవిధి పరోక్షజ్ఞానముగల సన్యాసికే.

1 బృ. 5-5-1 'ఆత్మానం విదిత్వా పుత్రాద్యేషణాభ్యో వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి'

తా॥ ఆత్మజ్ఞానమును సంపాదించి పుత్రాదికోరికలను విడుచుట సన్యాసము. (2) ప్రాప్తింపనిపక్షమునందు (5) 'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' యనునది విధింపబడునట్లే మౌనము విధియగును.

2 బృ. 5-5-1 'తస్మాద్బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్ బాల్యంచ పాండిత్యంచ నిర్విద్యాథ ముని రమౌనంచ మౌనంచ నిర్విద్యాథ బ్రాహ్మణః'

తా॥ పండితుడు శ్రవణమననములుకలిగి చిత్తశుద్ధితోనుం డవలెను. నిదిధ్యాసపరుడగుచు నేనే బ్రహ్మముననెడి సాక్షా త్కారము కలవాడగుచున్నాడు

అవ॥ ఛాం. 'సఖల్వేవం వర్తయన్యావదాయుషం' యను శ్రుతిచేత గృహస్థునికి కర్మములేకాని సన్యాసము లేదుగదా అని యాక్షేపమురాగా సిద్ధాంతము.

1 కృత్స్న 2 భావా త్తు 3 గృహిణో 4 పసంహారః ॥ 48

తా॥ (2) తుశబ్దము గృహస్థులు విద్యాసాధనము లన్ని టిని గ్రహింప యోగ్యులని విశేషమును తెలియచేయును. (1) ఆయాసముతోకూడిన అనేకయజ్ఞాది స్వాశ్రమకర్మలను గృహస్థుచేయవలయును. గనుక (3) గృహస్థునితో (4) స మాప్తిని చెప్పబడినది.

1 మౌనవదితరేషా 2 మప్యు 3 పదేశాత్ ॥ 49

తా॥ (1) సన్యాసమునకును, గార్హస్థ్యమునకును, శ్రుతిస మ్మతియున్నట్లే (2) వానప్రస్థమునకును, బ్రహ్మచర్యమునకు నుకలదు. 'తపఏవ ద్వితీయో బ్రహ్మచర్యాచార్యకులవాసీ తృతీయః' యను శ్రుతివలన నాలుగాశ్రమములకును (3) భే దములేకుండా నుపదేశించుటవలన వికల్పముచేతగాని సము చ్చయముచేతగాని వానికి అనుష్ఠేయత్వము సిద్ధము.

(15 అనావిష్కారాధికరణము)

1 అనావిష్కుర్వన్న 2 న్వయాత్ ॥ 50

తా॥ 47 సూ. క్రింది బృ. 5-5-1 తస్మాద్బ్రాహ్మణోత్యాది శ్రుతిలోని బాల్యశబ్దము పిల్లలు సంచరించెడి బాల్యావస్థ యని పూర్వపక్షము రాగా- సిద్ధాంతము-

2 దంభదర్పప్రకాశేంద్రియత్వాది రాహిత్యరూపమై అంతర్గతమయిన విశేషభావమని యంగీకరించునపుడే జ్ఞానాభ్యాసమునకుపయోగార్థమగును. బాలుడెట్లు బాగుగ నెఱుగని యింద్రియముల చేత నితరులవద్ద తనవిషయమునుగూర్చి ప్రకటింప ఇచ్ఛనుపొందడో అట్లే యతి (జ్ఞాని) జ్ఞాన, ధ్యాన, ధార్మికత్వాదులచేత తనమహిమను ప్రకటింపక దర్పాది రహితుడై యుండును. స్మృతులు-

1 యం న సంతం నచాసంతం నాశ్రుతం నబహుశ్రుతం।
న సువృత్తం న దుర్వృత్తం వేదకశ్చిత్స బ్రాహ్మణః॥

తా॥ తనపుట్టుక సత్కులమందనిగాని, దుష్కులమందని గాని, తాను మూర్ఖుడనని, లేక విద్వాంసుడను, అని గాని గుర్తింపడో తనది సాధునడత లేక చెడునడత యని యెఱుగడో అతడే బ్రహ్మసాక్షాత్కారముకలవాడు.

2 గూఢధర్మాశ్రితో విద్వానజ్ఞాతచరితం చరేత్ ।
అంధవజ్జడవచ్చాపి మూకవచ్చ మహీం చరేత్ ॥

తా॥ బ్రహ్మవిదుడు తనధర్మమును ఇతరులకు తెలియకుండ సంచరించుచు గుడ్డి, మూగ, మూర్ఖులవలె నుండును.

3 అవ్యక్తలింగాఽవ్యక్తాచారః ।

తా॥ ముముక్షువు తనధర్మమును ప్రకటింప చిహ్నములు లేనివాడై పరులకు తెలియరాని చరిత్రముతో సంచరించును.

(16 ఐహికాధికరణము)

1 ఐహికమప్య 2 ప్రస్తుతప్రతిబంధే 3 తద్దర్శనాత్ ॥ 51

తా॥ 26 సూత్రము మొదలు యీసూత్రము వఱకును విద్యాసాధనము చెప్పబడినది. జ్ఞానసిద్ధి యీజన్మమునందే సిద్ధించునని పూర్వపక్షము రాగా- సిద్ధాంతము- (2) ప్రతిబంధము లేనపుడు (1) ఈజన్మమునందే కలుగుచున్నది ప్రతిబంధమున్నపుడు జన్మాంతరమునందు కలుగును. (3) ఇట్లు శ్రుతి స్మృతులు చెప్పుచున్నవి.

1 క. 2-7 'శ్రవణాయాపి బహుభిర్యో నలభ్యశ్శృణ్వంతోపి బహవో యం నవిద్యుః ఆశ్చర్యో వక్తా కుశలోస్య లబ్ధా ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః'

తా॥ పరబ్రహ్మము శ్రవణముచేత లభింపనివాడును, వినుటచేత తెలియరానివాడును గనుక కుశలుడగు నాచార్యునిచేత నుపదేశింపబడువాడైనను ఈతని నెఱుగువాడు అనేకులలో నొకడేయుండును. వామదేవుడు గర్భములోనుండియే బ్రహ్మభావమును పొందెనని చెప్పెడి శ్రుతి జన్మాంతరసంచితమగు సాధనమువలన వేఱొకజన్మమునందు జ్ఞానసిద్ధిని చూపుచున్నది. గర్భములోనున్నపుడు ఈజన్మమునందు సంపాదింపతగిన విద్యాసాధనముకలదని ఊహింపరాదుగదా?

2 స్మృతి॥ భ.గీ. 6అ. 37 'అప్రాప్య యోగసంసిద్ధింకాం గతిం కృష్ణ గచ్ఛతి'

తా॥ యోగఫలమునుపొందలేని యోగభ్రష్టుడు యేగతిని పొందునని అర్జునుడు అడిగెను.

3 'నహి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి'

తా॥ శాస్త్రవిహితకార్యమును చేయువాడు అపకీర్తినిగాని కీటాదిజన్మమునుగాని పొందడు. వాడు ఉభయలోకములందును చెడడు.

4 భ. గీ. 6అ. 43 'తత్రతం బుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం'

తా॥ యోగభ్రష్టుడు పుణ్యలోకఫలమనుభవించి మరల సాధువులగు శ్రీమంతులకులమందు పుట్టి పూర్వజన్మసంబంధమగు బుద్ధితోనుండును.

5 భ. గీ. 6అ 45 'అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిం' దీనితా॥ 3అ. 4పా. 38సూ. నందు కలదు.

(17 అధి) 1 ఏవం 2 ముక్తిఫలానియమ 3 స్తదవస్థావధృతే స్తదవస్థావధృతేః ॥

తా॥ బ్రహ్మజ్ఞానసిద్ధి ఆలస్యముగాను, శీఘ్రముగానుకలుగునట్లే (1-2) ముక్తిరూపఫలమును కలుగును. (3) ముక్త్యవస్థ వేదాంతములన్నిటియందును ఒకటియే యగుటవలన ముక్త్యవస్థ బ్రహ్మమే. "అస్థూలమనణు సఏష నేతినేత్యాత్మా। యత్ర నాన్యత్పశ్యతి । బ్రహ్మైవేదమమృతం పురస్తాత్ । ఇదం సర్వం యదయమాత్మా, సవా ఏషమహా నజ ఆత్మాఽజరోఽమృతోఽభయోబ్రహ్మ। యత్ర త్వస్యసర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్ ॥" ఇత్యాది శ్రుతులవలన బ్రహ్మమునకు ఏకత్వనిశ్చయమేగాని అనేకాకారయోగములేదు. ముక్తిసాధనమగు జ్ఞానవిద్యకు కర్మములవలె భేదములేదు. 'మనోమయః ప్రాణశరీర' ఇత్యాది సగుణవిద్యలం

దు గుణముల వృద్ధిక్షయమునలన భేదముకలుగునట్లే ఆయా యుపాసనములకును ఫలభేదము కలుగుచున్నది.

1 ఛా. 3-14-1 'తం యథా యథోపాసతే తదేవభవతి' శ్రుతియు నట్లే చెప్పుచున్నది. తా॥ 1-1-12 కలదు.

గుణములు లేనందున నిర్గుణవిద్యయందట్లు సంభవింపదు.

8 వ ప్ర॥ సమాప్తము.

---

# 9 వ ప్రకరణము

అహంగ్రహోపాసనయనగా తానే బ్రహ్మము
ననెడి యుపాసనవలనకలుగు ఫలము.

4అ. 1పా. 2 అధికరణము.

ఆత్మేతితూపగచ్ఛంతి గ్రాహయంతి చ ॥ 3

ఆత్మేతితు=ఆత్మస్వరూపము తానే యని ఉపగచ్ఛంతి= ధ్యానోపాసనములను చేయవలెను. గ్రాహయంతిచ=శ్రుతు లట్లే బోధించుచున్నవి.

1 జాబాల॥ 'త్వంవా అహమస్మి భగవో దేవతే అహం వై త్వమసి భగవో దేవతే'

తా॥ బ్రహ్మమును నీవే నేను, నేనే నీవు.

2 'అహం బ్రహ్మాస్మి' తా॥ నేను బ్రహ్మమునైతిని.

3 బృ. 5-7-3 'ఏషత ఆత్మాంతర్యామ్యమృతః'

తా॥ సర్వభూతములకు ఆత్మడే యంతర్యామియని గౌత మునితో యాజ్ఞవల్క్యుడు చెప్పెను.

4 బృ. 5-4-1 'ఏషత ఆత్మా సర్వాంతర ఏషత ఆత్మాంతర్యామ్యమృతః'

5 ఛాం. 6-8-7 'తత్సత్యం స ఆత్మా తత్త్వమసి' ఇత్యాది శ్రుతులు జీవేశ్వరులకు అభేదమునే చెప్పుచున్నవి

తా॥ ప్రతిమయందు విష్ణువని భేదదృష్టితో చేయునది ప్రతీకోపాసనమనబడును. ఎట్లనగా—

ఛాందోగ్యము— 'మనో బ్రహ్మ, ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః' అంతఃకరణమే బ్రహ్మమనియు, సూర్యుడే బ్రహ్మమనియు చేయుట. ఇట్లు చేయుటవలన అనర్థములుకూడాకలుగును

బృహదారణ్యము— 'అథ యోఽన్యాం దేవతాముపాస్తేఽన్యోఽసావన్యోఽహమస్మీతి నసవేద। మృత్యోస్సమృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి సర్వం తం పరాదాద్యోఽన్యత్రాత్మనస్సర్వం వేద'

తా॥ తాను బ్రహ్మమునభేభావన అహంగ్రహోపాసనయందేకాని ప్రతీకోపాసనలయందు లేదు. ఆత్మోపాసనముకంటె భిన్నములగు ప్రతీకోపాసనములును, తనకంటెభిన్నమని తలచి బ్రహ్మోపాసనమును, ఎల్లపదార్థములను బ్రహ్మముకంటె భిన్నమనియు, ఉపాసనచేయువాడు శ్రేయోమార్గమునుండి తొలగి జననమరణములను పొందుచుండును.

జీవునకు జ్ఞానావస్థయందు సంసారసుఖదుఃఖములు లేవు.

బృ. 4-4-14 'యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్। అత్ర పితాఽపితా భవతి వేదాఽవేదాః'

తా॥ సర్వమును ఆత్మగాచూచువానికి అవి తనస్వరూపమే కనుక దేనియందును కోరికలుండవు. ఎట్లనగా— సుషుప్త్యవస్థ

యందు జీవుడు కర్మసంబంధమునువిడిచి ఆత్మస్వరూపముతో నుండుటచేతి ఆప్రాజ్ఞునకు తండ్రి తండ్రికాడు. వేదములు వేదములుకావు. అంతయును ఆత్మస్వరూపముగానే యుండును. గాని కార్యావస్థ ధర్మములేవియునులేవు. అట్లే అహంగ్రహోపాసకులకును.

1అ. 3పా. 9సూ. ధర్మోపపత్తేశ్చ ।

తా॥ ప్రకరణధర్మములు పరబ్రహ్మమునకే తగియుండుట వలన భూమశబ్దముచేత పరబ్రహ్మమే గ్రహింపవలెను.

1 ఛాం. 7-24-1 'యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి స భూమా'

2 ఛాం. 7 'యోవై భూమా తదమృతం'

3 ,, 'యోవై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి భూమైవ సుఖం'

తా॥ ఏది ఉత్కృష్టవస్తువో అదియే సుఖము. మిగిలిన వస్తువులయందు సుఖములేదు.

9 వ ప్ర॥ సమాప్తము.

---

# 10 వ ప్రకరణము



సూర్యాది ప్రతీకోపాసనలవలన కలుగు ఫలము.

4అ. 1పా. 4సూ. నప్రతీకేనహి సః ॥

తా॥ ప్రతీకేఽమనస్సు సూర్యుడు మొదలగు ప్రతీకము

లు ఆత్మయని (న=చెప్పతగదు) ప్రతీకములనుపాసించు (సః =వాడు) అప్రతీకములు (న హి=కాదుగదా?

కర్తృత్వాది సంసారధర్మములను నిరాకరించుట చేత బ్రహ్మస్వరూపమును, ఆచరించుటచేత నుపాసనావిధమును కలుగుచున్నది. బ్రహ్మము జగత్సృష్టికర్తయును, ప్రతీకములగు సూర్యాదులును, ఉపాసకులును, బ్రహ్మమువలన సృష్టింపబడినవారును కనుక నుపాస్యుడు ప్రతీకములతో సమానుడగుటచేత బ్రహ్మమును నేను అనునట్లు ప్రతీకములగు సూర్యాదులను నేను అని చెప్పుటలేదు. జీవులకును, బ్రహ్మమునకును భేదములేదుగాని, ఉపాసనచేయుజీవునకును, ఉపాస్యదేవతలగు ప్రతీకములై జీవులయిన సూర్యాదులకును భేదము కలదు. గనుక అహంగ్రహోపాసనము ప్రతీకములందు తగదు. గాని ఆదిత్యాదులందు బ్రహ్మదృష్టినుంచుటవలన శ్రేయస్సు కలుగునని క్రిందిసూత్రమునందు చెప్పబడుచున్నది.

అవ॥ పరబ్రహ్మమే ఆదిత్యాదులని ఉపాసింపవలయునా? లేక ఆదిత్యాదులే పరబ్రహ్మమని యుపాసింపవలయునా? యని సంశయమురాగా సిద్ధాంతము-

5సూ. బ్రహ్మదృష్టిరుత్కర్షాత్ ॥

తా॥ బ్రహ్మదృష్టిః=ఆదిత్యాదులందు బ్రహ్మదృష్టినుంచునట్టి (ఉత్కర్షాత్ =ఉత్కర్షబుద్ధివలన శ్రేయస్సుకలుగును.) నికృష్టునియందు ఉత్కృష్టబుద్ధినుంచువాడు శ్రేయస్సును పొందును.

'బ్రహ్మేత్యాదేశః' 'బ్రహ్మేత్యుపాసీత' 'బ్రహ్మేత్యుపాస్తే' యని మెల్లచోట్ల బ్రహ్మశబ్దోత్కర్షను శ్రుతిచెప్పుచున్నది.

1 ఛాం. 3-19-4 'సయఏతదేవం విద్వానాదిత్యం బ్రహ్మే
2 'యో వాచం బ్రహ్మేత్యుపాస్తే' [త్యుపాస్తే'
3 'యస్సంకల్పం బ్రహ్మేత్యుపాస్తే'

తా॥ (1) సూర్యునియందు బ్రహ్మమును ధ్యానించువాడు సూర్యభావమును పొందును. (2) వాగింద్రియమును బ్రహ్మభావముతో నుపాసించువాడు వాగ్గోచరమగు దేశమునందు కోరికలను పొందును. (3) సంకల్పమును బ్రహ్మబుద్ధితోను పాసించువాడు బ్రహ్మచేత నిర్మింపబడిన స్థిరమగు లోకములను పొందును.

10 వ ప్ర॥ సమాప్తము.

---

# 11 వ ప్రకరణము

జ్ఞానసాధనములగు సప్తభూమికల వివరణము.

యోగవాసిష్ఠము-ఉపశమప్రకరణము.

కిం మూఢ ఇవ తిష్ఠామి ప్రేక్ష్యేఽహం శాస్త్రసజ్జనైః।
వైరాగ్యపూర్వమిచ్ఛేతి శుభేచ్ఛేత్యుచ్యతే బుధైః।

తా॥ నేను మూఢునివలె నెందుకుండవలెను. వైరాగ్యమవలంబించి సజ్జనసాంగత్యముతో శాస్త్రవిమర్శము చేసెదను. అనెడి కోరికగల ప్రథమభూమిక శుభేచ్ఛ.

శాస్త్రసజ్జనసంపర్కౌ వైరాగ్యాభ్యాసపూర్వకం।
సద్విచార్య ప్రవృత్తిర్యా ప్రోచ్యతే సావిచారణా॥

తా॥ శాస్త్రాభ్యాసమును, సత్సాంగత్యమును, వైరాగ్యాభ్యాసమును చేయుచు ఆత్మవిమర్శము చేయుటయే విచారణ రెండవభూమిక.

విచారణా శుభేచ్ఛాభ్యా మింద్రియార్థేష్వసక్తతా।
యత్ర సా తనుతాభావాత్ప్రోచ్యతే తనుమానసీ॥

తా॥ భోగములను కోరక దేహమే ఆత్మయనెడి భ్రాంతి విడిచి వైరాగ్యముతో సజ్జనులతోకూడా శాస్త్రార్థమును విమర్శించుట తనుమానస. మూడవభూమిక.

భూమికాత్రితయాభ్యాసా చ్చిత్తేఽర్థవిరతేర్వశాత్।
సత్వాత్మని స్థితిః శుద్ధే సత్వాపత్తిరుదాహృతా॥

తా॥ పైభూమికల నభ్యసించుచు విషయములను గోరక వైరాగ్యముతో సత్వగుణప్రధానముగనుండుట సత్వాపత్తి. దీనియందున్నవాడు బ్రహ్మవిదుడు. నాల్గవభూమిక.

భూమికాత్రితయం త్వేతద్రామ జాగ్రదితిస్థితం।
యథావద్భేదబుద్ధ్యేదం జగజ్జాగ్రదితిస్థితం॥
(యథావద్భేదబుద్ధ్యేదం జగజ్జాగ్రతి దృశ్యతే) పాఠాం॥
అద్వైతే స్థైర్యమాయాతే ద్వైతే చోపరతిం గతే।
పశ్యంతి స్వప్నవల్లోకం చతుర్థీం భూమికామితాః

తా॥ మొదటిమూడుభూమికలయందును జగత్తు సత్యముగభాసించుటచేత జాగ్రదవస్థ. జగత్తు మిథ్యయనియు, దీనికధిష్ఠానమగు బ్రహ్మము సత్యమనియు నిశ్చయముతో నిర్వికల్పక బ్రహ్మ సాక్షాత్కారము కలుగచేయునది నాలగవ

భూమిక. ఏనికి ద్వైతము స్ఫురింపదు. జగత్తు స్వప్నతుల్య ముగ నుండును.

దశా చతుష్టయాభ్యాసా దసంసర్గఫలాయచ।
రూఢసత్త్వచమత్కారా ప్రోక్తాఽసంసక్తినామికా॥

తా॥ పైనచెప్పిన అభ్యాసమువలన సత్త్వగుణప్రధానుడై కర్మఫలమును కోరకుండుటయే అసంసక్తి. ఐదవభూమిక.

భూమికాపంచకాభ్యాసా త్స్వాత్మారామతయా దృఢం।
ఆభ్యంతరాణాం బాహ్యానాం పదార్థానా మభావనాత్॥
పరప్రయుక్తేన చిరం ప్రయత్నేనావబోధనం,
పదార్థభావినీనామ షష్ఠీ సంజాయతే గతిః।

తా॥ పైఅభ్యాసబలముచేత బాహ్యాంతరములందు అన్యపదార్థభావన లేకుండ స్వాత్మారాము (చిద్రూపు) డై భిక్షాదులకుకూడ పరులప్రేరణచేతనేగాని లేవనట్టి అవస్థ పదార్థభావిని ఆరవభూమిక.

భూమిషట్కచిరాభ్యాసా ద్భేదస్యానుపలంభనః।
యత్స్వభావైకనిష్ఠత్వం సాజ్ఞేయా తుర్యగా గతిః॥

తా॥ పైగుణములతో బాహ్యాంతరములందు చిదాత్మనే భావించుచు, భిక్షాదులకు పరులచేత లేపబడుచు స్వస్వరూపానుసంధానపరుడై సమాధిస్థితితో నుండుట ఏడవభూమిక. తురీయస్వరూపచైతన్యమును బొందించునది గనుక తుర్యగ అనబడును.

11 వ ప్ర॥ సమాప్తము.

# 12 వ ప్రకరణము

సగుణ నిర్గుణోపాసనముల ఫలము.

(1అ. 1పా. 6అధి) ఆనందమయోఽభ్యాసాత్ । 12

తా॥ ఆనందమయుడు జీవుడని చేసిన పూర్వపక్షముమీద సిద్ధాంతము- అభ్యాసాత్=పలుమాఱుచెప్పుటవలన ఆనంద మయః=ఆనందమయుడు పరబ్రహ్మమేగాని జీవుడుకాడు. తైత్తిరీయశ్రుతియందు అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ యనిచెప్పి తరువాత 'తస్మాద్వాఏతస్మాద్విజ్ఞానమయాదన్యోఽంతరఆత్మానందమయ' అని చెప్పబడినది విజ్ఞానమయుని (జీవుని) కంటె అన్యమై లోపలనున్న ఆత్మయే ఆనందమయుడని అర్థము. ప్రారంభమునందుగల 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' యను శ్రుతిచేత ఆత్మయేకాని జీవుడు కాడు. మయట్ నకు వికారార్థముచేత జీవుడనిచేసిన పూర్వపక్షము సరికాదు. ప్రాచుర్యార్థముచేత బ్రహ్మమే.

1 తై. 2-7 'రసగ్గంహ్యేవాయం లబ్ధ్వా నందీభవతి కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ యదేషఆకాశఆనందోనస్యాత్ ఏషహ్యేవానందయాతి సైషానందస్య మీమాగ్ంసాభవతి'

తా॥ ఆనందమే బ్రహ్మము. అదియే లోకమును సుఖపెట్టునది. బ్రహ్మమును పొందినవాడే కైవల్యసుఖముగలవాడు

2 తై. 2-8 'ఏతమానందమయమాత్మానముపసంక్రామతి'

3 తై. 2-9 'ఆనందంబ్రహ్మణోవిద్వాన్నబిభేతికుతశ్చనేతి'

4 తై. 3-6 'ఆనందోబ్రహ్మేతి వ్యజానాత్'

5 బృ. 5-9-26 'విజ్ఞానమానందం బ్రహ్మ'

తా. ఈశ్రుతులవలన ఆనందమే బ్రహ్మమని సిద్ధాంతము. బ్రహ్మము ఉపాధినాశ్రయించినపుడే సగుణము. ఉపాధినాశ్రయింపనపుడు నిర్గుణమే.

6 బృ. 6-5-15 'యత్రహి ద్వైతమివ భవతి। తదితర ఇతరం పశ్యతి। యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్'

తా॥ ఉపాధితోకూడినపుడు సగుణము భాసిల్లుచున్నది. జగత్తంతయు నాత్మగాభాసించునపుడు వేఱువస్తువులేదు. ఇదియే నిర్గుణము.

7 తై. 3-12-7 'సర్వాణిరూపాణి విచింత్య ధీరః నామానికృత్వాభివదన్యదాస్తే'

తా॥ జగత్తును సృజించి దానియందు జీవరూపముతోనున్న సగుణమూర్తినికూడా నిర్గుణమూర్తియని తెలిసికొనినవాడు ముక్తినిపొందును.

8 శ్వే. 6-19 'నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం। అమృతస్య పరంసేతుం దగ్ధేంధనమివానలం॥'

తా॥ అంశములును, పరిణామమును, రాగాదిదోషములును, అజ్ఞానమును, లేనివాడును, శాంతిస్వరూపముతో అజ్ఞానమును దహించి ముక్తినిచ్చువాడు నగు పర (నిర్గుణ)బ్రహ్మమును తెలిసికొనవలెను.

9 ఛాం. 3-14-1 'తంయథాయథోపాసతే తదేవభవతి'

తా॥ ఏవిధముగానుపాసించువానికి అందుకుతగిన ఫలమే

కలుగుచున్నది. వీనివలన సగుణ నిర్గుణోపాసనలకు వేఱువేఱు ఫలము కలుగుచున్నది.

(1అ. 2పా, 4అధి) అంతరఉపపత్తేః ॥ 13సూ.

తా॥ జరామరణములులేని ఆనందస్వరూపాదిలక్షణములు పరబ్రహ్మమునకు ఉపపత్తేః=తగియుండుటవలన అంతరః= కంటిలోనున్న పురుషుడు పరబ్రహ్మమే. కాని ప్రతిబింబోపాస్తి కాదు.

1 ఛాం. 4-15-1 'యఏషోఽక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మేతి హోవాచైతదమృత మేతదభయ మేతద్బ్రహ్మేతి తద్యద్యప్యస్మిన్ సర్పిర్వోదకంవా సించతి వర్త్మనీ హ్యేవ గచ్ఛతి' ఇది ఉపకోసలవిద్యయందున్నది

తా॥ కంటియందలి పురుషుడు సర్వజంతువులకును ఆత్మయని ఉపకోసలునకు గురువు చెప్పెను. కంటియందుపోసిన నూనె నెయ్యి రెప్పలనే పొందుచున్నది. తామరాకును నీరు అంటనట్లు ఆత్మను ఏదియునంటదు.

2 బృ. 7-5-2 'రశ్మిభిరేషోఽస్మిన్ ప్రతిష్ఠితః'

తా॥ సూర్యుడు కిరణములతో కంటియందున్నాడు.

3 ఛాం. 6-8-7 'స ఆత్మా తత్త్వమసి' [తివి.

తా॥ సత్పదార్థమే జగత్తునకు ప్రత్యగాత్మ. అదియే నీవై

అవ॥ సర్వవ్యాపకమైన ఆత్మకు ఒకస్థలము నిర్ణయింపతగదని పూర్వపక్షమురాగా- సిద్ధాంతము-

స్థానాది వ్యపదేశాచ్చ ॥ 14

తా॥ స్థానాది=చోటు, పేరు, ఆకారము మొదలగునవి ఉపాసనకొఱకు; వ్యపదేశాత్, చ= అనేకశ్రుతులయందుచె

వ్వుటవలన పూర్వపక్షము సరికాదు. 'యః పృథివ్యాంతిష్ఠన్' 'యశ్చక్షుషి తిష్ఠన్' 'తస్యోదితినామ' 'హిరణ్యశ్మశ్రుర్హిర ణ్యకేశః' ఇత్యాదిశ్రుతులు ఉపాసనకొఱకు నిర్గుణబ్రహ్మము నకు నామరూపములు చెప్పుచున్నవి.

అవ॥ క్రింది 2 శ్రుతిచేత జగత్కర్త హిరణ్యగర్భుడు (సగుణబ్రహ్మము) అని పూర్వపక్షమురాగా- సిద్ధాంతము- (1అ. 3పా. 4అధి) ఈక్షతి కర్మవ్యపదేశాత్సః ॥ 13సూ.

తా ఈక్షతి=శ్రుతివలన చూచుట తెలిసికొనుట మొద లగు; కర్మ=ధ్యానోపాసనములలెడి కర్మము; వ్యపదేశాత్= ఉపదేశింపబడుటవలన; సః=ఆపురుషుడు పరబ్రహ్మమే. ధ్యాన, ఈక్షణములు రెండును ఒకేవిషయము.

1 ప్రశ్నోపనిషత్తు. 5-2 'ఏతద్వై సత్యకామ పరంచా పరంచ బ్రహ్మ। యదోంకారస్తస్మాద్విద్వానేతే నైవాయ తనేనైకతరమన్వేతి'

తా॥ కార్యకారణబ్రహ్మములు రెండును ఓంకారస్వరూ పమే. కారణబ్రహ్మమునందు మనస్సు నిలుపశక్యము కాదు. ఉపాసనకొఱకు కార్యబ్రహ్మము కల్పింపబడినది. కార్యకార ణములు రెండును ఓంకారమని గౌణముగా చెప్పబడినది. ఓంకారోపాసనముచేత రెండింటిలో నొకదానిని పొందునని శైబ్యునితో పిప్పలాదమహర్షి చెప్పెను.

2 ప్ర॥ 5-5 'యః పునరేతంత్రిమాత్రేణోమిత్యేతే నైవాక్షరేణ పరంపురుషమభిధ్యాయీత'

తా॥ మూడుమాత్రలుగల ఓంకారముగు సూర్యాంతర్గత పురుషుని నుపాసించువాడు సూర్యునియందు ప్రవేశించి

పాము తనకూసమును విడిచినట్లు పాపములనువిడిచి సత్యలోకమును పొందుచున్నాడు.

అవ॥ ఆత్మశబ్దముచేత సృష్టిప్రారంభమున నున్నవాడు హిరణ్యగర్భుడని పూర్వపక్షమురాగా-

(3అ. 3పా.) ఆత్మ గృహీతిరితరవదుత్తరాత్ । 16సూ.

తా॥ ఇతరత్='తస్మాద్వా ఏతస్మాదాత్మనఆకాశస్సంభూతః' యను శ్రుతియందు ఆత్మశబ్దముచేత ప్రత్యగాత్ముడే ముఖ్యార్థముగా గ్రహింపబడునట్లే యిచటను ఆత్మగృహీతిః=ఆత్మగ్రహణమే కాని హిరణ్యగర్భుడు కాడు. 'ఆత్మైవేదమగ్ర ఆసీత్' ఇత్యాదులందు నెచటను పురుషవిధ యనునది మొదలగు నితరవిశేషము వినబడుచున్నదో నచట నాత్మునకు గ్రహణము యుక్తము. ఉత్తరాత్='స ఈక్షత లోకాన్నుసృజై' 'సఇమాన్ లోకానసృజత' ఇత్యాది వాక్యములు పరబ్రహ్మమునే చెప్పుచున్నవి. వేఱొకఅర్థము.

క్రిందిశ్రుతులవలన ఛాందోగ్యమునందు బ్రహ్మతత్త్వసంపదుపాస్తియును, వాజసనేయకమునందు నిర్గుణజ్ఞానోపదేశమును కనుపించుటచేత నన్యోన్యము గుణోపసంహారము లేదని పూర్వపక్షమురాగా- 'సదేవ సోమ్యేదమగ్రఆసీ' త్తను చోట సచ్ఛబ్దముచేత పరమాత్మయని ఛందోగులును, 'కతమ ఆత్మా' యనుచోట ఆత్మగ్రహణమని వాజసనేయులును చెప్పుచున్నారు. తరువాత నున్న తాదాత్మ్యోపదేశమువలన నట్లేకనిపించును.

అన్వయాదితిచేత్స్యాదవధారణాత్ । 17సూ.

తా॥ అన్వయాత్ =వాక్యతాత్పర్యముచేత హిరణ్యగర్భుడేకాని పరబ్రహ్మము కాదు. ఇతిచేత్ =అనియందువేని; అవధారణాత్ =సృష్టికిపూర్వము పరబ్రహ్మమొకటియే యను నిశ్చయమువలన పరబ్రహ్మమే స్యాత్ =అగును. పరబ్రహ్మము తానులేనిదే శరీరములుండనేరవని హిరణ్యగర్భాది సర్వశరీరములందును ప్రవేశించెనని శ్రుతులు చెప్పుచున్నవి.

1 ఐ. 1-3-12 'సఏతమేవ సీమానం విదార్యైతయా ద్వారా ప్రాపద్యత' [ప్రాణితం'

2 ఐ. 1-3-11 'యది వాచాభివ్యాహృతం యది ప్రాణేన

తా॥ పరమాత్మ బ్రహ్మరంధ్రముగుండా లింగశరీరమునందు ప్రవేశించెను.

3 ఐ. 3-1-3 'ఏషబ్రహ్మైష ఇంద్రఏష ప్రజాపతిః'

తా॥ శరీరమునందు ప్రవేశించిన పరబ్రహ్మమే ఇంద్రుడును, ప్రజాపతియును, సర్వప్రపంచపదార్థములును.

4 సర్వం తత్ప్రజ్ఞానే త్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం । ప్రజ్ఞానేత్రోలోకః ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ'

తా॥ ఈజగత్తు చిదాత్మయందే సృష్టిస్థితి లయములగుచున్నవి. స్వర్గాదిలోకములన్నియు చిదాత్మయొక్క నియమమే. ప్రజ్ఞయే లోకములకధిష్ఠానము. ఆచిదాత్మయే బ్రహ్మము.

(4అ. 3పా.) 1 ఉభయవ్యామోహా 2 తత్సిద్ధేః, 5సూ.

తా॥ అర్చిరాదిమార్గముచేత పోవువారు లీనమైన ఇంద్రియసముదాయము కలవారును, అస్వతంత్రులును, అచేతనములును అగుటచేత అర్చిరాదులకు స్వాతంత్ర్యము సిద్ధము. అర్చిరాదులకు నేతృత్వసిద్ధికలదు. కనుక దోషముకాదు.

అవ॥ పైసిద్ధాంతము సరికాదు. 'తాన్ వైద్యుతాల్లోకా దమానవః పురుషో బ్రహ్మగమయతి' అని ఉపాసకులను విద్యుల్లోకమునుండి ఒకసిద్ధుడు బ్రహ్మలోకమునకు తీసుకొనిపోవును. అని శ్రుతిచెప్పుచున్నది. దీనివలన అర్చిరాదులు కూడ ఉపాసకుని అనంతరలోకములకు తీసికొనిపోవువారని చెప్పవలసియున్నదని యాక్షేపమురాగా అట్లుకాదని చెప్పుచున్నాడు

వైద్యుతేనైవ తత స్తచ్ఛ్రుతేః ॥ 6సూ.

బృ. 8.2-15 'అమానవఏత్య బ్రహ్మలోకం గమయతి' యను శ్రుతియందు అమానవపురుషుడే తీసికొనిపోవుననుట వలన (తతః) అతనిచేతనే విద్యుల్లోకమును, (వైద్యుతేనైవ) వరుణాదిలోకములమీదుగా బ్రహ్మలోకమును పొందింపబడు చున్నాడు అని తెలియబడును.

అవ॥ 4 అధికరణములచేత దేవయానమార్గము నిరూపించి ఫలభూతమగు బ్రహ్మలోకమునుగూర్చి నిరూపించువాడై మొదట స్వసిద్ధాంతమును చెప్పుచున్నాడు.

(5అధి) కార్యం బాదరి రస్య గత్యుపపత్తేః ॥ 7సూ.

తా॥ బాదరి=బాదరాచార్యుడు కార్యం=సగుణబ్రహ్మమునే యమానవపురుషుడు పొందించుచున్నాడని తలచుచున్నాడు. (అస్య గత్యుపపత్తేః) కార్య (సగుణ) బ్రహ్మమునకు ప్రదేశమును, గంతవ్యమునకుపపత్తియును, కలుగుటవలన నతనిని పొందించును. నిర్గుణపరబ్రహ్మము సర్వగతమును, ప్రత్యగాత్మయు నగుటవలన నతనియందు గంతృ గంతవ్య గతి భావములు సంభవింపదు. అని బాదరిపూర్వపక్షము.

విశేషితత్వాచ్చ ॥ 8సూ.

బృ. 8-2-15 'బ్రహ్మలోకాన్ గమయతి' యను శ్రుతి లోని బహువచనాదులచేత (విశేషితత్వాత్) చ విశేషము తోకూడిన కార్యబ్రహ్మపరముగాని నిర్గుణపరబ్రహ్మముకాదు అనియు పూర్వపక్షము.

అవ॥ నపుంసకశబ్దముచేత నిర్గుణబ్రహ్మమునకేకాని సగుణ బ్రహ్మమునకు వర్తింపదని మఱియొక ఆక్షేపమునురాగా సిద్ధాంతము. 1 సామీప్యాత్తు 2 తద్వ్యపదేశః ॥ 9సూ.

తా॥ (1) సగుణబ్రహ్మమునకు నిర్గుణబ్రహ్మము సామీప్యమువలన సగుణబ్రహ్మమందును (2) నపుంసకశబ్దప్రయోగము విరోధింపదు. పరబ్రహ్మమే శుద్ధోపాధిసంబంధముకలదియును ఉపాసనకొఱకు చెప్పబడినదియును.

శ్రుతి-'ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవమావర్తం నావర్తంతఇతి। తేషామిహ న స పునరావృత్తిరస్తి। తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి'

అవ॥ కార్యబ్రహ్మలోకమని చెప్పునెడల 'న స పునరావర్తతే' బ్రహ్మమును పొందినవాడు తిరిగిరాడు అని చెప్పిన శ్రుతికి విరోధించును. కార్యబ్రహ్మలోకము అనిత్యమైనదిగదా? అని యనగా సమాధానము:

కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్ ॥ 10

తా॥ (కార్యాత్యయె) సగుణ (కార్య) బ్రహ్మలోకమునకు లయముకలుగుచుండగా నచటనున్నవారుత్పన్నమైన జ్ఞాన సామర్థ్యముకలవారై (తదధ్యక్షుణసహ) హిరణ్యగర్భునితో (అతఃపరం) అంతకంటె పరిశుద్ధమగు విష్ణునిపరమపదమును

పొందుదురు. ఇట్లు క్రమముక్తిని (అభిధానాత్) శ్రుతివాక్యములవలన నంగీకరింపవలెను. 10

స్మృతేశ్చ. 11

'బ్రహ్మణాసహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే।
పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపదం.।'

ఈ స్మృతికిని 10వ సూత్రతాత్పర్యమే. 11

అవ॥ ఈవిధముగా స్వసిద్ధాంతమును చెప్పగా పూర్వపక్షము చేయబడుచున్నది.

పరం జైమినిర్ముఖ్యత్వాత్ ॥ 12

తా॥ (పరం) పర (నిర్గుణ) బ్రహ్మమునే పొందించునని (ముఖ్యత్వాత్) నపుంసకశబ్దమునకు నిర్గుణబ్రహ్మము ముఖ్యార్థమనియు, సగుణబ్రహ్మము గౌణార్థమనియు, జైమిని తలచుచున్నాడు. దర్శనాచ్చ ॥ 13సూ.

తా॥ 'తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి' ఇత్యాదిశ్రుతులవలన నిర్గుణబ్రహ్మమేకాని సగుణబ్రహ్మముకాదని అమృతత్వము (మోక్షము)ను పొందువారినిగురించికనుపించుచున్నది

అవ॥ 'ప్రజాపతిస్సభాం వేశ్మ ప్రపద్యే' బ్రహ్మదేవునిసభకు పోవుదును అను శ్రుతియందు సగుణబ్రహ్మలోకమునుగూర్చి సంకల్పించినట్లు చెప్పబడియున్నదికదా? అనగా పూర్వపక్షియగు జైమినిమహాముని సమాధానము చెప్పుచున్నాడు.

నచ కార్యే ప్రతిపత్త్యభిసంధిః ॥ 14సూ.

తా॥ (కార్యే ప్రతిపత్త్యభిసంధిః) కార్య (సగుణ) బ్రహ్మప్రాప్తిసంకల్పము (న) కాదు. గతిశ్రుతులు పరబ్రహ్మపర

మని జైమినిపక్షము. కార్యబ్రహ్మపరమని కొందఱిపక్షము. పరబ్రహ్మపరమందు గతిలేనందునను, కార్యబ్రహ్మపరమందు గతియున్నందునను 'కార్యం బాదరి' యనుపక్ష మేనిశ్చయము

(4అ. 4పా.) వికారావర్తిచ తథాహి స్థితిమాహ ॥ 19 సూ.

తా॥ వికారావర్తిచ=పరమాత్మ సూర్యమండలాద్యధిష్ఠానముగ నుండుటయేకాక నిర్గుణముకూడ కలదు. తథాహి-స్థితిః=అట్లే పరమాత్మకు సగుణ నిర్గుణముల నెడి రెండురూపముల స్థితిని ఆహ=శ్రుతి చెప్పుచున్నది.

1 ఛా. 3-12-6 'తావానస్య మహిమా తతో జ్యాయాగ్ంశ్చ పురుషః। పాదోఽస్య సర్వాభూతాని త్రిపాదస్యామృతం దివి॥'

తా॥ పరమాత్మ సర్వోత్కృష్టుడు ఒకపాదముచేత జగత్తును, మూడుపాదములచేత మోక్షమును వహించియున్నాడు.

(7అధి) దర్శయతిచ్చైవం ప్రత్యక్షానుమానే। 20

తా॥ పరమాత్మకు వికారములు లేని రూపము నిర్గుణము.

1 ముం. 2-2-1 'నతత్ర సూర్యోభాతి నచంద్రతారకం।
నేమావిద్యుతో భాంతి కుతోఽయమగ్నిః'

2 భ.గీ. 15అ. 6 'నతద్భాసయతే సూర్యో నశశాంకో
నపావకః।' [ప్రచేయలేరు.

తా॥ ఆత్మస్వరూపమును సూర్యచంద్రాగ్నులు ప్రకాశింఇట్లు ప్రత్యక్షానుమానే=శ్రుతిస్మృతులు దర్శయతి=చూపుచున్నవి. కనుక పరమజ్యోతికి సగుణరూపములు వికారములని ప్రసిద్ధము.

పంచదశీ ప్ర॥ 9 ధ్యానదీపము.

నిష్కామోపాసనాన్ముక్తి స్తాపనీయే సమీరితా।
బ్రహ్మలోకస్సకామస్య శైబ్యప్రశ్నే సమీరితః॥ 143॥
నిర్గుణోపాస్తి సామర్థ్యాత్తత్ర తత్వమవేక్షతే।
పునరావర్తతే నాయం కల్పాంతేచ విముచ్యతే॥ 146॥

తా॥ నిష్కాముడై నిర్గుణోపాసనచేయువానికి మరణకాలమందే జ్ఞానద్వారా ముక్తికలుగుచున్నదని తాపనీయోపనిషత్తునందును, బ్రహ్మాదిలోకములందు కోరికకలిగి నిర్గుణోపాసనచేయువానికి బ్రహ్మలోకప్రాప్తికలుగునని శైబ్యప్రశ్నోపనిషత్తునందును చెప్పబడినది. కోరికగలవాడు నిర్గుణోపాస్తిసామర్థ్యమువలన సగుణబ్రహ్మలోకమందు పరతత్త్వమును విమర్శించుచు అపరోక్షజ్ఞానవంతుడై సగుణబ్రహ్మప్రళయమునందు నిర్గుణబ్రహ్మముక్తిని పొందుచున్నాడు. గాని మరల జన్మింపడు.

ఇహావా మరణేచాస్య బ్రహ్మలోకేఽథవా భవేత్।
బ్రహ్మసాక్షాత్కృతిస్సమ్యగుపాసీనస్య నిర్గుణం॥ 150॥

తా॥ శాస్త్రోక్తప్రకారము లెస్సగా నిర్గుణబ్రహ్మోపాసనచేసినవానికి జీవితకాలమందైనను, మరణకాలమందైనను, బ్రహ్మలోకమందైనను కైవల్యముక్తి కలుగును.

భ.గీ. సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞంచ యే విదుః।
7అ. ప్రయాణకాలేపిచ మాం తే విదుర్యుక్తచేతసః॥ 30॥

8అ. అంతకాలేచ మామేవ స్మరన్ముక్త్వా కళేబరం।
యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥

తా॥ సమస్తభూతములును, యజ్ఞములును, చిద్రూపమని దృఢముగ తెలిసికొనినవాడును, మరణకాలమందు చిద్రూపమునే స్మరించువాడును, ముక్తిని పొందుచున్నారు.

నిర్గుణచింతా నిష్కళేత్యుచ్యతే విజ్ఞానభైరవభట్టారకైః॥
ధ్యానం యా నిష్కళా చింతా నిరాధారా నిరాశ్రయా।
నతు ధ్యానం శరీరస్య ముఖహస్తాది కల్పనేతి॥

తా॥ శరీరముఖహస్తాదులను ధ్యానము చేయతగదు. నిరాధారము, నిరాశ్రయము, కళాశూన్యము నగు నిర్గుణమునే ధ్యానింపవలయును.

పంచదశి 5ప్ర॥ మహావాక్యవివేకము.

పరిపూర్ణః పరాత్మాస్మిన్ దేహే విద్యాధికారిణి।
బుద్ధేస్సాక్షితయా స్థిత్వా స్ఫురన్నహమితీర్యతే॥ 3॥

తా॥ సకలబుద్ధివృత్తులకును సాక్షిగ స్ఫురించునట్టి పరమాత్మయే అహంశబ్దమునకు లక్ష్యమగు చైతన్యమనియర్థము లోకములో అహంశబ్దమునకు దేహమనియు, అహంకారమనియు, చెప్పెడి రెండుఅర్థములును వాచ్యార్థములు గనుక నివి జ్ఞానావస్థయందు ఉపయోగింపవు.

అవ॥ క్రింది 1 శ్రుతిలోని వైశ్వానరశబ్దముచేత జగత్కర్త జఠరాగ్నియా లేక భూతాగ్నియా లేక జీవుడా అని పూర్వపక్షము రాగా— (1అ.2పా.7అధి)

1 వైశ్వానరః 2 సాధారణ 3 శబ్ద 4 విశేషాత్॥

తా॥ (2) జఠరాగ్నిమొదలగువానియందు సాధారణముగా చెప్పబడు (3) శబ్దమునకంటె (4) విశేషణములుండుట

వలన (1) వైశ్వానరశబ్దముచేత పరబ్రహ్మమే గ్రహింపవలయును.

1 ఛాం. 5-18 'యస్త్వేతమేవం ప్రాదేశమాత్ర మభివిమానమాత్మానం వైశ్వానరముపాస్తే। స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మస్వన్నమంతి। తస్యహవా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్థైవసు తేజాశ్చక్షుర్విశ్వరూపః ప్రాణః పృథగ్వర్త్మా సందేహోబహులో వస్తిరేవ రయిః పృథవ్యేవ పాదావురఏవ వేదిర్లోమాని బర్హిర్హృదయం గార్హపత్యో మనోన్వాహార్యపచనఆస్యమావహనీయం'

తా॥ వైశ్వానరుడు ప్రపంచమునంతను ఎఱిగినవాడును, తలకును, చుబుకము (గడ్డము) నకును మధ్యను చిన్నపరిమాణముతో నున్నవాడును, ఇతని నుపాసించువాడు ఎల్లభోగస్థానములందును, ఎల్లశరీరములందును, భోజనపదార్థముల ననుభవించుచున్నాడు. ఇతనికి ద్యులోకమే శిరస్సు. సూర్యుడే నేత్రము. వాయువే ప్రాణము. ఆకాశమే దేహమధ్యభాగము. ఉదకమే పొత్తికడుపు. భూమియే పాదములు. వక్షమే అగ్నియుండు వేది. (అరుగు) వెండ్రుకలే దర్భలు. హృదయమే గార్హపత్యాగ్ని. మనస్సే దక్షిణాగ్ని. ముఖము ఆవహనీయము. (హోమస్థానము) ఇట్లుండుటచేత వైశ్వానరుడు సర్వాత్మస్వరూపుడు.

2 ఛాం. 5-24 'ఏవం హ్యస్య సర్వే పాప్మానః
ప్రదూయంతే'

తా॥ అగ్నియందు వెల్లువూవుకాలునట్లు వైశ్వానరోపాసకునియొక్క యెల్లకర్మములు కాలిపోవును. 24

1 స్మర్యమాణ 2 మనుమానం 3 స్యాది 4 తి ॥ 25

తా॥ (1) స్మృతియందలి విషయము (2) ఆధారభూత ముగా నొకశ్రుతియుండవలయనని ఊహింపచేయునది (3) అగునను కారణమువలన వైశ్వానరశబ్దమునకర్థము పరబ్రహ్మమే.

1. వి.పు 'యస్యాగ్నిరాస్యం ద్యౌర్మూర్ధా ఖం నాభిశ్చరణౌ క్షితిః । సూర్యశ్చక్షుర్దిశశ్శ్రోత్రం తస్మై లోకాత్మనే నమః ।'

తా॥ అగ్నియే ముఖము. ద్యులోకమే శిరస్సు. ఆకాశమే నాభి. భూలోకమే పాదములు. సూర్యుడే నేత్రము. దిక్కులే చెవులు గల త్రైలోక్యశరీరుడగు ఈశ్వరునికి నమస్కారము.

శబ్దాదిభ్యోఽంతఃప్రతిష్ఠానాచ్చ నేతిచేన్న
తథా దృష్ట్యుపదేశాదసంభవాత్పురుషమపి
చైనమధీయతే ॥ 26 సూ.

తా॥ శబ్దాదులవలన అగ్నినే చెప్పుచు త్రేతాగ్నివిభాగము వైశ్వానరునకే చేయబడి ప్రాణాహుతులకాధారముగా చెప్పుటచేత అంతః=పురుషునిలోపల ప్రతిష్ఠానాత్ =ఉన్నాడనుటవలన వైశ్వానరశబ్దముచేత పరబ్రహ్మము నేతిచేత్-కానేరదందువేని న=సరికాదు. తథా దృష్ట్యుపదేశాత్ =అట్లే జఠరాగ్నియే పరమేశ్వరుడనిగాని, జఠరాగ్నియందున్నాడని గాని యుపాసనమార్గము చెప్పుటవలనను అసంభవాత్ = ద్యులోకము శిరస్సుగానుండుట మొదలగునవి జఠరాగ్నియందుండుటకు వీలులేనందునను, వైశ్వానరశబ్దముచేత పరబ్రహ్మ

మే. అట్లే వాజసనేయశాఖవారు ఏనం=వైశ్వానరుని పురుషమపి=పురుషుడనియును అధీయతే=చెప్పుచున్నారు.

1 శ. బ్రా. 10.6.1 'సఏషోగ్నిర్వైశ్వానరో యత్పురుషస్సయో హైతమేవాగ్నిం వైశ్వానరం పురుషం పురుషేంతః ప్రతిష్ఠితం వేద'

తా॥ వైశ్వానరుని పూర్ణుడుగాను, మూర్ధచుబుకములకు మధ్యనున్నవానిగాను ఉపాసించువాడన్నిభోగములననుభవించును.

1 అతఏవ 2 న 3 దేవతా 4 భూతంచ ॥ 27

తా॥ (1) ప్రపంచమయశరీరమగుటకు వీలులేనందున (3) అగ్నినభిమానించు దేవతయును (4) పంచమహాభూతములలోని అగ్నిభూతమును వైశ్వానరశబ్దముచేత చెప్పబడనేరవు.

1 సాక్షాద 2 ప్యవిరోధం 3 జైమినిః ॥ 28

తా॥ (1) ప్రత్యక్షముగా జఠరాగ్నియనిగాని, జఠరాగ్నిలోపలనున్నాడనిగాని తలంపక శుద్ధపరబ్రహ్మమని తలచినను (2) విరోధములేదని (3) జైమినిముని తలచుచున్నాడు.

1 అభివ్యక్తేరిత్యా 2 శ్మరథ్యః ॥ 29సూ.

(1) పరమేశ్వరుడు సర్వవ్యాపకుడైనను ఉపాసకులకొఱకు ప్రాదేశమాత్రుడనుట విరుద్ధముకాదని (2) అశ్మరథ్యముని తలచుచున్నాడు.

అనుస్మృతేర్బాదరిః ॥ 30సూ.

తా॥ ధ్యానముకొఱకు హృదయమునందు పరమేశ్వరుడుండుటవలన విరోధములేదని బాదరిముని మతము.

1 సంపత్తేరితి 2 జైమిని స్తథాహి 3 దర్శయతి 31

తా॥ (2) జైమినిముని (1) పరబ్రిహ్మము ప్రాదేశమాత్రుడనుట విరుద్ధముకాదని వ్యాసులు తలచుచున్నాడు. (3) వాజసనేయబ్రాహ్మణమునందట్లే చెప్పబడినది.

1 శ్రుతి। 'ప్రాదేశమాత్రమివహవై దేవాస్సువిదితా అభిసంపన్నా స్తథాతు వఏతాన్వక్ష్యామి యథా ప్రాదేశమాత్రమేవాభిసంపాదయిష్యామీతి। సహోవాచ మూర్ధానముపదిశన్నువాచ। ఏషవా అతిష్ఠా వైశ్వానరఇతి చక్షుషీ ఉపదిశన్నువాచ। ఏషవై సుతేజా వైశ్వానరఇతి నాసికేఉపదిశన్నువాచ। ఏషవై పృథగ్వర్త్మాత్మా వైశ్వానరఇతి ముఖ్యమాకాశముపదిశన్నువాచ। ఏషవై బహులో వైశ్వానరఇతి ముఖ్యా అప ఉపదిశన్నువాచ। ఏషవై రయిర్వైశ్వానరఇతి చుబుకముపదిశన్నువాచ। ఏషవై ప్రతిష్ఠా వైశ్వానరఇతి।'

తా॥ దేవతలు పూర్వము ప్రాదేశమాత్రపరిమాణమును లేనట్టి ఈశ్వరుని పొందిరి. అట్టిఈశ్వరుని వైశ్వానరునితో నభేదముగా ప్రాచీనశాలాదులతో అశ్వపతిరాజిట్లు చెప్పెను. తనశిరస్సును చూపించి ఈశిరమే ద్యులోకమను వైశ్వానరుని శిరస్సు. అతనికి సూర్యుడే నేత్రములు. నాసికయే ప్రాణము ఆకాశమే దేహమధ్యభాగము. నోటియందలి చొంగనీరే పొత్తికడుపునందలి జలము. గడ్డమే పాదములు అదియేపృథ్వి అని ధ్యానింపవలయును.

1 ఆమనంతి 2 చైన 3 మస్మిన్ ॥ 32 సూ.

తా॥ (2) ఈపరబ్రహ్మమును (3) గడ్డము మొదలు శిర స్సువరకును గల ప్రదేశమునందు ఉన్నట్లు జాబాలశాఖవారు (1) చెప్పుచున్నారు. ఆత్మస్వరూపము ఎట్లు తెలియబడునని యడిగిన అత్రిమహర్షితో యాజ్ఞవల్క్యుడు చెప్పుచున్నాడు.

శ్రుతి॥ జాబాల॥ 2 'యఏషోనంతో వ్యక్త ఆత్మా సోవిముక్తే ప్రతిష్ఠితఇతి సోవిముక్తః కస్మిన్ ప్రతిష్ఠితఇతి వరణాయాం నాస్యాంచ మధ్యే ప్రతిష్ఠితఇతి కావై వరణా కాచ నాసీతి సర్వానింద్రియకృతాన్ దోషాన్ వారయతీతి తేన వరణా భవతి సర్వాణీంద్రియకృతాని పాపాని నాశయతీతి తేన నాసీ భవతి॥'

తా॥ నీచేతనడుగబడిన అనంతుడు నాశరహితుడు. అవ్యక్తుడు తెలియరానివాడు నగు ఆత్ముడు. అతడు జీవునియందు నిలిచెను. మఱియు కనుబొమలకును నాసికకును సంధియగు భ్రూమధ్యమందు నిలిచెను. ఇంద్రియములచేత చేయబడిన పాపములను తొలగించునది వరణ అనియు, పాపములను పోగొట్టునది నాసికయనియు చెప్పబడును.

2 జాబాల శ్రుతి॥ 2 'కతమచ్చాస్య స్థానం భవతీతి భ్రువోర్ఘ్రాణస్యచ యస్సంధిః సఏష ద్యులోకస్య పరస్యచ సంధిర్భవతి॥'

తా॥ జీవునకు ముఖ్యస్థానము భ్రూమధ్యమము. అదిస్వర్గ లోకమునకును, పరబ్రహ్మస్థానమునకును మధ్య సంధిప్రదేశము. ఇట్లు ధ్యానింపుమని యాజ్ఞవల్క్యుడు చెప్పెను.

## వివరణము-శ్రుతులనుబట్టి

| | |
|---|---|
| 1 నరునికి స్థూలదేహమునందు గల పాదములు మొదలు శిరస్సు వరకునుగల అవయవములు | నరునియొక్క చుబుకము మొదలు శిరస్సువరకునుగల అల్పప్రదేశమందే వైశ్వానరుడనెడి పరమాత్మకు ఉన్నవనుట |
| శిరస్సే | శిరస్సు |
| నేత్రములే | సూర్యుడనెడి నేత్రములు |
| నాసికే | ప్రాణవాయువు |
| హృదయాకాశమే | శిరస్సు మొదలుచుబుకము వరకును ఉన్న దేహమధ్య భాగము. |
| పాత్తికడుపునందలి చొంగనీరే | నోటియందలి చొంగనీరు |
| పాదములే | చుబుకము (గడ్డము) ఇదియే భూలోకము. |
| వక్షస్థలమే | అగ్నియుండు వేది(అరుగు) |
| వెండ్రుకలే | దర్భలు |
| హృదయమే | గార్హపత్యాగ్ని |
| మనస్సే | దక్షిణాగ్ని |
| ముఖమే | ఆవహనీయాగ్ని |
| నాభియే | ఆకాశము |
| చెవులే | దిక్కులు |

2 వీనిలో భ్రూమధ్యమందే జీవాత్మయున్నట్లును, అది ద్యులోకమునకును, పరబ్రహ్మస్థానమునకును సంధిప్రదేశమ

యు, ద్యులోకమనగా భూలోక భువర్లోక సువర్లోకములకు పైనియున్న స్వర్గలోకమనియు, అదియే బ్రహ్మరంధ్రమనియు చెప్పబడినదిగాని పరబ్రహ్మస్థానము ఈశరీరమునందుఏదియని సంశయము కలుగుచున్నది.

2 పరమాత్మస్థానము హృదయమని 1వ అధ్యాయము 3వ పాదము 24వ సూత్రమందును, నేత్రములయందలి పురుషుడే పరమాత్మయని 1వ అ. 2వ పా. 13-14 సూత్రములందును, సుషుప్తిస్థానము హృదయమని 1అ. 4పా. 18 సూత్రమునందును చెప్పబడినది. కాని పైజాబాలశ్రుతులవలనను, క్రింది ప్రమాణములవలనను ఇట్లుతోచును.

4 సుషుప్తియందు జీవాత్మ పరమాత్మతో నేకీభవించుచున్నదని 1వ అధ్యాయము 3వ పాదము 15-20వ సూత్రములందు చెప్పబడినది. మనస్సు లీనమైనపుడే సుషుప్త్యవస్థయనబడును. అణుమాత్రమున్నపుడు సమన అనియు, అదియును లేనపుడు ఉన్మన అనియు, సమనోన్మలు చుబుకముతోకూడిన శిరస్సునందే యున్నవనియు, వానిని మూలాధారము మొదలు బ్రహ్మరంధ్రమువరకునున్న సుషుమ్నానాడి యను పరచిత్తునందే భావించుమనియు ఆమ్నాయములందు చెప్పబడుచున్నది. మనోన్మనియే సుషుప్తియనెడి ద్వాదశాంతము. అనంతరము కంఠమనెడి విశుద్ధచక్రము నగును.

5 ల॥ స॥ 207 మనోన్మన్యై నమః ।

వ్యా॥ భ్రూమధ్యాదష్టమం స్థానం బ్రహ్మరంధ్రాదధస్తనం మనోన్మనీతి కథితం తద్రూపా త్తత్స్వరూపకం । స్వఛందసంగ్రహే॥ యా శక్తిః కారణత్వేన తదూర్ధ్వం చోన్మనీ స్మృ

తా। నాత్ర కాలకలామానం నతత్త్వం నచ దేవతా॥ సు
నిర్వాణం పరం శుద్ధం రుద్రవక్త్రం తదుచ్యతే। శివశక్తిరితి
ఖ్యాతా నిర్వికల్పా నిరంజనేతి॥ అతఏవ॥ 'వామదేవాయ
నమో జ్యేష్ఠాయ నమ ఇతి శ్రుతౌ। ప్రసిద్ధస్య మనోన్మనా
ఖ్యశివస్య శక్తిరితిచ॥' త్రిపురోపనిషద్యపి॥ నిరస్తవిషయా
సంగం సన్నిరుద్ధం మనోహృది। యదా యాత్యున్మనీభావం
తదా తత్పరమంపదం॥ యోగశాస్త్రే। నేత్రే యయోన్మేష
నిమేషముక్తే వాయుర్యయా వర్జితరేచపూరః। మనశ్చ సం
కల్పవికల్పశూన్యం మనోన్మనీ సా మయి సన్నిధత్తామితి॥
బృహన్నారదీయే॥ ధ్యాన ధ్యాతృ ధ్యేయభావో యదా నశ్య
తి నిర్భరం। తదోన్మనీత్వం భవతి జ్ఞానామృతనిషేవణాదితి॥
మనాంస్యున్మన్యతే ఉత్కృష్టజ్ఞానయుక్తాని కురుత ఇతివా॥

తా. భ్రూమధ్యము మొదలు ఎనిమిదవస్థానముగాను,
బ్రహ్మరంధ్రమునకు క్రిందిస్థానముగాను ఉన్న మనోన్మన
తెలియుటవలననే బ్రహ్మజ్ఞానము కలుగును. మరియు సర్వ
కారణశక్తికి మీదుగానున్నదియే మనోన్మనయనబడును.
అక్కడ కాలముగాని, 16 కళలుగాని, మానము (సంఖ్య)
గాని, 24-36 మొదలగు తత్త్వములుగాని, దేవతలుగాని
యేమియునులేవు. అది శుద్ధమోక్షమనెడి పరబ్రహ్మము. అది
వికల్పములును, మాయాకార్యములునులేని శివశక్తియని
స్వఛందసంగ్రహమునందు చెప్పటయేకాక వామదేవాయ
నమో జ్యేష్టాయ ఇత్యాది మంత్రముచేత ప్రసిద్ధమైన మనో
న్మనయనెడి శివరూపమునకే శక్తిరూపమనికూడా రుద్రాని
వాకమనెడి నమకమునందును, సర్వసంగములను పరిత్యజించి

మనస్సును హృదయమందు లగ్నముచేయుటయే ఉన్మనీభావమనియు, దీనియందె పరబ్రహ్మప్రాప్తియగుననియు, త్రిపురోపనిషత్తునందును చెప్పబడినది.

మరియు నేత్రములకు రెప్పపాటులేకపోవుటయును, రేచక పూరకములు లేకుండ పూర్ణకుంభకము కలుగుటయును, మనస్సునకు సంకల్పవికల్పములు లేకపోవుటయును, చేయునట్టి మనోన్మన అనుగ్రహించి నన్ను పొందుగాక? అని యోగశాస్త్రమును, ధ్యానధ్యాతృ ధ్యేయముల నెడి త్రిపుటి యెప్పుడు నశించుచున్నదో అప్పుడు జ్ఞానామృత సేవవలన ఉన్మనీభావము కలుగుననియు, జీవులయొక్క మనస్సులను ఉత్కృష్టజ్ఞానస్వరూపముగా చేయునదికనుక ఉన్మనయనియు బృహన్నారదీయమును చెప్పుచున్నవి. ఇచట సమన, ఉన్మన, యను రెండింటెని మనోన్మనయని ఒకటిగా చెప్పబడినది. అది భ్రూమధ్యమునకు పైనున్న బిందువు మొదలు ఎనిమిదవదగును

6 ద్వాదశాంతముయొక్క వివరణము-

వరివస్యారహస్యము- ప్రథమాంశము- పంచదశీవిద్యను గూర్చి- హృల్లేఖాయాః స్వరూపంతు వ్యోమాగ్ని ర్వామలోచనం। బిందర్ధచంద్రరోధిన్యో నాదనాదాంతశక్తయః॥ 12 వ్యాపికా సమనోన్మన్యఇతి ద్వాదశసంహతిః। బిందాదీనాం నవానాంతు సమష్టిర్నాదఉచ్యతే॥ 13॥ ప్రళయాగ్నినిభం ప్రథమం మూలాధారాదనాహతం స్పృశతి। తస్మాదాజ్ఞాచక్రం ద్వితీయకూటంతు కోటిసూర్యాభం। తస్మాల్లలాటమధ్యం తార్తీయం కోటిచందాభ్రం। మాలామణివద్వర్ణాః క్రమేణ భావ్యా ఉపర్యుపరి॥ 21॥ మధ్యేఫాలం బిందుర్దీపఇ

వాభాతి వర్తులాకారః । తదుపరి మతోర్ధచంద్రోస్వార్ధః కాం
త్యా తథాకృత్యా । అథ రోధనీ తదూర్ధ్వం త్రికోణరూపా
చ చంద్రికాకాంతిః । 23 । నాదస్తు పద్మరాగవదండద్వయ
మధ్యవర్తినీ వసిరా । నాదాంత స్తటిదాభః సవ్యస్థితబిందు
యుక్తలాంగలవత్ । 24 । తిర్యగ్బిందుద్వితయె వామోర్ధ్వగచ్ఛ
త్సిరాకృతిశ్శక్తిః । బిందూర్ధ్వగచ్ఛత్ర్యస్రిసాశ్రారాథ వ్యాపికా
ప్రోక్తా ॥ 25 । ఊర్ధ్వాధో బిందుద్వయరేఖాకృతిస్సమనా ।
సైవోర్ధ్వబిందుహీనోన్మనా తదూర్ధ్వం మహాబిందుః । 26 ।
శక్త్యాదీనాంతు వపుర్ద్వాదశరవికాంతిపుంజాభం ॥

తా॥ హ్రీంకారమునందు హకార రేఫ ఈకార బిందు అర్ధచంద్ర రోధిని నాద నాదాంత శక్తి వ్యాపిక సమన ఉన్మన యను 12 రూపములును, బిందువు మొదలుగాగల 9కి నాదమని పేరును కలదు. పంచదశీవిద్య బ్రహ్మవిద్య అనుటకు ప్రమాణము 5వ ప్రకరణమునందు కలదు. పంచదశియొక్క మూడుకూటములలో మొదటికూటము ప్రళయాగ్ని వలె మూలాధారచక్రము మొదలు అనాహత (హృదయ) చక్రమువరకును, అది మొదలు ఆజ్ఞా (భ్రూమధ్య) చక్రమువరకును కోటిసూర్యకాంతితో రెండవకూటమును, అదిమొదలు లలాటమధ్య (ఫాలము) చక్రమువరకును కోటిచంద్రకాంతితో మూడవకూటమును మాలయందు పూసలవలె క్రమముగా ఆయాబీజములును, ఫాలమధ్యము మొదలు క్రమముతో 1 బిందువు దీపమువలె కాంతితో గుండ్రముగాను, 2 అర్ధచంద్రుడు కాంత్యాకారములచేత అర్ధచంద్రునివలెను, 3 రోధిని వెన్నెలవంటికాంతితో త్రికోణరూపముగాను, 4 నాద

ము పద్మరాగకాంతితో అండద్వయమధ్యమందలి లింగాకారముగాను, 5 నాదాంతము మెరుపువంటికాంతితో నెడమభాగమున బిందువుకలిగి నాగలివలెను, 6 శక్తి ద్వాదశాదిత్యకాంతితో అడ్డముగానుండు రెంటుబిందువులుకలిగి యెడమభాగమందలి బిందువుపైని ఊర్ధ్వముగానుండు సిరా(లింగా)కారముగాను, 7 వ్యాపిక బిందువుతోకూడిన త్రికోణముగాను, 8 సమన మీదను క్రిందను రెండుబిందువులుగల రేఖగాను, 9 ఉన్మన క్రిందిబిందువుతోకూడిన రేఖగానుండి సమనయే ఉన్మనగాను ఉండును. 6.7.8 9 లు ద్వాదశాదిత్యులకాంతిగలవి. ఉన్మనకు అతమందున్నది మహాబిందురూపమగు చిద్రూపమే. బిందువు మొదలుగాగల తొమ్మిదియును, క్రమముగా సూక్ష్మరూపములుగాను, నాదసంజ్ఞకముగాను, ఉండి చిద్రూపమందు లీనమగును.

వి॥ పైనచెప్పిన 6వదగు శక్తియే స్వఛందసంగ్రహమందలి సర్వకారణశక్తిగానున్నది. హ్రీంకారమునందువలెనే ఓంకారమునందును 12 రూపములు గలవు. ఎట్లనగా-అకార ఉకార మకారములు మూడును, బిందువు మొదలుగాగల నాదసంజ్ఞ తొమ్మిదియును మొత్తము 12 ను కలవు. గనుకనే ద్వాదశాంతమనగా ఈ 12 యొక్క అంతమే చిద్రూపస్థానము సుషుప్తిస్థానము నగును. హ్రీంకార ఓంకారములకుభేదములేదని 104 పేజీలో కలదు.

## 7 మూలాధారాది చక్రములన్నియు సుషుమ్నానాడియందే కలవు.

ఆమూలాధారాదాబ్రహ్మబిలం విలసంతీం బిసతంతు తనీయసీం । విద్యుత్పుంజపింజరాం వివస్వదయుతభాస్వరప్రకాశాం పరిశ్శతసుధామయూఖశీతలాం తేజోదండరూపాం పరచితిం భావయేత్ ।

తా. మూలాధారము మొదలు బ్రహ్మరంధ్రమువరకును పద్మనాళములోని దారమువలెను, మెఱుపుతీగవలెను, కోటి సూర్యకాంతియు, కోటిచంద్రకాంతియు కలిగి తేజోదండస్వరూపముగానున్న పరచితిని తానుగా ధ్యానింపవలయునని ఆమ్నాయములందు చెప్పబడినది. మూలాధారమునుండి సహస్రారమునకును, సహస్రారమునుండి మూలాధారమునకును, సుషుమ్నామార్గమున బ్రహ్మరంధ్రమునాశ్రయించి హంస తిరుగుచుండును.

చక్రముల వివరణము.

| | | |
|---|---|---|
| మూలాధారచక్రము- | 4 | దళములుగల పద్మము గుదస్థానము |
| స్వాధిష్ఠానచక్రము- | 6 | దళములతో లింగమందు [నందు |
| మణిపూరచక్రము- | 10 | దళములతో నాభియందు |
| అనాహతచక్రము- | 12 | దళములతో హృదయమందు |
| విశుద్ధచక్రము- | 16 | దళములతో కంఠమందు |
| ఆజ్ఞాచక్రము- | 2 | దళములతో భ్రూమధ్యమందును |
| సహస్రదళపద్మము- | | బ్రహ్మరంధ్రము. [ఉన్నవి. |

శరీరమునందే సముస్తతీర్థములున్నవనుట.

సూతసంహిత.

శ్రీపర్వతశిరస్థానే కేదారస్తు లలాటకే । వారాణసీమహాప్రాజ్ఞ భ్రువోర్ఘ్రాణస్య మధ్యమే ॥ భ్రువోర్ఘ్రాణస్య యస్సంధి రితి జాబాలికీశ్రుతిః । కురుక్షేత్రం కుచస్థానే ప్రయా

గం హృత్సరోరుహే। చిదంబరంతు హృన్మధ్యే ఆధారే కమలాలయః। ఆత్మస్థం తీర్థముత్సృజ్య బహిస్తీర్థంతు యోవ్రజేత్ ॥ కరస్థం సమహారత్నం త్యక్త్వా కాచం విమార్గయేత్॥

తా॥ శ్రీశైలపర్వతము శిరస్సునందును, కేదారక్షేత్రము లలాటమందును, కాశీక్షేత్రము భ్రూమధ్యమునందును, కురుక్షేత్రము కుచస్థానమునందును, ప్రయాగక్షేత్రము హృత్పద్మమునందును, చిదంబరక్షేత్రము హృత్పద్మమధ్యమునందును, లక్ష్మీస్థానము మూలాధారమునందును, కలవనియు వీనినివిడిచి బహిస్తీర్థములకు పోయినవాడు చేతిలోనున్న మహారత్నమును విడిచి గవ్వనుపొందగోరువానితో సమానుడు. అని సకల తీర్థములు శరీరమునందే చూపబడినవి.

శరీరమునందే అండాండ, పిండాండ, బ్రహ్మాండ
ముల కైక్యము కలదనుట.

11 ఉమాసువాచ్ఛలాతంత్రము.

బైందవం బ్రహ్మరంధ్రం స్యాన్మస్తకం తు త్రికోణకం।
లలాటేఽష్టారచక్రం స్యాద్భ్రువోర్మధ్యే దశారకం॥
బహిర్దశారం కంఠే స్యాన్మన్వస్రం హృదయం భవేత్।
కుక్షిస్తు ప్రథమం వృత్తం నాభావష్టదళాంబుజం॥
కటిద్వితీయవలయం స్వాధిష్ఠానం కళాశ్రయం।
మూలే తృతీయవలయం జాన్వాది మహీపురం॥
జంఘే ద్వితీయభూగేహం తృతీయం పాదయోరపి।
బైందవం సత్యలోకం స్యాత్త్రికోణం తపఈరితం।
జనస్త్వష్టారచక్రం స్యాన్మహర్లోకం దశారకం।
బహిర్దశారం స్వర్లోకం మన్వస్రం భువఈరితం।

భూలోకమాదివృత్తం స్యాదష్టారమతలం తతః ॥
ద్వితీయవృత్తం వితలం సుతలం షోడశారకం ।
తలాతలం త్రివృత్తం స్యాద్భూగృహాంతు మహాతలం ।
ద్వితీయం భూపురం దేవి రసాతలముదీరితం ।
తృతీయభూపురం ప్రోక్తం పాతాళం సురవందితే ॥
సత్యాదిషుచ లోకేషు విరించాద్యాదివౌకసః ।

వైశ్వానర

| శ్రీచక్రమునందలి | శరీరమునందలి | 14 లోకములు |
|---|---|---|
| బిందువు | బ్రహ్మరంధ్రము | సత్యలోకము |
| త్రికోణము | మస్తకము | తపోలోకము |
| వసుకోణము | లలాటము | జనోలోకము |
| అంతర్దశారం | భ్రూమధ్యము | మహర్లోకము |
| బహిర్దశారం | కంఠము | స్వర్లోకము |
| మన్వస్రం | హృదయము | భువర్లోకము |
| ప్రథమవృత్తం | కుక్షి | భూలోకము |
| అష్టదళపద్మం | నాభి | అతలలోకము |
| ద్వితీయవృత్తం | కటిప్రదేశము | వితలలోకము |
| షోడశకళ | స్వాధిష్ఠానము | సుతలలోకము |
| తృతీయవృత్తం | మూలాధారము | తలాతలలోకం |
| ప్రథమభూపురం | జానువులు | మహాతలలోక |
| ద్వితీయభూపురం | జంఘములు | రసాతలలోకం |
| తృతీయభూపురం | పాదములు | పాతాళలోకం |

ఇట్లు అండాండ పిండాండ బ్రహ్మాండములు శరీరమందే కలవు.

ద్వాదశాంతము చిదూపస్థానమనుట.

దక్షిమూర్త్యుపనిషత్తు.

శౌనకాదిమహర్షులడిగిన ప్రశ్నములును, మార్కండే యులు చెప్పిన ఉత్తరములును, ఎట్లనగా-

ప్రశ్న- నీవు ఎందువలన చిరంజీవి అయితివి? ఏఆనందము ననుభవించుచుంటివి?

ఉత్తరము- పరమరహస్య శివతత్త్వజ్ఞానమువలన చిరంజీవినై ఆత్మానందసుఖమనుభవించుచుంటిని.

ప్ర॥ పరమరహస్య శివతత్త్వజ్ఞానమేది?

ఉ॥ దక్షిణాభిముఖముతోనున్న శివుని (దక్షిణామూర్తి) యొక్క అపరోక్షజ్ఞానమే శివతత్త్వజ్ఞానము.

ప్ర॥ దేవుడు ఎవడు?

ఉ సర్వమును ఆత్మయందు లీనముచేసి ఆత్మానందమునను భవించుచు సంతోషముతో ప్రకాశించుటయే దేవుడు.

ప్ర॥ జపమేది?

ఉ॥ దక్షిణామూర్తిమంత్రమే జపము.

ప్ర॥ ముద్రయేది?

ఉ॥ మౌనమే ముద్ర.

ప్ర॥ నిష్ఠయేది?

ఉ॥ సార్వకాలము పరబ్రహ్మభావముతోనుండుటయే నిష్ఠ.

ప్ర॥ జ్ఞానసాధన మేది?

ఉ॥ బ్రహ్మముతో నభేదముగా భావించు మంత్రజపమే జ్ఞాన [సాధనము.

ప్ర॥ పరికరములు ఏవి?

ఉ॥ చిత్తమును ఏకాగ్రతతో నుంచుటయే పరికరము.

ప్ర॥ బలి యేది?
ఉ॥ అంగముల చేష్టలుడుగుటయే బలి.
ప్ర॥ కాలమేది?
ఉ॥ జాగ్రదాదిస్థానత్రియమే కాలము.
ప్ర॥ స్థానమేది?
ఉ॥ ద్వాదశాంతమే స్థానము.

అని- ఓం బ్రహ్మావర్తే మహాభాండీరవటమూలే మహాసత్రాయ సమేతా మహర్షయ శ్శౌనకాదయస్తేహ సమిత్పాణయ స్తత్త్వజిజ్ఞాసవో మార్కండేయం చిరంజీవినముపసమేత్య పప్రిచ్ఛుః। కేన త్వం చిరంజీవసి। కేన వానందమనుభవసీతి। పరమరహస్య శివతత్త్వజ్ఞానేనేతి స హోవాచ। కిం తత్పరమరహస్యశివతత్త్వజ్ఞానం। కో దేవః। తత్రికోజపః కాముద్రా। కానిష్ఠా। కింతత్ జ్ఞానసాధనం। కః పరికరః। కోబలిః। కః కాలః। కిం స్థానమితి। స హోవాచ। యేన దక్షిణాభిముఖశ్శివో పరోక్షీకృతో భవతి తత్పరమరహస్య శివతత్త్వజ్ఞానం। యస్సర్వోపరమకాలే సర్వానాత్మన్యుపసంహృత్య స్వాత్మానందే సుఖే మోదతే ప్రకాశతేవా స దేవః అత్రైతే మంత్రరహస్యశ్లోకా భవంతి। మేధాదక్షిణామూర్తి మంత్రస్య। బ్రహ్మఋషిః। ఇత్యాది......మోసంముద్రా। సోహమితి యావత్థ్సితిస్సానిష్ఠా భవతి। తదభేదేన మన్వామ్రేడనం జ్ఞానసాధనం। చిత్తైతదేకతానతాపరికరః। అంగచేష్టార్పణం బలిః। త్రీణిధామాని కాలః। ద్వాదశాంతపదం స్థానం। అని శ్రుతియందు చెప్పబడినది.

దక్షిణామూర్త్యుపనిషత్తులోని మంత్రోపాసన
బ్రహ్మవిద్యోపాసనమనుట.
ఓం నమో భగవతే దక్షిణామూర్తయే మహ్యం
మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ స్వాహా।
శ్రీశంకరాచార్యవ్యాఖ్యానము-

ఓంకారేణ స్థూలసూక్ష్మకారణప్రపంచావధిభూతం ప్రత్యగభిన్నం తత్త్వమస్యాది మహావాక్యార్థభూతం బ్రహ్మాభిధీయతే। భగవచ్ఛబ్దేన 'ఉత్పత్తించ వినాశంచ భూతానామాగతింగతిం। వేత్తి విద్యామవిద్యాంచ సవాచ్యో భగవానితి।' శ్లోకోక్త సర్వజ్ఞస్సర్వశక్తిమాంశ్చాభిధీయతే। దక్షిణామూర్తిశబ్దేన సమగ్రా సృష్టిస్థితిసంహారేషు మూర్తిర్యస్యసః సత్వప్రధానమాయోపాధికో బింబభూతః పరమాత్మాభిధీయతే। చతుర్థ్యంతే నైక్యం దృఢీక్రియతే। మోజీవః కర్తృత్వాది విశిష్టోంతఃకరణప్రతిబింబభూతః ప్రతిపాద్యతే। నేతి నిషేధార్థః। తథాచాహం జీవో న। కింతు భగవాన్ దక్షిణామూర్తిరేవ। ఏతాదృశాయ మహ్యముపాధినా తిరస్కృతాయ మహిమ్నే। మేధాం స్థిరామసంభావనాది దోషరహితాం సవాసనావిద్యాద్వయనివర్తికాం ప్రజ్ఞామఖండసాక్షాత్కారరూపాం। ప్రయచ్ఛ దేహి। తయా భ్రాంత్యాది నివృత్తిః। తామపి స్వాహా ఆత్మని సచ్చిదానందస్వరూపే ప్రవిలాపయామీతి స్వాహాకారార్థః। మోజీవో నభవామి। కింతు కేవలో నిష్ప్రపంచశ్శివ ఇత్యుక్తశ్శివఏవాహం చతుర్థ్యైక్యదృఢీకారార్థా। జడానృతాహంకారేభ్యః ప్రాతిలోమ్యేన సత్యజ్ఞానానందాత్మకతయా అంచతి ప్రకాశయతీతి ప్రత్యక్ ఇతి॥

తా॥ ఓంకారమునకు స్థూలసూక్ష్మకారణప్రపంచమునకవధియు, ప్రత్యగాత్మకంటె భేదములేనిదియు, తత్త్వమస్యాది మహావాక్యములకు లక్ష్యార్థమునగు పరబ్రహ్మము అర్థము. భగవచ్ఛబ్దమునకు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు అని అర్థము దక్షిణామూర్తిపదములో దక్షిణశబ్దమునకు సకల జగత్సృష్టి స్థితి లయములను చేయదగిన సగుణబ్రహ్మమును, అమూర్తిశబ్దమునకు నిర్గుణబ్రహ్మము నర్థములు. చతుర్థీభక్త్యైక్యమర్థము. నమశ్శబ్దములోని మకారమునకు కర్తృత్వాదిధర్మములు గలిగి యంతఃకరణవిశిష్టుడగు జీవుడర్థము. నిషేధార్థకమగు నకారముతో గలిసి జీవుడు కాడని యర్థము. మహ్యాం మేధాం ప్రజ్ఞాం ప్రయచ్ఛ యనువానికి జీవసంజ్ఞను వదలి భగవద్రూపుడనగు నాకు వాసనలతో కూడిన విద్యాఽవిద్యలను నివర్తించుచు అఖండబ్రహ్మసాక్షాత్కారరూపమయి నిర్దుష్టమగు ప్రజ్ఞను దయచేయుము అని అర్థము. స్వాహాకారమునకు అటువంటిప్రజ్ఞను సచ్చిదానందపరబ్రహ్మమునందు లయము చేయుచున్నానని యర్థము. ప్రత్యగాత్మయనగా అన్నృతజడాహంకారములకు విలక్షణమగు సత్యజ్ఞానానందస్వరూపమగు ఆత్మ యర్థమని చెప్పబడెను.

12 శరీరమునకంతకును ప్రధానమగు శిరస్సునందలి చుబుకమునాశ్రయించి మనోవృత్తులు లేని శుద్ధచక్రమనెడి విశుద్ధచక్రము కలదు.

గురుధ్యానము బ్రహ్మరంధ్రమందలి త్రికోణమందు చేయుమని మహాపాదుకయందు చెప్పబడినది. ఆత్రికోణమే రోధినియు, సహస్రదళపద్మము నగును. దానికిని విశుద్ధచక్ర

మునకును, మధ్యస్థిప్రదేశము ఆజ్ఞాచక్రమే. మనోవృత్తు లన్నియు లీనమగు పరబ్రహ్మస్థానమనెడి ద్వాదశాంతము శరీరముమీదచూచునపుడు చుబుకమునకు వెనుకనున్న ఉచ్చిలిగుంటయనదగును. చక్రముమీద చూచునపుడు వెనుక ముందు అనెడి భేదములేదు.

13 బ్రహ్మరంధ్రమునందలి అమృతబిందువును మహాయోగులు విశుద్ధచక్రమునందే అనుభవించుచు క్రిందకుజార నియ్యకపోవుటచేత వారికి పునరుత్పత్తిలేదు ఇతరులకు ఆబిందువే అనాహతముమీదుగా స్వాధిష్ఠానమువరకును వచ్చును. రక్తశుక్లబిందువులు మిశ్రబిందువు అయినపుడు దేహోత్పత్తిబీజమగును. ఆయమృతము బ్రహ్మమనుట.

అధర్వణశిరస్సు.

తస్యోత్తరతశ్శిరో దక్షిణతః పాదో యఉత్తరస్స ఓంకారో యఓంకారస్సప్రణవో యః ప్రణవస్ససర్వవ్యాపీ యస్సర్వవ్యాపీ సోనంతో యోఽనంతస్తత్తారం యత్తారం తత్సూక్ష్మం యత్సూక్ష్మం తచ్ఛుక్లం యచ్ఛుక్లం తద్వైద్యుతం యద్వైద్యుతం తద్బ్రహ్మేత్యుపక్రమ్యాథర్వణశిరసిపఠితా।

తా॥ ఈతారమునకు ఉత్తరము శిరస్సు, దక్షిణము పాదములు, ఉత్తరమే ఓంకారము, ఓంకారమే ప్రణవము. ప్రణవమే జగత్తును వ్యాపించినది. అదియే అనంతము. అనంతమే తారము. తారమే సూక్ష్మము. సూక్ష్మమే శుక్లము. శుక్లమే ప్రకాశరూపము. అదియే బ్రహ్మము.

తారయతీతి తారం। అనగా సంసారసాగరమునుండి

తగింపచేయునది అని అర్థము. తౄ తరణే అను ధాతువునకు దాటుట యని యర్థము.

క. 2.6 1 'తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే। తస్మిన్ లోకాశ్శ్రితాస్సర్వే తదునాత్యేతి కశ్చన॥'

తా॥ సంసారవృక్షమునకు మూలకారణమే శుక్రము అది పరిశుద్ధమును కేవలచైతన్యస్వభావమును. అదియే బ్రహ్మము. నాశములేనిది. అన్నిటికంటె గొప్పది. దానినే లోకములన్నియు నాశ్రయించినవి.

బ్రహ్మవిద్యోపనిషత్.

జ్ఞానాత్స్వరూపం పరమం హంసమంత్రం సముచ్చరేత్। ప్రాణినాం దేహమధ్యేతు స్థితో హంసస్సదాచ్యుతః॥ హంస ఏవ పరం సత్యం హంసఏవతు శక్తికం। హంసఏవ పరంవాక్యం హంసఏవతు వైదికం। హంసఏవ పరో రుద్రో హంస ఏవ పరాత్పరః। సర్వదేవస్య మధ్యస్థో హంసఏవ మహేశ్వరః॥ పృథివ్యాది శివాంతంతు అకారాద్యాశ్చ వర్ణకాః। కూటాంతా హంసఏవ స్యాన్మాతృకేతి వ్యవస్థితాః॥ మాతృకారహితా మంత్రా ఆదిశ్యంతే నకుత్రచిత్। హంసజ్యోతిరనూపమ్యం మధ్యే దేవం వ్యవస్థితం। దక్షిణాముఖమాశ్రిత్య జ్ఞానముద్రాం ప్రకల్పయేత్। సదా సమాధిం కుర్వీత హంసమంత్రమనుస్మరన్॥ ఇత్యాది।

తా॥ హంసమంత్రమే జ్ఞానస్వరూపము. అది ప్రాణులయొక్క దేహమధ్యమందున్నది. అదియే సత్యరూపమున్ను, శక్తిరూపమున్ను, వాక్యరూపమున్ను, వైదికరూపమున్ను, పరారుద్రరూపమున్ను, సర్వదేవతలయొక్క మధ్యమాంగగల

మాహేశ్వరరూపమున్ను, పృథివి మొదలు శివునివరకునుగల జగత్తున్ను, అకారాదివర్ణములున్ను, మంత్రములున్ను హంస రూపమై మాతృక అనబడును. మాతృకాక్షరములులేని మంత్రములు ఎక్కడను లేవు. హంసమంత్రమే నిరుపమానమగు జ్యోతిస్స్వరూపము దక్షిణాభిముఖముతో ఈశ్వరుడు (దక్షిణామూర్తి) జ్ఞానముద్రతో సదా హంసమంత్రమును (సోహమని) స్మరించుచు సమాధిలోనుండును.

12 వ ప్ర॥ సమాప్తము.

---

# 13 వ ప్రకరణము

జ్ఞానానంతరము కొన్నికారణములచేతకలుగు జన్మాదులవలన జ్ఞానమునకు భంగములేదనియు, కలిగిన జ్ఞానమునకు నాశములేదనియు నిరూపణము.

అవ॥ బ్రహ్మవేత్తలగు వసిష్ఠుడు, సనత్కుమారుడు మొదలగువారుకూడా మరలజన్మించినట్లు స్మృతులుచెప్పుటచేత నిర్గుణవిద్యయందును దేవయానమార్గమవశ్యమని పూర్వపక్షమురాగా- సిద్ధాంతము-

(3అ. 3పా. 19అధి)

1 యావదధికార 2 మవస్థితి 3 రాధికారికాణాం ॥ 32

తా॥ బ్రహ్మవిదులగు వేదాచార్యుడైన యపాంతరతముడు విష్ణుని యోగమువలన కలియుగ ద్వాపరయుగసంధియం

డు కృష్ణద్వైపాయనుడుగాను, వసిష్ఠుడు నిమిశాపమువలన చతుర్ముఖుని యాదేశమువలన మిత్రావరుణులనుండియును, భృగువు మొదలగువారికి వరుణయజ్ఞమునందును, సనత్కుమారుడు రుద్రునకిచ్చిన వరముచేత స్కందుడుగాను, ఇట్లే దక్షుడు నారదుడు మొదలగువారును అనేకజన్మములను పొందిరి ఇంద్రునకు మేకజన్మమును, ఊర్వశియందు వసిష్ఠునకుత్పత్తియును కలదు. ఇట్లు ఇతిహాసపురాణాదులందు కనిపించుచున్నది. గనుక బ్రహ్మవిద్య మోక్షహేతువుకాదని పూర్వపక్షమురాగా- సిద్ధాంతము.

(2-3) అపాంతరతముడు మొదలగువారు వేదప్రవర్తనమొదలగు అధికారములందు నియమింపబడుటచేత వారికి మఱల జన్మము కలిగినది. కాని బ్రహ్మవిద్య మోక్షహేతువుకాదనరాదు.

1 ఛాం. 3-11-1 'అథ తతఊర్ధ్వఉదేత్య నైవోదేతా నాస్తమేతైకలఏవ మధ్యే స్థాతా ।'

తా॥ సూర్యుడు వేయియుగములు అధికారముచేసి కైవల్యమనుభవించెను. [తైత్త్య॥'

2 'తస్య తావదేవచిరం యావన్నవిమోక్ష్యేఽథ సంప

తా॥ 180 పేజీలో కలదు. అని శ్రుతులయందు చెప్పినట్లే యపాంతరతముడు మొదలగువారు ఆత్మజ్ఞానమున్నను అధికారమున్నంతవరకునుండి తరువాత మోక్షమును పొందుదురనుటకు విరుద్ధములేదు. మఱియు వారు స్వాతంత్ర్యముచేత నొకగృహమునుండి మఱియొకగృహమునకు పోవునట్లే దేహములన్ను నిర్మించుకొనినవారు గాని జాతిస్మరులుకారు. వర్త

మాన దేహముకంటె భావి దేహమునకు కారణమగు కర్మపు ట్టునెడల దగ్ధముకాని బీజమువంటి దగునని శంకింపతగదు. జ్ఞానమువలన కర్మబీజము నశించునని శ్రుతి స్మృతులు చెప్పు చున్నవి.

1 ముం. 2-2-9 'భిద్యతె హృదయగ్రంధి శ్ఛిద్యంతే
సర్వసంశయాః। క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్
దృష్టే పరావరే॥'

తా॥ బ్రహ్మము ప్రత్యక్షమగుచుండగా హృదయమున నున్న అజ్ఞానసంబంధములగు కామక్రోధాది సంశయములన్ని యు నశించును. క్షః'

2 ఛాం. 7-26-2 'స్మృతిలంభే సర్వగ్రంధీనాం విప్రమా

తా॥ అంతఃకరణ నిర్మలమగుటచేత ఆత్మస్మృతికలుగును. అందువలన రాగద్వేషాదులు నశించును. ఇవియే అంతఃకర ణమలములు.

3 భ. గీ. 4అ. 37 'యథైథాంసి సమిద్ధోగ్ని ర్భస్మసాత్కు రుతేర్జున। జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥'

తా॥ ఓయర్జునా! కట్టెలను అగ్ని దహించునట్లే ప్రారబ్ధ వ్యతిరిక్తపుణ్యపాపకర్మలను జ్ఞానాగ్ని దహించును.

4 'బీజాన్యగ్న్యుపదగ్ధాని నరోహంతి యథా పునః।
జ్ఞానదగ్ధైస్తథా క్లేశైర్నాత్మా సంపద్యతే పునః॥'

తా॥ అగ్నిచేతకాల్చబడిన బీజములకు మొలకలేనట్లే జ్ఞా నముచేత కాల్చబడిన అవిద్యాసంబంధరాగాదులవలన మఱల జన్మము కలుగదు. గనుక జ్ఞానముచేత కర్మబీజము నశించును 'తస్య తావదేవ చిరం' యను శ్రుతి ఆశరీరమున్నంతవఱకే

కైవల్యము కలుగదని చెప్పుచున్నది. ఆగామి సంచితములు నశించినను ప్రారబ్ధమనుభవింపవలయును.

అపాంతరతముడు మొదలగువారికి అధికారాంతమున కైవల్యము సిద్ధించును.

1 బృ. 3-4-10 'తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత సఏవ తదభవత్తథర్షీణాం తథా మనుష్యాణాం ॥'

తా॥ 21 వ పేజీలో కలదు.

జ్ఞానోత్పత్తికింకె పూర్వము చేసిన వేఱు వేఱుఉపాసనలకు నాశముకలదని తెలిసి విరక్తులై పరమాత్మజ్ఞానమును పొందుటవలన పూర్వముచేసిన ఉపాసనలనుబట్టి అధికారాపేక్షకలవారగుటచేత వారికి అట్లుకలిగెను.

2 బృ. 3-4-10 'బ్రహ్మణాసహ తేసర్వే సంప్రాప్తే ప్రతిసంచరే। పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరంపదం ॥'

తా॥ సత్యలోకమునుపొందిన సగుణబ్రహ్మనిష్ఠులు మహాప్రళయమునందు సగుణబ్రహ్మముతో శాశ్వతమగు నిర్గుణబ్రహ్మస్థానమును పొందుచున్నారు.

3 బృ. 5-4-1 'యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ' 'తత్త్వమసి' ఈశ్రుతులవలన జ్ఞానఫలము ప్రత్యక్షమే. 'తత్త్వమసి' యనునపుడు నీవు బ్రహ్మమైతివి అనికాని మరణానంతరము కాగలవని కాదు. కాబట్టి విద్వాంసునకు నిర్గుణబ్రహ్మవిద్యయందు అర్చిరాదిమార్గమవసరములేదని సిద్ధాంతము.

వి॥ పరమేశ్వరునివలన నియోగింపబడుటకూడా ప్రారబ్ధములో చేరినదే గనుక నది అనుభవింపవలయును. ఇది జ్ఞానులందరికిని సమానమే.

ఆ.గీ. యత్పదం ప్రేప్సవో దేవాః శక్రాద్యాః సర్వదేవతాః।
4ప్రి. అహో తత్ర స్థితో యోగీ సహర్షముపగచ్ఛతి ॥

తా॥ జనకరాజు చెప్పుచున్నాడు. ఇంద్రాది సర్వదేవతలు ఏపరమపదము ప్రాప్తింపక దీనులవలె ఖేదమొందిరో అట్టిసచ్చిదానందపదమందు ఐక్యజ్ఞానానుభవముగల యోగి విషయభోగములవలన ఖేదమోదములు లేకుండ సదానందమయుడై యుండునుగదా.

తజ్జ్ఞస్య పుణ్యపాపాభ్యాం స్పర్శో హ్యంతర్న జాయతే।
నహ్యాకాశస్య ధూమేన దృశ్యమానాపి సంగతిః॥ 3

తా॥ ధూమము ఆకాశమునంటనట్లు జ్ఞానికి పుణ్యపాపములంటవు.

ఆత్మైవేదం జగత్సర్వం జ్ఞాతం యేన మహాత్మనా।
యదృచ్ఛయా వర్తమానం తం నిషేద్ధుం క్షమేత కః॥ 4

తా॥ దృశ్యజగత్తు ఆత్మస్వరూపమే యని దృఢనిశ్చయముగల జ్ఞానికి తనకంటె భిన్నమైనది లేనందున నిది గ్రహింపతగినది. యిది విడువతగినది. యనెడి విధినిషేధములు లేవు.

18 సుఖమాస్తే సుఖం శేతే సుఖమాయాతి యాతిచ।
ప్రి. సుఖం వక్తి సుఖం భుంక్తే వ్యవహారేఽపి శాంతధీః॥59

తా॥ ఆత్మనిష్ఠగల జ్ఞాని ప్రారబ్ధవశముచేత వ్యవహారముచేయుచుండినను ఆత్మసుఖమునే పొందుచుండును. సర్వేంద్రియములు తమంతట వానివాని పనులు అనగా మాట్లాడుట, భుజించుట, మొదలగు క్రియలు నెరవేర్చుచుండగా వానియందెట్టికర్తృత్వభావమును లేక జ్ఞాని సర్వదా ఆత్మవిశ్రాంతుడై యుండును.

స్వభావాద్యస్య నైవార్తి ర్లోకవద్వ్యవహారిణః।
మహాహ్రదఇవాక్షోభ్యో గతక్లేశః సుశోభతే ॥ 60

తా॥ జ్ఞాని స్వాభావికముగ సాక్షాత్కృతానందమువలన ఆత్మసామర్థ్యముచేత లోకసామాన్యునివలె వ్యవహారలంపటుడై యుండియు ఖేదమొందడు. అట్టిక్లేశరహితుండగు జ్ఞాని మహామడుగుయందలి జలము చలింపనట్లు నిర్వికారుడై క్లేశములేకుండ సర్వదా ఆత్మారాముడై యుండును.

నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తిరుపజాయతే।
ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తిఫలభాగినీ ॥ 61

తా॥ అహంకార మమకారములు తొలగని మూఢుడు లోకప్రతీతికై బాహ్యేంద్రియవ్యాపారములేకుండ నివృత్తునివలెయుండినను వానిచిత్తవృత్తియొక్క ప్రవృత్తి స్వభావముగానేయుండును. జ్ఞాని ప్రారబ్ధవశమగు కర్మములు చేయుచు లోకదృష్టికి ప్రవృత్తునివలె సంచరించుచున్నను అతనికి కర్తృత్వాద్యధ్యాసము లేనందున ముక్తుడగును.

13 వ ప్ర॥ సమాప్తము.

---

# 14 వ ప్రకరణము

ధర్మార్థకామమోక్షములు నాలుగును నిర్గుణ బ్రహ్మమునుండియే కలుగునని నిరూపించుట.

(3అ.2పా.) 1 న 2 స్థానతోఽపి 3 పరస్యో 4 భయలింగం 5 సర్వత్రహి ॥ 11సూ.

తా॥ ఉపాధిసంబంధమువలన పరబ్రహ్మము సగుణ నిర్గుణ రూపములు రెండును పొందవచ్చునని పూర్వపక్షము రాగా- సిద్ధాంతము- (3) పరబ్రహ్మమునకు (2) పృథివి మొదలగు ఉపాధిసంబంధమువలన (4) సగుణ నిర్గుణములు రెండును (1) సంభవింపదు. సగుణరూపాదులన్నియు కల్పితములు. పురుషుడు తనప్రతిబింబముచేత సద్వితీయుడు కానేరడు .కను క నిర్విశేషబ్రహ్మమే గ్రహింపతగినది.

నభేదాదితిచేన్న ప్రత్యేకమతద్వచనాత్ ॥ 12

తా॥ శ్రుతులకు నిర్గుణబ్రహ్మమునందే తాత్పర్యముకాని ఉభయలింగత్వము లేదనుట న=యుక్తముకాదు. భేదాత్= భేదమువలనను, 'చతుష్పాద్బ్రహ్మ' 'షోడశకలం బ్రహ్మ' 'వామనీత్వాదిలక్షణం బ్రహ్మ' 'త్రైలోక్యశరీరం బ్రహ్మ' వైశ్వానరశబ్దోదితం బ్రహ్మ' బ్రహ్మమునకు నాలుగుపాదములు, పదునాలుకళలు గలదనియు, అది కర్మఫలమునుపొందించునదనియు, మూడులోకములసముదాయమే శరీరముగా గలదనియు, వైశ్వారనశబ్దముచేత చెప్పబడినదనియు, ఇత్యాది ఆకారాదులవలన సగుణబ్రహ్మము నంగీకరింపవలయును. ఇతిచేత్ అనియందువేని న=కాదు. ఉపాధివిశేషములు బ్రహ్మమునకు అభేదమునే చెప్పుచున్నవి.

1 బృ. 4-5-1 'యశ్చాయమస్యాం పృథివ్యాం తేజోమయోఽమృతమయః పురుషోఽయమేవ సయోఽయమాత్మా'

తా॥ భూమియందు స్వప్రకాశుడును, మరణములేనివాడును, దేహమునందు తేజోమయుడును, అమృతమయుడునగు జీవుడును పరబ్రహ్మమే. 12.

అపిచైవమేకే ॥ 13సూ.

మరియును కఠశాఖవారు 4-11 'మనసైవేదమాప్తవ్యం నేహనానాస్తి కించన। మృత్యోస్సమృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి॥'

తా॥ జగత్తంతయును బ్రహ్మముకంటె వేఱుకాదనెడి జ్ఞానము మనస్సుచేతనే పొందతగినది. బ్రహ్మముకంటె భేదము కొంచమైననున్నట్లు తలచువానికి జననమరణములు తప్పవని భేదనిందాపూర్వకముగా అభేదమునే చెప్పుచున్నారు.

2 శ్వే. 1-12 'భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మమేతత్'

తా॥ జీవులును, విషయములును, వీనికి నియంతయగు ఈశ్వరుడును బ్రహ్మమే. గనుక బ్రహ్మము నిర్గుణమే.

1 అరూపవదేవ హి 2 తత్ప్రధానత్వాత్ ॥ 14

తా॥ మఱియు (1) బ్రహ్మము రూపాదిశూన్యమే (2) క్రిందిశ్రుతులు నిర్గుణమేప్రధానమని చెప్పుచున్నవి. సగుణమునుచెప్పు శ్రుతులు ఉపాసనకొఱకే.

1 'అస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘం' [నన్యము.

తా॥ అక్షరస్వరూపము స్థూల సూక్ష్మ హ్రస్వములకంటె

2 'అశబ్దమస్పర్శమరూపమవ్యయం'

తా॥ శబ్దస్పర్శరూపములును, నాశమును లేని ఆత్మను తెలిసికొనినవాడు ముక్తిని పొందును.

3 బృ. 4-5-19 'తదేతద్బ్రహ్మ పూర్వమనపరమనంతరమబాహ్యమయమాత్మా బ్రహ్మ సర్వానుభూః'

తా॥ 59 పేజీలో కలదు.

ప్రకాశవచ్చావైయర్థ్యం ॥ 15 సూ.

పద॥ 1 ప్రకాశవత్ చ 2 అవైయర్థ్యం ॥

తా॥ (1) ఆకాశమునందని సూర్యచంద్రుల తేజస్సులకు యంగుళులు మొదలగు ఉపాధిసంబంధమువలన ఋజువక్రభావములు కలుగునట్లే బ్రహ్మమునకును పృథివ్యాదుల సంబంధమువలన వానియాకారము కలిగినట్లుండును. ఆకారము ఉపాసనకొఱకు కల్పింపబడినది గనుక (2) సగుణశ్రుతులు వ్యర్థములుకావు.

1 ఆహ చ 2 తన్మాత్రం ॥ 16 సూ.

తా॥ బ్రహ్మము (2) చైతన్యమాత్రమని (1) శ్రుతి చెప్పుచున్నది.

1 బృ. 6-5-13 'సయథా సైంధవఘనోఽనంతరోఽబాహ్యః కృత్స్నో రసఘనఏవైవంవా అరేఽయమాత్మానంతరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘనఏవ ।'

తా॥ ఉప్పుగడ్డయందు అంతటను ఏకరసమున్నట్లే బ్రహ్మమునందు నంతటను ఏకరసమే గాని వేరులేదు.

1 దర్శయతి చాథో అపి 2 స్మర్యతే ॥ 17 సూ.

తా॥ క్రింది శ్రుతి స్మృతులు నిర్గుణబ్రహ్మమునేచెప్పుచున్నవి.

1 బృ. 4-3-6 'అథాత ఆదేశో నేతి నేతి'

తా॥ జగద్వస్తువులన్నిటిని ఇదికాదు ఇదికాదు అని నిషేధింపగా మిగిలినదియే బ్రహ్మము.

2 కే. 3 'అన్యదేవ తద్విదితా దథో అవిదితాదధి'

తా॥ తెలిసినజగత్తుకంటెను, తెలియని అవిద్యకంటెను, భిన్నమై తెలిసికొనతగిన రూపము నిర్గుణబ్రహ్మమే.

3 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ'

తా॥ ఉపనిషద్వాక్యములు మనస్సుతో పరమాత్మను పొందచాలక మరలినవో అదియే పరబ్రహ్మము.

4 భ.గీ. 13అ. 12 'జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యత్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే। అనాదిమత్పరంబ్రహ్మ నసత్తన్నా సదుచ్యతే॥'

తా॥ మోక్షమునిచ్చువస్తువు ఆదిలేని నిరతిశయమగు పరబ్రహ్మము. అది అంతటనువ్యాపించి స్వప్రకాశమగుటవలన నింద్రియములగుగోచరముకాదు. పరోక్షమనియుచెప్పబడదు

5 భా॥ర శాం. 339అ. 44శ్లో॥ మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద। సర్వభూతగుణైర్యుక్తం నైవం మాం జ్ఞాతుమర్హసి॥

తా॥ ఓనారదా! ఎల్లభూతములయొక్క గుణములైన దివ్యగంధాదులతో కూడిన నాసగుణరూపమును చూచుచున్నానని నీవు తలచుచున్నావు. కాని అది నాచేత కల్పింపబడిన మాయగాని వాస్తవముకాదు. నేను నిర్గుణచైతన్యమని తెలిసికొనవలెను.

1 అతఏవ 2 చోపమా 3 సూర్యకాదివత్ । 18

తా॥ (1) బ్రహ్మము నిర్గుణముకనుకనే యితనికుపాధినిమిత్తము (పారమార్థికముకాకున్నను) విశేషత్వమును స్వీకరించుటచేతి (3) సూర్యచంద్రప్రతిబింబములను పోలినట్లు (2) ఉపమానము గ్రహింపబడుచున్నది.

1 శ్రుతి. 'యథాహ్యయం జ్యోతిరాత్మా వివస్వానపోభిన్నా బహుధైకోనుగచ్ఛన్నుపాధినా క్రియతే భేదరూపో దేవః క్షేత్రేష్వేనమజోయమాత్మా'

తా॥ సూర్యుడొకడే భిన్నజలములందు వేఱువేఱుగాచూడబడునట్లే బ్రహ్మమొకడే అన్నిశరీరములందును ప్రవేశించి వేఱువేఱురూపములతో చూడబడుచున్నాడు.

2 అమృతబిందూపనిషత్తు 12 'ఏకఏవతు భూతాత్మా భూతేభూతే వ్యవస్థితః। ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్ ॥'

తా॥ జలములందలి చంద్రునివలె పరమేశ్వరుడొక్కడే అన్నిజంతువులందును నిలిచి ఒకడుగాను, అనేకులుగాను చూడబడుచున్నాడు.

1 అంబువద 2 గ్రహణా 3 త్తు న 4 తథాత్వం ॥ 19

తా॥ (3) అత్మునకు జలమందలి సూర్యదృష్టాంతము (3) యుక్తముకాదు. (1-2) సూర్యాదులకు దూరమున జలమున్నది. గనుక నచట ప్రతిబింబోదయము యుక్తము. స్వరూపములేకుండ నన్నిటియందున్న ఆత్మకంటె వేఱగు భూతములు లేకపోవుటచేత నాదృష్టాంతము యుక్తముకాదని పూర్వపక్షము.

1 వృద్ధిహ్రాసభాక్త్వ 2 మంతర్భావా 3 దుభయసామంజస్యా 4 దేవం ॥ 20సూ.

తా॥ పూర్వపక్షముసరికాదు. (1) సూర్యప్రతిబింబము జలము వృద్ధియగునపుడు వృద్ధియును, జలముతిగ్గినపుడు క్షయమును, జలము చలించునపుడు చలనమును, జలధర్మముచేత కనిపించుచున్నవికాని అవి సూర్యునకు స్వతస్సిద్ధముగ లేవు. ఇట్లే బ్రహ్మమునకును (2) దేహాదులందు ప్రవేశించుటవలన వృద్ధిక్షయములేకాని స్వతస్సిద్ధముగలేవు. (4) ఈప్రకారము

గా (3) దృష్టాంతదార్ష్టాంతికముల సామంజస్యమువలన విరోధములేదని సిద్ధాంతము.

దర్శనాచ్చ ॥ 21సూ.

తా॥ క్రిందిశ్రుతులచేతను సూర్యాదిదృష్టాంతము యుక్తమే.

1 'అనేన జీవేనాత్మనానుప్రవిశ్య'

2 బృ. 4-5-18 'పురశ్చక్రే ద్విపదః పురశ్చక్రే చతుష్పదః। పురః సపక్షీభూత్వా పురః పురుష ఆవిశత్ ।'

తా॥ (2) పాదములు (4) పాదములు గల నరులను, పశువులు మొదలగువానిని ఈశ్వరుడు సృజించి తానందు ప్రవేశించెను. గనుక నిర్గుణబ్రహ్మమే ముక్తిస్థానము.

అవ॥ నిషేధశ్రుతులచేత బ్రహ్మము నిషేధింపబడెనని పూర్వపక్షమురాగా- సిద్ధాంతము.

(6అధి) ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి
తతో బ్రవీతిచ భూయః ॥ 22

తా॥ అధ్యాత్మ, అధిదైవతములని చెప్పబడుటవలన ప్రకృతైతావత్త్వం=ప్రకృతము, పరిచ్ఛిన్నమునగు మూర్తామూర్తలక్షణమైన సగుణబ్రహ్మరూపమును నేతినేతివాక్యముల చేత ప్రతిషేధతి=నిరాకరించుచున్నది. తతః=ప్రపంచనిషేధమునకుతరువాత భూయః=మఱల బ్రవీతిచ=అన్యత్పరమస్తి అను వాక్యమువలన నిర్గుణబ్రహ్మమే నిశ్చయము.

తదవ్యక్తమాహహి ॥ 23సూ.

తా॥ తత్ =ఆబ్రహ్మము ప్రపంచమునకు సాక్షియగుటవలన అవ్యక్తం=ఇంద్రియములకు గోచరింపదు.

క్రింది శ్రుతిస్మృతులట్లే చెప్పుచున్నవి.

1 ముం. 3-18 'నచక్షుషా గృహ్యతే నాపి వాచా నా
న్యైర్దేవై స్తపసా కర్మణావా'

తా॥ బ్రహ్మము, నేత్రములు, వాక్కు, ఇంద్రియములు
తపస్సు, కర్మములు మొదలగువానిచేత తెలియబడదు.

2 ముం. 1-1-6 'యత్తదద్రేశ్యమగ్రాహ్యం'

తా॥ జ్ఞానేంద్రియ కర్మేంద్రియములచేత తెలియరాని
అక్షరపదార్థము జగత్కారణము. [రోయముచ్యతే।'

3 భ. గీ. 2అ. 25 'అవ్యక్తోయ మచింత్యోయ మవికా

తా॥ ఆత్మ ఇంద్రియములకు గోచరింపనిదియు, స్ఫురింప
నిదియు, చింతింపశక్యము కానిదియు, అవయవములు లేనిది
యును.

1 అపిచ 2 సంరాధనే 3 ప్రత్యక్షానుమానాభ్యాం। 24

తా॥ (1) మఱియు యోగులు జగత్తును నిషేధించి ఆత్మని
(2) భక్తిధ్యానప్రణిధానాద్యనుష్ఠానముచేత చూచుచున్నా
రు. (3) ఇట్లు శ్రుతి స్మృతులు చెప్పుచున్నవి.

మాహాత్మ్యజ్ఞానపూర్వకమైన స్నేహమనెడి యంతఃక
రణవృత్తివిశేషమే భక్తి। భక్త్యావృత్తియే ధ్యానము। భక్తి
ధ్యానములచేత చిత్తమునందు ప్రత్యగాత్మను నిలుపుటయే
ప్రణిధానము. ఆదిపదముచేత జపనమస్కారాదులు గ్రాహ్యములు.

శ్రు॥ 1 క. 4-1 'పరాంచిఖాని వ్యతృణత్స్వయంభూ స్త
స్మాత్పరాఙ్పశ్యతి నాంతరాత్మన్ కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన
మైక్షదావృత్తచక్షురమృతత్వమిచ్ఛన్।'

తా॥ పరమాత్మ ఇంద్రియములను, శబ్దాదివిషయములను
సృజించి లయముచేయును. జనులు శబ్దాదులనే చూచెదరు

గాని అంతరాత్మను చూడరు. ఒకానొక ధీరుడు రాగాదుల నుండి మరలి ప్రత్యగాత్మను చూచును.

2 ము. 3-1-8 'జ్ఞానప్రసాదేన విశుద్ధసత్త్వ స్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః॥'

తా॥ రాగాదులు లేని నిర్మలజ్ఞానముకలవాడు బ్రహ్మదర్శనమునకు యోగ్యుడు. కాబట్టి ఆపరమేశ్వరుని సత్యము మొదలగు సాధనసామగ్రిచేత నేకాగ్రమనస్సుతో ధ్యానించుచు చూచుచున్నాడు.

స్మృ. 3 'యోగినస్తం ప్రపశ్యంతి భగవంతం సనాతనం'

తా॥ యోగులు పరమాత్మను ధ్యానకాలమునందు చూచుచున్నారు.

అవ॥ నిర్విశేషపరబ్రహ్మమునందు ఆరాధించువాడు ఆరాధింపబడువాడు అను భేదమే సంభవింపదని పూర్వపక్షమురాగా—

ప్రకాశాదివచ్చావైశేష్యం ప్రకాశశ్చ కర్మణ్యభ్యాసాత్ ॥ 25సూ.

తా॥ ప్రకాశాదివత్=ఆకాశమునందలి సూర్యుడు మొదలగునవి ఉపాధిభూతములగు అంగుళి, కలశ, జలాదులందు భేదమున్నట్లు భాసించుచు, స్వాభావికమైన యేకత్వమును విడువనట్లే ప్రకాశశ్చ=చిదాత్మయును, కర్మణి=బుద్ధ్యాద్యుపాధియందు భేదమున్నట్లు కనిపించునే కాని, యేకత్వమును విడువదు. భేదము ఉపాధిచేతనే కాని స్వభావముచేత నేకాత్మత్వమే. అట్లే అభ్యాసాత్=వేదాంతములందు జీవేశ్వరులకు అభేదమునే తత్త్వమసి మొదలగువాక్యములు చెప్పుచున్నవి.

1 అతోఽ 2 సం తేన 3 తథా హి 4 లింగం ॥ 26

తా॥ (1) జీవుడు అవిద్యాకృతమగు భేదమును స్వాభావికము అభేదము నగు విద్యచేత నిరసించి (2) అంతములేని బ్రహ్మముతో నేకత్వమును పొందుచున్నాడు. (3) అట్లేకదా (4) శ్రుతిచెప్పుచున్నది.

1 ముం. 3-2-9 'సయోహవై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి'

2 బృ. 6-4-6 'బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి'

తా॥ 179 పుటలో కలదు. విద్వాంసుడు బ్రహ్మమునిచటనే పొందుచున్నాడు.

1 ఉభయవ్యపదేశా 2 త్త్వహి 3 కుండలవత్ ॥ 27

తా॥ (1) జీవేశ్వరులకు భేదాభేదములు కనిపించుటవలన (3) పాముకును, పాముచుట్టలకును, వలె జీవేశ్వరులకును భేదాభేదములు కావలెను. (2) తుశబ్దము సిద్ధాంతవైషమ్యమును బోధించును. అహిత్వము (పాము) చేత నభేదమును, కుండలత్వము (చుట్టుకొనిన చుట్టల) చేత ఆభోగత్వము ప్రాంశుత్వము ననెడి భేదమును, కలుగునట్లే బ్రహ్మత్వముచేత నభేదమును, జీవత్వముచేత భేదమును కావచ్చును. కుండలత్వమనగా కడియమువలెనుండుట. ఆభోగత్వమనగా చక్రాకారముతోనుండుట. ప్రాంశుత్వమనగా దీర్ఘదండాకారముగానుండుట.

1 'తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః'

2 ముం. 3-2-8 'పరాత్పరం పురుషముపైతి దివ్యం'

3 బృ. 5-7-14 'యస్సర్వాణి భూతాన్యంతరో యమయతి । తత్త్వమసి। అహం బ్రహ్మాస్మి'

4 బృ. 5-4-1 'ఏషత ఆత్మా సర్వాంతరః'

తా॥ 209 పేజీలో కలదు.

5 బృ. 5-7-3 'ఏషత ఆత్మాంతర్యామ్యమృతః'

తా॥ 208 పేజీలో కలదు. (2) నదులు సముద్రమును పొందునట్లే విద్వాంసుడు అవిద్యను విడిచి పరమాత్మను పొందును. (3) ఎల్లజంతువులయందును లోపలనుండి నియమించు నదే పరమాత్మ.

1 ప్రకాశాశ్రయవ 2 ద్వా తేజస్త్వాత్ ॥ 28

తా॥ (1) ప్రకాశమునకును, దానికాశ్రయమగు సూర్యునకును వలె జీవేశ్వరులకును భేదాభేదములను తెలిసికొనుము. (2) సూర్యుడును, వానిప్రకాశమును, భిన్నముకాకున్నను భేదవ్యవహారమున్నట్లే జీవేశ్వరులకును భేదవ్యవహారమున్నను ఆత్మధర్మముచేత అభిన్నులే.

పూర్వవద్వా ॥ 29సూ.

తా॥ పై 25వ సూత్రమునందు చెప్పినట్లే కాదగును. అవిద్యాకృతమగు బంధము నశింపగా విద్యచేత మోక్షము కలుగును.

ప్రతిషేధాచ్చ ॥ 30సూ.

తా॥ 'నాన్యోతోస్తి ద్రష్టా' మొదలగు శ్రుతులు పరమాత్మకంటె వేఱువస్తువులేదని చెప్పుచున్నవి.

1 'అథాత ఆదేశో నేతినేతి'

2 బృ. "తదేతద్బ్రహ్మాపూర్వమనపరమనంతరమబాహ్యం'

తా॥ 59 పేజీలో కలదు. గనుక నిర్గుణబ్రహ్మమే ఉపాస్యము

(7అధి) 1 పర 2 మతః 3 సేతూన్మానసంబంధభేద

వ్యపదేశేభ్యః ॥ 31సూ.

తా॥ (2) బ్రహ్మముకంటె (1) వేఱొకవస్తువు నుండతగు

ను. (3) సేతు, ఉన్మాన, సంబంధములనెడి మూడు ఉపదేశ ములవలనను ఈశ్వరుడు భూమిమొదలగు లోకములకు నాశ ముకలుగకుండ ధరించిన సేతువనియు, క్రింది శ్రుతులవలస బ్రహ్మముకంటె వేఱొకవస్తువు కలదనియు పూర్వపక్షము- [వాడు.

1 చాం. 8-4-1 'అధ యఆత్మా ససేతుర్విధృతి రేషాం లోకానామసంభేదాయ'

తా॥ భూరాదిలోకముల క్షేమముకొరకు సేతువువంటి

సామాన్యాత్తు ॥ 32సూ.

తా॥ (తు) పై పూర్వపక్షము సరికాదు. (సామాన్యాత్) జగత్తుయొక్క మర్యాదలను నిలుపుటకు సేతువువంటివాడని బ్రహ్మమును స్తుతిచేయబడినది.

1 బుద్ధ్యర్థః 2 పాదవత్ ॥ 33సూ.

తా॥ పరిమాణమును చెప్పుట. (1) ఉపాసనార్థము కల్పన చేయబడినది. (2) అధ్యాత్మమును, అధిదైవితమును, బ్రహ్మ ప్రతీకములని చెప్పబడిన మనస్సునకును, ఆకాశాదులకును ధ్యానార్థము వాక్ ప్రాణ చక్షు శ్రోత్రములు మనస్సంబంధులగు పాదములును, నాలుగైన వాయ్వగ్న్యాదిత్యదిశలు ఆకాశసంబంధులగు పాదములును కల్పించునట్లె బ్రహ్మమున కు పరిమాణము మందబుద్ధిగలవారికి ధ్యానార్థము కల్పింప బడెను.

1 స్థానవిశేషా 2 త్ప్రకాశాదివత్ ॥ 34

తా॥ (1) బుద్ధి, సూర్యుడు, నేత్రములు మొదలగు ఉపాధిభేదమువలన నుపదేశములు తగుననతగదు. అవిగౌణముగా చెప్పబడినవి. పరిమాణమును చెప్పతలచికాదు. అట్లే భేదోపదేశమున్ను ఉపాధిచేతగాని స్వరూపాపేక్షకాదు. (2) ప్రకా

శాదివత్ అనునది యుపమానము సూర్యచంద్రప్రకాశము లకు యంగుళి మొదలగు ఉపాధిసంబంధమువలన కలిగినవిశే షము ఉపాధివిరహమువలన తొలగునట్లు బ్రహ్మమునకు బుద్ధ్యాద్యుపాధిసంబంధమువలన కలిగిన విశేషము ఉపాధివి యోగమువలన తొలగును. కాని వాస్తవము కాదు.

ఉపపత్తేశ్చ ॥ 35సూ.

తా॥ జీవేశ్వరులకు గౌణసంబంధమే కాని ముఖ్యసంబంధ ము చెప్పతగదు. 'స్వమపీతో భవతి' యనుచోట స్వరూపచై తన్యమునకు అపాయములేదు. గనుక జీవేశ్వరులకు స్వరూప సంబంధముకంటె నన్యసంబంధము లేవియు కలుగవు. అనేక శ్రుతులనుబట్టి బ్రహ్మము ఒకటేయని ప్రసిద్ధము.

1 ఛాం. 3-12-17 'యోయం బహిర్ధా పురుషాదాకాశః యోయమంతఃపురుష ఆకాశః। యోయమంతర్హృద య ఆకాశః।'

తా॥ పురుషునికంటె వెలుపలనున్న యాకాశము హృద యమధ్యమందు ఉపాస్యమని చెప్పిన పుండరీకాకాశమే. ఒక టియేయగు ఆకాశమునకు ఉపాధికృతభేదము చెప్పుచున్నది.

31 వ సూత్రమునందలి పూర్వపక్షము నింతవఱకును ఖండింపబడినది.

1 తథాన్య 2 ప్రతిషేధాత్ ॥ 36సూ.

తా॥ సేతువు మొదలగు ఉపదేశములను నిరాకరించుటవ లన వేఱొకవస్తువులేదని తెలియబడుచున్నట్లే (2) బ్రహ్మము కంటె నితరమును శ్రుతులు నిషేధించుచున్నవి. [వాధస్థాత్

1 ఛాం. 7-25-2 'సఏవాధస్తాదహమేవాధస్తాత్ ఆత్మైవ

తా॥ చరాచరములన్నియును ఆత్మస్వరూపమైన నేనే. అన్నిటియందునుగల ఆత్మవస్తువును నేనే. [ర్వం వేద'

2 బృ. 4-4-6 'సర్వం తం పరాదాద్యోన్యత్రాత్మన స్స

తా॥ సర్వమును ఆత్మకంటె వేఱుగాతలచినవానిని శ్రే యోమార్గమునుండి తొలగించును. గనుక నిర్గుణపరమాత్మ కంటె నన్యములేదు.

1 అనేన 2 సర్వగతత్వ 3 మాయామశబ్దాదిభ్యః॥ 37

తా॥ (1) సేతువు మొదలగు అన్యవస్తు నిరాకరణచేతను (2) ఆత్మునకు సర్వగతత్వము (అన్నిటియందునునికి) (3) ఆ యామశబ్దాదులవలన సిద్ధించుచున్నది.

భ.గీ. 2అ. 24 'నిత్యస్సర్వగతస్థాణురచలోఽయంసనాతనః'

తా॥ ఈబ్రహ్మము నాశములేనిది. ఎల్లవానిని పొందినది. స్థిరమైనది. కదలనిది. చిరాతనమైనదియును.

(8అధి) 1 ఫల 2 మత 3 ఉపపత్తేః॥ 38

తా॥ ధర్మార్థకామముల ఫలము కలుగుట కర్మములవలన కాదు. (1) కర్మఫలమైన స్వర్గాదికము (3) ఈశ్వరునకు ఫల దాతృత్వము సహజమగుటచేత నతనికే తగును.

శ్రుతత్వాచ్చ॥ 39సూ. [స్నవి.

తా॥ ఈశ్వరుడే ఫలమునిచ్చువాడని శ్రుతులు చెప్పుచు

బృ. 6-4-24 'సవా ఏషమహానజఆత్మాఽన్నాదో వసు దానః' [మును ఇచ్చును.

తా॥ బ్రహ్మమే ప్రాణులకు మిక్కిలిగా అన్నమును, ధన

ధర్మం జైమిని రతఏవ॥ 40సూ.

తా॥ జైమినిముని ధర్మం=కర్మములే ఫలమునిచ్చునని

చెప్పుచున్నాడు. అతఏవ=స్వర్గకామో యజేత మొదలగు శ్రుతులు అట్లె చెప్పుచున్నవి. అని పూర్వపక్షము-

1 పూర్వం 2 తు 3 బాదరాయణో 4 హేతువ్యపదేశాత్ ॥41

తా॥ (3) బాదరాయణాచార్యుడు (1) మొదటచెప్పిన ఈశ్వరునినే ఫలహేతువుగా చెప్పుచున్నాడు. (2) తుశబ్దము చేత పూర్వపక్షనిరాకరణము (4) కర్మఫలమునిచ్చువాడు ఈశ్వరుడని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి.

1 కౌ. 3-8 'ఏష హ్యేవ సాధుకర్మ కారయతి తం యమే భ్యో లోకేభ్య ఉన్నినీషతే। ఏష హ్యేవాసాధుకర్మ కారయతి తం యమధో నినీషతే॥'

తా॥ ఈశ్వరుడే ఉత్తమలోకములను పొందింపతలచిన పుడు సత్కర్మములను, అధోలోకములను, నరకములను, పొందింపతలచినపుడు దుష్కర్మములను చేయించును.

2 భ.గీ 7అ. 21 'యోయో యాంయాం తనుం భక్త శ్రద్ధయార్చితు మిచ్ఛతి। తస్య తస్యాచలాం శ్రద్ధాం తామే వ విధధామ్యహం'॥ సతయా శ్రద్ధయాయుక్త స్తస్యారాధన మీహతే। లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్ ॥

తా॥ ఎవరు యేకోరికతో యేదేవతను శ్రద్ధాభక్తులతో సేవించుచున్నారో వారికి అట్టికోరికలను చిరూపముచేత నేను తీర్చెదను.

(1అ. 2పా.) అనవస్థితే రసంభవాచ్చ నేతరః ॥ 17సూ.

తా॥ జీవుడు మొదలగువారు కంటియందుండుట అసంభ వముగుటవలనను, సత్యసంకల్పాదిగుణములు లేకపోవుటవలన

ను, అక్షిపురుషుడు పరబ్రహ్మమేకాని జీవుడుకానేరడు.

"రశ్మిభిరేషోస్మిన్ ప్రతిష్ఠితః" యను శ్రుతియందు సూర్యునికి కంటియందునికియున్నను, ఉత్పత్తిలయములుండుటవలన సూర్యునకును, ఇతరదేవతలకును, అమృతత్వాదులు శాశ్వతము కావు. వారియైశ్వర్యము పరమేశ్వరునివలన కలిగినదే.

అ.గీ. అలమర్థేన కామేన సుకృతేనాపి కర్మణా।
10ప్ర. ఏభ్యః సంసారకాంతారే నవిశ్రాంతమభూన్మనః ॥ 7

తా॥ ధర్మార్థకామములతో పూరితమైన సంసారాడవినుండి తప్పించుకొని విశ్రాంతినొందుట కడుదుర్లభము. కావున ధర్మార్థకామములందాసక్తి తగదు.

కృతం న కతిజన్మాని కాయేన మనసా గిరా।
దుఃఖమాయాస్పదం కర్మ తదద్యాప్యుపరమ్యతాం ॥ 8

తా॥ జనకా- నీవు వెనుకటిజన్మములందు కాయక్లేశము నొంది ప్రయాసమును, దుఃఖమును, కలిగించు కర్మములెన్ని జేసియుంటివి. ఆపూర్వజన్మకర్మములవలన నీకంతకంతకు అనర్థముతప్ప వేఱేమియు కలుగలేదుగదా? ఇప్పుడైనను కర్మములందాసక్తివిడిచి జ్ఞాననిష్ఠుడవై ఆత్మసుఖమునొందుమని అష్టావక్రముని చెప్పెను.

1అ. 3పా. 5అధి. 15సూ.

గతిశబ్దాభ్యాం తథాహి దృష్టం లింగం చ ।

తా॥ సర్వభూతములును సుషుప్తికాలమునందు కారణబ్రహ్మమునే పొందుచున్నవి. బ్రహ్మలోకశబ్దము పరబ్రహ్మమునే

చెప్పను. అట్టిగురుతు అనగా అనుభవముకూడ చూడబడు చున్నది.

1ఛాం. 8-3-2 'ఇమాస్సర్వాః ప్రజాః అహరహర్గచ్ఛం త్యేతం బ్రహ్మలోకం నవిందంతి'

తా॥ జీవులు ప్రతిదినము సుషుప్తియందు బ్రహ్మమును పొందుచుండియును అట్లు తెలిసికొనలేకనున్నారు.

అన్యార్థశ్చ పరామర్శః । 20సూ.

తా॥ 18సూ. నందలి జీవపరామర్శ అన్యమైన పరమాత్మను చెప్పుచున్నది. జాగ్రత్స్వప్నములందనుభవించిన వానిచేత అలసి సుషుప్తియందు బ్రహ్మమును పొందుచున్నాడు.

1 ఛాం 8-1-5 'ఏషఆత్మాஉపహతపాప్మా'

తాత్పర్యము 60 పుటలో కలదు.

(7అధి) శబ్దాదేవ ప్రమితః । 24సూ.

తా॥ 'అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః । ఈశానో భూతభవ్యస్య' యను శ్రుతిచేత జీవాత్మయని పూర్వపక్షమురాగా- పరమాత్మయనియే సిద్ధాంతము.

హృద్యపేక్షయాతు మనుష్యాధికారత్వాత్ । 25

తా॥ శాస్త్రము మనుష్యులకొఱకే యగుటవలన క. 2-6-17 'అంగుష్ఠమాత్రః పురుషోஉంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః' ఇత్యాది శ్రుతి పరమేశ్వరుడు ఎల్లపుడును ప్రాణులయొక్క హృదయమునందు అంగుష్ఠమాత్రప్రమాణముతో నున్నాడని చెప్పుచున్నది.

14 వ ప్ర॥ సమాప్తము.

# 15 వ ప్రకరణము

జ్ఞానవిద్యాభ్యాసము (సదాచరణము) వలన
నిర్గుణముక్తి కలుగువఱకును క్రమముగా
కలుగు శ్రేష్ఠఫలనిరూపణము.

భగవద్గీత 6 అధ్యాయము.

అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః।
అప్రాప్య యోగసంసిద్ధిం కాంగతిం కృష్ణ గచ్ఛతి ॥ 37
కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణఃపథి॥38

తా॥ జ్ఞానము పూర్ణముకాకుండ మనస్సు చలించి మరణించినవానిగతి యేమియని అర్జునుడడిగెను.

పార్థ నైవేహనాముత్ర వినాశ స్తస్య విద్యతే।
నహి కళ్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి ॥ 40 ॥
ప్రాప్య పుణ్యకృతాల్లోకానుషిత్వా శాశ్వతీస్సమాః।
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥
అథవా యోగినామేవ కులే భవతి ధీమతాం।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశం ॥ 42 ॥
తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికం।
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన ॥ 43 ॥

తా॥ అట్టివాడు దుర్గతిని పొందడు. దేవలోకములలో పుణ్యఫలమనుభవించి శుచిగల శ్రీమంతుల గృహమునందు

గాని, జ్ఞానులకులమునందుగాని జన్మించి జ్ఞానసిద్ధికొఱకు మరలయత్నించుచున్నాడని శ్రీకృష్ణుడు చెప్పెను.

మఱియు- వాసిష్ఠము.

ఏకామథ ద్వితీయాంవా తృతీయాం భూమికాముత ।
ఆరూఢస్య మృతస్యాథ కీదృశీ భగవన్ గతిః ।

తా॥ ఒకటి రెండు మూడు భూమికలలోనుండి మృతుడైనవానిగతి యేమి అని శ్రీరాముడడిగెను.

యోగభూమిక యోత్క్రాంత జీవితస్య శరీరిణః ।
భూమికాంశానుసారేణ క్షీయంతే పూర్వదుష్కృతం ॥
తతః సురవిమానేషు లోకపాలపురేషుచ ।
మేరూపవనకుంజేషు రమతే రమణీసఖః ॥
తతః సుకృతసంభారే దుష్కృతేచ పురాకృతే ।
భోగక్షయపరిక్షీణే జాయంతే యోగినో భువి ॥
శుచీనాం శ్రీమతాం గేహే గుప్తే గుణవతాం సతాం ।
తత్ర ప్రాగ్భావనాభ్యస్త యోగభూమిత్రయం బుధః ॥
స్పృష్ట్వోపరి పతత్యుచ్చైరుత్తరం భూమికాక్రమం ।

తా॥ అభ్యస్తమైన పూర్వభూమికలననుసరించి దుష్కృతము క్షీణించి దేవవిమానములతో దేవలోకములలోను, మేరుపర్వతమునందలి ఉద్యానవనములలోను, సంచరించుచు సుందరీమణులతో క్రీడించుచు సుకృతదుష్కృతముల ననుభవించి భూలోకములో శుచిగల శ్రీమంతుల గృహమునందు జన్మించి మిగిలిన భూమికలను క్రమముగ నభ్యసించును.

పంచదశీ ప్ర॥ 9 ధ్యానదీపము.

విచారయన్నామరణం నైవాత్మానం లభేతచేత్ ।
జన్మాంతరే లభేతైవ ప్రతిబంధక్షయేసతి ।

తా॥ మరణమువరకును బ్రహ్మవిచారముచేసినను ప్రతిబంధబాహుళ్యమువలన ప్రత్యగాత్మను పొందనియెడల మఱియొక జన్మమునందు పొందును. గాని చేసిన బ్రహ్మవిచారము వ్యర్థముకాదు.

3అ. 1పా. 3అధి. 8సూ.

1 కృతాత్యయేఽనుశయవాన్ 2 దృష్టస్మృతిభ్యాం
3 యథేత 4 మనేవంచ ॥

తా॥ యజ్ఞాదికర్మములు చేసిన బ్రాహ్మణులు చంద్రమండలమునందు కర్మఫలమనుభవించి మిగిలిన కర్మశేషముతో (1) కర్మఫలము క్షయమైనదని కలిగిన శోకాగ్నివలన సూర్యకిరణములచేత మంచుగడ్డలు కరిగినట్లే కరిగిపోయి శేషఫలమనుభవించుటకై భూలోకమునకు వత్తురని (2) శ్రుతి స్మృతులు చెప్పుచున్నవి. గనుక (3) వెళ్ళినమార్గముచేతగాని (4) దానికి విరుద్ధమగు మార్గముచేతగాని భూలోకమునకు వత్తురు.

1 ఛాం. 5-10-7 'తద్యదిహ రమణీయచరణా అభ్యాశోహయత్తే రమణీయాం యోనిమాపద్యేరన్ । బ్రాహ్మణయోనింవా క్షత్రియయోనింవా వైశ్యయోనింవా అథ యఇహ కపూయచరణా అభ్యాశోహయత్తే కపూయాం యోనిమాపద్యేరన్ శ్వయోనింవా సూకరయోనింవా చండాలయోనిం

వా॥ తా॥ పరలోకఫలమనుభవించినతరువాత అవశిష్టమైన పూర్వార్జితఫలమనుభవించుటకు వచ్చెడివారిలో పూర్వమీ లోకమునందు మంచిస్వభావముతో చేసిన పుణ్యముగలవారు క్రౌర్యము మొదలగు దోషములులేని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య జాతులలో నొకదానిని ఈలోకములో దుశ్శీలముచేత దుష్కృతముకలవారు జుగుప్సితయోనిని, శునక, సూకర, చండాలజాతులలో నొకదానిని శీఘ్రముగానే పొందుదురు.

2 ఆపస్తంబస్మృతిసూత్రము- 'వర్ణాశ్రమాశ్చ స్వకర్మనిష్ఠాః ప్రేత్య కర్మఫలమనుభూయ తతశ్శేషేణ విశిష్టదేశకులజాతిరూపాయుశ్శ్రుతవృత్తవిత్తసుఖమేధసో జన్మసతిపద్యంతే'

తా॥ బ్రాహ్మణాది జాతులవారు బ్రహ్మచర్యాద్యాశ్రమములతో విహితకర్మములుచేసి చంద్రలోకఫలమనుభవించి యితరమగు వారివారికర్మమునకు తగినదేశమును, వంశమును జాతియును, ఆకారమును, ఆయువును, జ్ఞానమును, ఆచారమును, విత్తమును, సుఖమును, బుద్ధియును గలవారై జన్మమును పొందుచున్నారు.

3 కదాచిత్సుకృతం కర్మ కూటస్థమిహ తిష్ఠతి।
మజ్జమానస్య సంసారే యావద్దుఃఖాద్విముచ్యతే॥

తా॥ సంసారసాగరమునందు మునుగుచున్నవాని పుణ్యకర్మము ముక్తికితగిన జ్ఞానముకలుగువరకును చిరకాలముకూడా నుండును. గాని ఫలమునీయక నశింపదు.

15 ప్ర॥ సమాప్తము.

# 16 వ ప్రకరణము

## 1 అధ్యాయము- 1 పాదము.

బ్రహ్మసూత్రములు 555 కి 15 ప్రకరణములలోను, గల 162 సూత్రములుగాక మిగిలిన 393 సూత్రములయొక్క తాత్పర్యసంగ్రహము.

1 అధ్యాయము 1 పాదమునందలి 1-2-3-4 సూత్రములు 5 వ ప్రకరణమునందు కలవు.

(5అధి) ఈక్షతేర్నాశబ్దం ॥ 5సూ.

తా॥ 5 మొదలు 11 వరకుగల సూత్రములందు జగత్కారణము సాంఖ్యులుచెప్పు సత్త్వరజస్తమోగుణత్రయాత్మక శక్తియనెడి ప్రధానముకాదనియు, పరబ్రహ్మమేఅనియు చెప్పబడుచున్నది. గౌణశ్చేన్నాత్మశబ్దాత్ ॥ 6సూ.

తా॥ 'తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి' యనుశ్రుతిలోని ఈక్షితృశబ్దముచేత గౌణపక్షముగానైనను ప్రధానము కాదు. తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్ ॥ 7సూ.

తా॥ ఛాం. 'స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో । ఆచార్యవాన్ పురుషో వేద, తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యేథ సంపత్స్యే' ఇత్యాది శ్రుతులు బ్రహ్మనిష్ఠగలవానికి మోక్షముకలుగుననుటవలన సచ్ఛబ్దముచేత బ్రహ్మమే.

హేయత్వావచనాచ్చ ॥ 8సూ.

తా॥ సచ్ఛబ్దముచేత ఆత్మకాదనియు, ఆత్మను గ్రహింపతగదనియు శ్రుతులు చెప్పలేదు.

స్వాప్యయాత్ ॥ 9సూ.

ఛా॥ ఛాం. 'యత్రైతత్పురుష స్వపితి నామ సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి । తస్మాదేనం స్వపితీత్యాచక్షతే స్వంహ్యపీతో భవతి'

తా॥ జీవుడు సుషుప్తియందు స్వస్వరూపమగు పరమాత్మతో నేకీభవించుచున్నాడనుటవలన ప్రధానము కాదు.

గతిసామాన్యాత్ ॥ 10సూ.

తా॥ చేతనమగు ఆత్మయే జగత్కారణమని శ్రుతులు మొదలగు వేదాంతవాక్యములన్నియు నొకటిగా చెప్పుచున్నవి.

1 తై. 2-1-2 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః' (2-4-1) తా॥ కలదు. 2 'ఆత్మనఏవేదం సర్వం' కౌషీ॥ 'ఆత్మనఏషప్రాణో జాయతే'

తా॥ ఆత్మనుండియే ఆకాశాది సర్వము పుట్టుచున్నవనుటవలనను ప్రధానముకాదు.

శ్రుతత్వాచ్చ ॥ 11సూ.

శ్వే. 'సర్వజ్ఞమీశ్వరం ప్రకృత్య' 'సకారణం కరణాధిపాధిపో నచాస్య కశ్చిజ్జనితా నచాధిపః'.

తా॥ ఇంద్రియములకు ప్రభువులు జీవులు. వీరికి ప్రభువు పరమేశ్వరుడు. ఇతనికి ప్రభువులేడు. ఇతనిని పుట్టించువాడును లేడు. 12సూత్రము 12వ ప్రకరణములో కలదు.

అవ॥ 12సూ. మొదలు 21వ సూత్రముపరకు జగత్కారణము బ్రహ్మమే కాని జీవుడుకాడనుట-

వికారశబ్దాన్నేతిచేన్న ప్రాచుర్యాత్ ॥ 13సూ.

తా॥ 'బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా' యను వాక్యముచేత ఆనం

దమయకోశమునకు బ్రహ్మము పుచ్ఛమువంటిది గనుక పరబ్రహ్మముకాదని యంటవేని అట్లుకాదు. పలుమాఱు అట్టిఅవయవవాచకములను చెప్పుటవలన పరబ్రహ్మమే.

తద్ధేతు వ్యపదేశాచ్చ ॥ 14సూ.

తా॥ ఆనందమునకు బ్రహ్మము కారణమని 'ఏషహ్యేవానందయాతి' యని శ్రుతి చెప్పుటచేత ప్రాచుర్యార్థమునే బోధించును.

మాంత్రివర్ణికమేవ చ గీయతే॥ 15సూ.

తా॥ 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' తై. 'బ్రహ్మవిదాప్నోతి పరం' 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' ఇత్యాదిశ్రుతులయందు పరబ్రహ్మమే ఆనందమయశబ్దముచేత చెప్పబడినది.

నేతరోఽనుపపత్తేః ॥ 16సూ.

తా॥ శ్రుతిసందర్భమునకు విరోధమై ఉపపత్తిలేనందున నితరుడైన జీవుడు జగత్కారణము కానేరడు.

తై. 2-6 'సోకామయత బహుస్యాం ప్రజాయేయేతి। సతపోతప్యత సతపస్తప్త్వా। ఇదగ్ం సర్వమసృజత యదిదం కించ' తా॥ దేనినుండి ఆకాశాదులు పుట్టెనవో యది యేఆత్మ అది తనయందుండి వ్యక్తముకానివానిని నామరూపములతో వ్యాపకముచేయుదునని సంకల్పించి తపస్సుచేసి జగత్తును సృజించెను. భేదవ్యపదేశాచ్చ ॥ 17సూ.

తా॥ 'రసోవై సః రసగ్ంహ్యేవాయం లబ్ధ్వానందీభవతి' ఛాం. 'ఆత్మాన్వేష్టవ్యః' 'ఆత్మలాభాన్నపరం విద్యతే' ఇత్యాది శ్రుతులయందు జీవుడు ఆత్మస్వరూపమును పొందునటచేత జీవుడు ఆత్మకంటె భేదముగలవాడు,

1 కామాచ్చ 2 నా 3 నుమానాపేక్షా । 18.

తా॥ తై. 2-6 'సోకామయత' యను శ్రుతిలో (1) సృష్ట్యాదిసంకల్పముండుటవలన పరబ్రహ్మమే (2) ప్రధానము కాదు (3) అనుమానము లేదు.

1 అస్మి 2 న్నస్యచ 3 తద్యోగం 4 శాస్తి । 19.

తా॥ (1) బ్రహ్మమునందు (2) జీవున (3) కైక్యము (4) వేదాంతశాస్త్రము చెప్పుచున్నది.

1 తై. 2-7 'యదాహ్యేవైష ఏతస్మిన్నదృశ్యేऽనాత్మ్యేऽనిరుక్తేऽనిలయేऽభయం ప్రతిష్ఠాం విందతే। అథసోऽభయం గతో భవతి। యదాహ్యేవైష ఏతస్మిన్నుదరమంతరంకురుతే అథ తస్య భయం భవతి'

తా॥ మాయాశూన్యమై నిర్వచింపరాని బ్రహ్మమునందు ఆత్మభావమును పొందు (జీవుడు) అప్పుడే బ్రహ్మమును పొందును. భేదముగ చూచువానికి జరామరణములు తప్పవు.

(7అధి) అంతస్తద్ధర్మోపదేశాత్ । 20.

తా॥ సూర్యమండలములోని పురుషునకు బ్రహ్మముయొక్క ధర్మములనే చెప్పుటవలన నతడు పరబ్రహ్మమేకాని జీవుడు కాడు.

1 ఛాం. 1-6.6 'అథ య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే। హిరణ్యశ్మశ్రుర్హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వఏవ సువర్ణస్తస్య యథాకప్యాసం పుండరీకమేవ మక్షిణీ తస్యోదితినామ సఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదిత ఉదేతిహవై సర్వేభ్యః పాప్మభ్యో యఏవం వేద। అథ యఏషోంతరక్షిణి పురుషో దృశ్యతే'

తా॥ సూర్యమండలమునందు బంగారుబొమ్మను పోలినపురుషుడు పాపములచేత స్పృశింపబడనివాడు. అతనిధ్యానాదులవలన సర్వపాపములు తొలగును. ఇట్లే నేత్రమునందలి పురుషుడును, అని [రూపం'

2 ఛాం. 1-7-4 'తస్యైతస్య తదేవరూపం యదముష్య

తా॥ బ్రహ్మమును తెలిసినవాడు మృత్యువునుండి తొలగునని కఠవల్లి 1-3-15 'అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం' యను శ్రుతి చెప్పుచున్నది.

భేదవ్యపదేశాచ్చాన్యః ॥ 21 సూ.

తా॥ శరీరాభిమానులగు సూర్యాదులు జీవులే. వీరికంటె (2) అన్యమైన వేఱొకడు అంతర్యామికలడని (1) భేదమును చెప్పుటవలన నేత్రమందును, సూర్యమండలమందును, ఉపాసింపబడువాడు పరమేశ్వరుడే.

(8అధి) ఆకాశ స్తల్లింగాత్ । 22 సూ.

తా॥ బ్రహ్మమునకు స్రష్ట్వాదిలక్షణములుండుటవలన, ఛాం. 'ఆకాశో హ్యేవైభ్యో జ్యాయమానాకాశః పరాయణం' యను శ్రుతిలోని ఆకాశశబ్దముచేత పరబ్రహ్మమే. కాని పంచభూతములలోని ఆకాశముకాదు.

(9 ప్రాణాధిక) అతఏవ ప్రాణః ॥ 23 సూ.

తా॥ సర్వశరీరములకు ప్రాణమే ముఖ్యము గనుక వానికి ప్రభువుగా బ్రహ్మమే ప్రాణశబ్దముచేత చెప్పబడుచున్నది. కాని ప్రాణవాయువుకాదు.

ఛాం. 'కతమా సా దేవతా ప్రాణఇతి హోవాచ । సర్వాణిహవా ఇమాని భూతాని ప్రాణమేవాభిసంవిశంతి । ప్రాణమ

భూజ్జిహ్వే స్సైషా దేవతా ప్రస్తావమన్వాయత్తా'

తా. ఉపాస్యదేవత ప్రాణమనెడి బ్రహ్మము. సమస్తభూతములు ప్రళయమునందు ప్రాణమునందే ప్రవేశించి మరల దానినుండియే పుట్టుచున్నవి.

24ల॥ 27 వరకు సూత్రములు 5వ ప్ర॥ నందు కలవు

(11అధి) ప్రాణస్తథానుగమాత్ ॥ 28సూ.

తా॥ సందర్భమునననుసరించి ప్రాణశబ్దముచేత పరబ్రహ్మమే కాని జీవాదులు కావు.

1 కౌ. బ్రా 'ప్రతర్దనోహ దైవోదాసిరింద్రస్య ప్రియం ధామోపజగామ యుద్ధేనచ పౌరుషేణచ'

2 'స హోవాచ । ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా తం మాయురమృతముపాస్వ' (3) అథ ఖలు ప్రాణఏవ ప్రజ్ఞాత్మేదం శరీరం పరిగృహ్యోత్థాపయతి' (4) నవాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్' (5) కౌ 3-9 'సఏష ప్రాణఏవ ప్రజ్ఞాత్మా నందోఽజరోఽమృతః'

తా॥ ప్రతర్దనరాజు ఇంద్రునినడుగగా తాను ప్రాణమును, చేతనుడను, అసయు, తనను ఆయువునకు కారణముగాను, అమృతస్వరూపముగాను నుపాసింపుమని పలికెను. వాక్కు మొదలగు ఇంద్రియములు శరీరమును ధరింపలేమనగా ప్రాణమేధరించునని చెప్పెను. ప్రాణమే ఆనందస్వరూపమును, మోక్షస్వరూపమును, జరామరణములులేని చేతనమును.

1 న 2 వక్తు 3 రాత్మోపదేశా 4 దితిచే 5 దధ్యాత్మ సంబంధభూమాహ్య 6 స్మిన్ ॥ 29సూ.

తా॥ (2) ఇంద్రుడు (3) తనప్రాణమునేగాని (2) పరబ్ర

హ్మము (4) చెప్పలేదందు వేస (6) ఈఅధ్యాయమునందు (5) ప్రత్యగాత్మసంబంధమైన ధర్మబాహుళ్యముండుటవలన (1) నట్లనరాదు.

1 శాస్త్రదృష్ట్యాతూ 2 పదేశో 3 వామదేవవత్ ॥30

తా॥ (3) వామదేవఋషి పూర్వజన్మవాసనవలన బ్రహ్మస్వరూపుడై తానే సూర్యుడనైతిని, మనువునైతిని, సర్వము ఆత్మస్వరూపమని చెప్పినట్లే ఇంద్రుడును శాస్త్రదృష్టిచేత నుపదేశించెను. కాని తనను స్తుతిచేసికొనలేదు.

జీవముఖ్యప్రాణలింగాన్నేతిచేన్నోపాసా త్రైవిధ్యా
దాశ్రితత్వాదిహ తద్యోగాత్ ॥ 31సూ.

తా॥ జగత్కర్త జీవుడనిగాని, ముఖ్యప్రాణమనిగాని, చెప్పుటకు గుర్తులుండుటచేత బ్రహ్మముకాదని యందువేని అట్లనరాదు. లింగమనగా శబ్దసామర్థ్యము, జీవోపాసనము, ముఖ్యప్రాణోపాసనము, బ్రహ్మోపాసనము, నను మూడువిధములుగా చెప్పుటవలనను, మనోమయః ప్రాణశరీరాదుల నుపాధిధర్మములతో బ్రహ్మోపాసనమనుటవలనను, ఇక్కడకూడా ఒకఅర్థమే యగుటవలనను, ప్రాణప్రజ్ఞాత్మలింగములుండుటచేత బ్రహ్మమే. 1 క. 2-5 'నప్రాణేనాపానేన మర్త్యో జీవతి కశ్చన ఇతరేణతు జీవంతి యస్మిన్నేతావుపాశ్రితౌ'

తా॥ మనుష్యుడు ప్రాణ అపాన వాయువులచేత జీవింపడు. ఇవి ఆశ్రయించిన బ్రహ్మముచేత జీవించుచున్నాడు.

2 జీవశబ్దముకూడ 'తత్త్వమసి' 'అహం బ్రహ్మాస్మి' మొదలగు శ్రుతులవలన బ్రహ్మశబ్దముకంటె మిక్కిలిభిన్నముకాదు.

1అ. 1పా. సమాప్తము.

1 అధ్యాయము- 2 పాదము.

1సూ. మొదలు 8సూ. వరకును జగత్కర్త జీవుడు కాడనుట.

(1అధి) సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్ ॥ 1సూ.

తా॥ వేదాంతవాక్యములందన్నిచోట్లను ప్రసిద్ధముగా బ్రహ్మమునుపదేశించుటవలన మనోమయాదిగుణములుగలవాడు పరబ్రహ్మమే. కాని జీవుడుకాడు.

1 ఛాం. 3-14-1 'సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత అథ ఖలు క్రతుమయః పురుషో యథా క్రతు రస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి సక్రతుం కుర్వీత' తా॥ ఈజగత్సృష్టికర్తయగు బ్రహ్మమునకు శత్రుమిత్రాదిభేదములును, రాగాదులును లేవు. బ్రహ్మమును మనోమయత్వాది గుణములతో నుపాసింపవలెను. ఎట్టిసంకల్పముతో నుపాసించువాడు అట్టిఫలమును పొందును.

2వ సూ. 5 వ ప్రకరణములో నున్నది.

1 అనుపపత్తే స్తు 2 న 3 శారీరః ॥ 3సూ.

తా॥ సత్యసంకల్పాది గుణములు బ్రహ్మమునకే గాని (3) జీవునికి (1-2) సంభవింపవు, 'సత్యసంకల్పః' 'ఆకాశాత్మా' 'అవాక్యనాదరః' ఛాం. 1-14-3 'జ్యాయాన్పృథివ్యా' 'జ్యాయానంతరిక్షాత్' 'ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః' యను శ్రుతులవలన బ్రహ్మము వ్యాపకత్వముచేత శరీరమందున్నను లేనివాడే. జీవునకు శరీరముకంటె వేఱధిష్ఠానము లేదు.

కర్మకర్తృవ్యపదేశాచ్చ ॥ 4సూ.

తా॥ పరబ్రహ్మము ముక్తిస్థానమనియు, జీవుడు ముక్తినిపొందతగినవాడనియు నుపదేశింపబడెను.

శబ్దవిశేషాత్ । 5సూ.

శబ్దములయొక్క భేదమువలనను, శత. బ్రా. 10-6-3 'యథా వ్రీహిర్వాయవోవా శ్యామాకోవా, శ్యామాకతండులోవైవ మంతరాత్మన్పురుషో హిరణ్మయః' యను శ్రుతిలోని 'పురుషః' అను ప్రథమాంతముచేత నుపాస్యదేవతగా బ్రహ్మమును 'అంతరాత్మన్' అను సప్తమ్యంతముచేత జీవుడును చెప్పబడుచున్నారు.

స్మృతేశ్చ ॥ 6సూ.

1 భ.గీ. 18అ. 6 'ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి। భ్రామయంత్సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥

తా॥ ఈశ్వరుడు జీవులయొక్క హృదయమునందుండి కర్మములను చేయించుచున్నాడు. [షు భారత।'

2 భ.గీ. 13అ. 2 'క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వక్షేత్రే

తా॥ సర్వశరీరోపాధులందును ఉన్న నన్ను క్షేత్రజ్ఞునిగా తెలిసికొనుము.

బృ. 5-7-23 'నాన్యోతోస్తి ద్రష్టా। నాన్యోతోస్తి శ్రోతా। నాన్యోతోస్తి మంతా। నాన్యోతోస్తి విజ్ఞాతా।'

ఈయంతర్యామికంటె చూచునది, వినునది, ఆలోచించునది, తెలియునదియును వేఱొకటిలేదు. ఇట్లు జీవేశ్వరులకు భేదముకలదు.

అర్భకౌకస్త్వా త్తద్వ్యపదేశాచ్చ నేతిచేన్న నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చ । 7సూ.

తా॥ అర్భక=అల్పమైన, ఓకస్త్వాత్=స్థానముగలవాడను

టవలన, 'ఏషమఆత్మాంతర్హృదయె' 'అణీయాన్ వ్రీహే ర్వాయవాద్వా' యను శ్రుతులు అల్పత్వమును, తద్వ్యపదే శాత్ =ఉపదేశించుటవలన జీవుడేగాని పరమాత్ముడు, ఇతి చేత్ =కాడనియందు వేని, న=దోషముకాదు. నిచాయ్యత్వా త్ =హృదయమునందు చూడతగినవాడగుటవలన ఏవం=ఈ ప్రకారము అణుత్వధర్మము చెప్పబడినది. ఆ ఈశ్వరుడు వ్యో మవచ్చ=ఆకాశమువలె నంతట నున్నవాడు.

1 సంభోగప్రాప్తి 2 రితిచే 3 న్న 4 వై శేష్యాత్ ॥ 8

తా॥ (1) జీవునితో కలిసియుండుటవలన బ్రహ్మమునకు సుఖదుఃఖాదులు కలవు. (2) అని యందు వేని (4) అట్లనరా దు. (5) జీవుడు కర్తయు, భోక్తయు, ధర్మాధర్మాది సాధనము లును, సుఖదుఃఖములునుకలవాడు. బ్రహ్మముఅట్టివిలేనివాడు

9వ సూత్రము 4వ ప్రకరణములో కలదు.

ప్రకరణాచ్చ ॥ 10సూ.

తా॥ బ్రహ్మప్రకరణమగుటచేతను 'నజాయతే మ్రియతే వా విపశ్చిత్' ఈశ్వరుడు పుట్టడు. నశింపడు. యను శ్రుతిచే త 'అత్త' యను వాక్యమునుబట్టి పరబ్రహ్మమే.

1 గుహాం ప్రవిష్టా 2 వాత్మానౌ హి 3 తద్దర్శనాత్ ॥ 11

తా॥ (1) హృదయగుహయందున్నవారు బుద్ధిజీవులందు వేని కారు. జీవేశ్వరులే. (2) జీవేశ్వరులు చేతనులును, సమా నస్వభావముగల ఆత్మలును. గనుకనే (3) జీవేశ్వరులు ఏక రూపముతో దేహమునందున్నారు.

1 క. 1-3-1 'ఋతంపిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి ।

పంచాగ్నయో యేచ త్రిణాచికేతా,' 2 ఆత్మానమన్విచ్ఛ గుహాం ప్రవిష్టః।'

తా॥ కర్మఫలమును జీవుడనుభవించుచున్నను ఛత్రిన్యాయముచేత జీవేశ్వరులిద్దరు ననుభవించుచున్నారనుటచేత బుద్ధిరూపమగు గుహయందున్నారు. వీరిలో జీవుడు సంసారి. ఈశ్వరుడు సంసారి కాడు. 2 నాచికేతునితో బుద్ధిరూపగుహయందలి పరమేశ్వరుని తెలిసికొనుమని యముడు చెప్పెను.

విశేషణాచ్చ ॥ 12సూ.

తా॥ పూర్వోత్తర గ్రంధవిశేషణములవలనను, క్రిందిశ్రుతులవలనను గుహయందున్నవారు జీవేశ్వరులే.

1 క. 'ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవచ'

2 క. 'తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం గంహ్వారేష్ఠం పురాణం । అధ్యాత్మయోగాధిగమేనదేవం మత్వా ధీరో హర్ష శోకౌ జహాతి'

తా॥ 1 జీవుని రథస్వామిగాను, దేహమును రథముగాను తెలియుము. 2 చూడశక్యముకానిదియు, అనేకానర్థములుగల యీశరీరమునందు బుద్ధిరూపముగ నున్నదియు, అనాదియు, నగు ఆత్మను నిష్ఠాముడై జ్ఞానముచేత తెలిసికొనినవాడు హర్ష శోకములను పొందడు.

13-14 సూత్రములు 12వ ప్రకరణములో నున్నవి.

1 సుఖవిశిష్ట 2 అభిధానాదేవచ ॥ 15సూ.

తా॥ కంటియందలి పురుషుడు సుఖస్వరూపమగు పరబ్రహ్మమే.

శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ ॥ 16సూ.

తా॥ శ్రుత=తెలిసికొనబడిన, ఉపనిషత్క=బ్రహ్మవిద్య గలవానికి. గతి=హిరణ్యగర్భలోకమును పొందునట్టి అర్చిరాదిమార్గమును, అభిధానాత్ = చెప్పుటవలనకూడా అక్షి (కంటి) పురుషుడు పరబ్రహ్మమే.

1 ప్ర. 1-10 'అథోత్తరేణ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయాత్మానమన్విష్యాదిత్య మభిజయంతే । ఏతద్వై ప్రాణానామాయతనమేతదమృతమభయ మేతత్పరాయణమే తస్మాన్న పునరావర్తంతే ।'

తా॥ స్వధర్మము, ఇంద్రియనిగ్రహము, ఆస్తిక్యబుద్ధి, ప్రజాపత్యాత్మ తాదాత్మ్యము, మొదలగువానిచేత బ్రహ్మము తానేయని తెలిసికొనినవాడు ఉత్తరాయణద్వారము (అర్చిరాదిమార్గము) చేత సగుణబ్రహ్మమును పొంది తరువాత నిర్గుణబ్రహ్మమును పొందును.

2 భ.గీ. 8అ. 24 'అగ్నిర్జ్యోతిరహశ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణం । తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః ।' తా॥ అగ్ని, జ్యోతి, దివాభిమాని, శుక్లపక్షాభిమాని ఉత్తరాయణాభిమాని, యను దేవతలున్న మార్గముగుండా సగుణబ్రహ్మోపాసకులు క్రమముగా బ్రహ్మమును పొందుచున్నారు.

3 ఛాం. 4-15-5 'యదుచైవాస్మిన్ శవ్యం కుర్వంతి । యదుచ నార్చిషమేవాభిసంభవంతి' ఆదిత్యాచ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురుషో మానవస్సఏనాన్ బ్రహ్మ గమయత్యేష దేవపథో బ్రహ్మపథ ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవమావర్తం నావర్తంతే ।'

తా॥ శవసంస్కారరూపకర్మము చేసినను, చేయకున్నను, అక్షిపురుషోపాసకులు అర్చిరాదిమార్గమున సూర్య చంద్రవిద్యల్లోకమును, హిరణ్యగర్భునిలోకమును పొందుచున్నారు అట్టివారీకల్పమునందు మఱల జన్మింపరు.

17వ సూ. 14వ ప్రకరణములో కలదు.

1 అ తర్యామ్య 2 ధిదైవాదిషు 3 తద్ధర్మవ్యపదేశాత్ । 18.

తా॥ (2) పృథివ్యాదులందు (1) లోపలనుండి నియమించువాడు (3) ఆత్మధర్మములనే చెప్పుటవలనను, 'ఏషతఆత్మాంతర్యామ్యమృతః' యను శ్రుతిచేత ఆత్మత్వ అమృతత్వ ధర్మములు గలవాడగుటవలనను పరబ్రహ్మమే. కాని జీవుడుకాడు. ప్రధానమును కాదు.

1 బృ. 5-7-1 'య ఇమంచ లోకం పరంచ లోకగ్ం సర్వాణి భూతాని యోంతరోయమితి' 2 'యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యాంతరోయం పృథివీన వేద యస్య పృథివీ శరీరం యః పృథివీమంతరోయమయ త్యేషతె ఆత్మాంతర్యామ్యమృతః'

తా. 1 స్వర్గాదిలోకములను నియమించుచు, సర్వప్రాణులను భ్రమింపచేయుచు, వారికర్మములకు తగిన వ్యాపారములను చేయించుచు 2 పృథివికంటె వేఱగు శరీరేంద్రియములు లేనివాడు నారాయణుడే. అతడు నీకును, నాకును, ఎల్లజంతువులకును ఆత్ముడు. అతడు సంసారధర్మములులేని అంతర్యామియని గౌతమునితో యాజ్ఞవల్క్యుడు చెప్పెను.

నచ స్మార్తమతద్ధర్మాభిలాపాత్ ॥ 19సూ.

తా॥ ధర్మ=అసాధారణధర్మములను, అభిలాపాత్=చెప్పుటవలన, అంతర్యామిగనుండి ప్రేరేపించునది అచేతనమైన

స్మార్తం=సాఙ్ఖ్యసమ్మతప్రధానము న=కానేరదు. బృ. 5-7 23 'అదృష్టో ద్రష్టా అశ్రుతశ్శ్రోతా' యను శ్రుతిలో చేత నధర్మములు కలవు. గనుక బ్రహ్మమే.

1 శారీరశ్చో 2 భయేఽపిహి 3 భేదే 4 నైన
5 మధీయతే ॥ 20 సూ.

తా॥ (2) కాణ్వులును, మాధ్యందినులును మాత్రము (4) ఈజీవుని అంతర్యామికంటె (3, వేఱైనవానిగా (5)పఠిం చుటవలన (1) జీవుడు అంతర్యామి కాడు. 'యోవిజ్ఞానేతిష్ఠన్' జీవుడు విజ్ఞానమయుడని కాణ్వులును, 'య ఆత్మని తిష్ఠన్' ఆత్మశబ్దము జీవవాచకమని మాధ్యందినులును చెప్పుచున్నారు

1 బృ. 6-5-14 'యత్రహి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి' 'యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్' తా॥ 209 పుటలో కలదు.

1 అదృశ్యత్వాదిగుణకో 2 ధర్మోక్తేః ॥ 21 సూ.

తా॥ (2) బ్రహ్మముయొక్క ధర్మములను చెప్పుటవలన (1) అదృశ్యము మొదలగు గుణములుగలది పరబ్రహ్మమే. కాని ప్రధానముకాదు. జీవుడును కాడు.

1 ముం. 1-1-5-6 'అథ పరా యయా తదక్షరమధిగ మ్యతే। యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షు శ్శ్రోత్రం తదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః ॥'

తా॥ జ్ఞానేంద్రియములకు తెలియనిదియు, నామరూపా దులును, నాశమును లేనిదియు, ఆకాశమువలె నంతటనువ్యా పించినదియు, సూక్ష్మమై భూతములకు కారణమైనదియునగు

పురుషునియొక్క విద్య పరయని విద్వాంసులుచేత చెప్పబడు
న్నది. 1 విశేషణభేదవ్యపదేశాభ్యాం చ

2-3 నేతరౌ ॥22సూ.

తా॥ (1) జీవేశ్వరులకు భేదమును చెప్పుటచేత ఇతరౌ=
ప్రధానముగాని, జీవుడుగాని, భూతయోనిశబ్దముచేత జగత్కా
రణము న-కాదు.

1 ముం. 2-1-2 'దివ్యోహ్యమూర్తః పురుషస్స బాహ్యా
భ్యంతరో హ్యజో ప్రాణోహ్యమనాశ్శుభ్రః ॥'

తా॥ 77 పుటలో కలదు.

రూపోపన్యాసాచ్చ ॥ 23సూ.

తా॥ రూప-జగత్కారణమై సర్వాత్మకమగు ఒక్కరూప
మును, ఉపన్యాసాత్-చెప్పుటవలన నది పరబ్రహ్మమే. కాని
ఇతరముకాదు.

1 ముం. 2-1-3 ''ఏతస్మాజ్జాయతే ప్రాణః'

తా॥ ఈపురుషునినుండియే ప్రాణములు పుట్టుచున్నవి.

24 మొదలు 32 వరకునుగల సూత్రములు

12 వ ప్రకరణములో కలవు.

2 వ పాదము సమాప్తము.

1 అధ్యాయము-3 పాదము.

(1అధి) 1 ద్యుభ్వాద్యాయతనం 2 స్వశబ్దాత్ ॥ 1సూ.

తా॥ (2) ఆత్మశబ్దమువలన (1) స్వర్గలోకము, భూలోక
ము, అంతరిక్షము, ప్రాణము, మనస్సు మొదలగునవిగలజగ
త్తునకు ఆధారము పరబ్రహ్మమే. కాని జీవుడు, ప్రధానము
మొదలగునవి కావు.

1 ఛాం. 6-8-4 'సన్మూలాస్సోమ్యేమాస్సర్వాః ప్రజా స్సదాయతనా స్సత్ప్రతిష్ఠా' [బ్రహ్మమే.

తా॥ ఈజగత్తుయొక్క సృష్టి, స్థితి, లయములకు కర్త

ముక్తోపసృప్య వ్యపదేశాత్ ॥ 2సూ.

తా॥ ముక్త-ముముక్షువులు, ఉపసృప్య-పొందతగినదని, వ్యపదేశాత్-శ్రుతులు చెప్పుటవలన స్వర్గాదిలోకములుగల జగత్తునకు ఆధారము పరబ్రహ్మమే.

1 ముం. 2-2-8 'భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః। క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే' తా॥ 249 పుటలో కలదు.

నానుమానమతచ్ఛబ్దాత్ ॥ 3సూ.

తా॥ అతచ్ఛబ్దాత్-ప్రధానాదులు జగత్కారణమని చెప్పు శబ్దములు లేకపోవుటవలన, అనుమానం-సాంఖ్యమతప్రధానము, న-కానేరదు.

ప్రాణభృచ్చ ॥ 4సూ.

తా॥ పైకారణములవలన జగత్కర్త జీవుడు కానేరడు.

భేదవ్యపదేశాత్ ॥ 5సూ.

తా॥ జీవుడు మోక్షాదికోరికలతో బ్రహ్మమును తెలిసికొనతగినవాడును, బ్రహ్మము అట్టివి లేనివాడును గనుక జగత్కర్త బ్రహ్మమే. ప్రకరణాత్ ॥ 6సూ.

తా॥ పరమాత్మనుచెప్పు ప్రకరణమునందుండుటవలన జీవుడు జగత్కర్తకాడు.

1 ముం. 1-1-3 'కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం' తా॥ 69 పుటలో కలదు.

స్థిత్యదనాభ్యాంచ । 7సూ.

తా॥ ముం. 3-1-1 'ద్వాసుపర్ణాసయుజాసఖాయాః తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యోభిచాకశీతి' యనుశ్రుతియందు జీవేశ్వరులు శరీరమునందున్నను జీవుడు కర్మఫలమనుభవించువాడనియు, ఈశ్వరుడు దేనితోనుసంబంధములేకుండ సాక్షిగానుండువాడనియు చెప్పబడినది.

1 భూమా 2 సంప్రసాదా 3 దధ్యుపదేశాత్ । 8సూ.

తా॥ (2) ప్రాణమునుపదేశించినతరువాత (3) చెప్పుట వలన (1) భూమాశబ్దముచేత పరబ్రహ్మమే. కాని ప్రాణవాయువుకాదు.

1 ఛాం. 7 'సభగవః కస్మిన్ ప్రతిష్ఠిత' 'స్వేమహిమ్ని'

తా॥ భూమము (పరమాత్మ) తనమహిమయందె నిలిచెనని సనత్కుమారుడు చెప్పెను.

9 వ సూ॥ 9 వ ప్రకరణములో కలదు.

(3 అక్షరాధి) 2 అక్షర 1 మంబరాంతధృతేః ॥ 10సూ.

తా॥ (1) జగత్తునుధరించుటవలన (2) పరమాత్మడే అక్షరశబ్దముచేతి చెప్పబడును. గాని ఓంకారవర్ణము కాదు. 'నక్షరతీత్యక్షరం' నశింపులేనిదిఅక్షరము. 'అశ్నుతేచేత్యక్షరం' అంతటను వ్యాపించినదిగనుక అక్షరము. కావున పరబ్రహ్మమే.

1 ఛాం. 2-23-4 'ఓంకారఏవేదం సర్వం'

తా॥ జగత్తంతయు ఓంకారమే. జగత్తు బ్రహ్మముయొక్క వికారమే కాని బ్రహ్మముకంటె వేరుకాదు. బ్రహ్మము ఓంకారముకంటె వేరుకాదు. అది సర్వాత్మకము. ఓంకారము జ్ఞానసాధనము.

1 సాచ 2 ప్రశాసనాత్ ॥ 11సూ.

తా॥ (2) ఈఅక్షరము ఆజ్ఞాపించుచున్నదనుటవలన (1) జగత్తునుధరించుపని పరబ్రహ్మమునకే కలదు.

బృ. 5-8-9 'ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః'

తా॥ 184 పుటలో కలదు.

1 అన్యభావ 2 వ్యావృత్తేశ్చ ॥ 12సూ.

తా॥ (1) ప్రధానము, జీవుడు, మొదలగునవి వానిస్వభావముచేతనే (2) జగత్కర్త కానేరవు.

13 వ సూ. 12 వ ప్రకరణములో కలదు.

హృదయమందున్న సూక్ష్మాకాశమే భూతాకాశము లేక జీవుడు అని పూర్వపక్షము రాగా-

(5 దహరాధి) 1 దహర 2 ఉత్తరేభ్యః ॥ 14సూ.

తా॥ (1) దహరశబ్దముచేత పరబ్రహ్మమే కాని జీవుడు కాడు. భూతాకాశమును కాదు. (2) వాక్యశేషమందు 'తదన్వేష్టవ్యం' అని దహరా (హృదయా) కాశమే చెప్పబడినది అల్పమైన హృదయమునందు ద్యులోకాదులును ఇమిడియున్నవి.

1 ఛాం. 8-1-1 'అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోస్మిన్నంతరాకాశ స్తస్మిన్ యదంతస్తదన్వేష్టవ్యం తద్వావ జిజ్ఞాసితవ్యం'

తా॥ ఈశరీరమునందుగల సూక్ష్మగుహలో సూక్ష్మాకారముగనున్న బ్రహ్మమునే శ్రవణాదులచేత విచారించి తెలిసికొనతగినది.

2 ఛాం. 8-1-5 'ఏషఆత్మా౽పహతపాప్మా విజరోవిమృత్యుర్విశోకో౽విజఘత్సో౽పిపాసస్సత్యకామ స్సత్యసంకల్పః'

తా॥ ఈబ్రహ్మమునకు ధర్మాధర్మములును, జరామరణములును, మనస్తాపమును, ఆహారాదులును లేవు. సఫలమైన కోరికలును, వ్యర్థముకాని సంకల్పములును కలవు.

15 వ సూ. 14 వ ప్రకరణములో కలదు.

1 ధృతేశ్చ 2 మహిమ్నో 3 ఽస్యా 4 స్మి 5 న్నుపలబ్ధేః॥ 16

తా॥ (1) జగత్తును ధరించుటవలన దహరాకాశముచేత పరబ్రహ్మమే. (3) జగత్తునుధరించు (2) ప్రభావము (4) ఈ పరబ్రహ్మమునందే (5) తెలియబడుచున్నది.

1 ఛాం. 8-4-1 'అథ యఆత్మా ససేతుర్విధృతిరేషాం లోకానామసంభేదాయ'

తా॥ భూమిమొదలగు లోకములను ఆత్మయే ధరించుచు [న్నది.

2 బృ. 6-4-22 'ఏషసర్వేశ్వర ఏషభూతాధిపతి రేషభూతపాల ఏషసేతుర్విధరణ ఏషాం లోకానామసంభేదాయ'

తా॥ ఆత్మ జీవులకును, కర్మములకును, నియమించుకర్తయైనను వానితోసంబంధములేనిది. సర్వమునకును కర్తయును రక్షించునదియును, వర్ణాశ్రమాదులను నిలుపుటకు గట్టువంటిదియు నగును. ప్రసిద్ధేశ్చ॥ 17సూ.

తా॥ ప్రసిద్ధివలన దహరాకాశముచేత పరబ్రహ్మమే.

1 ఛాం. 1-9-1 'సర్వాణిహవా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యంతే'

తా॥ ఈస్థావరజంగమములు ఆకాశశబ్దవాచ్యమగు బ్రహ్మమునుండియే పుట్టుచున్నవి.

1 ఇతరపరామర్శా 2త్స ఇతిచే 3 న్నా 4 సంభవాత్ ॥ 18.

తా॥ (1) క్రిందిశ్రుతిలోని సంప్రసాదశబ్దముచేత జీవుడే గనుక 'దహరోస్మిన్నంతరాకాశ' యనుచోటకూడా (2)జీవుడేచెప్పబడునంచు వేని (4) ఉపాధిధర్మములతోను బుద్ధిమొదలగు వానితోను కూడిన జీవునకు ఆకాశముతో పోలికసంభవింపదు గనుక (3) అట్లనరాదు.

1 ఛాం. 8-3-4 'అథ యఏష సంప్రసాదో స్మా చ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యత ఏష ఆత్మేతి హోవాచ'

తా॥ విద్వాంసుడు ఈశరీరమే ఆత్మగాభావింపక పరమాత్మయొక్క తేజోరూపమునుపొంది ఆత్మతో నేకీభవించుచున్నాడు. ఉత్తరాదితిచేదావిర్భూతస్వరూపస్తు ॥ 19సూ

తా॥ ఉత్తరాత్ =ప్రజాపత్యవాక్యముచేతను, ఇతరశ్రుతులచేతను దహరాకాశముచేత చెప్పబడువాడు జీవుడే ఇతిచేత్ =అనియందువేని అట్లుకాదు. ఆవిర్భూతం=సాక్షాత్కరింపబడిన స్వరూపం=ఆకారముకలవాడు జీవుడు. వానికి జ్ఞానమునకుపూర్వము అవిద్యాపూర్వకమగు జీవత్వముకలదు గనుక జ్ఞానానంతరముకూడా బ్రహ్మరూపుడైనను జీవనామముతో చెప్పబడుచున్నాడు. జీవుడును ఈశ్వరుడును ఆకాశమువలె అసంగులే. వారికి భేదముచెప్పుట అజ్ఞానముగాని వాస్తవముకాదు. [బ్రహ్మైవ భవతి'

1 ము. 3-2-9 'సయోహవై తత్పరమం బ్రహ్మవేద

2 క. 1-2-22 'అశరీరం శరీరేష్వనవస్థేష్వవస్థితం'

1 తా॥ 179 పుటలోను, 2 తా॥ 61 పుటలోను కలదు.

3 భ.గీ. 13అ. 31 'శరీరస్థోపి కౌంతేయ నకరోతి నలిప్య తే' తా॥ బ్రహ్మము శరీరమందున్నను ఏదియును చేయదు. కర్మబంధమును లేదు.

20 వ సూ. 14వ ప్రకరణములో కలదు.

1 అల్పశ్రుతే 2 రితిచే 3 త్తదుక్తం॥ 21సూ.

తా॥ (1) దహరాకాశముచేత పరబ్రహ్మముకాదు. (2) అనియందువేని అదిసరికాదు. (3) అట్టిఅల్పత్వమును ఈశ్వ రునియందును కలదు. గనుక పరబ్రహ్మమే.

(7 అధి) 1 అనుకృతే 2 స్తస్యచ ॥ 22సూ.

తా॥ క్రింది 1వ శ్రుతిచేత తేజోవిశేషమందువేని కాదు. (1) అనుసరించిప్రకాశించుటవలన 'భారూపస్సత్యసంకల్పః' సఫలమైన తలంపులుకలిగి స్వయముగ ప్రకాశించునది పర మాత్మయేకాని వేఱుకాదు. 'తమేవ భాంతిమనుభాతి సర్వం' అనువాక్యములోని అనుభావము ప్రాజ్ఞాత్మను గ్రహించును. (2) 'తస్యభాసా సర్వమిదం విభాతి' మొదలగు శ్రుతులవ లనను పరమాత్మయే. అన్నిటిని ఆత్మ ప్రకాశింపచేయును గాని ఆత్మను ప్రకాశింపచేయునది మఱియొకటిలేదు.

1 ముం. 2-2-10, క. 5-15 'న తత్ర సూర్యోభాతి న చంద్రతారకం। నేమాని విద్యుతోభాంతి కుతోయమగ్నిః॥ తమేవభాంతమనుభాతి సర్వం। తస్యభాసా సర్వమిదం విభా తి' 2 ముం. 'యస్మిన్ ద్యౌః పృథివీచాంతరిక్షమోతం,'

తా॥ 1 సూర్యచంద్రనక్షత్రములు, మెఱుపులు, అగ్ని హోత్రుడు మొదలగు సర్వము బ్రహ్మముచేతనే ప్రకా శించుచున్నవి. 2 స్వర్గలోక, భూలోక, అంతరిక్షములను

సృష్టించిన బ్రహ్మమునే తెలిసికొనుడు. తక్కినదంతయును విడువుడు.

1 అపిచ 2 స్మర్యతే॥ 23సూ.

తా॥ (1) మఱియును (2) స్మృతులట్లే చెప్పుచున్నవి.

భ.గీ. 15అ. 6 'నతద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః। యద్గత్వా ననివర్తంతే తద్ధామ పరమం మమ॥'

తా॥ 224 పుటలో కలదు.

24-25 సూ. 14 వ ప్రకర॥లోను, 26 ల॥ 38 వరకు నూ, 1 వ ప్రకరణములోను కలదు.

(11 కంపనాధికరణం) కంపనాత్ ॥ 39సూ. [కాదు.

తా॥ ప్రాణశబ్దముచేత బ్రహ్మమే. కాని భూతవాయువు

1 క. 2-6-2 'యదిదం కించ జగత్సర్వం ప్రాణఏజతి నిస్సృతం మహద్భయం వజ్రముద్యతం యఏతద్విదురమృతాస్తే భవంతి'

తా॥ జగత్కారణము ప్రాణమనెడి పరబ్రహ్మమే. అది గొప్పదియు, ఎత్తబడిన వజ్రమువలె సూర్యచంద్రాదిజగత్తునకుభయకారణమును, గనుక దానిని తెలిసినవారు ముక్తులు.

(12 జ్యోతరధి) 1 జ్యోతి 2 ర్దర్శనాత్ ॥ 40సూ.

తా॥ (2) శ్రుతులవలన (1) జ్యోతిశబ్దముచేత పరబ్రహ్మమే గాని అగ్నికాదు.

(13 అధి) 1 ఆకాశో 2 ఽర్థాంతరత్వాది 3 వ్యపదేశాత్॥41

తా॥ (2) నామరూపములుగల వస్తువుకంటె వేఱగుధర్మములను (3) ఉపదేశించుటవలన (1) ఆకాశశబ్దముచేత పరబ్రహ్మమే కాని పంచభూతాకాశముకాదు.

1 ఛాం. 8-14-7 'ఆకాశోహవై నామరూపయోర్నిర్వహితా తే యదంతరా తద్బ్రహ్మ తదమృతం సఆత్మా'

తా॥ ఆకాశమువలె సూక్ష్మమై శరీరములేని ప్రసిద్ధమగు బ్రహ్మమే జగద్బీజము. తనయందున్న జగత్తునే నామరూపములతో వ్యక్తపఱిచెను.

(14అధి) 1 సుషుప్త్యుత్క్రాంత్యో 2 ర్భేదేన ॥ 42సూ.

తా॥ (1) సుషుప్తియందును, మరణావస్థయందును, జీవపరమాత్మలకు (2) భేదము చెప్పబడుటచేత నిచట పరమాత్మయేకాని జీవుడుకాడు.

1 బృ. 6-4-22 'సవాఏషమహా నజ ఆత్మా యోయం విజ్ఞానమయః ప్రాణేషు యఏషోంతర్హృదయ ఆకాశ స్తస్మిన్ శేతే॥' 2 బృ. 'శారీరఆత్మా ప్రాజ్ఞేనాత్మనాన్వారూఢ ఉత్సర్జన్యాతి యత్రైతదూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి॥'

తా॥ 1 ఆత్మ సర్వవ్యాపకమైనదియు, జన్మములేనిదియు, సర్వజీవులహృదయాకాశమందు నిద్రించుచున్నదియును, 2 ఆత్మ లింగోపాధికుడగు జీవుడు దేహమును విడుచునపుడు మీదియూపిరికలవాడై పరమేశ్వరునిచేత నధిష్ఠింపబడి ధ్వని చేయుచు పోవుచున్నాడు.

పత్యాది శబ్దేభ్యః॥ 43సూ.

తా॥ పతి మొదలగు శబ్దములు బ్రహ్మప్రతిపాదనపరమే.

బృ. 6-4-22 'స సర్వస్యవశీసర్వస్యేశానస్సర్వస్యాధిపతిః'

తా॥ జగత్పదార్థములన్నిటిని లోబఱిచికొని బ్రహ్మాది సముదాయమునకు నియమించునది హృదయాకాశమందున్న ఆత్మయే. 3 వ పాదము సమాప్తము.

16 ప్రి॥ 1అ. 4 పాదము.

(1అధి) ఆనుమానికమప్యేకేషామితిచేన్న శరీర రూపకవిన్యస్తగృహీతేర్దర్శయతి చ। 1సూ.

తా॥ ఆనుమానికమపి అనుమానప్రిమాణముచేత తెలియబడు ప్రిధానముసైతము ఏకేషాం కఠశాఖయందు 'మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పరః' అను శ్రుతిలోని మహతః అవ్యక్తం పురుషః అను నివి సాంఖ్యస్మృతిచేత ప్రిసిద్ధమైన ప్రిధానమే జగత్కారణము ఇతిచేత్ అనియందువేని న=కాదు. శరీరరూపకవిన్యస్తగృహీతేః=రథసాదృశ్యముచేత అవ్యక్తమగు శరీరమును గ్రిహించుటవలన ప్రిధానము తెలియబడదు. జగత్కారణము ఆత్మయే అని దర్శయతిచ=శ్రుతులు చెప్పుచున్నవి.

1 క. 1-3-3 'ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు। బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రిగ్రిహమేవచ ॥ ఇంద్రియాణి హయానాహు ర్విషయాంస్తేషు గోచరాన్। ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః॥'

తా॥ జీవేశ్వరులలో జీవుడు రథస్వామి. దేహము రథము. బుద్ధియే సారథి. మనస్సే కళ్ళెపుత్రాడు. కన్నులుమొదలగునవి గుఱ్ఱములు. శబ్దాదులు గుఱ్ఱములుపోవు మార్గము అని తెలిసికొనుము.వీనితోకూడినదియేయాత్మయనిచెప్పుదురు

2 క. 1-3-10 'ఇంద్రియేభ్యః పరాహ్యర్థా హ్యర్థేభ్యశ్చ పరం మనః। మనసస్తు పరాబుద్ధి ర్బుద్ధేరాత్మామహాన్పరః॥ మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః। పురుషాన్న పరంకించి త్సాకాష్ఠా సా పరాగతిః॥'

తా॥ స్థూలేంద్రియములకంటె శబ్దాదులనెడి భూతసూక్ష్మములును, వానికంటె మనస్సును, దానికంటె బుద్ధియును, దానికంటె ఆత్మయును శ్రేష్ఠము. బుద్ధికంటె అవ్యక్తమువలన మొదటపుట్టిన హిరణ్యగర్భునియొక్క సమష్టి బుద్ధి శ్రేష్ఠము అది దేవతలు నరులు మొదలగు వానిని నియమించునదిగనుక ఆత్మ అనియు, మహాన్ అనియు చెప్పబడును. అవ్యక్తమనగా మాయాతత్త్వము. అదియే జగద్బీజము. అది జీవునికంటెను హిరణ్యగర్భబుద్ధికంటెను శ్రేష్ఠము. దానికంటె సర్వకారణమగు ఆత్మ శ్రేష్ఠము. అదియే ప్రత్యగాత్మ. దానికంటె శ్రేష్ఠమేదియును లేదు.

1 సూక్ష్మంతు 2 తదర్హత్వాత్ । 2సూ.

తా॥ (1) స్థూలశరీరమునుకలిగించిన పంచమహాభూతములకు కారణమగు సూక్ష్మభూతములు (2) అవ్యక్తశబ్దమునకు తగియుండుటవలన స్థూలశరీరము అవ్యక్తశబ్దముచేత చెప్పతగును. చెప్పతగదనుట సరికాదు.

1 బృ. 3-4-7 'తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్'
తా॥ ఈజగత్తు సృష్టికిపూర్వము బీజరూపముగానుండెను.

1 తదధీనత్వా 2 దర్థవత్ ॥ 3సూ.

తా॥ జగత్తు అవ్యక్తముయొక్క అధీనమని చెప్పినను భంగములేదు. (1) అది ఈశ్వరాధీనమంచున్నదే గనుక దోషములేదు. అట్లుఅనుట (2) ప్రయోజనము కలదియేకదా? బంధమోక్షములు శరీరాభిమానికే.

1 శ్వే. 4-10 'మాయాంతు ప్రకృతిం విద్యాత్ మాయినంతు మహేశ్వరం' తా॥ 75 పుటలో కలదు.

జ్ఞేయత్వావచనాచ్చ ॥ 4సూ.

తా॥ అవ్యక్తము జ్ఞేయమనియు, ఉపాసనార్హమనియు చెప్పలేదు. గనుక అవ్యక్తము ప్రధానముకాదు.

వదతీతిచేన్న ప్రాజ్ఞోహి ప్రకరణాత్ ॥ 5సూ.

తా॥ అవ్యక్తశబ్దము ప్రధానమును వదతీతిచేత్=చెప్పుచున్నందు వేని, న=అట్లుచెప్పదు. ప్రాజ్ఞోహి=పరమాత్మయని ప్రకరణాత్='పురుషాన్నపరం కించిత్సాకాష్ఠా సాపరాగతిః' ఇత్యాది పూర్వోత్తరప్రకరణసంబంధము చెప్పుచున్నది.

'ఏషసర్వేషు భూతేషు గూఢోత్మా నప్రకాశతే' 'యచ్ఛేద్వాఙ్మనసీప్రాజ్ఞ' 'అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం'

తా॥ ఇత్యాదివాక్యములచేత పరబ్రహ్మమే జ్ఞేయము. కాని ప్రధానముకాదు. అవ్యక్తమునుకాదు,

త్రయాణామేవ చైవముపన్యాసః ప్రశ్నశ్చ ॥ 6సూ.

తా॥ కఠవల్లియందు త్రయాణామేవ=అగ్ని జీవ పరమాత్మలు మూడింటికే ఉపన్యాసః-వరమునిచ్చుసామర్థ్యము కలదనుటవలన ఏవం-ఈవిషయములకే ప్రశ్నశ్చ-ప్రశ్నోత్తరములుగాని మఱియొకటిలేనందున ప్రధానమునకు అవ్యక్తముగాని జ్ఞేయత్వముగాని చెప్పతగదు.

అగ్నినిగూర్చి ప్రశ్న. క-'సత్వమగ్నిం స్వర్గమధ్యేషిమృత్యో ప్రబ్రూహి తం శ్రద్ధధానాయ మహ్యాం'

తా॥ ఓయముడా! స్వర్గమునకు సాధనమైన స్తండిలరూపాగ్నిని నాకుపదేశింపుము.

జీవునిగూర్చి ప్రశ్న. క-'యేయం ప్రేతే విచికిత్సామను

ప్యేఽస్తీత్యేకే నాయమస్తీతి చైకే ఏతద్విద్యామనుశిష్టస్త్వయాహం వరణామేషవరస్తృతీయః'

తా॥ నరుడు మఱణింపగా దేహాంతరసంబంధమగు ఆత్మ కలదని కొందఱును, లేదనికొందఱును చెప్పెదరు. ఈసంశయము తీర్పుము. ఇది మూడవవరము.

పరమాత్మనుగూర్చి ప్రశ్నము. క-'అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్ అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద'

తా॥ సత్కర్మ దుష్కర్మములకంటెను, కార్యకారణసముదాయముకంటెను, భూత భవిష్య ద్వర్తమానములకంటెను వేఱగు వ్యవహారాతీతమైన వస్తువునుపదేశింపుము.

మహద్వచ్చ । 7సూ.

తా॥ మహచ్ఛబ్దము సత్వగుణప్రధానప్రకృతియొక్క పరిణామమునంటు చెప్పచున్నను 'బుద్ధేరాత్మామహాన్పరః మహాంతం విభుమాత్మానం వేదాహమేతం పురుషం మహాంతం' మొదలగువానియందు ఆత్మశబ్దసంబంధమువలన సాంఖ్యమతతత్వార్థము చెప్పచున్నట్లే అవ్యక్తశబ్దముకూడ ప్రధానమును చెప్పచాలదు.

(2 అధి) 1 చమసవ 2 దవిశేషాత్ ॥ 8సూ.

తా॥ (2) సాంఖ్యమతమునకు విశేషమేదియు లేనందున (1) కింద్విశ్రుతియందు గిరిగుహాదులందు అర్వాగ్బిలత్వాది కల్పన కలుగుటవలన చమసమని నిశ్చయింపశక్యముకానట్లే అజశబ్దమునకు ప్రధానముచెప్పతగదు.

బృ. 4-2-3 'అర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్నః'

తా॥ మీదవర్తులాకారము క్రిందబిలముగలది చమసము. శిరస్సునందు క్రింద నోరనెడి బిలమున్ను మీద వర్తులాకారమున్ను కలుగుటవలన శిరస్సు చమసమనబడును. చమసమను యజ్ఞపాత్రివలె నుండును.

9 వ సూ. 5 వ ప్రకరణములో కలదు.

1 కల్పనోపదేశాచ్చ 2 మధ్వాదివ 3 దవిరోధః ॥10

తా॥ (1) అజాసాదృశ్యము తేజ, జల, పృథివీ లక్షణయగు చరాచరయోనికి యుపదేశముగనుక గౌణము. (2) సూర్యునకు మధుత్వమును, వాక్కునకు ధేనుత్వమును, ద్యులోకాదులకు అగ్నిత్వము మొదలగునవి కల్పించినట్లే ప్రకృతికి అజత్వమున్ను గనుక (3) తేజోబన్నాదులందు అజాశబ్దప్రయోగమువలన విరోధములేదు. ప్రధానశబ్దము అశబ్దమని స్పష్టము.

(3 అధి) న సంఖ్యోపసంగ్రహాదపి నానాభావా దతిరేకాచ్చ ॥ 11సూ.

తా॥ సంఖ్యోపసంగ్రహాదపి-క్రిందిశ్రుతియందు 25సంఖ్యను గ్రహించుటవలన ప్రధానము వేదోక్తము న-కాదు. నానాభావాత్-ఐదైదుగాను, లేక విడివిడిగా నుండుటచేత 'పంచపంచ జనాః' యనునది 25 తత్త్వములను బోధింపదు. అతిరేకాచ్చ-ఆత్మ, ఆకాశము లను చేర్చితే నిరువదియైదు సంఖ్య నతిక్రమించుచున్నది గనుక సరికాదు. క్రిందిశ్రుతిలోని 'అన్యమాత్మానం' అనుటచేత ఆత్మ నిర్దేశింపబడినది.

1 బృ. 6-4-17 'యస్మిన్ పంచపంచజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః తమేవమన్యమాత్మానంవిద్వాన్ బ్రహ్మామృతోమృతం'

తా॥ ప్రాణ చక్షు శ్రోత్రాన్న మనంబులైదును, వానికి కారణమగు అవ్యాకృతమును, కల్పించిన బ్రహ్మమును నేనే. నాకు మరణములేదు. పూర్వము అజ్ఞానముచేత శరీరుడనేగాని యిప్పుడు కాను. అమృతుడను అని మంత్రద్రష్టపలికెను.

1 ప్రాణాదయో 2 వాక్యశేషాత్ ॥ 12సూ.

తా॥ (1) ఐదుప్రాణములే (2) వాక్యాంతమందున్నవి. కావున పంచజనశబ్దముచేత ఆఐదును చెప్పబడినవి. గాని సాంఖ్యమత 25 తత్త్వములు కావు.

1 బృ. 6-4-18 'ప్రాణస్య ప్రాణముత చక్షుషశ్చక్షురుత శ్రోత్రస్య శ్రోత్రమన్నస్యాన్నం మనసో మనో యే విదుః'

తా॥ ప్రాణమునకు ప్రాణనాదివ్యాపారమును, నేత్రమునకు దర్శనాది సాధనమును, చెవికి శ్రవణసామర్థ్యమును అన్నము భుజించుసామర్థ్యమును, మనస్సునకు మననశక్తిని, ఇచ్చునట్టి ప్రత్యగాత్మను ఎఱిగినవారే బ్రహ్మము నెఱుగుదురు.

జ్యోతిషైకేషామసత్యన్నే ॥ 13సూ.

తా॥ ఏకేషాం=కాణ్వశాఖవారికి అసతి అన్నే=అన్నమునుగూర్చిన పాఠములేనందున జ్యోతిషా='తద్దేవా జ్యోతిషాం జ్యోతిః' యను మంత్రములోని జ్యోతిస్సుచేత పంచసంఖ్యను చెప్పెదరు. మాధ్యందినులకు ఒకమంత్రమునందే పంచసంఖ్యయుండుటచేత జ్యోతిస్సునందపేక్షలేదు. గనుక ప్రధానవిషయమై శ్రుతి ఒకటియును లేదు.

శ్రుతులు పరస్పరభిన్నములుగానుండుటచేత బ్రహ్మము జగత్కారణముకాదని పూర్వపక్షమురాగా-

(4అధి) కారణత్వే న చాకాశాదిషు యథా వ్యపదిష్టో క్తేః ॥ 11సూ.

తా॥ ఆకాశాదిషు=ఆకాశాదులందు క్రమమార్గనిరోధము శ్రుతులయందున్నను కారణత్వే=సృష్టికర్తయందలికారణమునకు విరోధమేదియు న=లేదు. యథావ్యపదిష్టో క్తేః=శ్రుతులయందు బ్రహ్మమునే చెప్పుటవలన విరోధము లేదు.

1 తై-'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' 2 ఛాం-'సదేవ సోమ్యేదమగ్రఆసీత్। ఏకమేవాద్వితీయం। తదైక్షతబహుస్యాం ప్రజాయేయేతి। తత్తేజోఽసృజత' 3 ఐ-ఆత్మావా ఇదమేకఏవాగ్రఆసీ న్నాన్యత్కించ మిషత్సఈక్షత లోకాన్నసృజత' 4 ఛాం-'తరతి శోకమాత్మవిత్' 5 తై-'బ్రహ్మవిదాప్నోతి పరం' 6 శ్వే-'తమేవ విదిత్వాతిమృత్యుమేతి' 7 బృ. 'సఏష ఇహాప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః'

తా॥ (1) జ్ఞానమే అంతములేని బ్రహ్మము జగత్సృష్టికి పూర్వమున్నది. అదియేకాని వేఱులేదు. (2) 184 పుటలో కలదు. (3) అదియేచూచి లోకమును సృజించెను. (4) ఆత్మనెఱిగినవానికి మనస్తాపముండదు. (5-6) ఆత్మను తెలిసినవాడు సంసారమును దాటుచున్నాడు. (7) సర్వశాస్త్రములచేత తెలియులగిన ఈశ్వరుడు కర్మఫలమును కోరిన బ్రహ్మాదిస్తంబపర్యంతము నన్నిటియందు నున్నాడు.

సమాకర్షాత్ ॥ 15సూ.

తా॥ 'అసద్వా ఇదమగ్రఆసీత్' ఇత్యాదులందుగల అసదాదిశబ్దములు బ్రహ్మమునే చెప్పుచున్నవి.

1 తై. 2-8 'తత్సత్యమిత్యాచక్షతే'

తా॥ బ్రహ్మమే చరాచరజగత్తు అయ్యెను.

(5 అధి) జగద్వాచిత్వాత్ ॥ 16సూ.

తా॥ జగత్కారణము జీవుడు కాదు. ప్రాణము కాదు. పరమేశ్వరుడేయని శ్రుతులు చెప్పుచున్నవి.

1 కౌ. 'అథాస్మిన్ ప్రాణఏవైకధా భవతి' 2 'యోవై బాలాకఏతేషాం పురుషాణాం కర్తా యస్యవై తత్కర్మ సవై వేదితవ్యః' 3 బృ-'కతమ ఏకో దేవఇతి ప్రాణఇతి సబ్రహ్మ త్యాదిత్యాచక్షతే'

తా॥ (1) దృష్ట నిద్రించుకాలములో స్వప్నములేనపుడు బ్రహ్మమునందేకీభవించుచున్నాడు. (2) ఓబలాకా పుత్రుడ వగు బ్రాహ్మణుడా సూర్యాదులతోకూడిన జగత్తు ఎవని కార్యమో అట్టిపరమేశ్వరుడే తెలియతగినవాడు. (3) ఒకడ ను దేవుడు ప్రాణమే. అని యాజ్ఞవల్క్యుడు చెప్పెను.

జీవముఖ్యప్రాణలింగాన్నేతిచే త్తద్వ్యాఖ్యాతం ॥ 17.

తా॥ జీవముఖ్యప్రాణలింగాత్-జీవుడు లేక ముఖ్యప్రాణ ము, జగత్కారణము, ఇతిచేత్-అనియందువేని, న-కాదు. తత్-వ్యాఖ్యాతం 1అ. 1పా. 31సూ. క్రింద వ్యాఖ్యానము చేయబడినది.

1 కౌ. 4-20 'సర్వాన్ పాప్మానోపహత్య సర్వేషాం చ భూతానాం శ్రైష్ఠ్యం స్వారాజ్యమాధిపత్యం పర్యేతి య ఏవం వేద'

తా॥ జగత్కర్త బ్రహ్మమని తెలిసినవాడు మఱలజన్మము లేని శ్రేష్ఠమగు ఐశ్వర్యమును, స్వాతంత్ర్యమును పొందును.

అన్యార్థంతు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానాభ్యామపి
చైవమేకే ॥ 18సూ

తా॥ జైమిన్యాచార్యుడు జీవునినే అన్యార్థంతు- బ్రహ్మమని తలచుటవలన జీవుడు ప్రధానమా? లేక బ్రహ్మము ప్రధానమా? యని సంశయమురాగా, ప్రశ్నవ్యాఖ్యానాభ్యాం- ప్రశ్నోత్తరముల చేత నిద్రపోవుపురుషుని మేలుకొల్పువాడు జీవుడు. అతడు ప్రాణాదులకంటె వ్యతిరిక్తుడు. అతనికంటె పరుడు బ్రహ్మము అని చెప్పెను. మఱియు నిట్లె వాజసనేయులును తలచుచున్నారు. జీవుడు జగత్కారణము కాడు.

1 కా. 4-19 'యదా సుప్తస్స్వప్నం న కంచన పశ్యత్యథాస్మిన్ ప్రాణఏవైకధా భవతి' 2 'ఏతస్మాదాత్మనస్సర్వే ప్రాణా యథాయతనం విప్రతిష్ఠంతే ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః' 3 బృ. 'దహరోఽస్మిన్నంతరాకాశః'

తా॥ (1) స్వప్నములేని నిద్రయందు ప్రాణశబ్దముచేత చెప్పబడువాడు బ్రహ్మముతో నేకీభవించుచున్నాడు. (2) ఎల్లఇంద్రియములును ఈయాత్మనుండియే వానివాని గోలకములందు ప్రవేశించుచున్నవి. సూర్యాది దేవతలను అట్లె. (3) జీవుడు హృదయమందుగల చిదాకాశబ్రహ్మమునందు సుషుప్తికాలములో శయనించుచున్నాడు.

(6అధి) వాక్యాన్వయాత్ ॥ 19సూ.

తా॥ బ్రహ్మమునకీవాక్యము సమన్వయమగుటవలనను, పర్యాలోచనవలనను జీవుడు కాడు.

1 బృ. 4-4-5 మైత్రేయీబ్రాహ్మణము- 'నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియో భవతి' యని యుపక్రమిం

చి నవా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవత్యా త్మనస్తు కామాయ సర్వం ప్రియం భవత్యాత్మావా రే ద్రష్ట వ్యశ్శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసితవ్యో మైత్రేయ్యాత్మ నోవా అ రే దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానేనేదం సర్వం విదితం'

తా॥ ఓమైత్రేయీ! భార్యకు భర్త ప్రియుడగుట భార్య యొక్క ప్రయోజనముకొఱకే. ఎల్లకార్యములయొక్క ప్రయోజనముకొఱకు ఎల్లదియును ప్రియముకాదు. తనప్రయో జనముకొఱకే ఎల్లదియును ప్రియమగుచున్నది. ఆత్మ చూడ తగినదియు, వినతగినదియు, చింతింపతగినదియు, ధ్యానింపతగి నదియును, అట్లు చేసినవానికి అత్మదర్శనమగును.

1 ప్రతిజ్ఞాసిద్ధే 2 ర్లింగ 3 మాశ్మరధ్యః ।

తా॥ 'ఆత్మ విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి' ఆత్మ తె లియబడినపుడు అంతయు నాత్మగ తెలియబడును. 'ఇదం సర్వం యదయమాత్మా' ఈవస్తుజాతమంతయు ఆత్మయే యని ప్రతిజ్ఞ కలదు. జీవునకు చూచుట మొదలగునవి కలవ నుచు ఆత్మతో నభేదముగ చెప్పుటయే. 1-2 ప్రతిజ్ఞాసిద్ధికి సా ధనముగా సూచించుచున్నది. 'ఏకవిజ్ఞానేన సర్వం విజ్ఞానం' యను ప్రతిజ్ఞకు భంగముకలుగుననే తాత్పర్యముతో జీవేశ్వ రులకు భేదములేదని 3 ఆశ్మరధ్యాచార్యుడు తలచుచున్నాడు

1 ఉత్క్రమిష్యత 2 ఏవంభావా 3 దిత్యౌడులోమిః ।21

తా॥ పరమాత్మ ప్రసన్నుడగు జీవుడు దేహమునుండి (1) పోవునపుడు (2) పరమాత్మతో నైక్యమగుటవలన అభేదమని (3) ఔడులోమ్యాచార్యుడు తలచుచున్నాడు.

1 ఛాం. 8-12-3 'ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతిరుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే'

తా॥ దేహమునువిడుచు కాలమునందు జీవుడు పరముగు జ్యోతిస్సునుపొంది ఆసద్రూపము చేతనే స్వరూపసిద్ధినిపొందును

1 అవస్థితే రితి 2 కాశకృత్స్నః ॥ 22సూ.

తా॥ (1) పరమాత్ముడే జీవుడుగానున్నందువలన అభేదజ్ఞానము తగునని (2) కాశకృత్స్నాచార్యుడు తలచుచున్నాడు

1 ఛాం. 6-3-2 'అనేనజీవేనాత్మనానుప్రవిశ్య నామరూపేవ్యాకరవాణి' 2 తై. 3-12-7 'సర్వాణి రూపాణి విచింత్య ధీరః నామానికృత్వాభివదన్యదాస్తే' 3 'ఏకమేవాద్వితీయం' 4 ఛాం. 'ఆత్మైవేదం సర్వం' 5 ముం. 'బ్రహ్మైవేదం సర్వం' బృ. 'ఇదం సర్వం యదయమాత్మా' 6 బృ. నాన్యోతోఽస్తి ద్రష్టా' 7 'నాన్యదతోఽస్తి ద్రష్టృ' 8 భ.గీ.7అ. 19శ్లో. 'వాసుదేవస్సర్వమితి' 9 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత' 10 'సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం' 11 బృ. 'అన్యోసావన్యోహమస్మీతి న స వేద యథా పశుః' 12 'మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి' 13 'సవా ఏషమహా నజ ఆత్మాఽజరో అమృతోఽభయో బ్రహ్మ' 14 ముం. 'వేదాంతవిజ్ఞానసునిశ్చితార్థా' 15 ఈ. 'తత్ర కోమోహః కశ్శోక ఏకత్వమనుపశ్యతః' 16 తై. తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్'

తా॥ (1) 2-4-20సూ. క్రింద కలదు. (2) ఈశ్వరుడు తానుసృజించిన జగత్తునందున్నాడు. అట్లు తెలిసినవాడిచటనే ముక్తిని పొందును. (3) బ్రహ్మము ఒకటియే రెండవది లేదు

(4) ఈసర్వమును ఆత్మస్వరూపమే. (5) అంతయును బ్రహ్మమే. (6) అంతర్యామికంటె చూచువాడు వేఱొకడు లేడు. (7) అక్షరముకంటె వేఱొకటి చూచునది లేదు. (8) పరిపక్వమైన జ్ఞాని జగత్తును ప్రత్యగాత్మయగు నేనేయని తెలిసినన్ను పొందుచున్నాడు. (9) ఎల్లశరీరములందుగల జీవులు నేనే. (10) అట్లు తెలిసినవాడు పరబ్రహ్మమును పొందును. (11) తాను వేఱు దేవత వేఱు అని యుపాసనచేయువాడు దేవతలకు పశువగును. (12) బ్రహ్మమును ఏకత్వముగా చూడనివానికి సంసారబంధము తప్పదు. (13) బ్రహ్మమునకు ముసలితనమును, కామాదులును, మరణమును, భయమును లేవు. (14) తా॥ 191 పుటలోను, (15) తా॥ 59 పుటలోనుకలదు (16) తా॥ 2వ శ్రుతివలెనే.

23 ల॥ 28 వరకు సూత్రములు 5వ ప్రి॥ లోనున్నది.

1 వ అధ్యాయము సమాప్తము.

---

16 వ ప్రి॥ 2అ. 1 పాదము.

(1 అధి) స్మృత్యనవకాశదోషప్రసంగ ఇతి చేన్నాన్య
స్మృత్యనవకాశదోషప్రసంగాత్ । 1సూ.

తా। జగత్కారణము ప్రధానమని సాంఖ్యులుచెప్పెడి స్మృత్యనవకాశదోషప్రసంగః= స్మృతికి అవకాశము కలుగచేయని దోషము కలుగును. ఇతిచేత్ =అనియంతువేని న=అది సరికాదు. దానినంగీకరించు నెడల, అన్యస్మృత్యనవకాశదోషప్రసంగాత్ =అన్యమగు అగ్నిహోత్రాదిధర్మములను చెప్పువేదవాక్యప్రమాణముగల మన్వాదిస్మృతులకును, కేవలమో

క్షసాధనములగు కాపిలస్మృతులకును, కేవలబ్రహ్మమునుబోధించు భారతాదిస్మృతులకును, అట్టిదోషములు కలుగును. గనుక సాంఖ్యస్మృతి అంగీకరింపతగదు.

1 శ్వే. 5-2 'ఋషిం ప్రసూతం కపిలం యస్తమగ్రే జ్ఞానైర్బిభర్తి జాయమానంచ పశ్యేత్'

తా॥ సృష్ట్యాదియందు కపిలుడను మహర్షిని పుట్టించి త్రికాలజ్ఞానమునిచ్చిన ఈశ్వరుని చూడవలెను.

• 2 భారతము శాం. 334అ. 27 'యత్తత్సూక్ష్మమవిజ్ఞేయం'
28 శ్లో॥ సహ్యంతరాత్మా భూతానాం క్షేత్రజ్ఞశ్చేతి కథ్యతే।
29 శ్లో॥ తస్మాదవ్యక్తముత్పన్నం త్రిగుణం ద్విజసత్తమ।

తా. ఓనారదా! చేతనమగు బ్రహ్మమును ధ్యానించుచున్నాను. అతడే అంతరాత్ముడు, క్షేత్రజ్ఞుడును. అతనినుండియే సత్త్వరజస్తమోగుణత్రయాత్మక మాయయందు లీనమైయున్న జగత్తు పుట్టినది. [తే।

3 భార. అవ్యక్తం పురుషే బ్రహ్మన్నిష్క్రియే సంప్రలీయ
తా॥ నిర్గుణబ్రహ్మమునందు ఆమాయలీనమగుచున్నది.

4 విష్ణుపు. 'అతశ్చ సంక్షేపమిమం శృణుధ్వం నారాయణస్సర్వమిదం పురాణః స సర్గకాలే చ కరోతి సర్గం సంహారకాలే చ తదత్తి భూయః'

తా॥ అంతర్యామియగు నారాయణుడే జగత్సృష్టి స్థితిలయములు చేయుచున్నాడు.

5 భ.గీ. 7అ. 6 'అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా।                [శ్రీకృష్ణుడు చెప్పెను.

తా॥ ఈజగదుత్పత్తిలయములకు కారణుడను నేనేయని

6 మనుస్మృతి. 12అ. 91 'సర్వభూతేషు చాత్మానం సర్వ భూతాని చాత్మని। సంపశ్యన్నాత్మనా జీవో స్వారాజ్యమధి గచ్ఛతి ॥'

తా॥ సర్వభూతములును సూక్ష్మరూపముతో పరమాత్మ యందును, పరమాత్మ సర్వభూతములయందును ఉండినట్లు తెలిసి బ్రహ్మార్పణముగా కర్మములు చేయువాడు ముక్తిని పొందును. 1 ఇతరేషాం 2 చానుపలబ్ధేః । 2సూ.

తా॥ (1) సాంఖ్యస్మృతియందలి మహత్తత్త్వము అహంకారము, పంచతన్మాత్రములు ను వేదమునందుగాని, లోకము నందుగాని (2) కనిపింపవు.

(2అధి) 1 ఏతేన 2 యోగః 3 ప్రత్యుక్తః॥ 3సూ.

తా॥ (1) సాంఖ్యస్మృతియును, (2) యోగస్మృతియును (3) నిరాకరింపబడినది. 1 సాంఖ్యులును, యోగులును, ద్వైతులును ఆత్మను చూచువారు కారు.

1 తై. బ్రా. 3-12-9 'నావేదవిన్మనుతే తం బృహంతం'

తా॥ వేదము నెఱుగనివాడు పరమేశ్వరుని తెలియజాలడు

(3 అధి) నవిలక్షణత్వాదస్య తథా త్వంచ శబ్దాత్ ॥4.

తా॥ బ్రహ్మమే ప్రకృతియనియు, జగత్కారణమనియు చెప్పుట న=యుక్తము కాదు. అస్య=ఈజగత్తు విలక్షణత్వాత్=ప్రకృతి (బ్రహ్మము) కంటె వ్యతిరిక్తమగుటవలన బ్రహ్మము అచేతనుడైనా కావలయును. లేక జగత్తు బ్రహ్మము నుండి పుట్టనిదియైనను కావలయును. తథాత్వం=ప్రకృతివిలక్షణత్వము శబ్దాత్=శబ్దము (శృతి) వలననే నిరసింపబడుచున్నది.

1 త్తై. 2-6 'విజ్ఞానంచావిజ్ఞానంచ'

తా॥ జగత్తు అచేతనముగనుక చేతనమగు బ్రహ్మముకం టె వ్యతిరిక్తమని పూర్వపక్షము.

అభిమానివ్యపదేశస్తు విశేషానుగతిభ్యాం ॥ 5సూ.

తా॥ అభిమానవ్యపదేశః= మృత్తు మొదలగువానికి అభిమానదేవతలున్నందున తు=చేతనత్వము కలదనిచెప్పతగదు విశేషానుగతిభ్యాం=విశేషములవలనను, అనుసరించుటవలనను అవి చేతనములనతగవు. [ఘ్మానాః'

1 కా. 2-7 'ఏతాహవై దేవతా అహం శ్రేయసే వివద

తా॥ ఇంద్రియాధిష్ఠాన దేవతలు తమతమ శ్రేష్ఠత్వముకొఱకు జగడమాడిరి గనుక బ్రహ్మముపాదాన కారణము కాదనియు పూర్వపక్షము.

1 దృశ్యతే 2 తు ॥ 6సూ.

తా॥ 4-5 సూ. లోని పూర్వపక్షము సరికాదు. చేతనులైన ప్రసిద్ధపురుషులందు విలక్షణములైన గోళ్లును, కేశములును, అచేతనములైన గోమయరాశియందు చేతనములైన వృశ్చికాదులును పుట్టుట. (1) కనిపించుటవలన బ్రహ్మము నుండి విలక్షణజగత్తు పుట్టకూడదను నియమము లేదు.

1 క. 1-2-9 'నైషా తర్కేణ మతిరాపనేయా ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ'

తా॥ ఆగమములచేత తెలియతగిన జ్ఞానము తనబుద్ధిచేత నూహింపశక్యముకాదు.

2 భ.గీ. 2అ. 25 'అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే' తా॥ 259 పుటలో కలదు.

అసదితిచేన్న ప్రతిషేధమాత్రత్వాత్ । 7సూ

తా॥ ఈజగత్తు సృష్టికిపూర్వము అసదితిచేత్-అసత్తుయని యందువేని న-కాదు. ప్రతిషేధమాత్రత్వాత్-ఈలేదనుట కేవలనిషేధమాత్రముగుటవలన నుత్పత్తికి పూర్వముగల సత్త్వమును బాధింపచాలదు. కారణరూపముచేత సత్తేగాని అసత్తుకాదు.

1 బృ. 4-4-6 'సర్వం తం పరాదాద్యోఽన్యత్రాత్మన స్సర్వం వేద'

తా॥ బ్రాహ్మణాదిజాతులన్నియు బ్రహ్మమే. సర్వమును బ్రహ్మముగ౦టె వేఱని తెలిసికొనినవాడు శ్రేయోమార్గము నుండి తొలగును.

అపీతౌ తద్వత్ప్రసంగాదసమఞ్జసం ॥ 8సూ.

తా॥ అపీతౌ-ప్రళయమునందు తద్వత్ప్రసంగాత్-జగద్ధర్మములైన అపరిశుద్ధము, స్థూలము మొదలగునవి బ్రహ్మమునకు ఉండవలెను గనుక బ్రహ్మము జగత్కారణము కాదని పూర్వపక్షము.

1 నతు 2 దృష్టాంతభావాత్ ॥ 9సూ.

తా॥ (1) పై పూర్వపక్షము సరికాదు. (2) దానిని ఖండించునట్టి దృష్టాంతములనేకములుండుటవలన కారణమును కార్యమెప్పుడును దూషింపనేరదు. ఘటాదులు లయకాలమునందు మృత్తుయగునట్లే, జగత్తులయకాలమునందు బ్రహ్మముతోనేకీభవించును. కార్యములన్నియు లయకాలమందు తమ కార్యధర్మముతో కారణముననుసరించునని ఉదాహరణమొకటియును లేదు. కార్యకారణములకు భేదములేదు.

1 బృ. 4 4-6 'ఇదం సర్వం యదయమాత్మా' 2 ఛా. 'ఆత్మైవేదం సర్వం' 3 ఛాం. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' 4 ముం. 'బ్రహ్మైవేదమమృతం పురస్తాత్' 4 తా॥ 60 పుటలో కలదు. 1-2-3 జగత్త్రయము ఆత్మరూపముగ తెలిసికొనినవాడు జీవన్ముక్తుడు. జ్ఞానముచేత అజ్ఞానము నశించును.

స్వపక్షదోషాచ్చ ॥ 10సూ.

తా॥ విలక్షణమైన జగత్తునకు బ్రహ్మము ఉపాదానకారణముకాదని సాంఖ్యులుచెప్పినట్లే వారిపక్షమందును శబ్దాదులులేని ప్రధానమువలన శబ్దాదులతోకూడిన జగత్తు పుట్టినట్లు చెప్పుటవలన దోషముకలదు.

తర్కాప్రతిష్ఠానాదప్యన్యథానుమేయమితిచే
దేవమప్యవిమోక్షప్రసంగః ॥ 11సూ.

తా॥ తర్కాప్రతిష్ఠానాత్-తర్కములు స్థిరముకానివియు వేదసహాయములేనివియు నగుటవలన తర్కబలముచేత పూర్వపక్షముచేయరాదు. అన్యథానుమేయః ఇతిచేత్-మఱియొకవిధముగా దోషముకలుగకుండునట్లుగాను, ఖండింపవీలులేనట్లుగాను ఊహింపవలయునందువేని ఏవమపి-అట్లయినను, అవిమోక్షప్రసంగః-ముగింపుకలుగనేరని ప్రశంసము కలుగును. గనుక ఆగమముచేతను, దానిననుసరించిన తర్కముచేతను బ్రహ్మమే జగత్కారణమును, ప్రకృతియును అని సిద్ధాంతము.

(4 అధి) ఏతేన శిష్టాపరిగ్రహాపి వ్యాఖ్యాతాః ॥ 12

తా॥ ఏతేన = 3 వ అధికరణమునందలి నిరూపణచేతనే శిష్టాపరిగ్రహాః=శిష్టులైన మనువు, వ్యాసులు మొదలగువా

రిచేత బ్రాత్తుగనంగీకరింపబడని పరమాణు మొదలగు బౌద్ధ మతవాదములుసైతము వ్యాఖ్యాతాః= వేదాంతసిద్ధాంతమున కు భంగమును కలిగింపనేరవు.

(5 అధి) భోక్త్రాపత్తేరవిభాగశ్చేత్స్యాల్లోకవత్ । 13

తా॥ జగత్తు బ్రహ్మముకంటె వేఱనియందు వేని అట్లుకన బడినను బాధకములేదు. భోక్త్రాపత్తేః అవిభాగః= చేతనుడగు శరీరుడే భోక్త. అచేతనములైన శబ్దాదివిషయములే భోగ్యములు. వీనిలో ఒకదానిభావమును మఱియొకటిపొందునేని యీవిభాగమునకు అభావముకలుగును. అన్నియును పరము కారణమైన బ్రహ్మముకంటె వేఱుకావుగనుక విభాగమునకు అభావములేదు. భోక్తృభోగ్యవిభాగమునకు అభావమువలన బ్రహ్మము కారణమనతగదు. ఇతిచేత్ -అనియందు వేని స్యాల్లోకవత్ -లోకమునందిట్లుకనబడుటవలన నీవిభాగము అద్వైతమందు యుక్తమే. బుద్బుదతరంగాదులు సముద్రముకంటె వేఱుకానట్లే ఇచటనున్న 'తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్' యను శ్రుతి భోక్తృభోగ్యములు బ్రహ్మముకంటె వేఱుకావని చెప్పుచున్నది

(6 అధి) 1 తదనన్యత్వ 2 మారంభణశబ్దాదిభ్యః 14

తా॥ కార్యమైన జగత్తు కారణమైన బ్రహ్మముకంటె భేదముగలదికాదు. (2) ఆరంభణశబ్దములవలన నభేదమే. 'ఏక విజ్ఞానేన సర్వవిజ్ఞానం'

1 ఛాం. 'యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం' 2 ఛాం. 'ఐతదాత్మ్యమిదం సర్వం।

తత్సత్యం స ఆత్మా। తత్త్వమసి॥'                [కలము.

తా॥ (1) తా 67 పుటలోను, (2) తా॥ 209 పుటలోను

1 భావే 2 చోపలబ్ధేః॥ 15సూ.

తా॥ (1) కారణమున్నప్పుడే (2) కార్యముకనబడును. మృత్తులేని ఘటములేదు. తంతువులులేని వస్త్రములేదు. గనుక కార్యకారణములకు భేదములేదు.

1 సత్వాచ్చా 2 పరస్య॥ 16సూ.

తా॥ ఈజగత్తు (2) సృష్టికిపూర్వము బ్రహ్మరూపమని 'సదేవ సోమ్యేదమగ్రఆసీత్' 'ఆత్మావా ఇదమేకఏవాగ్ర ఆసీత్త' ను శ్రుతులు చెప్పుటవలన జగత్తు బ్రహ్మముకంటె వేఱుకాదు.

1 అసద్వ్యపదేశా 2 న్నేతి 3 చే 4 న్న 5 ధర్మాం
తరేణ 6 వాక్యశేషాత్॥ 17సూ.

తా॥ (1) జగత్తు సృష్టికిపూర్వము అసత్తుఅని చెప్పిన 'అసద్వా ఇదమగ్రఆసీత్త' ను శ్రుతివలన (2-3) సత్పదార్థము కాదంటివేని (4) అట్లనరాదు. (5) స్పష్టమైన నామరూపము లకంటె స్పష్టముకాని నామరూపమనునది వేఱొకధర్మమగు టవలన సత్తునే అసత్తుఅని చెప్పబడినది (6) 'అసదేవేదమగ్రఆసీత్' అని చెప్పి తరువాత 'తత్సదాసీత్' సత్తుఅని చెప్పబడినది. 'తదాత్మానగ్గం స్వయమకురుత' యను శ్రుతిలో బ్రహ్మము తానే ప్రపంచరూపమైనట్లు చెప్పబడినది. గనుక అసత్తనునది కేవలశూన్యముకాదు.

1 యుక్తేః 2 శబ్దాంతరాచ్చ। 18సూ.

తా॥ యుక్తివలనను (2) శబ్దమువలనను జగత్తు సృష్టికి

పూర్వము సత్తే. బ్రహ్మముతో భేదములేనిదియే. యుక్తి అనగా క్షీరమువలన దధిపుట్టునుగాని ఘటము పుట్టదు. మృత్తువలన ఘటమేగాని దధిపుట్టదు. శబ్దమువలననగా అసత్తును చెప్పు శబ్దముకంటె సత్తును చెప్పునది శబ్దాంతరము. 'సదేవసోమ్యేదమగ్రఆసీత్' యను శ్రుతిలో సచ్ఛబ్దార్థమగు బ్రహ్మముతో కారణసంబంధము చెప్పబడినది.

పటవచ్చ ॥ 19సూ.

తా॥ పటము ముడవబడినపుడును, చాపబడినపుడును పటమే. ముడవబడినపుడు పొడవు, వెడల్పులు తెలియవు. అట్లె జగత్తు సృష్టికిపూర్వము బీజరూపముగా బ్రహ్మమునందణగియున్నది. సృష్టికాలమున విస్తరింపబడినది.

యథా చ ప్రాణాదిః ॥ 20సూ.

తా॥ ప్రాణాపానాది వాయువులు ప్రాణముకంటె భేదము గలవికావు. అవి ప్రాణాయామము చేయునపుడు ఇంద్రియనిరోధమును, చేయనపుడు ఇంద్రియవ్యాపారమును కలిగించును. కార్యభేదముచేత వేఱొకవస్తువు కానేరదు. అట్లె జగద్బ్రహ్మములకును భేదములేదు.

1 ఛాం. 6-1-2 'యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతం'

తా॥ ఎవనిని తెలియుటవలన వినబడనిది వినబడినదియు, తర్కింపబడనిది తర్కింపబడినదియు, తెలియబడనిది తెలియబడినదియు, నగునో అట్టిఆత్మను తెలిసికొంటివాయని శ్వేతకేతువును తండ్రియడిగెను.

(7 అధి) 1 ఇతరవ్యపదేశాద్ధితా 2 కరణాది
దోషప్రసక్తిః ॥ 21 సూ.

తా॥ (1) జీవుడే జగత్కారణమను నెడల (2) తనకుహితమైన కార్యములు చేసికొనలేని దోషము కలుగునని పూర్వపక్షము. 1 అధికంతు 2 భేదనిర్దేశాత్ ॥ 22 సూ.

తా॥ (2) జీవేశ్వరులకు శ్రుతులందు భేదముచెప్పుటవలన జీవునికంటె (1) అధికుడగు బ్రహ్మమునందు హితాహిత కార్యము లేవియులేవు. గనుక పైపూర్వపక్షము సరికాదు.

1 బృ. 4-4-5 'ఆత్మావాఽరే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః' తా॥ 60 పుటలో కలదు.

1 అశ్మాదివచ్చ 2 తదను 3 పపత్తిః ॥ 23 సూ.

తా॥ (1) రాళ్ళలో వజ్రవైడూర్యాదిమణులకును, సూర్యకాంతాదులకును, పాషాణాదులకును హెచ్చుతగ్గు ఖరీదులును, బీజములకు బహువిధములైన పత్ర, ఫల, పుష్ప, రస గంధాది భేదములును ఉన్నట్లె జీవునకున, బ్రహ్మమునకున భేదముకలుగును. కాని ఆకారణమువలన (2) జగత్తునకు బ్రహ్మము కారణముకాదని యనతగదు.

24-25-26-27 సూత్రములు 5 వ ప్రకర. లో నున్నవి.

1 ఆత్మని 2 చైవం 3 విచిత్రాశ్చ హి ॥ 28 సూ.

తా॥ స్వప్నమునందు వాస్తవముగలేని బండ్లు మార్గములు రథములు మొదలగునవి ఆత్మవలన పుట్టుచున్నవి. (3) దేవాదులందును మాయావిమొదలగువారియందును చిత్రమగు సృష్టులు చూడబడుచున్నవి. (2) అట్లె (1) బ్రహ్మమునందును సృష్టియగును.

1 బృ. 6-3-10 'నతత్రి రథా నరథ యోగా నపంథానో భవంత్యథ రథాన్ రథ యోగాస్ పథస్సృజతే'

స్వపక్షదోషాచ్చ ॥ 29సూ,

తా॥ జగత్కారణము ప్రిధానమనియు, అణువనియు చెప్పిన మతములందును ఈదోషములు కలవు.

30-31 సూ. లు 5వ ప్రికరణములో నున్నవి.

11 అధి) 1 న 2 ప్రియోజనవత్వాత్ ॥ 32సూ.

తా॥ (2) ఏకోరికయునులేని పరబ్రిహ్మము (1) జగత్కర్తకాడని పూర్వపక్షము.

1 బృ. 4-4-5 'నవా అరే సర్వస్య కామాయ సర్వం పిరియం భవతి। ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి'

తా॥ 16 ప్రి॥ 1-4-19సూ॥ క్రింద కలదు.

1 లోకవత్తు 2 లీలాకైవల్యం ॥ 33సూ.

తా॥ సిద్ధాంతము (1) లోకమునందు రాజులు మొదలగువారు ఫలాపేక్షలేక (2) కేవలలీలారూపమగు క్రీడలు సలుపునట్లే బ్రిహ్మము లీలారూపమగు సృష్టిని చేయును.

12 అధి) 1 వైషమ్యనైర్ఘృణ్యే 2 న 3 సాపేక్ష

త్వా 4 త్తథాహి 5 దర్శయతి ॥ 34సూ.

తా॥ (1) బ్రిహ్మమునకు వైషమ్యమును, దయాశూన్యత్వమును, రాగాదిదోషములును లేవు. (3) సృజింపబడుచున్న ప్రాణులయొక్క ధర్మాధర్మముల నెడి కర్మములే కారణమై హెచ్చుతగ్గుస్థితులు కలుగుచున్నవి. (4-5) అట్లే శ్రుతులు చెప్పుచున్నవి.

1 కా. 3-8 'ఏష హ్యేవ సాధుకర్మ కారయతి। తం య మేభ్యో లోకేభ్య ఉన్నినీషతే। ఏషఉ ఏవాసాధుకర్మ కార యతి తం యమధో నినీషతే'

తా॥ పుణ్యలోకములను పొందింపతలచినపుడు సత్కర్మ ములను, నరకములను పొందింపతలచినపుడు దుష్కర్మములను చేయించుచున్నాడు. [పాపః పాపేన'

2 బృ. 5-2-13 'పుణ్యోవై పుణ్యేన కర్మణా భవతి।

తా॥ పుణ్యకర్మముచేత పుణ్యాత్ముడును, పాపకర్మముచేత పాపాత్ముడు నగును. [స్తథైవ భజామ్యహం'

3 భ.గీ. 4అ. 12 'యే యథా మాం ప్రపద్యంతే తాం

తా॥ నన్ను ఏకోరికతో నెట్లు సేవించునో అట్లె నేను అనుగ్రహించెదను

1 న 2 కర్మా 3 విభాగా 4 దితిచే 5 న్నా
6 నాదిత్వాత్ ॥ 35సూ.

తా॥ సృష్టికిపూర్వము (3) విభాగములేనందున (2)ధర్మా ధర్మలక్షణమగు విషమకర్మ (1) సంభవింపదు. (4) అని యందువేని (6) సంసారమనాదియగుటవలన (5)అట్లనరాదు

1 ఉపపద్యతే చా 2 ప్యుప 2 లభ్యతే చ ॥ 36సూ.

తా॥ (1) సంసారమనాదియనుట యుక్తమే. (2) అపి- మఱియును (3) అనాదిత్వమును శ్రుతి స్మృతులు చెప్పుచు న్నవి. శ్రుతులు:—

1 'అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకర వాణి' తా। 78 పుటలో కలదు.

2 ఋ. సం. 10 190 'సూర్యాచంద్రమసౌ ధాతాయథా
పూర్వమకల్పయత్'                    [జగత్తును సృజించెను.
తా॥ బ్రహ్మము పూర్వకల్పమువలెనే సూర్యచంద్రాది
3 భ.గీ. 15అ. 3 'నరూపమస్యేహ తథోపలభ్యతే నాం
తోనచాదిర్నచ సంప్రతిష్ఠా'
తా॥ ఈసంసారవృక్షముయొక్క ఆకారముగాని, ఆది మ
ధ్యాంతములుగాని ఎవనికిని తెలియబడవు.

37సూ. 5 వ ప్రకరణములో నున్నది.

2 వ అ. 1 పాదము సమాప్తము.

---

16 ప్ర॥ 2అ. 2వ పాదము.

(1 అధి) 1 రచనానుపపత్తేశ్చ 2 నా 3 నుమానం ॥ 1

తా॥ జగత్సృష్టికర్త ప్రధానముకాదనుటకు (2-3) అను
మానములేదు. అది అచేతనము.

ప్రవృత్తేశ్చ ॥ 2సూ.

తా॥ అచేతనములైన రథాదికార్యములు చేతనులగువారి
యధీనములోనున్నవి. ప్రధానముయొక్క ప్రవృత్తియును, చే
తనునియొక్క ప్రేరణములేనిదే జరుగనేరదు. చైతన్యముయొ
క్క ప్రవృత్తి దేహమున్నప్పుడేగాని లేనపుడులేదు.

1 పయోంబువ 2 చ్చే 3 త్తత్రాపి ॥ 3సూ.

తా॥ (1-2) దూడవృద్ధికొఱకు క్షీరములును, లోకోప
కారముకొఱకు నీళ్లును, స్వభావముచేత ప్రవహించునట్లే పు
రుషుని భోగమోక్షములకొఱకు ప్రధానము ప్రవర్తింపగల

దందు వేని (3) క్షీరజలములందును చేతనాధిష్ఠితములైనవాని యందే ప్రవృత్తియగుచున్నది.

1 బృ. 5-7-4 'యోఽప్సుతిష్ఠన్ యోఽపోంతరో యమయతి' [చున్నాడు.

తా॥ ఆత్ముడు ఉదకములందున్నవాడై ప్రవర్తింపచేయు

1 వ్యతిరేకా నవస్థితే 2 శ్చా 3 నపేక్షత్వాత్ ॥4సూ.

తా॥ (1) ప్రధానమునకు సత్త్వరజస్తమోగుణములకంటె వేఱుగా ప్రవర్తకముగాని నివర్తకముగాని లేదు. పురుషుడు ఉదాసీనుడగుటవలన ప్రవర్తక నివర్తకములు లేవు. (3) మఱియొకయపేక్షగలదికాదు. ఈశ్వరుడు ప్రధానముకంటె విలక్షణమగు సర్వజ్ఞత్వాది ధర్మములు గలవాడు.

అవ॥ గడ్డి పాలరూపమును పొందునట్లు ప్రధానము జగద్రూపపరిణామము కావచ్చునని పూర్వపక్షమురాగా—

1 అన్యత్రాభావాచ్చ 2 న 3 తృణాదివత్ ॥ 5సూ.

తా॥ (2-3) తృణాదులకు స్వాభావికమైన పరిణామము లేదు. (1) ధేనువు అనుభవించినపుడే తృణాదికము క్షీరమగును. గాని యెద్దు అనుభవించినపుడు అట్లుకాదు. గనుక తృణాదులకువలె ప్రధానమునకు పరిణామము యుక్తముకాదు.

1 అభ్యుపగమేఽప్య 2 ర్థాభావాత్ ॥ 6సూ.

తా॥ మఱియు (1) ప్రధానమునకు ప్రవృత్తి ఉన్నదని చెప్పినను దోషమే. (2) ప్రయోజనములేదు. ప్రధానమునకు ప్రవృత్తి స్వభావమైనను మఱియొకదానియపేక్ష లేనపుడు భోగమోక్షములుకలుగునని చేసినప్రతిజ్ఞ కుహాని యేకలుగును.

1 పురుషాశ్మన 2 దితిచే 3 త్తథాపి ॥ 7సూ.

తా॥ (1) చూచుటకుశక్తికలిగి నడుచుటకు శక్తిలేనికుంటివాడు, చూచుటకు శక్తిలేకున్నను నడుచుటకు శక్తిగలగ్రుడ్డివాని నధిష్ఠించిపోవునట్లు పురుషుడు ప్రధానమును ప్రవర్తింపచేయువచ్చునని మఱల పూర్వపక్షముచేయగా (3) అట్లయినను దోషమే. నిర్గుణుడు నిష్క్రియుడు నగు పురుషునకు ప్రవర్తనవ్యాపారమే లేనందున అతడు ప్రధానము నెట్లుప్రవర్తింపచేయగలడు?

అంగిత్వానుపపత్తేశ్చ ॥ 8సూ.

తా॥ సత్త్వరజస్తమోగుణములు అన్యోన్యము వానిగుణభావమును విడిచి స్వరూపమాత్రావస్థయే ప్రధానమనబడును. ఆయవస్థయందు ఆగుణములకు స్వరూపనాశముకలుగుటవలన పరస్పరము (1) అంగాంగిభావములేనందున ప్రధానమునకు ప్రవృత్తియుక్తముకాదు.

1 అన్యథానుమితౌ చ 2 జ్ఞశక్తివియోగాత్ ॥ 9సూ.

తా॥ (1) వేఱొకలాగున అనుమానించినను (2) ప్రధానమునకు చైతన్యశక్తిలేనందువలన సృష్ట్యాదులయందు సమర్థతలేక దోషము పోనేరదు.

1 విప్రతిషేధా 2 చ్చాసమంజసం ॥ 10సూ.

తా॥ (1) సాంఖ్యమతమందు ఇంద్రియములసంఖ్య 7అనియు, 11 అనియు, సూక్ష్మభూతములసృష్టి మహత్తత్త్వమువలన ననియు, లేదా అహంకారమువలన ననియు, పరస్పరవిరోధములుగానుండుటవలన (2) సాంఖ్యమతము సరిగాలేదు.

11 సూ. మొదలు 45 (ఈపాదసమాప్తి) వరకును, తర్క, బౌద్ధ, జైన భాగవతుల పాంచరాత్రాగమాది మతముల ఖండనము-

మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమండలాభ్యాం ॥ 11 సూ.

తా॥ పరమాణువులవలన ద్వ్యణుకమును, దానివలన త్ర్యణుకమును పుట్టునట్లు బ్రహ్మమువలన జగత్తు పుట్టవచ్చును. ఇంటికప్పునందుగల రంధ్రములనుండి సూర్యకాంతిలో కనుపించు నలుసు త్ర్యణుకము. దానిలో ⅙ ఆఱవభాగము పరమాణువు. రెండుపరమాణువులు ద్వ్యణుకము. వైశేషిక సాంఖ్యమతములు సరియైనవి కావు.

(3 అధి) 1 ఉభయథాపి 2 న 3 కర్మా 4 త
5 స్తదభావః ॥ 12సూ.

తా॥ (1) పరమాణువులందు మొదటికర్మమునకు నిమిత్తమున్నను లేకున్నను (3) అణువులందు సంయోగనిమిత్తకర్మము (2) సంభవింపదు. (4) అందుచేత (5) సంయోగమువలన సృష్టి సంభవింపదు.

1సమవాయాభ్యుపగమాచ్చ 2సామ్యాద 3నవస్థితేః॥ 13సూ.

తా॥ మఱియు (1) ద్వ్యణుకమునకు అణువు కారణమనుటకు సంభవములేదు. (2-3) అనవస్థయు కలుగును. రెండు అణువులవలన ద్వ్యణుకము పుట్టదు.

1 నిత్యమేవచ భావాత్ ॥ 14సూ.

తా॥ (1) ప్రవృత్తి నిత్యమయితే ప్రళయములేదు. నివృత్తినిత్యమయితే సృష్టిలేదు. రెండును చెప్పనెడల పరస్పరవిరోధము కలుగును.

1 రూపాదిమత్త్వాచ్చ 2 విపర్యయో 3 దర్శనాత్ ॥15.

తా॥ (1) రూపాదులుకల పరమాణువులకు (2) నశింపు గల స్థూలము అనిత్యము కలుగుటవలన నిరాశ్రయమేయగును. (3) అట్లే లోకమునందు చూడబడుచున్నది.

1 ఉభయథాచ 2 దోషాత్ । 16సూ.

తా॥ (1) పరమాణువులకు హెచ్చుతగ్గుగుణములలోనేదియున్నను (2) దోషమే.

అపరిగ్రహాచ్చాత్యంతమనపేక్షా ॥ 17సూ.

తా॥ ప్రధాన సత్కార్యవాదములు కొంతవఱకైనను కొందఱిచేత నంగీకరింపబడినది. కాని అణువాదము అపరిగ్రహాత్ =ఏయంశమందును అంగీకరింపబడనందున అత్యంతం, అనపేక్షా=ఎప్పుడును అపేక్షింపతగదు.

(4 అధి) 1 సముదాయ 2 ఉభయహేతుకేఽపి

3 తదప్రాప్తిః । 18సూ.

తా॥ జగత్కారణము పరమాణువులని అర్ధనాస్తికులైన వైశేషికులును, స్కంధములని సర్వనాస్తికులైన బౌద్ధులును చెప్పుదురు. (1-2) తార్కిక, బౌద్ధమతములు రెండింటికిని జగత్కారణము (3) ప్రాప్తింపదు.

1 ఇతరేతరప్రత్యయత్వా 2 దితిచే 3 న్నోత్పత్తి

4 మాత్రనిమిత్తత్వాత్ । 19సూ.

తా॥ అవిద్యాదులే కారణము (2) అని యందువేని (3) కాదు. (4) అవిద్యాదులు పరస్పరము ఉత్పత్తికే నిమిత్తములగుటవలన చేతనసహాయములేనిదే సంఘాతము సిద్ధింపదు.

1 ఉత్తరోత్పాదేచ 2 పూర్వనిరోధాత్ ॥ 20 సూ.

తా॥ బౌద్ధసిద్ధాంతమునందు (1) కార్యముపుట్టగానే (2) కారణమునకు నాశముచెప్పుటవలన కార్యము పుట్టనేరదు.

1 అసతి 2 ప్రతిజ్ఞోపరోధో 3 యౌగపద్య
4 మన్యథా ॥ 21 సూ.

తా॥ (1) కారణములేనిదే కార్యముపుట్టు నెడల (2) రూపాదివిజ్ఞానమగు నాలుగువిధముల సంస్కారమనెడి నీప్రతిజ్ఞకు భంగముకలుగును. కారణములేనిదే కార్యముపుట్టు నందు వేని అన్నియు నన్నిచోట్ల పుట్టవచ్చును. (4) లేదా కార్యమునకు కారణమంగీకరించి పూర్వక్షణము ఉత్తరక్షణము పుట్టు వఱకు నుండునను నెడల (3) దానివలన కార్యకారణములకు ఒకకాలమందునికి యగును. ఆదియందును, అంతమందును పుట్టిన పదార్థములన్నియు క్షణకాలముండునని చేసిన నీప్రతిజ్ఞకు భంగముకలుగును.

1 ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధాప్రాప్తి
2 రవిచ్ఛేదాత్ ॥ 22 సూ.

తా॥ (1) పదార్థములకు బుద్ధిపూర్వక నాశమనెడి ప్రతిసంఖ్యానిరోధమున్ను, తనంతటనేకలుగు నాశమనెడి అప్రతిసంఖ్యానిరోధమున్ను అను నీరెండింటికి సంభవములేదు. (2) వస్తువులకును, సంతానమునకును విచ్ఛేదము ఎడతెఱపిలేక పోవుటవలన సంభవింపదు.

1 ఉభయథా చ 2 దోషాత్ ॥ 23 సూ.

తా॥ నిర్హేతుకముగా నశించునని చెప్పిన మొదటివికల్పమునకు హానియు, రెండవవికల్పమునందు మార్గోపదేశమున

కు ఆనర్థక్యమును కలుగును. (2) పైదోషముచేత బౌద్ధమత
ము సరికాదు. 1 ఆకాశేచావిశేషాత్ ॥ 24సూ.

తా॥ ప్రతిసంఖ్యాఽప్రతిస ఖ్యావినాశములు రెండును.
ఆకాశము, నిరుపాఖ్యము (శూన్యము) అని బౌద్ధులకభిమత
ము. (1) ఆకాశమునందును తక్కిన రెండింటివలెనేగాని విశే
షమేదియునులేదు. శ్రుతులు ఆకాశమునకు పుట్టుకను చూపు
చున్నవి. 1 అనుస్మృతేశ్చ ॥ 25సూ.

తా॥ బౌద్ధులు ప్రపంచమువలె ఆత్మకును క్షణికత్వము చె
ప్పవలెను. కాని ఆత్మకు క్షణికత్వము సంభవింపదు. (1)అను
భవమునను సరించి పుట్టుచున్నస్మరణమే అనుస్మృతి. ఒకరియ
నుభవము మరియొకనికిరాదు. అందువలన ఆత్మతో ఏకకర్తృ
కమైనదియగుచు ఉభయాశ్రయమగు ఆత్మకు స్థిరత్వముకల
దు. గనుక క్షణికసిద్ధాంతము సరికాదు.

1 నా 2 సతోఽ 3 దృష్టత్వాత్ ॥ 26సూ.

తా॥ (1-2) అభావమువలన భావము పుట్టదు. పుట్టునేని
కారణమును గ్రహించుట నిరర్థకమగును. అభావమునకు కా
రణమున్నప్పుడు చెవలపిల్లికి కొమ్ములుపుట్టవలెను. (3) అట్లు
కనిపింపనందున అభావమునకు కారణత్వము లేదు.

1 ఉదాసీనానా 2 మపి 3 చైవం 4 సిద్ధిః ॥ 27సూ.

తా॥ (2 3) అభావమువలన పదార్థములుపుట్టునేని (1-2)
కార్యముకోరినప్రకారము ప్రయత్నములేనిదే కావలెను. గ
నుక అభావమువలన భావముపుట్టుననుట భ్రాంతియే.

అవ॥ సౌత్రాంతిక, వైభాషిక మతములు ఖండింపబడిన
వి. యోగాచారమతమును ఖండించుచున్నాడు.

(5 అధి) 1 నా 2 భావ 3 ఉపలబ్ధేః ॥ 28సూ.

తా॥ (2) బాహ్యపదార్థములు లేవని (1) నిశ్చయింపశక్యముకాదు. (3) జ్ఞానముకంటె భిన్నమగుటవలనను, ఎల్లజ్ఞానములందును ఘటము, పటము, స్తంభము మొదలగు బాహ్యపదార్థములుప్రత్యక్షముగానున్నందువలనను అభావమనరాదు.

1 వైధర్మ్యా చ్చ 2 న 3 స్వప్నాదివత్ ॥ 29సూ.

తా॥ (3-2) జాగ్రద్వస్తువులు స్వప్నవస్తువులవలె కావు (1) విరుద్ధధర్మములు కలవి. స్వప్నవస్తువులు జాగ్రితలోకనుపింపవు. జాగ్రిద్వస్తువులు స్వప్నవస్తువులవలె మిథ్యకావు.

1 న 2 భావో౽ 3 నుపలబ్ధేః ॥ 30సూ.

తా॥ పదార్థసాక్షాత్కారములేకున్నను వాసనావైచిత్ర్యమువలన జ్ఞానవైచిత్ర్యము కలుగునందువేని (3) నీపక్షమునందు బాహ్యపదార్థములకు సాక్షాత్కారములేనందున (2) వాసనలకుత్పత్తిగాని సత్తగాని (1) యుక్తముకాదు.

క్షణికత్వాచ్చ ॥ 31సూ.

తా॥ ఆలయవిజ్ఞానము క్షణికమగుటచేత అస్థిరమైనది. గనుక వాసనలకాశ్రియముకానేరదు. ఇట్లు బాహ్యార్థవాద, విజ్ఞానవాదములు రెండును నిరాకరింపబడినవి.

సర్వథానుపపత్తేశ్చ ॥ 32సూ,

తా॥ బౌద్ధమతము ఇసుకనూతివలె శిథిలమగుచున్నది. గాని ఉపపత్తిలేదు.

(6 అధి) 1 నై 2 కస్మిన్న 3 సంభవాత్ ॥ 33సూ.

తా॥ జైన (దిగంబర) సిద్ధాంతము (1) యుక్తమైనదికా

దు. (2) ఒకకాలమునందే కలిమి, లేమి మొదలగు విరుద్ధధర్మములకు శీతోష్ణములకువలె సమావేశములేదు,

1 ఏవం చాత్మాఽ 2 కార్త్స్న్యం ॥ 34సూ.

తా॥ (1) జైనసిద్ధాంతమునందు విరుద్ధధర్మములదోషమున్నట్లే (2) జీవునకు పరిపూర్ణత్వ నిత్యత్వములు లేని వేఱొక దోషమును కలదు. యార్హతులు శరీరపరిమాణమే జీవునకునని తెలచుచురు. అట్లయితే ఘటాదులకువలె జీవునకు నిత్యత్వములేని దోషము కలుగును.

1న చ 2 పర్యాయాదప 3 ్యవిరోధో

4 వికారాదిభ్యః ॥ 35సూ.

తా॥ (2) క్రమముగా అవయవములు కొన్ని రావడము, కొన్ని పోవడము సైతము జీవునియందీ దేహపరిమాణముయొక్క కలిమిలేములకు (3) విరోధములేకుండ (1) లేదు. (4) వికారాదులు జీవునకు ఎప్పుడును కలుగుటవలన జరామరణములవలె ఆత్మునకు నిత్యత్వములేనిదోషము కలుగును.

1 అత్యంతావస్థితే 2 శ్చోభయనిత్యత్వా

3 దవిశేషః ॥ 36సూ.

తా॥ (1) మోక్షమును పొందునప్పుడున్న జీవునిపరిమాణమునకు నిత్యత్వము నంగీకరించు జైనమతమువలెనే (2) జీవునకు మొదటను, మధ్యను, పరిమాణము నిత్యమగుటవలన (3) విశేషములేనందున ఏకశరీరపరిమాణమేయగును.

(7 అధి) పత్యురసామంజస్యాత్ ॥ 37సూ.

తా॥ వైశేషికులు మొదలగువారు ఈశ్వరుడు నిమిత్తకారణమనుటకు అసామంజస్యాత్ = సామంజస్యములేనందువలన

పత్యుః = ఈశ్వరునకు ప్రధానపురుషులకు అధిష్ఠాతృత్వముచేత జగత్తునకు నిమిత్తకారణమనతగదు. హీనులు, మధ్యములు ఉత్తములునగు ప్రాణులను సృజించునట్టి ఈశ్వరునకు రాగద్వేషాది దోషములు కలుగును. ప్రాణుల కర్మముచేత ప్రేరితుడై అట్లుచేయుటచేత దోషములేదందువేని కర్మమునకు ప్రేరకత్వము సంభవింపదు. గనుక పాశుపతమతము సరికాదు

సంబంధానుపపత్తేశ్చ ॥ 38 సూ.

తా॥ ప్రధానము కంటెను పురుషుడు కంటెను భిన్నుడగు ఈశ్వరుడు సంబంధములేనిదే వానిని ప్రేరేపింపచాలడు. వీరు ముగ్గురును అవయవములులేనివారగుటచేత సంయోగసంబంధము కలుగదు. గనుక సాంఖ్యయోగవాదుల ఈశ్వరకల్పనము యుక్తముకాదు. అధిష్ఠానానుపపత్తేశ్చ ॥ 39 సూ.

తా॥ తార్కికులు చెప్పెడి ఈశ్వరునకు ప్రధానప్రేరణ యుక్తముకాదు. యుక్తమను నెడల కుమ్మరి. ఘటాదులనువలె ప్రధానాదుల నాశ్రయించి నడుపవలెను. ప్రధానాదులు ప్రత్యక్షముకాని రూపాదులు కలవియును, మృదాదులకంటె విలక్షణమును గనుక ఈశ్వరునకు అధిష్ఠేయత్వము ఉపపత్తి కాదు. 1 కరణవ 2 చ్చే 3 న్న 4 భోగాదిభ్యః ॥ 40

తా॥ (1-2) చక్షురాదీంద్రియములను జీవుడు ప్రేరేపించునట్లే ఈశ్వరుడు ప్రధానాదులకును అని చెప్పినను సరిపడదు. (4) ఇంద్రియములవలన కలుగు భోగాదులు జీవునియందు కనిపించునట్లు ప్రధానాదులవలన కలుగు భోగాదులు ఈశ్వరునియందు కనిపింపవు. గనుక జీవునివలె ప్రేరేపించువాడు ఈశ్వరుడు (3) కానేరడు.

1 అంతవత్త్వమ 2 సర్వజ్ఞతావా ॥ 41సూ.

తా॥ (1) ప్రధానము, పురుషుడు, ఈశ్వరుడు నను ముగ్గురును పరిమాణముకలవారని బౌద్ధులుచెప్పుటచేత వీరు క్రమముగా పరిమాణాంతము కాగానే ముక్తులగుటచేత సంసారములకంతమై ఆద్యంతములు లేకపోయి శూన్యవాదమగును. గనుక తర్కమతము సంగతముకాదు.

(8 అధి) ఉత్పత్త్యసంభవాత్ ॥ 42సూ.

తా॥ భాగవతుల పాంచరాత్రాగమములందు చెప్పినట్లు జీవులకు ఉత్పత్తిసంభవింపదు. ఉత్పత్తికలదను నెడల నిత్యత్వమున్ను, మోక్షమున్ను లేకపోవును.

న చ కర్తుః కరణం ॥ 43సూ.

తా॥ కర్తుః=సిద్ధములైన కరణం=ఇంద్రియములను ప్రయోగించువాడు కర్తయని లోకప్రసిద్ధము. గాని కర్తయగు దేవదత్తుడు మొదలగువారినుండి క్రియాసాధనమగు పరశువుమొదలగునవి పుట్టుచున్నట్లు న=కనిపింపదు. గనుక వారికల్పనమసంగతము. సంకర్షణుడనే జీవునివలన ప్రద్యుమ్నుడను మనస్సు పుట్టినదనే మొదలగు వాక్యములకు దృష్టాంతముగాని, శ్రుతిగాని లేదు.

విజ్ఞానాదిభావేవా తదప్రతిషేధః ॥ 44సూ.

తా॥ సంకర్షణాదులకుత్పత్తిలేకున్నను జీవులుకారు. 'వాసుదేవాఏవైతే సర్వే నిర్దోషా నిరధిష్ఠానా నిరవద్యాశ్చ' వీరు వాసుదేవస్వరూపులు. రాగ ద్వేష నాశములు లేనివారు. ప్రకృతివలన పుట్టనివారును, పాంచరాత్రోక్తివలన వీరందరును జ్ఞానైశ్వర్య శక్తిబల వీర్య తేజముల నెడి అంతరసామర్థ్య

ము, శరీరసామర్థ్యము, శౌర్యము, ప్రాగల్భ్యములనెడి ఈశ్వరధర్మములు కలవారు.

విప్రతిషేధాచ్చ ॥ 45సూ.

తా॥ పాంచరాత్రాగమమునందు జ్ఞానైశ్వర్యశక్త్యాదులు వాసుదేవుని గుణములనియు, నివి యన్నియు నాత్ముడే (వాసుదేవుడే) యనియు ననుటచేత నొకవస్తువునకే గుణగుణిత్వకల్పన విరోధముకనిపించుచున్నది.

2 వ పాదము సమాప్తము.

---

16 వ ప్ర॥ 2అ. 3 పాదము.

ఈమూడవపాదమునందు పంచమహాభూతములును బ్రహ్మమునుండి పుట్టెననియు, జీవుడు నిత్యుడనియు, జీవునకుగల కర్తృత్వము ఈశ్వరునివలన కలిగినదనియు చెప్పబడుచున్నది 1సూ. మొదలు 5సూ. వరకును పూర్వపక్షము.

(1 అధి) నవియదశ్రుతేః ॥ 1సూ.

తా॥ ఛాందోగ్యమునందు 'సదేవ సోమ్యేదమగ్రఆసీత్' 'తదైక్షత' 'తత్తేజో సృజత' తేజముపుట్టినట్లుగాని ఆకాశోత్పత్తిచెప్పలేదనియు,

అస్తి తు ॥ 2సూ.

తా॥ తైత్తిరీయమునందు 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' 'తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశస్సంభూతః' యని ఆకాశోత్పత్తియును, శ్రుతులలో ఆత్మవలన ఆకాశమున్ను, దానివలన తేజమును పుట్టినట్లు తైత్తిరీయకమునందు చెప్పబడినది. ఉపాదానకారణము ఆత్మయని ఛాందోగ్యమునందున్ను, వాయు

వులని తైత్తిరీయమునందును చెప్పుటవలన శ్రుతులకు పర స్పరవిరోధము కలదనియు,

గౌణ్యసంభవాత్ । 3సూ.

తా॥ ఆకాశమునకుత్పత్తిని చెప్పు శ్రుతి గౌణమనియు,

శబ్దాచ్చ । 4సూ.

తా॥ ఆకాశము మరణములేని అజమనియు, పుట్టుక లేనిది యనియు,

1 బృ. 4-3-3 'వాయుశ్చాంతరిక్షంచైతదమృతం' 2 'ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః' 3 'సయథానంతోయమాకాశఏవ మనంతఆత్మా వేదితవ్యః' 4 తై. 'ఆకాశశరీరం బ్రహ్మ ఆకాశఆత్మా'

తా॥ (1) వాయువు, ఆకాశము మరణములేనివి. (2) బ్రహ్మము ఆకాశముతో తుల్యమైనది (3) ఆకాశమువలెనే బ్రహ్మమున్ను ఆదిమధ్యాంతములు లేనిది. (4) బ్రహ్మము ఆకాశశరీరమే. 1స్యా 2చ్చైకస్య 3బ్రహ్మశబ్దవత్ ॥ 5సూ.

తా॥ 'ఆత్మనఆకాశస్సంభూతః। ఆకాశాద్వాయుః' అను శ్రుతులనుబట్టి బ్రహ్మమునుండి ఆకాశము పుట్టినదందువేని (2) ఒకటియేయగు భూతశబ్దమునకు (3) బ్రహ్మశబ్దమువలెనే గౌణ, ముఖ్య, ప్రయోగములు (1) కావచ్చును.

1 తై. 3 'తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ' 'తపో బ్రహ్మేతి'

తా॥ తపమే బ్రహ్మము. దానిని తపముచేతనే తెలిసికొనుము. భూతశబ్దమునకు ఆకాశమునందు గౌణము, తేజము మొదలగువానియందు ముఖ్యప్రయోగమును కావచ్చునని యు 1లు 5 వరకు పూర్వపక్షము.

1 ప్రతిజ్ఞాఽహాని 2 రవ్యతిరేకా 3 చ్ఛబ్దేభ్యః ॥ 6సూ.

తా॥ సిద్ధాంతము:- (2) బ్రహ్మముకంటె వ్యతిరేకమగు వస్తువు లేనందున (1) క్రిందిశ్రుతులలోని ప్రతిజ్ఞకు హానిలేకుండా అన్నివస్తువులలోను తెలిసికొనతగినది బ్రహ్మమే యగును. (3) వైదికశబ్దములవలన ప్రకృతివికారములకు వ్యతిరేకము లేదనెడి న్యాయముచేతనే ప్రతిజ్ఞాసిద్ధి తెలియబడును. 'తస్మాదాత్మన ఆకాశస్సంభూతః' యను శ్రుతి 'తత్తేజో సృజత' యను శ్రుతితో విరోధించుచున్నది.

1 ఛాం. 6-1-3 'యేనాఽశ్రుతం శ్రుతం భవత్యమతం మతమవిజ్ఞాతం విజ్ఞాతం' తా॥ 315 పుటలో కలదు.

2 ముం. 1-1-3 'కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి' తా॥ 69 పుటలో కలదు. గనుక ఆత్మకంటె భిన్నమేదియు లేదు.

1 యావద్వికారంతు 2 విభాగో 3 లోకవత్ ॥ 7సూ.

తా॥ (3) లోకమునందు సువర్ణకుండలాదులవలె (1) వికారముకనుపించువరకే (2) విభాగము చూడబడుచున్నది, ఆకాశము ఆత్మనుండిపుట్టినటు శ్రుతిచెప్పుచున్నది. ఆత్మకంటె పరమైనది లేదు 'జ్యాయానాకాశాత్' ఆకాశమునకు బ్రహ్మముకంటె తక్కువపరిమాణము కలదు.

1 శ్వే. 4-19 'న తస్య ప్రతిమాస్తి' ఆత్మతో వేఱొకటి సామ్యములేదు. [నది తుచ్ఛము.

2 బృ. 5-4-2 'అతోన్యదార్తం' బ్రహ్మముగాక మిగిలి

(2 అధి) 1 ఏతేన 2 మాతరిశ్వా 3 వ్యాఖ్యాతః ॥ 8 సూ.

తా॥ (1) ఆకాశమునకుత్పత్తి చెప్పుటవలన (2) దానికా

శ్రియమైన వాయువునకును, (3) ఉత్పత్తి తైత్తిరీయమునందు కలదు. గాని ఛాందోగ్యమునందు చెప్పలేదు. ఉత్పత్తిప్రకరణమునందు ఆకాశవాయువులకు పుట్టుక కలదనిగాని లేదనిగాని యేదియును చెప్పలేదు.

9 వ సూత్రము 5 వ ప్రకరణములో కలదు.

(4 అధి) 1 తేజో 2 ఽత 3 స్తథా 4 హ్యాహ ॥ 10

తా॥ (1-2) అగ్నికి కారణము బ్రహ్మమని ఛాందోగ్యమునందున, వాయువులని తైత్తిరీయకమునందును చెప్పబడినది. (3-4) అట్లే శ్రుతులు-

1 'ఏతస్మాజ్జాయతే ప్రాణః' 2 తై. 'సతప స్తప్త్వా ఇదగ్ం సర్వమసృజత యదిదం కించ' అను శ్రుతులు బ్రహ్మమే కారణమని చెప్పుచున్నవి. 'వాయోరగ్నిః' యనుశ్రుతిలో వాయువవలన అగ్నిపుట్టినట్లు కలదు.

3 తై 2 తదాత్మానగ్గ్ం స్వయమకురుత' 4 భ గీ. 10అ 4 'బుద్ధిర్జ్ఞానమసంమోహః' యని యుపక్రమించి 'భవంతి భావాభూతానాం మత్తఏవ పృథగ్విధా ॥'

తా॥ వీనివలన బ్రహ్మమే జగద్రూపమయ్యెను. గనుక ఆకాశవాయువులద్వారా అగ్నికి కారణము బ్రహ్మమే.

(5 అధి) ఆపః ॥ 11సూ.

తా॥ 'అగ్నేరాపః' అగ్నివలన జలముపుట్టెను. 'తదపోసృజత' బ్రహ్మము జలమును సృజించెను. అగ్నిజలములకు విరోధమున్నను 'అగ్నేరాపః' యను శ్రుతిచేత విరోధములేదు.

(6 అధి) 1 పృథివ్యధికారరూప 2 శబ్దాంతరేభ్యః ॥ 12.

తా॥ (1) భూమి జలమువలన పుట్టినదని (2) ప్రకరణ

రూపశబ్దాంతరములవలన చెప్పబడుచున్నది. 'తత్తేజోఽసృజత' 'తదపోఽసృజత' యని మహాభూతములకు బ్రహ్మమునుండి యుత్పత్తి కనిపించుచున్నది.

(7 అధి) 1 తదభిధ్యానాదేవతు 2 తల్లింగా 3 త్సః ॥ 13.

తా॥ (3) ఆపరమేశ్వరుడు (2) అంతర్యామిగనుండుట మొదలగు సర్వాత్మకభావముతో ఆకాశాదులను ప్రవర్తింప చేయునని శ్రుతులు చెప్పుటవలన (1) తనసంకల్పముచేతనే అట్లుచేయుచున్నాడు. గనుక ఆకాశమునుండి వాయువు పుట్టెనని చెప్పిన శ్రుతికి విరోధములేదు.

1 బృ. 'యః పృథివ్యాం తిష్ఠన్ యః పృథివ్యా అంతరో యం పృథివీ నవేద యస్య పృథివీశరీరం.యః పృథివీ మంతరో యమతి'

తా. ఏనారాయుడు పృథివియొక్క లోపలను, వెలుపలను, ఉన్నవాడో దానికంటె వేరయిన శరీరేంద్రియములు లేవో పృథివీదేవతను ఎవడు ప్రేరణచేయుచున్నాడో అతడే అందరికిని ఆత్మస్వరూపుడు.

2 తై. 2-6 'సోకామయత బహుస్యాం ప్రజాయేయేతి'

తా॥ 275 పుటలో కలదు.

3 'సచ్చత్యచ్చాభవత్ । తదాత్మానగ్గం స్వయమకురుత'

తా॥ ఆకాశాదిజగత్తును సృజించి అందుప్రవేశించి మూర్తమును, అమూర్తము నయ్యెను.

(8 అధి) 1 విపర్యయేణ తు 2 క్రమో 3 ఽత 4 ఉపపద్యతే చ ॥ 14సూ.

తా॥ (3) ఉత్పత్తిక్రమముకంటె (1) విపరీతక్రమముచేత

నే లయముకలుగును. మృత్సంబంధఘటాదులు లయకాలము నందు మృద్భావమును పొందునట్లు (4) ఉదకమునలన పుట్టిన పృథివి ఉదకమందును, తేజమువలనపుట్టిన ఉదకము తేజమందును లయమగును. ఇట్లే క్రమముగా సూక్ష్మతరమై బ్రహ్మమునందు లీనమగును.

1 భార. శాం. 'జగత్ప్రతిష్ఠా దేవర్షే పృథివ్యప్సుప్రలీయతే। జ్యోతిష్యాపః ప్రలీయంతే జ్యోతిర్వాయౌ ప్రలీయతే॥ వాయుశ్చ లీయతే వ్యోమ్ని తచ్చావ్యక్తే ప్రలీయతె। అవ్యక్తం పురుషే బ్రహ్మన్ నిష్కలే సంప్రలీయతే॥'

తా॥ పృథివి జలమందును, జలము అగ్నియందును, అగ్ని వాయువునందును, వాయువు ఆకాశమునందును, ఆకాశము అవ్యక్తమందును, అవ్యక్తము నిర్గుణబ్రహ్మమునందును లయమగుచున్నవి.

(9 అధి) 1 అంతరా 2 విజ్ఞానమనసీ 3 క్రమేణ 4 తల్లింగాది 5 తిచే 6 న్నా 7 విశేషాత్ 15.

తా॥ (4) ము॥. 2-1-3 'ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ। ఖంవాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ॥' ప్రాణము, మనస్సు మొదలగు ఇంద్రియములును పంచమహాభూతములును. బ్రహ్మమునుండి పుట్టెననెడి సృష్టివాక్యమువలన (1) ఆత్మునకును, భూతములకును నడుమను (2) ఇంద్రియమనోబుద్ధులు చెప్పబడుచున్నవి. గనుక (3) ఈ క్రమముచేత భూతములయుత్పత్తిక్రమమునకు భంగముకలుగును (5) అనియందువేని (6) కాదు (7) అవి భూతవికారములైనను, కాకున్నను వాని యుత్పత్తిక్రమమునకు భూతో

త్పత్తిలయక్రమమునందు విరుద్ధమైన విశేషములేదు. అథర్వణమునందు 'ప్రజాపతిర్వా ఇదమగ్ర ఆసీత్ । స ఆత్మానమైక్షత । స మనోఽసృజత । తన్మన ఏవాసీత్ । తదాత్మానమైక్షత । తద్వాచమసృజత' తా॥ భూతోత్పత్తిక్రమముకంటె ఇంద్రియోత్పత్తిక్రమము వేఱుగాను ప్రజాపతిసృష్టి మొదటిదిగాను ఇంద్రియసృష్టి తరువాతదిగాను చెప్పబడినది గనుక భంగములేదు.

(10 అధి) 1 చరాచరవ్యపాశ్రయస్తు 2 స్యాత్ 3 త్త
ద్వ్యపదేశో 4 భాక్త 5 స్తద్భావభావిత్వాత్ ॥16.

తా॥ (3) జీవునికి జననమరణములు కలవందువేసి అది (2-4) గౌణమే. (5) జీవుడు శరీరోపాధినాశ్రయించినపుడు ఆయుపాధికి జన్మమరణములుగాని జీవునకు లేవు. అట్లే క్రింది శ్రుతులు- [జీవో మ్రియతే'

1 ఛాం. 6-11-3 'జీవాపేతం వావ కిలేదం మ్రియతే న

2 బృ. 6-3-8 'స వా అయం పురుషో జాయమానశ్శరీరమభిసంపద్యమానస్స ఉత్క్రామన్ మ్రియమాణః'

తా॥ (1) ఈదేహము జీవునిచేత విడువబడి మరణించుచున్నది. జీవుడు మరణింపడు. (2) జీవుడేపుట్టి దేహేంద్రియాది సముదాయమునుపొంది మఱల దానిని విడుచును. గనుక స్వయంప్రకాశపురుషుడు దేహేంద్రియాదులకంటెనన్యుడే అని శ్రుతి చెప్పుచున్నది.

(11 అధి) నాత్మాశ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః ॥17.

తా॥ ఆత్మా=జీవుడు న=పుట్టడు. అశ్రుతేః=పుట్టుచున్నట్లు శ్రుతులులేవు. నిత్యత్వాత్=నిత్యత్వమునే శ్రుతులు చెప్పుచున్నవి గనుక జీవునకు జననమరణములు లేవు.

1 ఛాం. 6-11-3 'న జీవో మ్రియతే'
తా॥ జీవునికి మరణము లేదు.
2 ఛాం. 6-3-2 'అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి' తా॥ 258 పుటలో గలదు.
3 ఛాం. 3 'తత్త్వమసి' ఆసత్పదార్థమే నీవు అగుదువు శ్వేతకేతూ
4 బృ. 6-4 25 'సవా ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మ'
5 బృ. 'సఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః'
6 బృ. 'అహం బ్రహ్మాస్మి'
7 బృ. 'అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః'
8 బృ. 'సవా అయమాత్మా బ్రహ్మ విజ్ఞానమయః। ప్రాణమయ శ్చక్షుర్మయ శ్శ్రోత్రమయః'
9 క. 2-18 'నజాయతే మ్రియతేవా విపశ్చిత్'
10 క. ... 'అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణః'
11 తై. 2-6 'తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్'
12 శ్వే 6-4 'ఏకోదేవస్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా' దీనితా॥ 62 పుటలో కలదు.

తా॥ (4) ఆత్మస్వరూపము వ్యాపకమైనది. జన్మము, ముసలితనము, మరణము, కామములు, భయమును లేనిది. నిరతిశయమైన మహత్వముగలది. (5) సృజింపబడినవానియందు గోళ్ళతుదవరకును ఖడ్గమువలె ప్రవేశించెను. (6) నేను బ్రహ్మమునగుదును. (7) సర్వమున నుభవించునట్టి ప్రత్యగాత్మయే బ్రహ్మము. (8) పరలోకమునకును, అక్కడనుండి యీ

లోకమునకు సంచరించుచున్నది పరబ్రహ్మమే కాని బుద్ధిసంబంధమువలన జ్ఞానపరతంత్రిమును, మనస్సంబంధమువలన మనఃపరతంత్రిమును, చూచునపుడు చక్షుఃప్రిధానమును, వినునపుడు శ్రోత్రిప్రిధానము నగును. (9) ఆత్మునకు జననమరణములు లేవు. (10) అది శాశ్వతమగు నిత్యస్వరూపము. (11) జగత్తును సృజించి బ్రిహ్మము దానియందు ప్రివేశించెను.

(12 అధి) జ్ఞోఽతఏవ ॥ 18సూ.

తా॥ జీవుడు తర్కమతప్రికారము ఆగంతుకచైతన్యుడా? సాంఖ్యమతప్రికారము నిత్యచైతన్యుడా? యని సంశయము రాగా- అతఏవ=పరబ్రిహ్మము ఉపాధిసంపర్కముచేత జీవభావమును పొందుటవలన జ్ఞః=నిత్యచైతన్యుడే జీవుడును.

1 బృ. 5-9-29 'విజ్ఞానమానందం బ్రిహ్మ' [లో కలదు.
2 తై. 'సత్యం జ్ఞానమనంతం బ్రిహ్మ' దీనితా॥ 302 పు॥
3 బృ. 6-5-13 'అనంతరోఽబాహ్యః కృత్స్నః ప్రిజ్ఞానఘనఏవ' తా॥ ప్రిలయమందు లోపలను వెలుపలను భేదములేనిదై అంతయును చైతన్యమే. పై శ్రుతులు చైతన్యమైన బ్రిహ్మమే జీవుడని చెప్పుచున్నవి.

అవ॥ జీవుడు బ్రిహ్మమువలె సర్వవ్యాపకుడు కాడని 19 మొదలు 28 సూత్రిమువరకును పూర్వపక్షము.

13 అధి) ఉత్క్రాంతిగత్యాగతీనాం ॥ 19సూ.

తా॥ జీవుడు దేహమును విడిచి పరలోకమునకు పోవుట. మరల వచ్చుట మొదలగు వ్యాపారములవలన జీవునకు అణుపరిమాణమేర్పడెను. [తైస్సర్వైరుత్క్రామతి'
1 కౌ. 3-4 'సయదాస్మాచ్ఛరీరాదుత్క్రామతి సహైవై

తా॥ జీవుడు శరీరమునుండి బుద్ధ్యాదులతోకూడి పోవుచున్నాడు.

2. బృ. 6-4-6 'తస్మాల్లోకాత్పునరేత్యస్మై ల్లోకాయ కర్మణే' తా॥ చంద్రలోకఫలమనుభవించి భూలోకమునకు వచ్చుచున్నాడు.

1 స్వాత్మనా 2 చోత్తరయోః ॥ 20సూ.

తా॥ (2) ఉత్క్రాంతికి తరువాతచెప్పిన గతులు రెండింటికిని జీవుడు కర్తయగుటచేత రాకపోకలకొఱకు అణుపరిమాణమేర్పడెను. [శరీరదేశేభ్యః'

1 బృ. 6-4-2 'చక్షుషోవా మూర్ధ్నోవాఽన్యేభ్యోవా

తా॥ వారి కర్మోపాసనల ననుసరించి కంటినుండి సూర్యలోకమునకును, శిరస్సునుండి బ్రహ్మలోకమునకును, ఇతర అవయవములనుండియును జీవులు పోవుచున్నారు.

2 బృ. 6-4-1 'సఏతాస్తేజోమాత్రా స్సమభ్యాదదానో హృదయమేవాన్వవక్రామతి' ఆత్మునికి స్థానము హృదయము

నాణురతచ్ఛ్రుతేరితిచే న్నేతరాధికారాత్ ॥ 21సూ.

పద॥ 1 న 2 అణుః 3 అతచ్ఛ్రుతేః 4 ఇతిచేత్ 5 న 6 ఇతరాధికారాత్ ।

తా॥ ఆత్ముడు (1-2) అణుపరిమాణుడు కాడు. (3) మహాపరిమాణుడని బృ. 6-4-22 'సవా ఏష మహా నజ ఆత్మా' ఇత్యాది శ్రుతులు చెప్పుటవలన అణుత్వము చెప్పతగదు. (4) అనియందు వేని (5) కాదు. (6) మహాపరిమాణమును బోధించు శ్రుతులు బ్రహ్మప్రకరణములోనివి కనుక దోషము కాదు. జీవునకు అణుత్వము విరోధింపదు.

స్వశబ్దోన్మానాభ్యాం చ ॥ 22సూ.

తా॥ జీవునివలె ఆత్ముడును అణుపరిమాణుడని కొన్నిశ్రుతులుచెప్పుచున్నవి. గాని భేదము క్రిందిసూత్రమునందుకలదు

1 ముం. 3-1-9 'ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యో యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ'

తా॥ ఏశరీరమునందు ప్రాణవాయువు ఐదుప్రకారములుగా ప్రవేశించెనో ఆశరీరమునకే సూక్ష్మమగు ఆత్మస్వరూపము తెలియబడును.

1 అవిరోధ 2 శ్చందనవత్ ॥ 23సూ.

తా॥ (2) దేహమునందు ఒకచోటనున్న చందనబిందువు అంతటను సంతోషింపచేయునట్లు బ్రహ్మము శరీరమునందొక చోటనుండి అంతను సంతోషింపచేయును. గనుక (1) విరోధములేదు.

1 అవస్థితివైశేషమ్యా 2 దితిచే 3 న్నా 4 భ్యుపగమాద్ధృదిహి ॥ 24సూ.

తా॥ (1) ఉనికి వేరుగానుండి దృష్టాంతదార్ష్టాంతికములు రెండింటికి సమానభావము లేనందున సంశయముపోలేదు. (2) అనియందువేని (3) దోషముకాదు. (4) బ్రహ్మమునకు చందనబిందువువలె నునికినంగీకరించుటవలన దోషముకాదు.

1 ప్ర. 3-6 'హృది హ్యేషఆత్మా' జీవుడు హృదయాకాశమునందుండును.

2 ఛా. 8-3-3 'సవాఏషఆత్మా హృది'

తా॥ ఆత్ముడు హృదయాకాశమునందుండుటచేత హృదయమని పేరు కలిగెను,

1 గుణాద్వా 2 లోకవత్ ॥ 25సూ.

తా॥ (2) లోకమునందు మణిప్రదీపము మొదలగునవి గదిలోనొకచోటనుండి అంతనుప్రకాశింపచేయునట్లే జీవుడు అణువైనను (1) చైతన్యగుణవ్యాప్తివలన దేహమునంతను వ్యాపించుననుటకు విరోధములేదు.

1 వ్యతిరేకో 2 గంధవత్ ॥ 26సూ

తా॥ (2) గంధముగల కుసుమాదులు ప్రాప్తింపకున్నను గంధపరిమళము కలుగుటవలన గంధము గుణమేయైనను దానికి కుసుమాదులకంటె వేఱువృత్తియగునట్లే (1) అణువైన జీవునిచైతన్యమునకు నాశ్రయవిశేషముకావచ్చును.

1 తథాచ 2 దర్శయతి ॥ 27సూ.

తా॥ (1) అట్లే ఆత్మునకు హృదయమునందునికియు, అణురూపమును, చైతన్యగుణముచేత శరీరమునంతను వ్యాపించునట్లు 'ఆలోమభ్య ఆనఖాగ్రేభ్యః' యను శ్రుతి (2)చూపుచున్నది. 1 పృథగుపదేశాత్ ॥ 28సూ.

తా॥ కౌ. 3-6 'ప్రజ్ఞాయాశరీరం సమారుహ్య' యనుశ్రుతియందు ఆత్ముని చైతన్యమును (1) వేఱుగాచెప్పుటవలన ఆత్మునకు అన్నిశరీరములందును వ్యాపించుట చైతన్యగుణముచేతనే యగును.

1 బృ. 4-1-17 'తదేషాం ప్రాణినాం విజ్ఞానేన విజ్ఞానమాదాయ'

తా॥ శారీరునికంటె వేఱుగా ఆత్మునకు చైతన్యగుణముచేతనే వ్యాప్తికలదనుటవలన ఆత్ముడు అణువేయని ప్రాప్తమైనది.

19 సూ. మొదలు 28 సూ. వరకును పూర్వపక్షమే.

1 తద్గుణసారత్వా 2 త్తు 3 తద్వ్యపదేశః
4 ప్రాజ్ఞవత్ ॥ 29సూ.

తా॥ సిద్ధాంతము:- (2) పూర్వపక్షము సరికాదు. ఏధర్మములునులేని బ్రహ్మము ఉపాదిధర్మముల నారోపించుకొనుట చేత (1) అట్టి గుణసారమువలన (3) ఆబుద్ధిచేత జీవునకు పరిమాణమును, ఉత్క్రిమణాదులును కలిగెను. గాని స్వభావము చేత కాదని చెప్పుటవలన జీవునకుగల అణుత్వమే (4) పరమాత్మునకును సగుణోపాసనములందు ఏర్పడినది.

1 ఛాం. 3-14-3 'అణీయాన్ వ్రీహేర్వాయవాద్వా'

2 ఛాం. 'మనోమయః ప్రాణశరీర స్సర్వగంధః స్సర్వసర స్సత్యకామ స్సత్యసంకల్పః'

తా॥ ఆత్మ మనఃప్రాయమును, ప్రాణమే శరీరముగా కలదియును, సుగంధపరిమళములు, రసములు, ఉత్తమకోరికలు. వ్యర్థముకాని సంకల్పములును కలదియును.

1 యావదాత్మభావిత్వాచ్చ 2 న 3 దోష
4 స్తద్దర్శనాత్ ॥ 30సూ.

తా॥ (3) బుద్ధివియోగము కలిగినపుడు సంసారమునకు సత్త్వములేనిదోషము వచ్చునని (2) శంకింపతగదు. (1) బుద్ధిసంయోగముచేత ఆత్మ ఎంతవఱకు సంసారిగానుండునో యెంతవరకు జ్ఞానముచేత సంసారము నివర్తింపదో యంతవఱకును శమింపదు. అంతవరకే జీవత్వము. ఇట్లుకల్పింపబడిన స్వరూపముకంటె వేఱుగా జీవుడనువాడు లేడు. (4) శ్రుతులవలన నట్లే కనిపించుచున్నది.

1 బృ. 5-7-23 'నాన్యోతోస్సి ద్రష్టా శ్రోతా మంతా

విజ్ఞాతా । నాన్యదతోఽస్తి ద్రిష్టృ శ్రోతృ మంతృ విజ్ఞాతృ తత్త్వమసి అహం బ్రహ్మాఽస్మి' దీని తా॥ 13 పుటలో కలదు.

2 బృ 6-3-7 'యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషస్ససమాన స్సన్నుభౌ లోకావనుసంచరతి ధ్యాయతీవ లేలాయతీవ'

తా॥ బుద్ధికి ఉపాధియు, ఇంద్రియాదులకంటె పరమును, హృదయమందు జ్యోతిస్వరూపముతో నున్నదియు నగు పరబ్రహ్మము బుద్ధితో నేకీభవించి ఇహపరలోకములందు తిరుగుచున్నాడు. బుద్ధి ధ్యానించునపుడును, చలించునపుడును, తాను కూడా అట్లేయుండును.

3 శ్వే. 3-8 'వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్ । తమేవం విదిత్వాతిమృత్యుమేతి నాన్యఃపంథా విద్యతే యనాయ'

తా॥ వ్యాపకమై ప్రకాశస్వరూపముతో అజ్ఞానముకంటె వేఱుగనున్న పరబ్రహ్మమును నేనే. అని తెలిసికొనినవాడు సంసారసాగరమును దాటుచున్నాడు. మోక్షప్రాప్తికి యిది గాక వేఱొకమార్గము లేదు.

అవ॥ సుషుప్తియందును, ప్రళయమునందును జీవునకు బుద్ధిసంయోగమున్నదనుటకు వీలులేదు గనుక నది సంసారమున్నంతవరకు నున్నదనుట తగదని యాక్షేపమురాగా-

1 పుంస్త్వాదివ 2 త్వస్య 3 సతో 4 ఉభివ్యక్తి యోగాత్ ॥ 31సూ.

తా॥ (1) లోకమునందు సంతానమునుకలిగించు వీర్యము బాల్యాదులయందు సూక్ష్మబీజముగానుండి యావనాదుల

యందు ఘనీభవించి సంతానముకలిగించునట్లై (2-3) ఈ బుద్ధిసంయోగమునకును, సుషుప్తిప్రళయములందు (బాల్య మందు వీర్యమువలె) సూక్ష్మశక్తిరూపముతోనుండి (4) మ రల జాగ్రదవస్థయందును, సృష్ట్యాదియందును ఆవిర్భావము సంభవించును. [హే'

1 ఛాం. 6-9-2 'సతి సంపద్య నవిదుస్సతి సంపత్స్యామ

2 ఛాం. 'తఇహ వ్యాఘ్రోవా సింహోవా'

తా॥ 1 జీవులు పరబ్రహ్మమునందేకీభవించుచున్నను అట్లు తెలియచాలకున్నారు. 2 సుషుప్తికిని ప్రళయమునకును పూ ర్వము ఏజంతువుగానున్నది ఆజంతువుగానే జాగ్రత్తియందును సృష్టియందును ఉండును.

1 నిత్యోపలబ్ధ్యనుపలబ్ధిప్రసంగో 2 ఽన్యతర
నియమోవా 3 ఽన్యథా ॥ 32సూ.

తా॥ ఆత్మకు అంతఃకరణము, మనస్సు, బుద్ధి, విజ్ఞానము, చిత్తము ననునివి యుపాధులని శ్రుతులందుకలదు. వృత్తుల లో సంశయాదులుకలది మనస్సు. నిశ్చయాదులుకలదిబుద్ధి. గర్వముతోకూడిన అహంకారము విజ్ఞానము. స్మృతిప్రధాన ముగాగలది చిత్తము. అంతఃకరణమవశ్యముకలదు. (3) లేద నునెడల (1) సర్వకాలము ఇంద్రియములకు సమీపమందు న్న విషయముల అనుభవముకలుగవలయును. లేక కారణసా మగ్రియున్నను కార్యాభావమగునెడల సాక్షాత్కారము లేక పోవలెను. అట్లయితే (2) ఆత్మునకుగాని, ఇంద్రియములకు గాని శక్తిప్రతిబంధము నంగీకరింపవలెను. కాని క్రియలులేని ఆత్మకు శక్తిబ్రతిబంధము సంభవింపదు.

1 బృ. 3-5-3 'అన్యత్ర మనా అభూవం నాదర్శమన్యత్ర మనా అభూవం నాశ్రౌషం' 2 బృ. 'మనసా హ్యేవ పశ్యతి, మనసా శృణోతి' 3 'కామస్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతిరధృతి హీర్ధీర్భీరిత్యేతత్సర్వం మనఏవ'

తా॥ 1 మనస్సు ఒకవస్తువునందున్నపుడు మఱియొకటికనిపింపదు. గనుక మనస్సు వేరుగాకలదు. 2 మనస్సుచేతనే చూచుట, వినుట కలుగును. 3 కోరికలు మొదలగునవి అంతఃకరణరూపము. కనుక బాహ్యేంద్రియములకంటె మనస్సు భిన్నము. బుద్ధిసద్భావము మనస్సంబంధమే.

అవ॥ బుద్ధియే కర్తయని పూర్వపక్షమురాగా-

(14 అధి) 1 కర్తా శాస్త్రార్థవత్త్వాత్ ॥ 33సూ.

తా॥ శాస్త్రార్థము వలన జీవుడు కర్తయగును. 'యజేత, జుహుయాత్, దద్యాత్' యాగము, అగ్నిహోత్రాదికర్మములు, దానములచేత కోరికను సంపాదింపుమని చెప్పబడినది

1 ప్ర. 4-9 'ఏషహి ద్రష్టా శ్రోతా మంతా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః'

తా॥ జీవుడు దేహేంద్రియాది సంఘాతమందున్నాడు. జలమునశించినపుడు సూర్యప్రతిబింబము నిలుచునట్లే ఉపాధి నశించినపుడు జీవుడు బ్రహ్మమునందే నిలుచును.

విహారోపదేశాత్ ॥ 34సూ.

తా॥ విహార=సంచారమును, ఉపదేశాత్=చెప్పుటవలన జీవుడే కర్త. జీవునకు స్వప్నమందు స్వేచ్ఛానుసారముగా సంచారముకలదు.

1 బృ. 4-1-18 'స్వే శరీరే యథాకామం పరివర్తతే'

2 బృ. 6-3-12 'సఈయతేఽమృతో యత్ర కామం'

తా॥ మఱణధర్మములేని జీవుడు కోరికగలపదార్థముకొఱకుపోవుచున్నాడు.

ఉపాదానాత్ ॥ 35సూ.

తా॥ ఉపాదానకారణముచేతను జీవుడే కర్త. 'ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞానమాదాయ' 'ప్రాణాన్ గృహీత్వా' ఇత్యాది శ్రుతులవలన జీవునకు కర్తృత్వము కలదు.

1 వ్యపదేశాచ్చ 2 క్రియాయాం 3 నచేన్నిర్దేశ 4 విపర్యయః ॥ 36సూ.

తా॥ (1-2) లౌకిక వైదికకర్మములన్నిటియందును 'విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేపిచ' యని విజ్ఞానశబ్దము చేత జీవునకు కర్తృత్వము కలదు. (3) లేదందువేని (4) చెప్పినవిషయముకూడ మాఱుననవలయును.

అవ॥ జీవుడు కర్తయై స్వతంత్రుడే అయితే తనకిష్టముకాని ఫలము నెందుకు పొందుననగా-

ఉపలబ్ధివదనియమః ॥ 37సూ.

తా॥ ఉపలబ్ధివత్ = ఆత్మునకు జ్ఞానమునందు స్వాతంత్ర్యమున్నను నియమములేకూడ యిష్టమును, అనిష్టమును తెలిసికొనునట్లే వానినిసంపాదించుటయందును, అనియమః=నియమములేదు.

శక్తివిపర్యయాత్ ॥ 38సూ.

తా॥ అహంకారముకంటె భిన్నుడగు జీవుడు కర్తకావలెను. బుద్ధి కర్తయయ్యెనేని శక్తివిపర్యయముకావలెను. బుద్ధికి ఇంద్రియశక్తిపోవలెను. కర్తృశక్తికలుగవలెను. ఇంద్రియ

ముకంటె భిన్నమగుదానికే కర్తృత్వము మేము అంగీకరించు టవలన కర్త జీవుడే.

1 సమాధ్య 2 భావాచ్ఛ ॥ 39సూ.

తా॥ జీవునకు కర్తృత్వము లేదనునెడల బ్రహ్మమును తెలిసికొనుసాధనమైన (1) సమాధికి (2) అభావము కలుగుట వలన జీవునికే కర్తృత్వము కలదు.

1 మాం. 2-2-6 'ఆత్మావారే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో నిదిధ్యాసితవ్యః । సోన్వేష్టవ్య స్సవిజిజ్ఞాసితవ్యః'
తా॥ 60 పుటలో కలదు.

2 'ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం స్వస్తినః పారాయ తమసః పరస్తాత్'

తా॥ కర్మమార్గమునుండి విరక్తులైన శిష్యులారా మీకు నిర్విఘ్నమగుగాక. అజ్ఞానతమస్సుకంటె తరువాతనున్న అవతలియొడ్డగు బ్రహ్మస్వరూపప్రాప్తికై ఆత్మస్వరూపమును ఓంకారమూలముగా ధ్యానింపుడు.

(15 అధి) 1 యథా చ 2 తక్ష్ణో 3 భయథా ॥ 40సూ.

తా॥ (2) వడ్రంగి (1) పనిచేయునపుడు దుఃఖమును, పని మానినపుడు సుఖమును పొందునట్లు జీవుడును (3) అవిద్యచేత ద్వైతముతో కూడి స్వప్న జాగరావస్థలలో దుఃఖించుచు, సుషుప్తియందు పరమాత్మునందు సుఖించుచున్నాడు. ఇట్లు జీవుడు కర్తగాను, అకర్తగానుండును. అట్లె ముక్త్యవస్థయందును అవిద్యను జ్ఞానదీపముచేల నివారించి కేవలాత్ముడై సుఖించును. జీవునకు బ్రహ్మతత్త్వమునుపదేశించుటచేత స్వాభావికకర్తృత్వములేదు. మనస్సుయొక్క వృత్తులైన కామా

దులు స్వప్నమునందును కలవు. ఉపాధిచేత కర్తృత్వము కలి
గెను. గనుక అసంగశ్రుతులకు విరోధములేదు.

1 బృ. 6-3-7 'ధ్యాయతీవ లేలాయతీవ'

2 బృ. 4-4-14 'యత్రహి ద్వైతమివ భవతి తదితర
ఇతరం పశ్యతి । యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్తత్కేన
కం పశ్యేత్' దీని తా. 215 పుటలో కలదు.

3 బృ. 6-3-21 'తద్వా అస్యైతదాప్తకామమాత్మకామ
మకామం రూపం శోకాంతరం'

4 బృ. 6-4-32 'ఏషాస్య పరమాగతిరేషాస్య పరమా
సంపదేషోస్య పరమో లోక ఏషోస్య పరమఆనందః'

తా॥ 3-4 ఆత్మతో నేకీభవించి తదితరమును చూడకపోవు
టయే పరబ్రహ్మరూపము. అది కోరికలు దుఃఖము లేనిది.
ఆనందరూపము. ఇదియే జీవునకు కర్మసాధ్యమగు దేవతాది
ప్రాప్తికంటె నుత్తమమగు ప్రాప్యస్థానము.

(16 అధి) పరాత్తు తచ్ఛ్రుతేః ॥ 41సూ.

తా. పరాత్ = ఇంద్రియసముదాయముతో అజ్ఞానావస్థ
యందున్న జీవునికి ఈశ్వరానుగ్రహముచేతనే కర్తృత్వ భో
క్తృత్వాది సంసారమును, జ్ఞానముచేత మోక్షమునుకలుగును

1 కౌ. 3-8 'ఏషహ్యేవ సాధుకర్మ కారయతి తంయమే
భ్యో లోకేభ్య ఉన్నినీషత ఏషహ్యేవాసాధుకర్మ కారయతి
తం యమధో నినీషతే' తా॥ 2-1-34 సూ. నందు కలదు.

2 బృ. 5 'య ఆత్మని తిష్ఠన్నాత్మానమంతరో యమయతి'

1 కృతప్రయత్నాపేక్ష 2 స్తు 3 విహితప్రతి
షిద్ధావైయర్థ్యాదిభ్యః॥ 42సూ.

తా॥ (1) జీవుడుచేసిన ధర్మాధర్మముల ననుసరించి ఈశ్వరుడు ప్రేరణచేయుచు విషమఫలములనిచ్చుచున్నాడు. గాని నతనికి పక్షపాతములేదు (3) ఈశ్వరునకట్టిశక్తి లేదనునెడల విధిశాస్త్రము వ్యర్థమగును. 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' 'బ్రాహ్మణో నహంతవ్యః' ఇత్యాది విధినిషేధవాక్యములు కలవు.

(17 అధి) అంశో నానావ్యపదేశా దన్యథాచాపి దాశకితవాదిత్వ మధీయతఏకే ॥ 43సూ.

తా॥ అంశః=విస్ఫులింగములు అగ్నియొక్క అంశములైనట్లు జీవుడు ఈశ్వరాంశమేయగును. నానావ్యపదేశాత్= 'సోన్వేష్టవ్య స్సవిజిజ్ఞాసితవ్యః' 'ఏతమేవ విదిత్వా మునిర్భవతి' 'య ఆత్మని తిష్ఠన్నాత్మానమంతరో యమయతి' ఈమొదలగు భేదములేనపుడు ఉపపన్నముకాదుగనుక జీవుడే ఈశ్వరుడనరాదు. అన్యథా=మఱియొక అభేదమును చెప్పువాక్యము కలదు. ఏకే=ఆథర్వణికులు బ్రహ్మసూక్తమునందు 'బ్రహ్మదాశా బ్రహ్మదాసా బ్రహ్మేవేమేకితవా' యను వాక్యముచేత దాశకితవాదిత్వం=బ్రహ్మమునకు దాశకితవాదిభావమును అధీయతే=పఠించుచున్నారు. దాశులు=పల్లెవాండ్రు, దాసులు= స్వామివిషయము ఆత్మను సమర్పించువారు, కితవులు=జూదమాడువారు మొదలగువారు. వీరందరును బ్రహ్మమేయని చెప్పుచున్నారు. 'త్వం స్త్రీ త్వం పుమా' నిత్యాది శ్రుతులవలనను జీవుడు ఈశ్వరాంశమే యగును.

మఱియు, మంత్రవర్ణాచ్చ ॥ 44సూ.

తా॥ ఛాం. 3-12-6 'ఏతావానస్య మహిమా తతోజ్యా

యాగ్ంశ్చ పూరుషః పాదోస్య సర్వాభూతాని త్రిపాదస్యా మృతందివి' పరబ్రహ్మము జగత్తుకంటె మహత్తరమైనది. ఇతని నాల్గవఅంశమే అన్నిజంతువులును మిగిలిన మూడంశములు సూర్యమండలమునందు భక్తానుగ్రహముకొఱకునున్నది. 'అహింసన్ సర్వభూతాని అన్యత్ర తీర్థేభ్యః' ఏజంతువునుగాని హింసింపనివాడు బ్రహ్మలోకమును పొందును. అని జీవునికి ఈశ్వరాంశము మంత్రవర్ణమందును చెప్పబడినది.

అపిచ స్మర్యతే ॥ 45సూ.

తా॥ మఱియు, భగవద్గీత 15అ. 7 'మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః' అని జీవునకు ఈశ్వరాంశముచెప్పబడినది.

ప్రకాశాదివన్నైవం పరః ॥ 46సూ.

తా॥ ఏవం-ఈప్రకారము జీవునకుగల సంసారదుఃఖములు పరః-పరుడగు ఈశ్వరునకు న-లేవు. ప్రకాశాదివత్-సూర్యచంద్రుల తేజస్సులు అంగుళులు మొదలగు నుపాధులసంబంధమువలన ఋజువక్రభావమును పొందుచున్నను పరమార్థముచేత పొందనట్లే బుద్ధ్యాదులతోకూడిన జీవుడు దుఃఖించుచున్నను అట్టిదుఃఖము ఈశ్వరునకులేదు.

స్మరంతి చ ॥ 47సూ.

తా॥ క్రింది శ్రుతిస్మృతులు జీవునికిగల సంసారదుఃఖములు బ్రహ్మమునకు లేవని చెప్పుచున్నవి.

1 శ్వే. 4-6 'తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యోభిచాకశీతి' తా॥ జీవుడు కర్మఫలమనుభవించును. ఈశ్వరుడు అట్టిదిలేకుండా సాక్షిగానుండును.

2 క. 5-11 'ఏకస్తథా సర్వభూతాంతరాత్మా నలిప్యతే

లోకదుఃఖేనబాహ్యః' తా॥ పరబ్రహ్మమునకు జీవునిదుఃఖములతో సంబంధములేదు.

3 వ్యాసస్మృతి. తత్ర యః పరమాత్మాహి సనిత్యో నిర్గుణస్స్మృతః। నలిప్యతే ఫలైశ్చాపి పద్మపత్రమివాంభసా॥ కర్మాత్మాత్వపరో యోసౌ మోక్షబంధైస్సయుజ్యతే। సనప్తదశకేనాపి రాశినా యుజ్యతే పునః॥

తా॥ పరమేశ్వరుడు నిత్యుడు, నిర్గుణుడు, తామరాకును నీరువలె కర్మఫలమునంటనివాడు. జీవుడు కర్మాశ్రయుడు, బంధమోక్షములుకలవాడు. అతడే జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, ప్రాణములు, మనోబుద్ధులు, అనెడి 17 సంఖ్యగల రాశిగల లింగశరీరముతో సంబంధముకలవాడు.

అవ॥ సర్వశరీరములయందున్న జీవుడు ఒక్కడేయనుటచేత సర్వజాతులును ఒకటియేయై విధినిషేధములకు అవకాశముండదని యాక్షేపమురాగా-

1 అనుజ్ఞాపరిహారౌ 2 దేహసంబంధా 3 జ్జ్యోతిరాదివత్ ।48

తా॥ (1) 'ఋతౌ భార్యాముపేయాత్' అను జ్ఞ విధి 'గుర్వంగనాం నోపగచ్ఛేత్' నిషేధము. అట్లే 'అగ్నీషోమీయం పశుం సంజ్ఞపయేత్' అనుజ్ఞ. 'నహింస్యాత్సర్వభూతాని' పరిహారము. ఇట్లే లోకమునందును 'మిత్రముపాసితవ్యం' యనుజ్ఞ. 'శత్రుః పరిహర్తవ్యః' పరిహారము. ఇట్లు విధినిషేధములచేత ఆత్మునికి ఏకత్వమున్నను (2) దేహముతోసంబంధము వలన నుపపన్నమే. (3) అగ్నికి ఏకత్వమున్నను స్మశానాగ్ని పరిహరింపబడును గాని ఇతరాగ్ని పరిహరింపబడదు. ఇట్లే ఆత్మునకు విధినిషేధములు ఉపాధిభేదమువలన కలుగును.

అవ॥ సర్వశరీరములయందును కర్తగానున్న జీవుడు ఒకడే యనునపుడు ఫలసాంకర్యము కలుగదాయని పూర్వపక్షము రాగా— 1 అసంతతే 2 శ్చావ్యతికరః॥ 49సూ.

తా॥ (1) కర్తయు, భోక్తయు నగు జీవునకు ఎల్లశరీరములతోను సంబంధములేకపోవుటవలన కర్మఫలసాంకర్యములు లేవు. ఆత్మకును అట్లె. గనుకనే (2) కర్మవ్యతికరముగాని ఫల వ్యతికరముగాని లేదు.

ఆభాసఏవ చ 50సూ.

తా॥ జీవుడు ఆత్మయొక్క ప్రతిబింబమేకాని సాక్షాత్తుగా పరమాత్మకాడు. వేఱొకవస్తువును కాదు. ఒకజీవుని కర్మఫలముతో వేఱొకజీవునకు సంబంధములేదు.

అదృష్టా నియమాత్ ॥ 51సూ.

తా॥ అదృష్టమునకు నియమములేకపోవుటవలన ధర్మాధర్మలక్షణమగు యదృష్టము ఒకొ్కకజీవునకు ఒకొ్కకవిధముగా నుండును. 1 అభిసంధ్యాదిష్వపి 2 చైవం 52.

తా॥ (1) సాధారణమగు ఆత్మ మనస్సంయోగముచేత ఎల్లజీవుల సన్నిధానమందును చేయుబడుచున్న రాగాదులయందు నియమకారణముకానందునవలన వానియందును (2) పై ప్రకారమే కలుగును.

1 ప్రదేశాదితిచే 2 న్నాం 3 తర్భాభాత్ ॥ 53.

తా॥ (1) ఆత్మకు శరీరోపాధిని పొందినపుడే మనస్సుతో సంబంధముకలదు. అట్టియవస్థ పరమార్థకార్యములకును, అదృష్టమునకును, సుఖదుఃఖములకును కాగలదంటివేని (2) కాదు. (3) ప్రభుత్వము ఎలజీవులకును సమానమేయగుట

చేత నెల్లశరీరములందును అంతర్భవించుటవలన నదియుక్తము కాదు. 3 వ పాదము సమాప్తము.

---

## 16 వ ప్ర॥ 2అ. 4 పాదము.

అవ॥ ప్రాణమును, ఇంద్రియములు 11 ను, సూక్ష్మభూతములనియు, జగత్కర్త పరమేశ్వరుడేకాని జీవుడు కాడనియు మొదలగునవి చెప్పబడుచున్నవి.

(1 అధి) తథా ప్రాణాః ॥ 1సూ.

తా॥ క్రింది 1-2 శ్రుతులయందు ప్రాణములకుత్పత్తిచెప్పలేదు. 3 శ్రుతియందు లయమును, 4-5-6-7 శ్రుతులయందుత్పత్తియును చెప్పబడినది. 8 శ్రుతియందు ప్రాణోత్పత్తివాక్యసముదాయముచెప్పబడినది. ఆవాక్యమందు లోకాదులు పరబ్రహ్మమునుండి పుట్టుచున్నట్లే ప్రాణములుపుట్టుచున్నవని 'ఏతస్మాజ్జాయతే ప్రాణో' ఇత్యాది శ్రుతులందు ఆకాశాదులకువలెనే ప్రాణాదులకుత్పత్తిచెప్పబడినవి.

1 ఛాం. 6-2-3 'తత్తేజో సృజత' తా॥ 184పు॥ కలదు.

2 తై. 2-1-2 'తస్మాద్వాఏతస్మాదాత్మనఆకాశస్సంభూతః' తా॥ బ్రహ్మమువలన ఆకాశముపుట్టినది

3 'అసద్వా ఇదమగ్రఆసీత్తదాహుః కిం తదసదాసీదిత్యృషయో వావ తేఽగ్రే సదాసీత్తదాహుః కేతే ఋషయఇతి ప్రాణావా ఋషయః'

తా॥ జగత్తు సృష్టికిపూర్వము అభావమాత్రముగానుండెనని ఋషులనగా ప్రాణేంద్రియములు చెప్పుచున్నవి.

4 బృ. 4-1-20 'యథాగ్నేః క్షుద్రావిస్ఫులింగావ్యుచ్చరంతి। ఏవమేవైతస్మాదాత్మనస్సర్వే ప్రాణాః' 5 ముం. 'ఏతస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ' 6 ముం.2-1-1 'సప్త ప్రాణాః ప్రభవంతి తస్మాత్' 7 ప్ర. 'సప్రాణమసృజత ప్రాణాచ్ఛ్రద్ధాం ఖంవాయుర్జ్యోతిరాపః పృథివీంద్రియం మనోన్నం' 8 బృ. 'ఏతస్మాదాత్మనస్సర్వేప్రాణా స్సర్వేలోకాస్సర్వేదేవా స్సర్వాణి భూతాని చ వ్యుచ్చరంతి'

తా। 4 అగ్నివలన మిడుంగురులువలెనే ఆత్మనుండి ప్రాణముమొదలగు ఇంద్రియములు పుట్టుచున్నవి. 5 మనస్సు ఇంద్రియములును అక్షరపురుషునినుండియే పుట్టుచున్నవి. 6సప్త ప్రాణములు అనగా నేత్రములు రెండు, నాసాపుటములు రెండు, చెవులు రెండు, వాగింద్రియము ఒకటి. 7 ఆపురుషుడు సమష్టిప్రాణమగు హిరణ్యగర్భుని, ఆస్తిక్యబుద్ధిని ఆకాశమును, వాయువును, అగ్నిని, జలమును, భూమిని, వాగింద్రియమును మనస్సును, అన్నమును, క్రమముగా సృజించెను. 8 డిటో

గౌణ్యసంభవాత్ ॥ 2సూ.

తా॥ ప్రాణోత్పత్తిశ్రుతి గౌణము అందువేసి కాదు. ముఖ్యమే

1 క. 'కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి' 'తస్మాజ్జాయతే ప్రాణః' 2 పురుషఏవేదం విశ్వం తపో బ్రహ్మపరామృతం' 3 'బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం' 4 'ఆత్మనోవా౽రేదర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానేనేదం సర్వం విదితం'

తా॥ సృష్టికిపూర్వము సద్భావమని వినువాక్యమునకు గతి యేమనగా- 'అప్రాణో హ్యమనాశ్శుభ్రో హ్యక్షరాత్పరతః

పరః' యను శ్రుతిచేత మూలప్రకృతికి ప్రాణాది విశేషరాహిత్య నిశ్చయమువలన నిది మూలకారణవిషయము కాదు.

తత్ప్రాక్ఛ్రుతేశ్చ ॥ 3సూ.

తా॥ 'ఏతస్మాజ్జాయతే ప్రాణః' యను శ్రుతిలో జాయతే యను శబ్దమునకు ప్రాక్ ప్రాక్ఛ్రుతేః చ పాఠక్రమమునందు మొదటివియగు ప్రాణములు వినబడుటవలన ఆకాశాదులవలె ప్రాణములకునుత్పత్తి ముఖ్యమే.

తత్పూర్వకత్వాద్వాచః ॥ 4సూ.

తా॥ వాక్ శబ్దముచేత ప్రాణము, మనస్సు గ్రహింపబడును. ఛాం. 'అన్నమయంహి సోమ్యమనఆపోమయః ప్రాణస్తేజోమయీ వాక్' యను శ్రుతియందు వాక్కుకంటెప్రాణమనస్సులు తత్పూర్వకత్వాత్ = బ్రహ్మము ప్రకృతిగాగల అగ్ని, జల, భూములవలన పుట్టినవియని చెప్పుటవలన నెల్ల ప్రాణేంద్రియములును బ్రహ్మమువలన పుట్టినవని సిద్ధించుచున్నది. (2 అధి) సప్తగతేర్విశేషితత్వాచ్చ ॥ 5సూ.

తా॥ ముఖ్యప్రాణముగాక తక్కినప్రాణములు ఎన్నియని సంశయమురాగా- ప్రాణములు సప్తైవ=ఏడేయని గతేః=సప్త ప్రాణాః ప్రభవంతి తస్మాత్' ఇత్యాది శ్రుతులు చెప్పుచున్నవి. 'సప్తవై శీర్షణ్యాః ప్రాణాః' యనుచోట విశేషితత్వాచ్చ=ప్రత్యేకించిచెప్పబడినవని పూర్వపక్షము.

1 హస్తాదయస్తు 2 స్థితే 3 ఽతో 4 నైవం ॥ 6సూ.

తా॥ సిద్ధాంతము- (1) పైయేడింటికంటె నధికముగా చేతులు మొదలగునవి శ్రుతులందువినుటవలన (2) ఏడుసంఖ్యకంటె అధికముగ నున్నందున ఎక్కువసంఖ్య తక్కువసంఖ్య

యంను (3) అంతర్భవింపదు. కాబట్టి పదునొకండే ఇంద్రియములు. అట్లే 'దశమే పురుషే ప్రాణా ఆత్మైకాదశ' యని శ్రుతికలదు. ఆత్మశబ్దముచేత అంతఃకరణము గ్రహింపబడును ఇట్లే మరణకాలమునందున్నవని 'దశమేపురుషే ప్రాణాఆత్మైకాదశస్తే యదాస్మాచ్ఛరీరాదుత్క్రామంత్యథ రోదయంతి'యని శ్రుతికలదు. (3 అధి) అణవశ్చ ॥ 7సూ.

తా॥ ప్రాణములనెడి ఇంద్రియములు సూక్ష్మములును, అల్పములును గనుక అణుపరిమాణముకలవి.

(4 అధి) శ్రేష్ఠశ్చ ॥ 8సూ.

తా॥ తక్కినప్రాణములకువలె ముఖ్యప్రాణమునకును బ్రహ్మమువలన నుత్పత్తికలదని ముం. 'తస్మాజ్జాయతే ప్రాణో మనస్సర్వేంద్రియాణిచ' ఇత్యాదిశ్రుతులు చెప్పుచున్నవి.

(5 అధి) 1 న 2 వాయుక్రియే 3 పృథగుపదేశాత్ ॥ 9

తా॥ ప్రాణమే వాయువనియు, అది ప్రాణము, అపానము వ్యానము, ఉదానము, సమానము అను నైదువిధములుగనుండునని 'యఃప్రాణస్సవాయు స్సఏషవాయుః పంచవిధః ప్రాణోపానోవ్యాన ఉదానస్సమానః' యనుశ్రుతి చెప్పుచున్నది. సర్వేంద్రియములవృత్తిన్ని ప్రాణమని సాంఖ్యమతమందు ప్రాప్తింపగా (2-1) వాయువుగాని ఇంద్రియవ్యాపారముగాని ప్రాణస్వరూపముకాదని (3) వేఱుగాచెప్పుటవలన ప్రాణమే బ్రహ్మముయొక్క నాల్గవపాదమనియు, వాయువుచేత వ్యక్తమై తనకార్యము చేయుననియు, ఛాం. 3-18-4 'ప్రాణఏవ బ్రహ్మణశ్చతుర్థః పాదస్సవాయునా భాతి చ తపతిచ' యను శ్రుతిచెప్పుచున్నది. గనుక భేదాభేదశ్రుతులకువిరోధము లేదు.

1 చక్షురాదివ 2 త్తు 3 తత్సహశిష్ట్యాదిభ్యః ॥ 10.

తా॥ ప్రాణమునకు స్వాతంత్ర్యము కలదందువేని (2) లేదు. (1) రాజునకు మంత్రులువలె, నేత్రములు మొదలగు ఇంద్రియములు జీవునకు కర్తృత్వ భోక్తృత్వాదులకో ఉపకరణములుగాని స్వతంత్రములు కానట్లే ముఖ్యప్రాణమున్ను జీవునకు సహాయపడునేకాని స్వతంత్రము కాదు. (3) నేత్రాదులతోకూడా ప్రాణము (ప్రాణసంవాదులందు) చెప్పబడుటవలన స్వతంత్రము కాదు.

1 అకరణత్వాచ్చ 2 న 3 దోష 4 స్తథాహి 5 దర్శయతి॥ 11

తా॥ (1) ప్రాణము ఇంద్రియముకానందున (3) విషయాంతరముకావలెనను దోషము (2) లేదు. (4) అట్లే ముఖ్యప్రాణమునకు తక్కిన ఇంద్రియముల నెడి ప్రాణములకంటె విశేషమును (5) శ్రుతిచూపుచున్నది.

1 ఛాం. 5-1-6-7 'అథహ ప్రాణా అహం శ్రేయసే వ్యూదిరే' యని యారంభించి 'యస్మిన్వ ఉత్క్రాంత ఇదం శరీరం పాపిష్ఠతరమివ దృశ్యతే సవశ్శ్రేష్ఠః'

తా॥ ముఖ్యప్రాణమును, ఇంద్రియములును, ఎవరు శ్రేష్ఠులనికోరగా బ్రహ్మదేవుడు ఎవరుపోతే దేహము ముట్టరాని అశుచిగలదియగునో వారు శ్రేష్ఠమనిచెప్పెను. దీనివలనప్రాణమే ముఖ్యకారణము.

2 బృ. 6-3-12 'ప్రాణేన రక్షన్నవరం కులాయ'

తా॥ చక్షురాదీంద్రియములు నిద్రించునపుడు ప్రాణమే శరీరరక్షణమును చేయుచున్నది.

1 పంచవృత్తి 2 ర్మనోవ 3 ద్వ్యపదిశ్యతే ॥ 12సూ.

తా॥ (2) మనస్సునకువలెనే ప్రాణమున్ను (1) ప్రాణాపానాది మైదువృత్తులు కలదియని (3) శ్రుతులు చెప్పుచున్నవి. ప్రాణముయొక్క పంచవృత్తులు ఎట్లనగా- ప్రాణముచ్ఛ్వాసాదిగుండా నాసికనుండి వెలుపలకువచ్చునట్టియవస్థ ప్రాణము. లోపలికిపోవు అవస్థ అపానము. నిశ్వాసాది కర్మములుగలది లోపలికిపోవునపు డుచ్ఛ్వాసయనియు, వెలుపలికివచ్చునపుడు నిశ్వాసయనియు, కొన్నిచోట్లకలదు. వాసరెండింటికిని మధ్యముననుండునది వ్యానము. అది బలసాధ్యములగు అగ్నిమంథనాదికార్యములకు హేతువు. మీదికిపోవునవస్థగల యుదానముత్క్రాంత్యాదులకు కారణము. రసమును అన్నియవయవములయందును సమానముగ ప్రసరింపచేయునది సమానము.

(6 అధి) అణుశ్చ ॥ 13సూ.

తా॥ ముఖ్యప్రాణమున్ను తక్కినప్రాణములవలె అణుత్వము, సూక్ష్మమును గనుకనే ఉత్క్రాంతికాలమునందు ప్రక్కలనున్నవారిచేతనైనను చూడబడదు.

1 బృ. 8-3-22 'సమఃప్లుషిణా సమో మశకేన సమో నాగేన సమఏభిస్త్రిభిర్లోకై స్సమోఽనేన సర్వేణ'

తా॥ ముఖ్యప్రాణము చిన్నపురుగుతోను, దోమతోను, ఏనుగుతోను, ఈజగత్తుతోను తుల్యమైనది.

(7 అధి) 1 జ్యోతిరాద్యధిష్ఠానం 2 తు 3 తదామననాత్ ॥ 14

తా॥ (1) అగ్ని మొదలగు నభిమానదేవతలచేత నధిష్ఠితములై ప్రాణాదులు తమతమకార్యములందు ప్రవర్తించుచున్నవి. గాని స్వతంత్రముగా సమర్థమైనవికావు. (3) అట్లే శ్రుతులుకలవు.

1 ఐ. 1-2-4 'అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్'
'వాయుః ప్రాణోభూత్వా నాసికే ప్రావిశత్'

తా॥ అగ్ని వాగింద్రియమై నోటియందును, వాయువు ప్రాణమై నాసికారంధ్రములందును ప్రవేశించెను.

2 భా. శాం. 'వాగధ్యాత్మమితి ప్రాహుర్బ్రాహ్మణాస్తత్వదర్శినః। వక్తవ్యమధిభూతంతు వహ్నిస్తత్రాధిదైవితం॥'

తా॥ జ్ఞానులైన బ్రాహ్మణులు వాగింద్రియమును అధ్యాత్మమనియు, వాగింద్రియవిషయపదార్థసముదాయమును అధిభూతమనియు, అగ్ని దానికి ప్రేరకదేవతయనియు చెప్పుచున్నారు.

1 ప్రాణవతా 2 శబ్దాత్ ॥ 15సూ.

తా॥ ఇంద్రియములకు అధిష్ఠానదేవతలున్నను (1) జీవునితోడనే ప్రాణేంద్రియాదులకు సంబంధమని (2)శ్రుతులుకలవు

1 ఛాం. 8-12-4 'అథ యత్రైతదాకాశ మనుప్రవిష్టం చక్షుస్సచాక్షుషః పురుషో దర్శనాయ చక్షురథ యోవేదేదం జిఘ్రాణీతి సఆత్మా గంధాయ ఘ్రాణం'

తా॥ చక్షురింద్రియము నల్లగ్రుడ్డునందు ప్రవేశించునపుడు జీవుడు దానినభిమానించు ద్రష్టయగును. ఆయింద్రియము జీవునికి యింద్రియాపేక్ష వ్యాపారముకొఱకేగాని జ్ఞానముకొఱకు కాదు. ఇంద్రియాధిష్ఠానదేవతలనేకులు కనుక వారికి భోగము సంభవింపదు.

1 తస్య చ 2 నిత్యత్వాత్ ॥ 16సూ.

తా॥ సుఖదుఃఖములు (1) జీవునకు (2) నిత్యమగుటవలన నతనికేగాని ఇంద్రియాధిష్ఠానదేవతలకు లేదు. [గచ్ఛతి.

1 బృ=పుణ్యమేవాముంగచ్ఛతి నహవై దేవాన్ పాపం

తా॥ దేవతలను పుణ్యమేగాని పాపముపొందదు.

2 బృ. 6-4-2 'తముత్క్రామంతం ప్రాణోనూత్క్రామతి ప్రాణమనూత్క్రామంతం సర్వేప్రాణా అనూత్క్రామంతి'

తా॥ జీవునినను సరించి ముఖ్యప్రాణమును, దానిననుసరించి తక్కిన యింద్రియములును పోవుచున్నవి.

తఇంద్రియాణితద్వ్యపదేశాదన్యత్ర శ్రేష్ఠాత్ 17సూ. (8 అధి)

తా॥ తే=ఆప్రాణములు అన్యత్ర శ్రేష్ఠాత్ =ముఖ్యప్రాణముకంటె నితరములని కనిపించుటవలన ఇంద్రియాణి=ఇంద్రియములని భేదము చెప్పబడుచున్నది.

18 భేదశ్రుతేః

తా॥ వాగాదులు ప్రాణముకంటె వేఱని శ్రుతులుచెప్పుటవలన వేఱు తత్త్వములేకాని ప్రాణవృత్తులుకావు.

1 బృ. 3-5-3 'మనోవాచంప్రాణంతా న్యాత్మనేఽకురుత'

తా॥ సృష్టికర్త మనసును, వాగింద్రియమును, ప్రాణమును, తనకొఱకు రచియించెను.

వైలక్షణ్యాచ్చ 19 సూ.

తా॥ వాగాదులు నిద్రించునపుడు మేల్కొనియుండు ముఖ్యప్రాణమునకు మృత్యుగ్రస్తములేదు. తక్కినవానికి కలదు. ముఖ్యప్రాణమే దేహధారణమునకును, దేహపతనమునకును హేతువుగాని తక్కినయింద్రియములుకావు. విషయాలోచనకు ఇంద్రియములు కారణముగాని ప్రాణముకాదు.

1 సంజ్ఞామూర్తి 2 క్లృప్తిస్తు 3 త్రివృత్కుర్వత 4 ఉపదేశాత్॥ 20 సూ. (9 అధి)

తా॥ (1) అగ్నియును, ఆదిత్యుడును, విద్యుత్ ను, ఆశ్లే కుశ. కాశ. పలాశాదులందును, పశు. మృగ. మనుష్యాదులందును, ప్రతిజాతియు ప్రతివ్యక్తియు ననేకప్రకారములుగల నామరూపములతోకూడిన యీజగత్తు (2) అగ్ని జల భూములను నిర్మించిన పరమేశ్వరునియొక్క కార్యమేకాని జీవకార్యముకాదని శ్రుతులు కలవు.

ఛాం 6-3-2 సేయం దేవ తైక్షత హంతాహమిమా స్తిస్రో దేవతా అనేనజీవేనాత్మనానుప్రవిశ్య నామరూపేవ్యాకరవాణి

తా॥ అగ్నిజలభూములను సృజించినసద్దేవత నామరూపములను స్పష్టపరుతునని సంకల్పించెను.

1 మాంసాది 2 భౌమం 3 యథాశబ్ద 4 మితరయోశ్చ 21 సూ

తా॥ (1) మాంసము మొదలగునవి (2) భూమివలన పుట్టినవని (3) శబ్దానుసారముగా తెలియబడుచున్నది. (4) జలాగ్నులయొక్క కార్యములను 3 శబ్దానుసారముగా నెఱుగవలెను. మూత్రిలోహితప్రాణములు జలకార్యములు, మజ్జాస్థివాక్కులు అగ్ని కార్యములు ప్రాణవాయువునకు జలకార్యత్వము ఔపచారికము.

1 ఛాం 6-5-1 అన్నమశితం త్రేధావిధీయతే తస్యయస్థవిష్ఠోధాతు స్తత్పురీషం భవతి యోమధ్యమ స్తన్మాంసం యోఽణిష్ఠ స్తన్మనః॥

తా॥ అన్నము జఠరాగ్నిచేత పచనమై మిక్కిలిస్థూలమైన వస్తువు పురీషమగును. మధ్యమాంశము రసాదిక్రమమున మాంసమగును. అత్యంతసూక్ష్మాంశము హృదయమున సూక్ష్మనాడులగుండా వాగాదీంద్రియముల స్థితినిసంపాదించుచు

మనస్సగును మనోరూపముచేతపరిణమించియభివృద్ధియగును.

1 వైశేష్యాత్తు 2 తద్వాద 3 స్తద్వాదః 22 సూ.

తా॥ (1) విశేషముయొక్క భావము బాహుళ్యమువలన త్రివృత్కరణము అన్నిభూతములకు సమానమైనను ఒక్కొక చోట నొక్కొక భూతధాతువునకు నాధిక్యముచూచుటవలన (2) పృధివ్యాది భేదోపదేశము యుక్తము.

2 అధ్యాయము సమాప్తము.

---

16 వ ప్రి॥ 3అ. 1 పాదము.

అవ॥ జీవులు ఈశరీరమునుండి తొలగినతరువాత కలుగు దుఃఖములను, సత్కర్మఫలముచేత కలుగు జ్ఞానమును చెప్పు చున్నాడు.

(1 అధి) 1 తదంతరప్రతిపత్తౌ 2 రంహతి 3 సంపరి ష్వక్తః 4 ప్రశ్ననిరూపణాభ్యాం॥ 1సూ.

తా॥ జీవుడు (1) దేహాంతరమునుపొందుటకు దేహబీజము లగు భూతసూక్ష్మములతో (3) కూడినవాడై (2) పోవుచు న్నాడని (4) ప్రశ్నోత్తరములచేత చెప్పబడుచున్నది.

1 ఛాం. 5-3-3 'వేత్థ యధాపంచమ్యామాహుతావాపః పురుషవచసో భవంతి' యని ప్రశ్నము. ఇది ప్రవాహణుడను రాజు శ్వేతకేతువునడిగిన ప్రశ్నములలో 5 వది.

ఓ శ్వేతకేతూ భూతసూక్ష్మములలో ఐదవయాహుతి యగు స్త్రీరూపాగ్నియందు దహించునపుడు పురుషాకారము గ నెట్లుపరిణమించుచున్నవో ఎఱుగుదువా?

ద్యు, పర్జన్య, పృథివీ, పురుష యోషిత్తు లనెడి ఐదుఅగ్ను లందును శ్రద్ధా, సోమ, వృష్ట్య, న్న, రేతో, రూపములనెడి యాహుతులను చెప్పినతరువాత-

2 ఛాం. 5-9-1 'ఇతి తు పంచమ్యా మాహుతావాపః పురుషవచసో భవంతి'

తా॥ శ్వేతకేతు తనతండ్రిని, అతడు ప్రవాహణుడను రాజును అడుగగా నతడిట్లుచెప్పెను. ఓగౌతముడా! సూక్ష్మభూతములు దధ్యాదిరూపములగు జలాగ్నులయందు కాల్పబడి సూక్ష్మరూపముతో జీవునినాశ్రయించి ఇంద్రియాధిష్ఠానదేవతలచేత ద్యులోకాగ్నియందు కాల్పబడి సోమనామముగల దేహముతోనుండును. మరల సంతాపముచేత కరగిన జలమయదేహమును పర్జన్యాగ్నియందు కాల్పగా నది వర్షమగును. ఇట్లు సోమభావ వర్షభావములను పొందినవానిని భూమ్యగ్నియందు కాల్పగా నవి వ్రీహియవాద్యన్నరూపముగ పరిణమించును. వానిని పురుషాగ్నియందు చేయు హోమముచేత రేతోరూపమగును. దానిని స్త్రీరూపాగ్నియందు హోమము చేయగా రేతోరూపమును పొందిన జలమై గర్భరూపమును పొంది పురుషశబ్దవాచ్యములగుచున్నవి. ఇది ఉత్తరము. కనుక జీవుడు భూతసూక్ష్మములతోకూడియే పోవుచున్నాడు.

1 త్ర్యాత్మకత్వా త్తు 2 భూయస్త్వాత్ ॥ 2సూ.

తా॥ పైశ్రుతి జలమునేచెప్పుచున్నను త్రివృత్కరణశ్రుతి వలన నుదకములే అగ్నియు, భూమియు నగుటవలన నవి దేహారంభములేయగును. శరీరమునందు అధికభాగమైన జలశబ్దము చేత పంచభూతములును చెప్పబడినవి. (1) దేహము తేజ

జలాన్న కార్యముల (పాక స్వేదగంధముల) వలన భూతత్రి యారబ్ధమే. వాత, పైత్య, శ్లేష్మ ములనెడి మూడుధాతువుల తోకూడుటచేత త్ర్యాత్మకమే. (పంచీకరణమే) దేహము తక్కినభూతములులేనిదే కేవలముదకముతో నారంభింపబడ శక్యము కాదు. 'ఆపఃపురుషవచసో భవంతి' యను ప్రశ్నప్రతి వచనములలో (2) బాహుళ్యమున పేక్షించి జలశబ్దము ప్రయోగింపబడినది. ప్రాణగతేశ్చ ॥ 3సూ.

తా॥ బృ. 6-4-2 'తముత్క్రామంతం ప్రాణో ఽనూత్క్రామతి ప్రాణమనూత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామంతి' యను శ్రుతిచేత జీవునితో ప్రాణములును, ఇంద్రియములును ఉదకములతో కలిసి పోవుచున్నవి.

1 అగ్న్యాదిగతిశ్రుతే 2 రితిచే 3 న్న 4 భాక్తత్వాత్ ॥4

తా॥ 1 బృ. 5-2-13 'యత్రాస్యపురుషస్యాగ్నిం వాగప్యేతి వాతం ప్రాణః' వాగింద్రియము అగ్నియందును, ప్రాణవాయువు మహావాయువునందును, వెండ్రుకలు, లతలు, వృక్షములందును ప్రవేశించును. అప్పుడు జీవుడు దేనినాశ్రయించును అని యార్తభాగుడు యాజ్ఞవల్క్యుని నడిగిన (1) శ్రుతివలన ప్రాణములు జీవునితో పోనేరవు. (2) అనియందు వేని (3) కాదు. (4) వాగాదులు అగ్న్యాదులను పొందుననిన శ్రుతిలో లోమకేశాదులు చెప్పలేదు గనుక గౌణమగును. జీవునికి యుపాధివినాగా గమనమును, ప్రాణములువినాగా దేహాంతరభోగమును సంభవింపదు.

1 ప్రథమే 2 ఽశ్రవణా 3 దితిచే 4 న్న 5 తాఏవ 6 హ్యు 7 పపత్తేః ॥ 5సూ.

తా॥ జలమును పర్జన్యాదులయందేగాని ప్రిధమాగ్నియందుకల్పింపశక్యముకానందున పురుషభావము యుక్తముకాదు. (3) అనియందువేని (6) ప్రిధమాగ్నియందు (5) ఆజలమునే శ్రిద్ధాశబ్దముచేత చెప్పుటవలన (4) దోషముకాదు. (7) శ్రిద్ధాశబ్దముచేత జలముగ్రిహింపతగును.

1 'ఆపోహాస్మై శ్రిద్ధాం సన్నమంతే పుణ్యాయ కర్మణే'

తా॥ జలములే స్నానాది పుణ్యకార్యములకొఱకు ఆసక్తినిపుట్టించుచున్నది గనుక శ్రిద్ధాశబ్దముచేత దోషములేదు.

1 అశ్రుతత్వా 2 దితిచే 3 న్నే 4 ష్టాదికారిణాం
5 ప్రితీతేః ॥ 6సూ.

తా॥ ఉదకములు పంచమాహుతియందు పురుషాకారమగునని (1) శ్రుతియందు లేనందున నుదకముతో జీవులుపోనేరరు. (2) అనియందువేని (4) యాగాదులను చేసినవారికి (5) అట్టిగమనప్రితీతియుండుటవలన (3) దోషముకాదు.

1 ఛాం. 5-10-3 'అథ యఇమే గ్రామే ఇష్టాపూర్తే దత్తమిత్యుపాసతే తే ధూమమభిసంభవంతి'

తా॥ అగ్నిహోత్రాదికర్మలును, వాపీకూప తటాకాది నిర్మాణమును, అర్థులకు యథాశక్తి దానమును, గురుసేవమొదలగునవియును ఆసక్తితోచేయువారు ధూమాది (పితృయాన) మార్గమును పొందుచున్నారు.

1 భాక్తం 2 వా 3 ఽనాత్మవిత్త్వా 4 త్తథాహి
5 దర్శయతి ॥ 7సూ.

తా॥ యాగములుచేసి చంద్రిలోకమునకు పోవువారు దేవతలకు ఆహారమగుదురని చెప్పిన 'ఏష సోమోరాజా తద్దేవా

నామన్నం తం దేవాభక్షయంతి' యను శ్రుతి (1) గౌణాతు ముఖ్యమను నెడల 'స్వర్గకామో యజేత' మొదలగు శ్రుతులకు బాధకలుగును. (2) మరియు దేవతలు అమృతమును చూచి సంతోషించువారేగాని భుజించరు, త్రాగరు, చర్వణాదికములేదు. అని ఛాం. 3-6-1 'నవై దేవా అశ్నంతి పిబంత్యేత దేవామృతం దృష్ట్వా తృప్యంతి' యను శ్రుతి చెప్పుచున్నది. (3) ఆత్మజ్ఞానములేని కర్మపరులు దేవతలకాహారమనుట యుక్తమే. (4) అట్లే బృ. 3-4-10 'అథ యోఽన్యాం దేవతాముపాస్తే ఽన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద యథా పశురేవం స దేవానాం' తా॥ ఆత్మదేవతకంటె వేఱుగా తాను వేఱు తానుపాసించు దేవత వేఱు అని ఉపాసించువాడు తత్త్వజ్ఞానము నెఱుగక పశువువలె దేవతలకు ఆహారమగునని శ్రుతి కలదు. కాని ఇది గౌణము. పంచాగ్ని విద్య నెఱిగిన యిష్టాదికారులు కర్మపరులేగాని ఆత్మవిదులుకారు. కర్మముతో జ్ఞానానుష్ఠానము చేయువారును కారు. చంద్రలోకఫలానంతరము మఱల నీలోకమునకు వత్తురని ప్ర. 5-4 'స సోమలోకే విభూతిమనుభూయ పునరావర్తతే' యని శ్రుతిచెప్పుచున్నది.

8 వ సూ. 15 వ ప్ర॥ లోను, 9 వ సూ. 2 వ ప్రకరణములోను కలవు.

(2 అధి) 1 ఆనర్థక్య 2 మితిచే 3 న్న 4 తదపేక్షత్వాత్. ॥ 10

తా॥ శ్రౌతమైన శీలమునకు శుభాశుభ యోన్యాపత్తిఫలము లేదను నెడల (1-2) శీలమఘనకు అనర్థకము కలుగునందు వేని (4) ఇష్టాదికర్మములు ఆచారమునపేక్షించుటవలన (3) దోషముకాదు. శీలమనగా- మనోవాక్కాయకర్మలలో దేనిచేతను

ఏజంతువునకును కీడుచేయక దయతోనుండుట. సత్ప్రవర్తనములేనివానిని వేదములు పవిత్రనిచేయచాలవని 'ఆచారహీనం నపునంతి వేదాః' ఇత్యాది శ్రుతిస్మృతులు కలవు. గనుక సత్ప్రవర్తనము శ్రేయము.

సుకృతదుష్కృతే ఏవేతి తు బాదరిః ॥ 11సూ.

తా॥ చరణశబ్దముచేత పుణ్యాపాపకర్మములేయని బాదరిముని తలచుచున్నాడు. పుణ్యకర్మగలవాడు ఉత్తముడని 'ధర్మంచరేత్యేషమహాత్మా' యను శ్రుతిచేత ఆచారముకూడా ధర్మవిశేషమునే చెప్పుచున్నది.

(3 అధి) అనిష్టాదికారిణామపి చ శ్రుతం ॥ 12సూ.

తా॥ యజ్ఞాదులుచేయనివారికిని, కౌ. 1-2 'యేవైకేచాఽస్మాల్లోకాత్ప్రయంతి చంద్రమసమేవ తే సర్వే గచ్ఛంతి' యను శ్రుతివలన పంచమాహుతిచేత దేహారంభమును, చంద్రలోకప్రాప్తియును కలుగుచున్నదిగదా యనిపూర్వపక్షము

1 సంయమనే 2 త్వ 3 నుభూయే 4 తరేషా 5 మారోహావరోహౌ 6 తద్గతిదర్శనాత్ ॥ 13సూ.

తా॥ సిద్ధాంతము- (4) యజ్ఞాదులులేని అధర్మపరులు(1) యమలోకమునందు తమతమకర్మఫలమును (3) అనుభవించి యీలోకమునకు వత్తురు. (5) ఇట్టిరాకపోకలున్నవని (6)శ్రుతులుచెప్పుటవలన నెల్లవారికిని చంద్రలోకప్రాప్తి లేదు.

1 క. 2-6 'న సాంపరాయణః ప్రతిభాతి బాలం ప్రమాద్యంతం విత్తమోహేన మూఢం అయం లోకో నాస్తి పరఇతి మానీ పునఃపునర్వశమాపద్యతే మే'

తా॥ ధనపుత్రాదులయందాశగలవారికి పరలోకసాధనో

పాయముతో చదు: పరలోకము లేదనువారు జన్మమరణము లుకలవారై నావశమగునని యముడు నచికేతునితో చెప్పెను 'వైవస్వతం సంగమనం జనానాం' ఇత్యాదిశ్రుతులచేత అధర్మపరులకు యమశిక్షకలదు.

స్మరంతి చ॥ 14సూ.

తా॥ మనువు, వ్యాసులు మొదలగు శిష్టులు నాచికేతోపాఖ్యానము మొదలగు గ్రంథములయందు పాపాత్ములకుయమలోక శిక్షలనే చెప్పియున్నారు.

అపి చ సప్త॥ 15సూ.

తా॥ పాపాత్ములు రౌరవాదినరకములేడిటిని పొందుచున్నారు గాని చంద్రలోకమును పొందరు.

1 తత్రాపిచ 2 తద్వ్యాపారా 3 దవిరోధః॥ 16సూ.

తా॥ (1) ఆనరకములందు (2) యమునికే స్వతంత్రమంగీకరించుటవలన (3) అవిరోధః=విరోధములేదు: చిత్రగుప్తాదులకు అధికారములేదు.

విద్యాకర్మణోరితి తు ప్రకృతత్వాత్ ॥ 17సూ.

తా॥ బ్రాహ్మణాదులు వారివారి యాశ్రమవిహితకర్మములను చేయుచు యజ్ఞదానాదికర్మములు చేసినవారు దక్షిణ (ధూమాది) మార్గముచేత చంద్రలోకఫలమనుభవించి మరలవత్తురు. వీరే విహితకర్మములను ఉపాసనలను చేయుచు జ్ఞానమును పొందినవారు ఉత్తర (అర్చిరాది) మార్గముచేత బ్రహ్మలోకమును పొందుదురు. ఈరెండుమార్గములును లేనివారికి మూడవమార్గమైన మశకదంశాది క్షుద్రజంతువులుగా జననమరణములు కలుగుచుండును.

1 ఛాం. 5-10-8 'అథైతయోః పథోర్న కతరేణ చ న తాని మాని క్షుద్రాణ్యసకృదావర్తీని భూతాని భవంతి జాయస్వ మ్రియస్వేత్యేతత్తృతీయస్థానం తేనాసా లోకో న సంపూర్యతే'

తా॥ కర్మములుగాని, ఉపాసనగాని లేని మూడవమార్గస్తులకు క్షుద్రజన్మములే కలుగును. పుణ్యకర్మలు లేనివారికి చంద్రలోకప్రాప్తి కలుగదని గౌతమునితో పాంచాలరాజు చెప్పెను. న తృతీయే తథోపలబ్ధేః ॥ 18సూ

తా॥ తృతీయె=మూడవమార్గమందు దేహలాభమునొరకు ఆహుతిసంఖ్యానియమము న=లేదు. తథా అట్లే ఉపలబ్ధేః శ్రుతులు చెప్పుచున్నవి.

1 'పంచమ్యామాహుతావాపః పురుషవచసో భవంతి'

2 'జాయస్వ మ్రియస్వేత్యేతత్తృతీయస్థానం'

తా॥ పురుషశబ్దము మనుష్యులకేగాని కీటపతంగాదులకు లేదు. 2 తా॥ మూడవమార్గమందు నిరంతరము జన్మమరణములు తప్పవు.

స్మర్యతేఽపిచ లోకే ॥ 19సూ.

తా॥ మఱియు లోకే=లోకమున భారతాదిగ్రంథములందు స్మర్యతే=ద్రోణుడు, ధృష్టద్యుమ్నుడు, సీతా, ద్రౌపది మొదలగువారికి యోనివలన పుట్టుక లేదని చెప్పబడుచున్నది. వారిలో ద్రోణాదులకు ఆహుతి ఒకటియైనను లేదు. ధృష్టద్యుమ్నుడు మొదలగువారికి స్త్రీపురుషవిషయమైన ఆహుతులు రెండును లేవు. బలాకపక్షి రేతస్సంబంధము లేకయే గర్భమునుధరించుచున్నది. గనుక ఆహుతినియమము లేదు.

దర్శనాచ్చ । 20 సూ.

తా। స్వేదజ, ఉద్భిజ్జములకు గ్రామ్యధర్మములేకనే ఉత్ప త్తికలదు. ఇష్టేష్టే సత్కర్మములు చేయవివారికినియమములేదు

1 తృతీయశబ్దావరోధః 2 సంశోకజస్య ॥ 21 సూ.

తా। 'అండజం జీవజముద్భిజ్జం' అనుచోట మూడేచెప్పినను (2) స్వేదజములకును (1) మూడవదైన ఉద్భిజ్జశబ్దముచేతనే గ్రహింపతగును. స్వేదజ ఉద్భిజ్జములు రెండును భూమినుండి యు, జలమునుండియు పుట్టుచున్నవి గనుక విరోధములేదు.

(4 అధి) 1 సాభావ్యాపత్తి 2 రుపపత్తేః ॥ 22 సూ.

తా॥ జీవులు పొందునది (1) ఆకాశాది సామ్యమేగాని స్వరూపముకాదు. (2) అట్లయితేనే యిది ఉపపన్నమగును.

1 ఛాం. 5-10-5 'అథైతమేవాధ్వానం పునర్నివర్తంతే యథేత మాకాశ మాకాశాద్వాయుం వాయోర్భూత్వా ధూమో భవతి ధూమోభూత్వాఽభ్రం భవత్యభ్రంభూత్వా మేఘో భవతి మేఘో భూత్వా ప్రవర్షతి'

తా। చంద్రలోకఫలానంతరము జీవులు కరగినశరీరముకల వారై ఆకాశమునుపొంది ముద్దగాచేయబడిన లింగోపాధికల వారై వాయురూపమును, క్రమముగా ధూమరూపమును, మేఘరూపమును, వర్షరూపమును పొంది భూమియందు ప్రవే శించుదురు.

(5 అధి) 1 నాతిచిరేణ 2 విశేషాత్ ॥ 23 సూ.

తా॥ జీవులు ఆకాశాదిసామ్యమును పొందుట (1) స్వల్ప కాలమేయని (2) విశేషముకనిపించుటవలన చెప్పబడుచున్న ది. వ్రీహ్యాదిభావమును పొందినతరువాత

ఛాం. 5-10-6 'అతో వై ఖలు దుర్నిష్ప్రపతరం'

తా॥ మిక్కిలిదీర్ఘకాలమునకు అన్నము నెవడు భక్షించునో ఋతుకాలమునందు వీర్యమును స్త్రీయందు ప్రవేశపెట్టుచున్నాడో వానియాకృతికలవాడగుచున్నాడు. గనుక వ్రీహ్యాది భావమును పొందుటకుపూర్వము అల్పకాలమే.

(6 అధి) 1 అన్యాధిష్ఠితే 2 పూర్వవ 3 దభిలాపాత్ ।24

తా॥ (1) అన్యులగు జీవులు వ్రీహ్యాదిసంసర్గమాత్రము కలవారై (2-3) పూర్వమువలెనే స్థావరభావమును పొంది సుఖదుఃఖములననుభవింపవచ్చును. కాని చంద్రలోకమునుండి వచ్చినవారికట్లు కాదు.

1 అశుద్ధమితిచే 2 న్న 3 శబ్దాత్ । 25సూ॥

తా॥ పశుహింసాదులచేత యజ్ఞాదులు (1) శుద్ధముకానివందువేని (3) ధర్మాధర్మవిజ్ఞానమగు శాస్త్రహేతువగుటవలన (2) వైదికకర్మము శుద్ధమైనదే. 'నహింస్యాత్సర్వాభూతాని' ఏజంతువునుగాని హింసింపరాదు. ఇది సామాన్యశాస్త్రము. 'అగ్నీషోమీయం పశుమాలభేత' అగ్నియును, సోముడును అధిదేవతగాగల కర్మమునందుపశుహింస చేయవచ్చునని విశేషశాస్త్రము. గనుక వ్రీహ్యాదిసంశ్లేషయు గౌణమే.

1 రేతస్సిగ్యోగో 2 ఽథ । 26.

తా॥ (2) వ్రీహ్యాదిభావమును పొందినతరువాత (1) రేతస్సేకముచేయువారితోడి సంబంధము రేతస్సిగ్భావమనియంగీకరింపవలెను.

1 యోనేః 2 శరీరం ॥ 27సూ.

తా॥ రేతస్సు యోనియందు ప్రవేశింపగా జీవులకు (2) దేహముపుట్టుచున్నది. కర్మఫలముచేత జ్ఞానసాధనమగు వైరాగ్యము సిద్ధించును.

మొదటిపాదము సమాప్తము.

---

16 వ ప్రి॥ 3అ. 2 పాదము.

అవ॥ మొదటిపాదమునందు కర్మఫలము అశాశ్వతమని చెప్పి ఈరెండవపాదమునందు మహావాక్యార్థవిచారముచేయుచున్నాడు.

(1 అధి) 1 సంధ్యే సృష్టి 2 రాహ హి ॥ 1సూ.

తా॥ సంధ్యమనగా స్వప్నస్థానము. వేదమందు 'సంధ్యం తృతీయం స్వప్నస్థానం' అనియున్నది. (1) స్వప్నకాలమందలి సృష్టి జాగ్రత్కాలమువంటిదే. హి=ఏకారణమువలననగా-

బృ. 6-3-10 'నతత్రరథా నరథయోగా నపంథానోభవం త్యథ రథానథయోగాన్పథస్సృజతే'

తా॥ స్వప్నమునందుకనబడు రథములు మొదలగునవి జాగ్రత్కాలమునందులేవు. కాని వీనినన్నిటిని ఆత్మయే కల్పించుచున్నాడనియు,

1 నిర్మాతరం 2 చైకే 3 పుత్రాదయశ్చ ॥ 2సూ.

తా॥ (2) కఠశాఖవారు (1) ఈసంధ్యమునే కామాదులనునిర్మించు పరమాత్ముడని చెప్పుచున్నారు.

కఠ. 2-5-8 'యఏషసుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః'

తా॥ ఇంద్రియాదులు నిద్రించునపుడు 3 పుత్రాదికోరిక లను అవిద్యచేత పుట్టించి మేలుకొనుచున్నవాడే పరమాత్ము డు. గనుక స్వప్నవస్తువులును సత్యమనియు 1-2 సూత్రముల పూర్వపక్షము.

1 మాయామాత్రం 2 తు 3 కార్త్స్న్యేనా
4 నభివ్యక్తస్వరూపత్వాత్ ॥ 3సూ.

తా॥ (2) సిద్ధాంతము- (1) స్వప్నసృష్టి మాయికమేకాని సత్యముకాదు (3-4) స్వప్నవస్తువు యథార్థముకాదు. స్వప్న మందలి రథాదులకు ఉచితమైన దేశము సంభవింపదు.

1 సూచకశ్చ హి 2 శ్రుతే 3 రాచక్షతే చ 4 తద్విదః ॥ 4

తా॥ స్వప్నము (1) రాగలశుభాశుభములను సూచించు నని (2) శ్రుతిచెప్పుచున్నది. (4) స్వప్నాధ్యాయము నెఱిగి నవారును (3) చెప్పుచున్నారు.

1 ఛాం. 5-2-9 'యదా కర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి। సమృద్ధిం తత్ర జానీయాత్తస్మిన్ స్వప్న నిదర్శనే' తా॥ కామ్యకర్మములందు స్వప్నములో స్త్రీనిచూ చెనేని ఆకర్మము సిద్ధించును. కాని ఆస్త్రీ జాగ్రత్కాలము లో లేనిదే. [యాక్షేపమురాగా-

అవ॥ ఈశ్వరసృష్టివలెనే జీవుని స్వప్నప్రపంచమునని

1 పరాభిధ్యానాత్తు 2 తిరోహితం 3 తతో
4 హ్యస్య 5 బంధవిపర్యయౌ ॥ 5సూ.

తా॥ జీవునకు ఈశ్వరునితోఁగల సమానధర్మము అవిద్యాదులచేత (2) మఱుగుపడినది. (1) పరమేశ్వరానుగ్రహము వలన స్పష్టమగును. ధ్యానింపనివారికి స్పష్టపడదు. (3) ఈశ్వరానుగ్రహమువలననే (4) జీవునకు (5) ఈశ్వరస్వరూపజ్ఞానముచేత మోక్షమును, అదిలేనివారికి బంధమును కలుగును.

1 శ్వే. 1-11 'జ్ఞాత్వా దేవం సర్వపాశాపహానిః క్షీణైః క్లేశై ర్జన్మ మృత్యుప్రహాణిః । తస్యాభిధ్యానా త్తృతీయం దేహభేదే విశ్వైశ్వర్యం కేవల ఆప్తకామః'

తా॥ తానేబ్రహ్మమనని ఆత్మసాక్షాత్కారముగలవానికి నిర్గుణవిద్యాఫలము కలుగును. పరమేశ్వరానుగ్రహమువలన బంధమోక్షములనపేక్షించిగాని ఈశ్రుతిలోని హానిద్వయము నపేక్షించిగాని అణిమాద్యష్టసిద్ధులు ఈదేహపాతానంతరము సిద్ధదేహమునందు సంభవించును. తరువాత ద్వైతశూన్యుడై ఆనందము గలవాడగును. ఇదియే సగుణవిద్యకు ఫలమైన క్రమముక్తిమార్గము.

1 దేహయోగా 2 ద్వా 3 సోఽపి । 6సూ.

తా॥ (3) జీవుని జ్ఞానైశ్వర్యము (1) స్థూలసూక్ష్మదేహములు, మనోబుద్ధులు, సుఖదుఃఖాదులు యొక్క సంబంధము వలన తిరోభావమగుచున్నది. (2) జీవేశ్వరులకు భేదములేదని 'నేయం దేవతైక్షత' 'అనేన జీవేనాత్మనానుప్రవిశ్య' 'తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో' యను శ్రుతులు చెప్పుచున్నవి గనుక స్వప్నము మాయామాత్రమే.

(2 అధి) 1 తదభావో నాడీషు 2 తచ్ఛ్రుతే 3 రాత్మని చ । 7సూ.

తా॥ (1) స్వప్నముయొక్క అభావమే సుషుప్తి. జీవుడు నరములగుండా హృదయకమలముద్వారా (3) పరబ్రహ్మము నందు సుషుప్తిని చెందును. (2) అట్లే.

1 కా. 4-19 'తాసు తిధా భవతి యదా సుప్తస్స్వప్నం న కంచన పశ్యత్యధాస్మిన్ ప్రాణఏవైకధా భవతి' యను శ్రుతి నాడులకు ప్రాణమునకు ఒకేవాక్యముద్వారా సుషుప్తియం దు సముచ్చయమును చెప్పుచున్నది. గనుక ప్రాణమనెడి ఆత్మ యే సుషుప్తిస్థానము.

1 అతః 2 ప్రబోధో 3 ఽస్మాత్ ॥ 8సూ.

(1) అందువలన క్రిందిశ్రుతులచేత (3) ఈయాత్మనినుం డియే జీవునకు (2) మెలకువ కలుగుచున్నది. [వచ్చెను.

1 బృ. 4-1-16 'కుతఏతిదాగాత్' జీవుడు ఎక్కడనుండి

2 బృ. 4-1-20 'యథాగ్నేః క్షుద్రావిస్ఫులింగావ్యుచ్చ రంత్యేవ మేవై తస్మాదాత్మనస్సర్వే ప్రాణాః॥'

తా॥ నిప్పునుండి మిణుగురులువలెనే ఆత్మనుండి ఇంద్రియా దులు బయలువెడలుచున్నవి.

3 ఛాం. 6-10-7 'సతఆగమ్యనవిదుస్సతిఆగచ్ఛామహే'

తా॥ జనులు సత్పదార్థమునుండి వచ్చియును అట్లు తెలియ జాలరు.

(3 అధి.) 1 సఏవతు 2 కర్మా 3 నుస్మృతి 4 శబ్ద 5 విధిభ్యః ॥ 9సూ.

తా॥ (1) సుషుప్తినిచెందిన జీవుడే లేచుచున్నాడు గాని మఱియొకడు కాడు. (2) సుషుప్తికిపూర్వముచేయుకర్మములే సుషుప్తినుండిలేచినతరువాతను చేయుటవలనను యాగాదుల

యందు నిన్నటితరువాయుకర్మలే చేయుటవలనను (3) పూర్వదినమందు చూచినదానిని స్మరించుటవలనను (4) శ్రుతులవలన నతనికే వర్తించుచున్నది. (5) కర్మవిద్యావిధులవలనను ఇట్లే

1 ముగ్ధే 2 ర్ధసంపత్తిః 3 పరిశేషాత్ ॥ 10సూ.

తా॥ మూర్ఛితుడు ఇంద్రియములచేత విషయములను, జ్ఞానములేనందున స్వప్నమును చూడలేడు. ప్రాణములతోనున్నందున మృతుడునుకాడు. విలక్షణముండుటచేత సుషుప్తియనరాదు. (3) పైజాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలలో దేనియందును చేరకపోవుటవలన (1) మూర్ఛితునియవస్థ (2) సగము సుషుప్తిధర్మములతోను, సగము మరణధర్మములతోనున్నది. 11ల॥ 41 వరకుగల సూత్రములు 14 వ ప్రకరణములో నున్నవి.

2 వ పాదము సమాప్తము.

---

16 వ ప్ర॥ 3అ. 3 పాదము.

(1 అధి) 1 సర్వవేదాంతప్రత్యయం 2 చోదనాద్యవిశేషాత్ ॥ 1సూ.

తా॥ (1) ఎల్లవేదాంతములచేతను విధింపబడిన జ్ఞానము (ఉపాసనము) ఆయా వేదాంతములయందు చెప్పబడినదియేయగును. (2) చోదనాదిభేదములేనందువలన అభేదమే. విధించుశబ్దముగాని, విధింపబడిన ప్రయత్నముగాని చోదనయనబడును. అగ్నిహోత్రకర్మమునందు జుహుయాత్ అని పురుషప్రయత్నము విధింపబడునట్లే.

బృ. 8-1-1 'యో హ వై జ్యేష్ఠంచ శ్రేష్ఠంచ వేద'

తా॥ తక్కిన ఇంద్రియములకంటె ప్రాణము జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వగుణములతో నుపాసించువాడు శ్రేష్ఠుడగుచున్నాడు. జ్ఞానమొకటియే యని పంచాగ్ని, వైశ్వానర, శాండిల్యవిద్యలు మొదలగు ఎల్లవేదాంతములయందును గ్రహింపనలెను.

1 భేదా 2 న్నేతి 3 చే 4 న్నై 5 కస్యామపి ॥ 2సూ.

తా॥ (1) గుణభేదమువలన విజ్ఞానమునకు ఐక్యము (2-3) లేదందువేని (4) దోషముకాదు. పంచాగ్నివిద్యను చెప్పుచు ఆఱవయగ్నిని వాజసనేయులును, పంచసంఖ్యను ఛాందోగులును చెప్పుచున్నారు. కాని ఐదగ్నులను రెండుశాఖలలోను గ్రహించుటవలన భేదముకాతగదు. కనుక ప్రాణాద్యుపాసన మొక్కటియె.

1 స్వాధ్యాయస్య 2 తథాత్వేన 3 హి 4 సమాచారే
5 ఽధికారాచ్చ 6 సవవచ్చ 7 తన్నియమః ॥ 3సూ.

తా॥ శిరోవ్రతాదులు ఆథర్వణికులకేయుండి ఇతరులకులేనందువలన విద్యకుభేదములేదు. ఆవ్రతధర్మము (1) వేదాధ్యయనమునకేగాని జ్ఞానవిద్యకుకాదు. (3-4) వేదవ్రతగ్రంథమునందు (2) శిరోవ్రతము వేదాధ్యయనమునకంగమనిచెప్పుటవలన (5) ముం. 3-2-11 'నైతదచీర్ణవ్రతోఽధీతే' శిరోవ్రతములేనివాడు విద్యనుపఠింపరాదనుటవలన నిది అధ్యయన ధర్మమే. (6-7) శిరోవ్రతమునకు నియమముకలదనుచోట సవవత్తనునవి యుదాహరణము. విద్యలకు ఏకత్వమని.

దర్శయతి చ ॥ 4సూ.

1 కా. 2-15 'సర్వే వేదా యత్పదమామనంతి'

తా॥ పొందతగిన వస్తువు ఓంకారశబ్దవాచ్యమగు బ్రహ్మ మేయని ఉపనిషద్వాక్యములు చెప్పుచున్నవి.

(2 అధి) 1 ఉపసంహారో 2 ఽర్థాభేదా 3 ద్విధిశేషవ
4 త్సమానే చ ॥ 5సూ.

తా॥ ఒకశాఖయందలి గుణములను (4) తుల్యమగు వేఱొకశాఖయందు (1) గ్రహింపవచ్చును. (2) ఆగుణములకు ఒకశాఖయందుగల ముఖ్యార్థమే తక్కిన అన్నిశాఖలయందును కలదు. జ్ఞానమొకటియేయగుటవలన (3) అగ్నిహోత్రాదికర్మము అన్నిచోట్ల నొకటియగునట్లే యిచటను కాతగును.

(3 అధి) 1 అన్యథా త్వం 2 శబ్దా 3 దితిచే
4 న్నా 5 విశేషాత్ ॥ 6సూ.

తా॥ వాజసనేయ, ఛాందోగ్యశాఖలలోని ప్రాణోపాసన (2) కర్తృ, కర్మ, వాచకశబ్దములవలన (1) భేదమే (3)అని యందువేని (4) కాదు. (5) అధికాంశము సమానముగనుక ఏకత్వము తొలగిపోదని పూర్వపక్షము.

1 నవా 2 ప్రకరణభేదా 3 త్పరోవరీయస్త్వాదివత్ ॥ 7

తా॥ సిద్ధాంతము- (2) ఛాందోగ్య, బృహదారణ్యముల లోని యుద్గీథోపాసనములకు ఉపక్రమమే వేఱుగాను, భేదముగానుండుటవలన నేకత్వము (1) న్యాయముకాదు. (3)ఆకాశమునందును. ఆదిత్యాదులందును, పరమాత్మయొక్క దృష్టినారోపించుటవలన నుద్గీథోపాస్తి సామ్యమున్నను క్రిందిశ్రుతులవలన ఓంకారము శ్రేష్ఠతరమును, అంతములేనిదియునగుటచేత అక్ష్యాదిత్యగతమైన హిరణ్యశ్మశ్రుత్వాది గుణములుగల

యుద్గీథోపాసనముకంటె భిన్నమైనట్లే, మఱియు నా రెండుఉపాసనములును ఒకశాఖలోనివియైనను పరస్పరభేదమున్నట్లె వేఱువేఱుశాఖలయందలి యిట్టిఉపాసనలకు భేదమేతగును. గాని ఐక్యములేదు.

1 ఛాం. 1-1-1 'ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత'

2 బృ. 'త్వం న ఉద్గాయ'

తా॥ 1 ఓంకారమును ప్రాణదృష్టితో నుపాసింపుము.

తా॥ 2 ఉద్గాతయగు ఆంగీరసుడు ప్రాణప్రధానమగు వాగింద్రియముచేత ఔద్గాత్రమును నిర్వహించెను ఇచటనుద్గాతయగు ఋత్విజుడు ప్రాణముగా నిరూపింపబడుటవలన నుపాస్తిమార్గము భిన్నము.

1 సంజ్ఞాతశ్చే 2 త్త 3 దుక్త 4 మస్తి 5 తు 6 తదపి॥ 8

తా॥ (1) రెండుశాఖలలోను ఒకటేపేరుగల విద్యకు ఐక్యము న్యాయమందువేని కాదు అది (6) 7 వదగు పూర్వసూత్రమునందు చెప్పబడినది. శ్రుతిచేత చెప్పనది బలవత్తరము. ఉద్గీథశబ్దము లౌకికవ్యవహారమగుటచేత దుర్బలత్వము. (6) ఉద్గీథవిద్యయనెడి పేరు భేదముగల పరోవరీయస్త్వాద్యుపాసనములందును (4) కలదు.

(4 అధి) 1 వ్యాప్తేశ్చ 2 సమంజసం। 9సూ.

తా॥ (1) ఓంకారము సర్వవేదసాధారణమగుటవలన 'ఓమిత్యేతదక్షరముద్గీథ ముపాసీత' యనుచోట నన్నివేదములయందునుగల ఓంకారోపాసనకు వర్తింపకపోవలెనని యుద్గీథశబ్దముచేత నోంకారము విశేషణముగా చేయుటవలన (2) యుక్తమే.

(5 అధి) 1 సర్వాభేదా 2 దన్యత్రేమే ॥ 10సూ.

తా॥ 3 వాజసనేయ ఛాందోగశాఖలయందు చెప్పబడిన వసిష్ఠత్వాదిగుణములను (2) కౌషీతకీమొదలగు శాఖలలో వున్న ప్రాణవిద్యయందు గ్రహింపవలెను. (1) ప్రాణసంవాదాది సారూప్యమువలన నన్నిశాఖలయందును ప్రాణోపాసనమొకటియేగాని భేదములేదు. వసిష్ఠత్వాది (వాక్కుయొక్క సిష్ఠత్వాది) గుణములు అనగా-సుస్థిరుడై యుండుట వాక్కుయొక్క గుణము. బాగుగమాటలాడనేర్చినవాడు సుస్థిరుడై యుండుట ప్రత్యక్షమగు వాగింద్రియముయొక్క గుణము. ఈవాక్కు ప్రాణముయొక్క స్వాధీనమందున్నది.

(6 అధి) 1 ఆనందాదయః 2 ప్రధానస్య ॥ 11సూ.

తా॥ (2) ప్రధానమగు బ్రహ్మముయొక్క (1) ఆనంద సత్యత్వాదులు సామాన్యముగా బ్రహ్మమునందు కల్పితధర్మములు. అవి అన్యోన్యము విశేషణ విశేష్యములగుచు విరుద్ధమైన అనృత జడదుఃఖాదిభ్రాంతిని తొలగించి సర్వాధిష్ఠానమగు యఖండవృత్తిని లక్షణచేత ప్రతిపాదించును.

1 ప్రియశిరస్త్వాద్యప్రాప్తి 2 రుపచయాపచయౌ
3 హి 4 భేదే ॥ 12సూ.

తా (3) ప్రియము, మోదము, ప్రమోదము, ఆనందము నను నివి తారతమ్యముకలవగుటవలన (1) తైత్తిరీయకమునందు చెప్పబడిన ప్రియమే శిరస్సుగానుండుట మొదలగు ధర్మములు ఇతరశాఖలందు గ్రహింపవలసిన పనిలేదు. మఱియు (2) వృద్ధిక్షయములు నానావిధములగు ధర్మములు (4) ధర్మియందుభేదము సప్రపంచత్వముకలుగగా సగుణమందే

సంభవించుచున్నవి. 'ఏకమేవాద్వితీయ' మిత్యాది శ్రుతుల వలన బ్రహ్మము భేదములేనిది గనుక బ్రహ్మధర్మమును చెప్పు స్థలములందు కోశధర్మములగు ప్రియశిరస్త్వాదులకు ప్రాప్తిలేదు.

ఇతరేత్వ ర్థసామాన్యాత్ । 13సూ.

తా॥ బ్రహ్మస్వరూపమును ప్రతిపాదించెడి సత్యత్వ జ్ఞానత్వానందత్వాత్మత్వ పూర్ణత్వములైదును ప్రతిపత్తిమాత్రప్రయోజనముకలవగుటచేత బ్రహ్మమనెడి ధర్మిఒకటియేయగుట వలన నన్నిశాఖలందును గ్రహింపతగును.

(7 అధి) ఆధ్యానాయ ప్రయోజనాభావాత్ ॥ 14.

తా॥ బ్రహ్మముఅన్నిటికంటె పరమయినది. ఇంద్రియాద్యర్థములు ఒకదానికంటె మఱియొకటి పరముగానుండి ప్రయోజనము లేనందువలన అర్థములనతిక్రమించిన పురుషుడు అన్నిటికంటె పరుడగుటచేత మోక్షసిద్ధికలుగుచున్నది. తత్తత్పరత్వ ధ్యానపూర్వకముగా ఆపురుషుని దర్శనముకొఱకేయని శ్రుతి చెప్పుచున్నది. [ముచ్యతే'

1 కాఠకశ్రుతి. 3-15 'నిచాయ్య తం మృత్యుముఖాత్ప్ర

తా॥ బ్రహ్మము తానేయని తెలిసికొనినవాడు మఱల జన్మములేని ముక్తిని పొందును.

ఆత్మశబ్దాచ్చ ॥ 15సూ.

1 క. 1-3-12 'ఏషసర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే । దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥'

2 క. 1-3-13 'యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞ'

తా॥ 1 బ్రహ్మము బ్రహ్మాది జగద్వస్తువులయందు అవిద్య చేత దాగియుండుటవలన కనిపింపదు. సూక్ష్మబుద్ధిచేత నేకాగ్రతతో చూచువానిచేత చూడబడును. 2 వివేకి వాగాదీంద్రియములను మనస్సునందును, దానిని బుద్ధియందును, దానిని హిరణ్యగర్భబుద్ధియందును నిలుపవలెను.

16-17 సూత్రములు 12 వ ప్రకరణములో నున్నవి.

(9 అధి) కార్యాఖ్యానాదపూర్వం ॥ 18సూ.

తా॥ ఛాందోగులు, వాజసనేయులు చెప్పిన ధ్యానాదులు విధికృతమే. వేఱొకపక్షమునందు 'తస్మాదేవం విద శిష్యన్నాచామే దశిత్వా చాచామేత్' యని ఆచమనమునే చెప్పుచున్నది. ఆచమనము కర్మములకంగమగుటవలన విధికాదు. సర్వము ప్రాణమునకు అన్నమే. 'ఆపోవాస' యనుచోట ఉదకములకు ఆచమనము విధింపలేదు. ధ్యానమేయుక్తము. వేఱొక అర్థము స్మృతిలో ఉదకములకు వస్త్రధ్యానమేకాని ఆచమనమును చెప్పలేదు.

(10 అధి) సమానఏవం చాభేదాత్ ॥ 19సూ

తా॥ భిన్నశాఖలందు విద్యైక్యముతో గుణములను గ్రహించుచున్నట్లే ఏశాఖయందును అభేదమువలన శాండిల్య, బృహదారణ్యకములలోని విద్యలకు గుణములను గ్రహించుట యుక్తమే.

(11 అధి) సంబంధాదేవ మన్యత్రాపి ॥ 20సూ.

తా॥ బృ. 7-5-1 'సత్యం బ్రహ్మ' 'తద్యత్తత్సత్యమసౌస ఆదిత్యోఽయఏష ఏతస్మిన్మండలే పురుషో యశ్చాయం దక్షిణేఽక్షన్ పురుషః' 2 బృ. 'తస్యోపనిషదహం' ఈరెండు

శ్రుతులయందును విద్యైక్యమువలన ఒకదానిలోనిగుణముల
ను మరియొకదానిలో గ్రహింపవచ్చుననియు,

నవా విశేషాత్ ॥ 21సూ.

తా॥ రెండుఉపనిషత్తులయందును ఆత్మభేదము లేదనియు
20-21 సూత్రముల పూర్వపక్షము.

దర్శయతి చ ॥ 22సూ.

తా॰ సిద్ధాంతము- 1 ఛాం. 1-7-5 'తస్యైతస్య తదేవరూ
పం యదముష్యరూపంయావముష్య గాష్ణౌతౌ గేష్ణాయన్నామ
తన్నామ' యను యతిదేశమిట్టి ధర్మములకు వ్యవస్థితిని దర్శ
యతి=చూపుచున్నది. అతిదేశమనగా చెప్పుట. లింగమనగా
చిహ్న. లింగముఎట్లుఅనగా వేదము. నేత్రములు, సూర్యుడు,
అను స్థానభేదముచేత భిన్నములగు ధర్మములు పరస్పరము
గ్రహింపతగవని శ్రుతులుచెప్పుటవలన నీరెండుఉపనిషత్తులు
ను భేదముగలవియే.

(12 అధి) సంభృతి ద్యువ్యాప్త్యపి చాతః ॥ 23సూ.

తా॰ సంభృతి ద్యువ్యాప్తి మొదలగు బ్రహ్మవిభూతులు
స్థానసంబంధముకలవి గనుక శాండిల్యవిద్య మొదలగువాని
యందు గ్రహింపతగినవికావు.

(13 అధి) పురుషవిద్యాయామివ చేతరేషా మనామ్నాత్ ॥

తా॥ తాండి పైంగి శాఖలవారి పురుషవిద్యయందుఆమ్నా
నమున్నట్లు తైత్తిరీయకమునందు లేనందున గ్రహింపతగదు.

(14 అధి) వేధాద్యర్థభేదాత్ ॥ 25సూ.

తా॥ ఆథర్వణికులు, తాండులు, శాట్యాయనీయులు, కఠు
లు, వాజసనేయులు, కౌషీతకులు, యను శాఖలలోని విద్యల

యందు హృనయసంబ ధమున్నను వేధాద్యర్థములకు సంబంధ ములేనందున గ్రహింపతగదు.

(15 అధి) హానౌతూపాయనశబ్దశేషత్వాత్కు-శా
చ్ఛందస్తుత్యుపగానవ త్తదు క్తం॥ 26సూ.

తా॥ హానియందు అనగా దుష్కృతమును విడుచుటయందు సుకృతమును స్వీకరించుట కలుగుచున్నది. ఎట్లనగా- కౌషీతకి శృతియందు విడుచుటకు అంగముగా స్వీకరించుట చెప్పబడి నది. ఈ రెండును స్తుత్యర్థమే. ఆధర్వణిక, తాండి, శాఖలశృ తులందు విడుచుటమాత్రమే చెప్పబడినది. ఇది శాఖాంతర మునందలి విశేషము గనుక శాఖాంతరమునందే గ్రహింపబ డును. అట్లే వికల్పపరిహారముకొఱకు ఏకవాక్యము పూర్వ మీమాంసయందు జైమినిమునిచేత 'అపితు వాక్యశేషత్వాది తరపర్యుదాసస్యాత్ప్రతిషేధేవికల్పస్స్యాత్' అనిచెప్పబడినది

(16 అధి) సాంపరాయే తర్తవ్యాభావా త్తథాహ్యన్యే॥27

తా॥ కౌషీతగిశాఖవారు పర్యంకవిద్యాశృతులలో చెప్పిన సుకృత దుష్కృతములు దేహమునుండి పోవునపుడే క్షయమగు ను. అట్లే 'అశ్వఇవ రోమాణి విధూయ పాపం' అని తాండు లును, 'తస్య పుత్రాదాయ ముపయంతి సుహృద స్సాధుకృ త్యాం ద్విషంతః పాపకృత్యాం' అని శాట్యాయనులును, విర జానదీతరణమునకు పూర్వమే సుకృత దుష్కృతములయొక్క నశింపుచెప్పుచున్నారు.

1 కౌ. 'సఏతం దేవయానం పంథానమాసాద్యాగ్నిలోక మాగచ్ఛతి' 2 'స ఆగచ్ఛతి విరజాం నదీం తాం మనసైవా త్యేతి తత్సుకృత దుష్కృతే విధూనుతే'

తా॥ 1 బ్రహ్మోపాసకుడు అర్చిరాదిమార్గము చేతఅగ్ని లోకమును పొందుచున్నాడు. 2తా॥ సంకల్పమాత్రము చేత నే విరజానదిని దాటుచు పుణ్యపాపములను విడుచుచున్నాడు.

ఛందత ఉభయావిరోధాత్ ॥ 28సూ.

విద్వాంసునకు దేహమును విడుచునపుడే ఇచ్ఛచేత దాని యనుష్ఠానము సంభవించును. ఇట్లగుచుండగా కార్యకారణ భావముచేత నుపపత్తియును, పై శ్రుతికి విరోధములేకపోవుట యును సంభవించును. కనుక విరజానదినిదాటకపూర్వమే పుణ్యపాపములు నశించును.

(17 అధి) గతేరర్థవత్త్వముభయథాఽన్యథాహి విరోధః॥29

తా॥ అర్చిరాదిమార్గగతి వేఱువేఱుగా సగుణోపాసకునకు సార్థకమును, నిర్గుణోపాసకునకు నిరర్థకమునగుచున్నది. సగుణ నిర్గుణవిద్యలందు సామాన్యముగా గతి యంగీకరించునపుడు 'పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి' యను శ్రుతియందుగల దేశాంతరగతికి విరోధమువచ్చును. నిరంజను డగువాడెట్లు దేశాంతరముపోవును? పొందతగిన బ్రహ్మము దేశాంతరప్రాప్తికధీనముకాదు. గనుక నిచట గతికి ఆనర్థక్య మేయగును.

ఉపపన్నస్తల్లక్షణార్థోపలబ్ధేర్లోకవత్ ॥ 30సూ.

తా॥ అర్చిరాదిమార్గము నిర్గుణోపాసకులకు కనిపింపకపో వుటవలన ఆమార్గము సగుణవిద్యయందు సార్థకమును, నిర్గుణ విద్యయందు నిరర్థకమునగుట యుక్తమే. మఱియు నిష్కాములై దహింపబడిన క్లేశబీజములుగల బ్రహ్మైకత్వజ్ఞానముగలవా రికి ముక్తి ఇచటనే కలుగును. లోకమునందు గ్రామాంతరము

పోవువానికి మార్గాపేక్షయే కాని ఇతరము లేనట్లే. యిచటను మార్గాపేక్ష లేదు.

(18 అధి) అనియమః సర్వేషా మవిరోధః
శబ్దానుమానాభ్యాం ॥ 31 సూ.

తా॥ అర్చిరాదిమార్గము పర్యంక, పంచాగ్ని, ఉపకోసల, దహర, విద్యలయందే యని నియమములేదు. బ్రహ్మలోక ప్రాప్తిగల సగుణవిద్యలకన్నిటికిని అర్చిరాదిమార్గము కలదు ప్రకరణవిరోధమును లేదు. అని శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి

1 ఛాం. 5-10-1 'తద్య ఇత్థం విదుః' 2 యేచేమేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే'

తా॥ 1 ద్యులోకాదులను అగ్నులుగా నుపాసించు పంచాగ్నివిద్యకలవారికి అర్చిరాదిమార్గమని శ్వేతకేతువుతో జనక చక్రవర్తి చెప్పెను. 2 వానప్రస్థులు, పరివ్రాజకులు, నైష్ఠిక బ్రహ్మచారులలో శ్రద్ధగల తపస్సుతో బ్రహ్మమును ధ్యానించువారికి అర్చిరాదిమార్గము కలదు.

32 సూ. 13 వ ప్రకరణములో నున్నది.

(20 అధి) అక్షరధియాం త్వవరోధః సామాన్య
తద్భావాభ్యామౌపసదవత్తదుక్తం ॥ 33 సూ.

తా॥ వాజసనేయకమను బృ. నందు 'ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంత్యస్థూలమనణుః' బ్రహ్మము స్థూలము కాదు సూక్ష్మము కాదు అనియు, అథర్వణమను ముండకోపనిషత్తునందు అక్షరముపక్రమ్య 'యత్తదద్రేశ్యమగ్రాహ్యం' బ్రహ్మమును చూచుటకు గ్రహించుటకు వీలు లేదనియు చెప్పిన రెండుశ్రుతులలోని గుణములను అక్షరమగు ధర్మియం

దు అన్నిచోట్లను గ్రహింపతగును. విరోధములేదు. అన్నివాక్యములందును బ్రహ్మప్రతిపాదనమగుటవలన నొకశాఖలో చెప్పిన నిషేధమును మఱియొకశాఖలో గ్రహింపతగును. ఒకచోట చెప్పబడిన అంగములకు వేఱొకచోట యంగిత్రో సంబంధముకలదు. అట్లె పూర్వమీమాంసయందు 'గుణముఖ్యవ్యతిక్రమే తదర్థత్వాన్ముఖ్యేన వేదసంయోగః' యను సూత్రమునందు చెప్పబడినది.

(21 అధి) ఇయదామననాత్ ॥ 34సూ.

తా॥ ఆథర్వణికులును, శ్వేతాశ్వతరులును, కఠకులును, పఠించు 'ద్వాసుపర్ణాసయుజాసఖాయాం' 'ఋతంపిబంతౌ సుకృతస్య లోకె' యను ఈరెండుమంత్రములందును అభిన్నముగా జీవేశ్వరులుచెప్పబడుచున్నారు. గనుక విద్యకుభేదములేదు

(22 అధి) అంతరాభూత గ్రామవత్స్వాత్మనః ।35.

తా॥ బృ. 5-5-1 'యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మయఆత్మా సర్వాంతరః' పరబ్రహ్మము కార్యకారణములు లేనివాడని ఉషస్తిమహర్షితోను, ఆకలి దప్పుల నతిక్రమించినవాడని కహోళమహర్షితోను యాజ్ఞవల్క్యుడుచెప్పిన రెండువిద్యలను ప్రత్యగాత్మునకు లోపలనున్నదనుట సమానమే గనుక విద్యకు ఏకత్వమే. భూతగ్రామవత్ = 'ఏకోదేవస్సర్వభూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా'

తా॥ 62 పుటలో కలదు.

అన్యథా భేదానుపపత్తిరితిచే న్నోపదేశాంతరవత్ ॥36

తా॥ విద్యాభేదమంగీకరింపబడనపుడు ఉపపత్తి కలుగదని యందు వేని, ఛాం. నందు ఆఱవ ప్రపాఠకములో 'సఆత్మా

తత్త్వమసి శ్వేతకేతో' యని 9 సారులు చెప్పినను విద్యాభేదములేనట్లె యిక్కడను కావచ్చును. గనుక దోషములేదు. రెండువిద్యలకును ఏకార్థమేగాని వేఱుకాదు.

(23 అధి) వ్యతిహారో విశంషంతి హీతరవత్ ॥ 37 సూ.

తా॥ ఐ. 'తద్యోఽహంసోఽసౌ యోఽసౌ సోహం' సూర్యునియందున్న పురుషుడే నేను. నేనే ఆపురుషుడు. అనియు, జాబాలశ్రుతి॥ 'త్వంవా అహమస్మి భగవో దేవతే అహంవై త్వమసి' ఓపూజ్యదేవతా నీవే నేను. నేనే నీవు. అనియును చెప్పబడిన ధ్యానము ఉభయవిధముకాదని యందువేని జీవేశ్వరులకన్యోన్యవిశేషణవిశేష్యభావము ధ్యానార్థమై సర్వాత్మత్వము మొదలగు ఇతిరిగుణములు పఠింపబడునట్లె జాబాలశాఖవారును ఉభయోచ్చారణముచేత ప్రత్యేకించి చెప్పుచున్నారు. గనుక నుభయవిధధ్యానమే తగును.

(24 అధి) సైవ హి సత్యాదయః ॥ 38 సూ.

తా॥ కొందిశ్రుతులలోని విద్యలు సత్యబ్రహ్మమునే సత్యవిద్యయని శ్రుతిచెప్పుటచేత విద్య ఒకటియేగాని రెండుకావు సత్యాదిగుణములు ఒకదానియందె గ్రహింపతగినవి.

1 బృ. 7-4-1 'సయోహవై తన్మహద్యక్షం ప్రథమజం వేద' 2 బృ. 'తద్యత్తత్సత్యమసౌ సఆదిత్యో యఏష ఏతస్మిన్మండలే పురుషో యశ్చాయం దక్షిణేక్షన్ పురుషః' 3 'జయతీమాన్ లోకాన్' 4 'హంతి పాప్మానం జహాతి చ'

1 తా॥ మొదటపుట్టిన హిరణ్యగర్భుడను సగుణబ్రహ్మోపాసనముచేత లోకజయఫలముకలుగును. 2 తా॥ ఆసత్యబ్రహ్మమే సూర్యమండలమందును, దక్షిణనేత్రమునందును గల

పురుషుఁడు. 3 తా॥ సత్యబ్రహ్మోపాసకుడు లోకములను జయించును. 4 తా॥ బ్రహ్మదృష్టితో నుపాసించువానికి పాపములునశించును.

(25 అధి) కామాదీతరత్ర తత్ర చాయతనాదిభ్యః॥ 39.

తా॥ ఛాం. 'దహరోఽస్మిన్నంతరఆకాశః' బృ. 'యఏషోఽంతర్హృదయ ఆకాశః' ఈరెండువిద్యలకు ఏకత్వమున్నదా లేదా? యను సంశయమురాగా- దేవదత్తుడు దత్తుడనియు, సత్యభామ భామఅనియు పిలువబడునట్లె సత్యకామాదులు కామాదులు అని చెప్పబడినది. ఛాందోగ్యశ్రుతిలో బ్రహ్మమునకుగల సత్యకామత్వము మొదలగు గుణములు బృహదారణ్యమునందలి 'సవాఏషమహానజ ఆత్మా' యనుచోట సంబంధించుచున్నవి. వాజసనేయకము, బృ=నందుగల వశిత్వాది గుణసముదాయము ఛాం=నందు 'ఏష ఆత్మాపహతపాప్మా' యనుచోట గ్రహింపబడుచున్నది. ఎందువలననగా- హృదయాతనము మొదలగు ధర్మములు రెండుచోట్లను హృదయస్థానవిషయము సమముగానున్నది. ఛాం=నందు సగుణమును, బృ=నందు నిర్గుణమును చెప్పబడినది. ఉపాసనకొఱకు సగుణము కల్పింపబడినది.

(26 అధి) ఆదరా దలోపః॥ 40సూ.

తా॥ భోజనములేనపుడు ప్రాణాగ్నిహోత్రమునకు లోపములేదు. జాబాలశ్రుతిలో ప్రాణాగ్నిహోత్రము ఆదరముగాచెప్పబడినది. భోజనలోపమున్నను ప్రతినిధిచేత ఆవశ్యకమని పూర్వపక్షము.

ఉపస్థితేఽత స్తద్వచనాత్ ॥ 41 సూ.

తా॥ సిద్ధాంతము- భోజనమున్నపుడే ప్రాణాగ్ని హోత్రముకలదు. 'తద్యద్భక్తం ప్రథమమాగచ్ఛేత్తద్ధోమీయం' అను వాక్యమువలన భోజనద్రవ్యములోనుండి ముందుగా ప్రాణాహుతులను చెప్పుటచేత భోజనములేనపుడు ప్రాణాగ్నిహోత్రమునకు లోపమేయగును.

(27 అధి) తన్నిర్ధారణానియమ స్తద్దృష్టేః పృథగ్ఘ్యప్రతిబంధఃఫలం ॥ 42 సూ.

తా॥ ఉద్గీథాదికర్మములయొక్క రసతమము, అస్తి, సమృద్ధి ముఖ్యప్రాణము, ఆదిత్యుడు నను నిట్టియుపాసనములు కర్మాంగములవలె నియమింపబడవు. శ్రుతులట్లే కలవు.

1 'తేనోభౌకురుతో యశ్చైతం దేవ వేదయశ్చ న వేద'

తా॥ ఉపాసనలేనివాడు కర్మములుచేయవచ్చును. ఛాందోగ్యశ్రుతిలో సామభక్తిచేత నుపాస్యదేవతనెఱుగకుండ గానము చేసితివేని నీశిరము పగులునని యుద్గాతతో నుషస్తి చెప్పెను. ఏకారణమువలన కర్మాంగోపాసనలకు వేఱుగా కర్మఫల సిద్ధికి ప్రతిబంధములేని ఫలముకలుగును. గనుక నుపాసనములకు కర్మాంగత్వము లేదు.

(28 అధి) ప్రదానవదేవ తదుక్తం ॥ 43 సూ,

తా॥ సంవర్గవిద్యయందు ప్రాణమే సంవర్గమనియు, వాయువే సంవర్గమనియు చెప్పిన రెంటును అభేదోపాస్యమగునా కాదా? యని సంశయమురాగా త్రిపురోడాశనిష్టియందు ఇంద్రాదిభేదము మొదలగువానిచేత ధ్యానము భేదించుచున్నవి

ఆప్రదానభేదము సంకర్ష కాండమునందు ద్రవ్య దేవతాభేదము వలన కర్మభేదముకలదు. గాని యిచట విద్యాభేదములేదు.

(29) లింగభూయస్త్వాత్తద్ధి బలీయస్తదపి। 44సూ,

తా॥ వాజసనేయక అగ్నిరహస్యమునందలి మనశ్చిదాదులు స్వతంత్రవిద్యలే. 'యత్కించేమాని భూతాని మనసా సంకల్పయంతి' త్యాది శ్రుతులు అగ్న్యలకు కేవలోపాసనత్వమును బలపఱుచుచున్నవి. ఆలింగము ప్రకరణముకంటె బలీయము. అట్లే పూ మీ సూ. 3-3-14 శ్రుతి॥ 'లింగవాక్యప్రకరణస్థాన సమాఖ్యానాం సమవాయే పారదౌర్బల్యమర్థవిప్రకర్షాత్' అని చెప్పబడినది.

పూర్వవికల్పః ప్రకరణాత్స్యాత్క్రియామానసవత్ ॥45.

తా॥ మనశ్చిదాదులగు అగ్న్యలు కర్మకంగత్వముకాదన తగదు. అగ్నిప్రకరణమగుటవలన క్రియామయాగ్నివిషయమగు ప్రకారభేదోపదేశమే కాని యిది స్వతంత్రము కాదు. ఆ యగ్న్యలు క్రియాసంబంధముచేత అంగములగును. ద్వాదశాహక్రతువుయందు భక్షణములు మానసములేయని క్రియకు అంగమగునట్లే యిదియును క్రియాంగమనియు,

అతిదేశాచ్చ। 46సూ.

తా॥ 'షట్త్రింశత్సహస్రాణ్యగ్నయోऽర్కా స్తేషామేకైక ఏవ తావాన్ యావానసౌ పూర్వః' అను నతిదేశమువలన నీమానసాగ్నులకు క్రియానుప్రవేశము బలపడుచున్నది. అనియును 45-46సూ. ముల పూర్వపక్షము.

విద్యైవ తు నిర్ధారణాత్ ॥ 47 సూ.

తా॥ సిద్ధాంతము- మనశ్చిదాదులనెడి యగ్నులు కేవల విద్యాత్మకములును, స్వతంత్రములును గాని కర్మాంగములు కావు. ఇవి ఉపాసనములే కాని కర్మశేషములు కావు.

దర్శనాచ్చ ॥ 48 సూ.

తా॥ ఆయగ్న్యులు శ్రుతులవలనను స్వతంత్రములే.

శ్రుత్యాది బలీయస్త్వాచ్చ న బాధః ॥ 49 సూ.

తా॥ మనశ్చిదాదులకుగల స్వాతంత్ర్యమునకు భంగమును కల్పింపరాదు. ప్రకరణముకంటె శ్రుతిబలవత్తరమగుటవలన శ్రుతిలింగసూత్రమున నిట్లుచెప్పబడినది.

అనుబంధాదిభ్యః ప్రజ్ఞాంతరపృథక్త్వవద్దృష్టశ్చ తదుక్తం ॥ 50 సూ.

తా॥ 'తే మనసైవాధీయంత మనసా చీయంత మనసైవ గ్రహా అగృహ్యంత' మొదలగు శ్రుతులచేత మనోవృత్తులందు క్రియాంగములను కూర్చుటవలన ప్రకరణమును నిరసించి స్వాతంత్ర్యముచెప్పబడినది. శాండిల్యాదివిద్యలకు ఉపాసనాంతరములకంటెను, కర్మములకంటెను, వేఱుగా స్వాతంత్ర్యమున్నట్లె యిచటనుకలదు. రాజసూయప్రకరణమునందుగల యవేష్టికి వర్ణత్రయసంబంధమువలన ప్రకరణముకంటె నుత్కర్షమున్నట్లు పూర్వకాండమునందు చెప్పబడినది.

న సామాన్యాదప్యుపలబ్ధేర్మృత్యువన్నహి లోకాపత్తిః 51

తా॥ మఱియు మనశ్చిదాదులకు మానసగ్రహమునకువలె క్రియాంగత్వము సిద్ధించుననతగదు. పూర్వసూత్రములోని

శ్రుత్యాదులవలన మనశ్చిదాదులకు స్వాతంత్ర్యముంటుటచేత మానసగ్రహసాదృశ్యమువలస క్రియాంగత్వము కల్పింపతగదు. క్రిందిశ్రుతులందు అగ్న్యాదిత్యపురుషులకు మృత్యుశబ్దము సమానమైనను అత్యంతసామ్యప్రాప్తిలేనట్లె ద్యులోకమునకు అగ్నిభావప్రాప్తి లేనట్లె యిచటను గ్రహింపతగును.

1 'సఏష ఏవమృత్యుర్యఏష ఏతస్మిన్మండలే పురుషః'

2 'అగ్నిర్వై మృత్యుః'

పరేణచ శబ్దస్య తాద్విధ్యం భూయస్త్వా త్త్వనుబంధః॥52.

తా॥ 'అయం వావలోక ఏషోగ్నిశ్చిత' యనుదానికి తరువాయి బ్రాహ్మణమునందు కేవలవిద్యావిధిత్వము అగ్నిశ్చిత మొదలగు శబ్దములకు ప్రయోజనముగానున్నది గాని శుద్ధకర్మాంగవిధిపరత్వము కనిపింపదు. 'విద్యయా తదారోహంతి యత్ర కామాః పరాగతాః నతత్ర దక్షిణాయంతి నావిద్వాంసస్తపస్వినః' యనువాక్యముచేత కర్మములను నిందించి విద్యకు ప్రాధాన్యముచెప్పబడినది. అట్లె 'యదేతన్మండలం తపతి' యను పూర్వబ్రాహ్మణమునందు 'సోమృతో భవతి మృత్యుర్హ్యస్యాత్మా భవతి' యని విద్యాఫలముచెప్పబడినది. అగ్న్యవయవములనేకములు విద్యయందు సంపాదింపవలయునని కర్మాగ్నితో విద్యపఠింపబడుచున్నది. గనుక మనశ్చిదాదులకు కేవలవిద్యాత్మకము సిద్ధము.

(30 అధి) ఏక ఆత్మనః శరీరేభావాత్ ॥ 53సూ.

తా॥ లోకాయతికులు మొదలగు కొందరివలన దేహమే ఆత్మయని పూర్వపక్షము.

వ్యతిరేక స్తద్భావా భావిత్వా న్నతూపలబ్ధినత్ ॥ 54.

తా॥ సిద్ధాంతము- దేహమే ఆత్మయనలెగదు. దేహము కంటె ఆత్మ వ్యతిరిక్తమే. ఆత్మధర్మములను దేహధర్మములుగా తలచెనేని దేహమున్నను ఆత్మధర్మములు మరణించునపుడు కనిపింపవు. చైతన్యముచేత చెప్పబడు బాహ్యములును, ఆధ్యాత్మికములునగు భూతభౌతికముల ఉపలబ్ధికి స్థితి యంగీకరింపబడునట్లే దీనికి వానికంటె విలక్షణమంగీకరింపవలెను. ఆత్మ ఉపలబ్ధిస్వరూపముగనుక దేహవ్యతిరిక్తము సిద్ధించును.

(31 అధి) అంగావబద్ధాస్తు న శాఖాసు హి ప్రతి వేదం॥55.

తా॥ కర్మాంగోపాసనములు అన్ని వేదములయందును ఏశాఖలో చెప్పినవి ఆశాఖయందే యను నియమము లేదు. అన్ని శాఖలకును వర్తించును.

మంత్రాదివద్వా విరోధః ॥ 56 సూ.

తా॥ వేరొకపక్షమునందు మంత్రాదులవలె విరోధములేనందున అన్యశాఖలయందలి ఉద్గీథాదులయందునువర్తించును

(32 అధి) భూమ్నః క్రతువజ్జ్యాయస్త్వం తథాహి దర్శయతి ॥ 57 సూ.

తా॥ వైశ్వానరవిద్యయందు ఒకచోట అగ్నిదృష్టితోసూర్యుని వేరొకచోట అన్నిటియందును అగ్నిదృష్టితో సమస్తోపాసనమును చెప్పుచున్నను సమస్తమగు వైశ్వానరోపాసనమునకును ప్రాధాన్యమును విధించుచున్నది. దర్శపూర్ణమాసాది క్రతువులందు సామస్త్యముచేత సాంగమైన ప్రధానమునకు ఒకప్రయోగమే చెప్పబడుచున్నది. కాని ప్రయాజాదులకు గాని కొన్నిఅంగములతోకూడిన ప్రధానమునకుగాని ప్రయో

గము వివక్షింపబడనట్లే యిచటను అని తెలియనలెను. ఈస
మస్తోపాసనమే ముఖ్యము. శ్రుతులట్లే కలవు.

(33 అధి) నానాశబ్దాది భేదాత్ । 58సూ.

తా॥ సగుణబ్రహ్మోపాసనగల విద్యలు ఒకటియేగదా యని యనగా వేద్యమొక్కటియైనను ఉపాసనలు భిన్నములే. 'వేద ఉపాసీత। సక్రతుం కుర్వీత' అని శబ్దభేదములుండుట వలన విద్యలు భిన్నములనుట యుక్తము.

(34 అధి) వికల్పోఽవిశిష్టఫలత్వాత్ । 59సూ.

తా॥ దహర శాండిల్యాది అహంగ్రహో (సగుణబ్రహ్మో) పాసనలు వికల్పముచేతనే చేయవలయును. ఉపాస్య విషయసాక్షాత్కారఫలము విద్యలకభేదముగా నున్నందున సముచ్చయముచేత చేయతగదు. విద్యలలో నొకదానిని సాక్షాత్కారపర్యంతము చేయవలెను.

1 ఛాం. 3-14-4 'యస్య స్యాదద్ధానవిచికిత్సాస్తి' 2బృ 'దేవోభూత్వా దేవానప్యేతి' 3 భ. గీ. 8అ. 6 'సదా తద్భావభావితః' తా॥ ఎవనికి తాను ఈశ్వరుడనను సాక్షాత్కారమగునో తాను ఈశ్వరుడనా కానా యను సంశయములేదో వానికీశ్వరఫలప్రాప్తికలుగును. 2 తా. దేవతను సాక్షాత్కరింపచేసికొని దేహపాతానంతరము దేవత్వమును పొందుచున్నాడు. 3 తా॥ ఎల్లప్పుడును ఏదేవతను స్మరించుచు ప్రాణము విడుచునో ఆదేవతాస్వరూపమును పొందుచున్నాడు.

(35 అధి) కామ్యాస్తు యథాకామం సముచ్చీయేరన్నవా పూర్వహేత్వభావాత్ । 60సూ.

తా॥ ప్రతీకోపాసనములు పూర్వముచెప్పిన వికల్పకారణ

ము లేనందున యథేచ్ఛగాను సముచ్చయముచేతను వికల్పము చేతను అనుష్ఠానము చేయవచ్చును.

(36 అధి) అంగేషు యథాశ్రియభావః ॥ 61సూ.

తా॥ కర్మాంగములగునట్టి ఉద్గీథోపాసనములు వేదత్రియ మునందు ఏవి విహితములో అవియేయనియు,

శిష్టేశ్చ ॥ 62సూ.

తా॥ వేదత్రియమునందును ఉపాసనాశ్రియములగు స్తోత్రాదులు విధిపబడునట్లే వానినాశ్రియించిన ఉపాసనము లును విధింపబడుచున్నవి. గనుక అంగములకును, ఉపాసనము లకును విధానభేదము లేదనియు,

సమాహారాత్ ॥ 63సూ.

తా॥ ఋగ్వేద, సామ వేదములయందలి ప్రణవోద్గీథముల కు ఏకత్వవిజ్ఞానముచేత నిట్టిఫలముకలదని చెప్పుచు వేదము ఎల్లయుపాసనములందును సముచ్చయముగాచెప్పుచున్నదనియు

గుణసాధారణ్యశ్రుతేశ్చ ॥ 64సూ.

తా॥ క్రిందిశ్రుతి ఓంకారమును వేదత్రియసాధారణముగా చెప్పుటవలన నాఉపాసనము సాధారణమనుట శాస్త్రీమే. పక్షాంతరమునందు కర్మాంగములగు నుద్గీథాదులన్నియును ఎల్ల ప్రియోగములందును సాధారణములుకావేని వానికాశ్రియ ములగు నుపాసనములకు సహభావము లేకపోవును. కానియు ద్గీథాదులు సర్వాంగగ్రాహియగు ప్రియోగవచనముచేత నన్నియును ఎల్లప్రియోగములందును సాధారణముగా వినబ డుచున్నవి.

1 ఛాం. 1-1-9 'తేనేయం త్రియీవిద్యా వర్తత ఓమి త్యాశ్రావయత్యోమితి శంసత్యోమిత్యుద్గాతయతి'

తా॥ ఓంకారముచేత వేదత్రియకర్మము ప్రవర్తిల్లుచున్నది ఓం అని అధ్వర్యుడు ప్రేషనిచ్చుచున్నాడు. ఓం అని హోత శస్త్రమును పఠించుచున్నాడు. ఓంకారమునుచ్చరించి ఉద్గాత గానముచేయుచున్నాడనియు, 61 ల॥ 64సూ. వరకును పూర్వ పక్షము.

నవా తత్సహభావాశ్రుతేః ॥ 65సూ.

తా॥ సిద్ధాంతము- వేదత్రియవిహితాంగములైన స్తోత్రాదులకును, 'గ్రహంవా గృహీత్వా చమసంచోన్నీయ స్తోత్రముపాకరోతీ' త్యాది ప్రయోగవిధిచేత సహభావమున్నట్లు యుపాసనలకు లేనందునను, ఉద్గీథాద్యుపాసనములు క్రత్వంగములనాశ్రయించినవియైనను గోదోహనాదులతో సమానపురుషార్థములని చెప్పుటవలననిచ్ఛానుసారముగాచేయవచ్చును.

దర్శనాచ్చ ॥ 66సూ.

తా॥ క్రిందిశ్రుతివలన నుపాసనములకు సహభావములేదు గనుక సముచ్చయముగాగాని వికల్పముగాగాని కావచ్చును.

1 ఛాం. 4-17-10 'ఏవం విద్ధ్వై బ్రహ్మా యజ్ఞం యజమానం సర్వాశ్చర్త్విజోఽరభిరక్షతి'

తా॥ కర్మాంగములకు లోపముకలిగినపుడు బ్రహ్మయను ఋత్విజుడే యజమానుని ఇతరఋత్విజులను వారిదోషముల నుండి కాపాడుచున్నాడు. 3 వ పా॥ సమాప్తము.

4వ పా॥ 1 మొ॥ 52సూ వరకును 8 వ ప్ర॥ లో కలవు.

---

16 వ ప్రి. 4అ. 1 వ పాదము.

ప్రథమసూత్రము 5వ ప్రకరణములో నున్నది.

లింగాచ్చ ॥ 2సూ.

తా॥ ఓంకారమునందు సూర్యదృష్టితో పలుమాఱు ఉపాసింపుమని చెప్పిన ఛాం. ఆదిత్యఉద్గీథయందు 'రశ్మీం స్త్వం పర్యావర్తయాత్', యను శ్రుతిచేత ఒకసారిశ్రవణమువలన బ్రహ్మసాక్షాత్కారము కలుగదు.

3వ సూ. 9వ ప్రిలోను, 4 5సూ. 10వ ప్రి ను కలవు.

ఆదిత్యాది మతయశ్చాంగం ఉపపత్తేః ॥ 6సూ.

తా॥ అంగములగు ఉద్గీథాది కర్మములందు సూర్యదృష్టితో చేయువానియొక్క కర్మము అవిద్వాంసుని కర్మముకంటె నెక్కువఫలమునిచ్చునని ఛాం. 'యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి' యను శ్రుతి చెప్పుచున్నది.

(6 అధి) ఆసీనః సంభవాత్ ॥ 7సూ.

తా॥ కర్మాంగములు కాని ఉపాసనలను కూర్చుండియును, కర్మాంగోపాసనములను వానివిధులననుసరించియును చేయవచ్చును.

ధ్యానాచ్చ ॥ 8సూ.

తా॥ ఉపాసనము ధ్యానమే ప్రధానముగాగలది.

అచలత్వంచాపేక్ష్య ॥ 9సూ.

తా॥ భూమివలెనే చలనములేకుండ ధ్యానింపుమని 'ధ్యాయతీవ పృథివీ' యను శ్రుతి కలదు.

స్మరంతి చ ॥ 10సూ.

తా॥ భ. గీ. 6అ. 11శ్లో॥ 'శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర

మాసనమాత్మనః ।' తా॥ పరిశుద్ధమగు స్థలమునందు షాలిఃపని: పద్మాసనాదులయందు కూర్చుండి జితేంద్రియుడై చిత్తశుద్ధి కొఱకు సమాధిచేయవలయునని స్మృతి చెప్పుచున్నది.

(7 అధి) యత్రైకాగ్రతా తత్రావిశేషాత్ ॥11సూ.

తా॥ కర్మాంగములుకాని యుపాసనలను చిత్తైకాగ్రత ఎక్కడ నెట్లుకలుగునో అక్కడ నట్లుచేయుమని 'మనోనుకూలే' యను శ్వే. శ్రుతి చెప్పుచున్నది.

(8 అధి) ఆప్రాయణాత్తత్రాపి హి దృష్టం ॥ 12సూ.

తా॥ కర్మోపాసనములను మఱణమువరకును చేయ్యవలయును. మఱణకాలమునందు విశేషజ్ఞానము కలుగునని బృ. 'సవిజ్ఞానో భవతి' 'సవిజ్ఞానమేవాన్వవక్రామతి' ప్రశ్నోపనిషత్తు. 3-10 'యచ్చిత్తస్తేనైష ప్రాణమాయాతి ప్రాణస్తేజసాయుక్తస్సహాత్మనా యథా సంకల్పితం లోకం నయతి' యనెడి శ్రుతులును, మఱణకాలమందును ఉపాసనకలదని 'సయావత్క్రతురయమస్మాల్లోకాత్ప్రైతి' యను శ్రుతియును, భ.గీ. 8అ. 6శ్లో॥ 'యంయంవాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరం। తంతమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః॥'. భ. గీ. 8-10 'ప్రయాణకాలే మనసాఽచలేన' యను స్మృతులును చెప్పుచున్నవి.

(9 అధి) తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేష వినాశౌ తద్వ్యపదేశాత్ ॥ 13సూ.

తా॥ తదధిగమే-బ్రహ్మసాక్షాత్కారము కలుగగానే, ఉత్తర పూర్వాఘయోః అశ్లేషవినాశౌ- జ్ఞానమునకు పూర్వమందు చేయబడినట్టియు, ముందు రాబోవునట్టియు పాపములు నశించు

నని తద్వ్యపదేశాత్ -శ్రుతి స్మృతులు చెప్పుచున్నవి

1 ఛాం 'యథా పుష్కరపలాశ ఆపో నశ్లిష్యం తఏవమేవం విది పాపం కర్మ నశ్లిష్యతే' తా॥ తామరగాకును ఉదకమువలెనే జ్ఞానిని రాగలపాపకర్మములంటవు.

2 ఛాం. 'తద్యథేషీకా తూలమగ్నౌ ప్రోతం ప్రదూయే తైవం హాస్య సర్వేపాప్మానః ప్రదూయంతే'

తా॥ జ్ఞానోత్పత్తివరకునుగల అన్నిజన్మములలోను చేసిన గతపాపములు నశించును.

3 ము. 'భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః। క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్‌దృష్టే పరావరే।'

తా. 249 పుటలో కలదు.

(10 అధి) ఇతరస్యాప్యేవ మసంశ్లేషః పాతేతు। 14.

తా॥ ఇతరస్యాపి-జ్ఞానియొక్క పుణ్యకర్మము ఏవం-పాపకర్మములవలెనే అసంశ్లేషః- నశించును. పాతేతు- ధర్మాధర్మములగు పుణ్యపాపములు నశించుటచేత శరీరపాతానంతరం ముక్తి కలుగునని బృ. 6-4-22 'ఉభే ఉహ్యైవైష ఏతే తరతి' సర్వే పాప్మానోఽతో నివర్తంతే' యనుశ్రుతులుచెప్పుచున్నవి.

(11 అధి) అనారబ్ధకార్యే ఏవతు పూర్వే తదవధేః।15.

తా॥ జన్మాంతరసంచితములున్ను జ్ఞానోత్పత్తికి పూర్వమీ జన్మమందుగల సంచితములున్ను జ్ఞానమువలన నశించుచున్నవి కాని యీజన్మమున ఆరంభమయిన పుణ్యపాపకార్యములలో కొంతననుభవించి కొంతమిగిలియుండుటచేత నవి దేహపాతమువఱకుమాత్రమే నుండునని కొందరిమతము.

16వ సూ. 7వ ప్రకరణములో నున్నది.

అతోఽన్యాపి హ్యేకేషాముభయోః॥ 17సూ.

తా॥ అతః-అగ్ని హోత్రాది నిత్యకర్మములకంటె అన్యా అపి-అన్యమగు ఫలముకొఱకుఁ చేయు పుణ్యకర్మము అస్తిహి-కలదుగదా? అట్టికర్మముచేత ఏకేషాం-కొన్ని శాఖలవారు 'సుహృదస్సాధుకృత్యా' మిత్యాది వాక్యముచేతను పుణ్యకర్మములు అతని మిత్రులను, పాపకర్మములు శత్రువులను, పొందునుగాని బ్రహ్మవిదునియందుండవని చెప్పుదురు. కాని ఇట్టి కామ్యకర్మము జ్ఞానమునకుపయోగింపదని ఉభయోః= జైమిని బాదరాయణాచార్యులిద్దరును తలచుచున్నారు.

(13 అధి) యదేవ విద్యయేతి హి ॥ 18సూ.

తా॥ 'యదేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి' యనెడి శ్రుతియందు విద్యతోకూడిన అగ్నిహోత్రకర్మమునకును, విద్యతోకూడని కర్మమునకును, ఏకసామర్థ్యముచూపుచున్నందున రెండును ముముక్షువునకు మోక్షప్రయోజనముకొఱకు యీజన్మమునందుగాని పూర్వజన్మములందుగాని చేసిన కర్మానుసారముగా పుణ్యపాపములు క్షయింపుద్వారా బ్రహ్మజ్ఞానకారణమగుచు శ్రవణమనన ధ్యాన తత్పరాదులగు అంతరంగకారణముల నపేక్షించి బ్రహ్మవిద్యతో నేకీభవించుచున్నవి. ఈకర్మములు జ్ఞానసాధనములని తాత్పర్యము.

భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే॥ 19సూ.

తా॥ ఇతరేతు=ప్రారబ్ధమగు పుణ్యపాపములను భోగేన= సుఖదుఃఖాద్యనుభవముచేత క్షపయిత్వా=నశింపుచేసి సంపద్యతే=బ్రహ్మమును పొందుచున్నాడు. ఇట్లే 'తస్య తావదేవ

చిరం యావన్నవిమోక్ష్యేఽథ సంపత్స్య ఇతి' 'బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి' మొదలగు శ్రుతులు చెప్పుచున్నవి.

మొదటిపాదము సమాప్తము.

వివరణము- ప్రారబ్ధమునుగూర్చి అపరోక్షానుభూతి90శ్లో॥ 'ఉత్పన్నేప్యాత్మవిజ్ఞానే ప్రారబ్ధం నైవముంచతి। ఇతియచ్ఛ్రూయతే శాస్త్రే తన్నిరాక్రియతేఽధునా ॥'

తా॥ ఆత్మజ్ఞానముకలిగినను ప్రారబ్ధము విడువదని శాస్త్రములయందెయ్యది వినబడుచున్నదో అది యిప్పుడు నిరాకరింపబడుచున్నది. సకలవ్యవహారకారణమైన అజ్ఞానము తొలగగా ప్రారబ్ధములేదని భావము.

జీ. వి. 'తీర్థే శ్వపచగృహేవా నష్టస్మృతిరపి పరిత్యజన్ దేహం। జ్ఞానసమకాలముక్తః కైవల్యం యాతి హతశోకః।'

తా। శ్రీకాశీమొదలగు పుణ్యతీర్థములయందుగాని, చండాలగృహమందుగాని, స్మృతిలేకుండా మరణించినను వానికి జ్ఞానోత్పత్తికాలమునందే శోకరహితుడై కైవల్యమును పొందుచున్నాడు. ఇందువలన ప్రారబ్ధము లేదనిభావము.

---

16 వ ప్ర॥ 4అ. 2వ పాదము.

అవ॥ శరీరమునుండిపోవు ఇంద్రియాదుల లయక్రమమును తరువాతపొందు దుఃఖములను చెప్పుచున్నాడు.

(1 అధి) వాఙ్మనసి దర్శనాచ్ఛబ్దాచ్చ ॥ 1సూ.

తా॥ 'వాఙ్మనసి సంపద్యతే' యను వాక్యముచేత వాగింద్రియవృత్తి మనసునందులయించుచున్నది. ఇట్లే లోకమునందుకనుపించుచున్నది. వృత్తికిని, వృత్తిమత్తునకును భేదము లేదు.

అతఏవచ సర్వాణ్యను ॥ 2సూ.

తా॥ వాక్కువలె చక్షురాదీంద్రియములన్నియును మనస్సననుసరించుచున్నవి.

(2 అధి) తన్మనః ప్రాణఉత్తరాత్ ॥ 3సూ.

ఇంద్రియవృత్తులతోఁ కూడిన మనస్సు ప్రాణమునందు లయమగుచున్నది.

(3 అధి) సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః ॥ 4సూ.

తా॥ ప్రాణములన్నియు జీవునిపొందుననిబృ. 'ఏవమేవేమమాత్మానమంతకాలే సర్వేప్రాణా అభిసమాయంతి యత్రైతదూర్ధ్వోచ్ఛ్వాసీ భవతి' యను శ్రుతియును, బృ. తముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి' ఇంద్రియములు ప్రాణముతో జీవుని పొందుననియు, 'ప్రాణమనూత్క్రామంతం సర్వేప్రాణా అనూత్క్రామంతి' యనియును చెప్పుచున్నవి. దీనితాత్పర్యము 360 పుటలోఁ కలదు.

భూతేషు తచ్ఛ్రుతేః ॥ 5సూ.

తా॥ 'ప్రాణస్తేజసి' యను శ్రుతివలన జీవుడు ప్రాణముతోఁ కూడి దేహబీజములగు సూక్ష్మభూతములందు నిల్చును.

నైకస్మిన్ దర్శయతో హి ॥ 6సూ.

తా॥ జీవుడు వేఱొకశరీరమును పొందగోరినపుడు ఒకతేజమునందే యుండడు. ఇట్లే 'ఆపఃపురుషవచసః' యను వాక్యము చెప్పుచున్నది. ఇంద్రియములు మనస్సునందును, మనస్సు ప్రాణమునందును, ప్రాణము జీవునియందును లీనమగును.

(4 అధి) సమానాచాసృత్యుపక్రమాదమృతత్వం చానుపోష్య । 7 సూ.

తా॥ అర్చిరాదిమార్గప్రాప్తికి పూర్వము సమానులుగా నున్నవారిలో అవిద్వాంసుడు కర్మములను చేయుచు మరల జన్మించుచున్నాడు. సగుణబ్రహ్మోపాసకుడు మోక్ష (సుషుమ్నా) నాడీద్వారా అర్చిరాదిమార్గమును పొందుచు అవిద్యాసంబంధమగు క్లేశములను నశింపుచేయకనే సగుణ విద్యాసామర్థ్యమువలన మోక్షమును పొందకోరుచున్నాడు.

(5 అధి) తదాపీతేః సంసారవ్యపదేశాత్ ॥ 8 సూ.

తా॥ ఇంద్రియాధిష్ఠానసూక్ష్మభూతసముదాయము జ్ఞానముకలిగి మోక్షముపొందువఱకునుండును. కొందఱు తాము చేసిన కర్మమును, విజ్ఞానముననుసరించి యోనిద్వారమునందు ప్రవేశించుచున్నారు. కొందఱు స్థావరాది జన్మములను పొందుచున్నారు. అని కఠవల్లి 5-7 'యోనిమన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః। స్థాణుమన్యేఽనుసంయాంతి యథా కర్మ యథా శ్రుతం;' యను శ్రుతిచెప్పుచున్నది. ఈమొదలగు శ్రుతులవలన సంసారవ్యపదేశాత్ - మోక్షముకలుగువరకును జననమరణములు కలుగును.

సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః ॥ 9 సూ.

తా॥ శరీరమునుండి పోవుచున్న తేజమనెడి ప్రకృతి ప్రమాణతశ్చ-పరిమాణముచేతను, స్వరూపముచేతను, సూక్ష్మం సూక్ష్మమయినది. అశ్లే తథోపలబ్ధేః- నాడీనిష్క్రమణ శ్రవణాదులవలన కనబడును. కనుకనే దగ్గిరనున్నవారికైనను చూడబడదు.

నోపమర్దేనాతః । 10సూ.

తా॥ అతః- తేజము మొదలగు భూతవర్గము మిక్కిలి సూక్ష్మమగుటవలననే, ఉపమర్దేన- స్థూల దేహమునకువలె దాహాదులు లేనందున సూక్ష్మశరీరము నశింపదు.

అస్యైవ చోపపత్తే రేష ఊష్మా ॥ 11సూ.

తా॥ ఏషః-ఊష్మా - జీవించియున్నపుడు స్పర్శముచేతను తెలిసికొనబడు ఈయూష్మము అస్యైవ-ఈసూక్ష్మశరీరము దే ఉపపత్తేః-మరణావస్థయందు స్థూల దేహమున్నను యూష్మము కనిపింపకపోవుటచే నది దేహముకంటె వేఱొకదానినాశ్రయించినట్లు 'ఉష్ణఏవైష జీవిష్యంచ్ఛీతో మరిష్యన్' జీవించి యున్నప్పుడు వెచ్చనిదియు, మరణించినపుడు చల్లనిదియు నగుచున్నదని శ్రుతిచెప్పుచున్నది.

(6 అధి) ప్రతిషేధాదితిచేన్న శారీరాత్ ॥ 12సూ.

తా॥ ప్రతిషేధాత్ - క్రిందిశ్రుతివలన పరబ్రహ్మవిదుని దేహమునుండి ప్రాణములు వెడలిపోవుట, నేతిచేత్ - లేదంటివేని, ప్రాణములు వెడలిపోవుట శారీరాత్ - శారీరుడగు జీవునినుండి యగుచున్నవి కాని దేహమునుండికాదు. గనుక విరోధము న-లేదు. ప్రాణములు జీవుని ననుసరించియే కాని జీవునివిడిచి వేఱుగాపోవు.

బృ. 6-4-6 'అధాకామయమానో యోఽకామోనిష్కామ ఆప్తకామ ఆత్మకామో న తస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి' తా॥ కోరికలులేనివాడు అకామయమానుడు. కామములు జీర్ణమైనవాడు నిష్కాముడు. ప్రాప్తమైన కామములుకలవాడు ఆప్తకాముడు. ఆత్మయందుమా

త్రిమే కామ్యముకలవాడు ఆత్మకాముడు. ఇట్లయినవాడు ముక్తుడు. ఆత్మగామికి సర్వమున్ను తనస్వరూపమే కనుక దేనినిగాని కోరడు. అతనియొక్క వాగాదీంద్రియములు దేహమునుండి పోనేరవు. బ్రహ్మమునిచటనే పొందుచున్నాడు.

స్పష్టో హ్యేకేషాం। 13సూ.

తా॥ ఏకేషాం—కాణ్వశాఖయందు బ్రహ్మవిదునియొక్క ప్రాణములు శరీరమునుండి లేచిపోవని హి—యేకారణముచే స్పష్టః—స్పష్టముగ చెప్పబడెనో యాకారణమువలన నట్లే చెప్పతగును.

బృ. 5-2-11 'యత్రాయం పురుషో మ్రియతే ఉదస్మాత్ప్రాణా ఉత్క్రామంత్యాహో నేతి' 'నేతి హోవాచ యాజ్ఞవల్క్యః' తా॥ విద్వాంసుడు మరణించుకాలమునందు ప్రాణాదులు వెడలిపోవునా లేదా యని యార్తభాగుడడుగగా సముద్రమునందు కెరటములు ఏకీభవించునట్లు బ్రహ్మమునందే లయమగుననియు, లేచిపోవనియు, దేహముఉబ్బి తిత్తివలె బాహ్యవాయువుచే పూరింపబడినదియై నిశ్చేష్టమగుచున్నదనియు యాజ్ఞవల్క్యుడు చెప్పెను. 'అత్రైవ సమవలీయంతే' యని ప్రాణములకిచ్చటనే లయమునుచెప్పి తత్సిద్ధికొఱకు 'సఉచ్ఛ్వయత్యాధ్మాయత్యాధ్మాతో మృతశ్శేతే' యని చెప్పబడినది. ఇట్లు రెండుశాఖలయందును తుల్యమే. 'అత్ర బ్రహ్మ సమశ్నుతే' ఇచటనే బ్రహ్మమును పొందుచున్నాడు. ఇట్లు అనేకశ్రుతులు కలవు. బ్రహ్మవిదునికి ఉత్క్రాంతిగాని, అర్చిరాదిమార్గముగాని లేదని సిద్ధాంతము.

స్మర్యతే చ । 14సూ.

తా॥ స్మృతియగు మహాభారతమునందు 'సర్వభూతాత్మ భూతస్య సమ్యగ్భూతాని పశ్యతః। దేవాపి మార్గే ముహ్యం తి హ్యపదస్య పదైషిణః।' బ్రహ్మవిదునియొక్క మార్గము ను దేవతలుసైతము తెలియజాలకున్నారు. యీస్మృతివలన బ్రహ్మవిదునకు జీవను ప్రాణములు మొదలగునవి లేచిపోవ ని సిద్ధము.

(7 అధి) తాని పరే తథా హ్యాహ । 15సూ.

తా॥ బ్రహ్మవిదుని ప్రాణశ్రద్ధాది 16 కళలును నదులు సముద్రమును పొంది యస్తమించునట్లు బ్రహ్మమునందస్తమిం చునని 'ఏవమేవాస్య పరిద్రష్టురిమాః షోడశకలాః పురుషాయ ణాః పురుషం ప్రాప్యాస్తం గచ్ఛంతి' యని ప్ర. ఉనందును, 'గతాః కలాః పంచదశ ప్రతిష్ఠా' ప్రాణాదులు వధునైద్ధు న్న తమప్రకృతులగు పృథివ్యాదులందు ప్రవేశించి వానితో బ్రహ్మమును పొందునని ముం. ఉ. నందును కలవు.

(8 అధి) అవిభాగో వచనాత్ । 16సూ.

తా॥ ప్రశ్నో॥ 'ఏవమేవాస్య భిద్యేతే చాసాం నామరూపే పురుష ఇతి। సఏషోఽకలోఽమృతో భవతి' యన్నుశ్రుతు లు విద్వాంసుని కళలు విభాగముకాక నే నిరవశేషముగ బ్రహ్మమునందు లయమగుచున్నవని చెప్పుచున్నవి.

(9 అధి) తదోకోఽగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో విద్యాసామర్థ్యాత్తచ్ఛేషగత్యనుస్మృతియోగా చ్చ హార్దానుగృహీతః శతాధికయా॥ 17సూ.

తా॥ తత్-శరీరమునుండి పోవతలచిన జీవుడు ఓకః-హృ

దయస్థానమునకు వచ్చి తదగ్రిజ్వలనం-నాడీముఖము (సుషు మ్నానాడీ) దారా చక్షువునుండిగాని, బ్రహ్మరంధ్రమునుం డిగాని కర్మానుసారము మఱియొక చోటనుండిగాని పోవుచు న్నాడు. ఇట్లె బృ. 6.4-1 'సఏతాస్తేజోమాత్రాస్సమభ్యా దదానో హృదయమేవాన్వవక్రామతి' బృ. 6-4-2 తస్య హైతస్య హృదయస్యాగ్రం ప్రద్యోతతే తేన ప్రద్యోతేనై షఆత్మా నిష్క్రామతి చక్షుషోవా మూర్ధ్నోవా అన్యేభ్యోవా శరీరదేశేభ్యః' యను శ్రుతులు చెప్పుచున్నవి. విద్వాంసుడు తత్ప్రకాశితద్వారః-తాను పొందతగిన ఫలము ననుసరించిన మార్గముతో సహనాశ్రమునుండి విద్యాసామర్థ్యాత్ -విద్యా బలముచేత పోవుచున్నాడు. తచ్ఛేషగత్యనుస్మృతియోగాత్ చ-విద్యాశేషభూతమగు మూర్ధన్యనాడీద్వారా గమనమును చింతించుచు అట్లే పోవుచున్నాడనుట యుక్తము. విద్వాంసు డును హార్దానుగృహీతః-ఉపాసనచేత ననుగ్రహింపబడి బ్ర హ్మభావమును పొందినవాడగుచు సుషుమ్నానాడీద్వారా బ్రహ్మరంధ్రమునుండి పోవుచున్నాడు. హృదయమునకు సం బంధించిన నాడులు 101 లో సుషుమ్నయనునది మాత్రము బ్రహ్మరంధ్రమును వ్యాపించియుండునని ఛాం. 8-6-6 'శతం చైకాచ హృదయస్య నాడ్యస్తాసాం మూర్ధానమభినిస్సృతైకా తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి' యను శ్రుతి చెప్పుచున్నది. బ్రహ్మోపాసనలేని వారు ఇతరనాడులద్వారా పోవుచున్నారు. వీరికి మోక్షము లేదు.

రశ్మ్యనుసారీ ॥ 18సూ.

త్రా॥ సుషుమ్నామార్గముచే మరణించువాడు రశ్మ్యను

సారీ-సూర్యకిరణములననుసరించియే పోవును.

నిశి నేతిచేన్న సంబంధస్య యావద్దేహభావి
త్వాద్దర్శయతి చ ॥ 19సూ.

తా॥ నిశి-రాత్రియందు మరణించినవానికి సూర్యకిరణ సంబంధము న ఇతిచేత్-- సంభవింపదంటివేని యావద్దేహభావిత్వాత్-నాడీరశ్మిసంబంధము దేహమున్నంతవరకు నుండును కనుక న-అట్లనరాదు. దర్శయతి చ-రాత్రికూడ శరీరమునందు తాపము మొదలగువానివలన కిరణములసంబంధము కనిపించుచున్నది. సూర్యమండలమునుండి కిరణములు దేహములోనున్న నాడులందు ప్రసరించుచు పారుచున్నవనియు, రాత్రియందును, సూర్యుని ననుసరించుననియు 1 ఛాం. 8.6.2 'అముష్మాదాదిత్యాత్ప్రతాయంతే తా ఆసు నాడీషు సృప్తా ఆభ్యో నాడీభ్యః ప్రతాయంతే తే ఆముష్మిన్నాదిత్యే సృప్తా' 2 'అహరేవైతద్రాత్రౌ విదధాతి' అనుశ్రుతి చెప్పుచున్నవి.

(11 అధి) అతశ్చాయనేఽపి దక్షిణే ॥ 20సూ.

తా॥ విద్యాఫలమునకును, మరణమునకును కాలనియమములేదు. విద్వాంసుడు దక్షిణాయనమున మృతుడైనను విద్యాఫలము నవశ్యము పొందును.

యోగినః ప్రతిచ స్మర్యతే స్మార్తేచైతే ॥ 21సూ.

తా॥ పైనిచెప్పిన రాత్రింపగళ్లు యోగులనుద్దేశించి చెప్పబడుచున్నది. భగవదారాధనబుద్ధితో చేసిన కర్మము యోగము. ధారణతోకూడి కర్తృత్వాభిమానములేకుండుట సాంఖ్యము. ఏతే=ఈయోగసాంఖ్యములు రెండును శ్రుతి స్మృతి సిద్ధములు కావు. స్మార్తేచ=స్మార్తమగు కాలనియమమునకు

శ్రౌతములగు ఉపాసనములందు ప్రవేశములేదు విద్వాంసుడు విద్యాసామర్థ్యమువలన పగటియందుగాని రాత్రియందుగాని ఉత్తరాయణమునగాని దక్షిణాయనమునగాని యెప్పుడు మరణించినను విద్యాఫలమును పొందును.

రెండవ పాదము సమాప్తము.

---

16 వ ప్ర॥ 4అ. 3వ పాదము.

1 అర్చిరాద్యధికరణము.

అర్చిరాదినా తత్ప్రథితేః ॥ 1సూ.

తా॥ సగుణబ్రహ్మోపాసకులకు అర్చిరాదిమార్గమే కలుగును. వీరు మరణమునొందగానే సూర్యలోకమును పొందుచున్నారని ఛాం. 'సయావత్ క్షిప్యేన్మనస్తావదాదిత్యం గచ్ఛతి' యను శ్రుతియును, జనులులేనిస్థలమునందు శ్రద్ధతో సత్యబ్రహ్మమునుపాసించు వానప్రస్థులును, త్రిదండిసన్న్యాసులును, అర్చిరాదిమార్గమున పోవుదురని బృ. 8-2 15 'యేచామీ అరణ్యే శ్రద్ధాం సత్యముపాసతే' యను శ్రుతియును, బ్రహ్మాదులు భోగములుగల బ్రహ్మలోకమునందు హిరణ్యగర్భునితో ననేకబ్రహ్మకల్పములుందురని, కౌ. 'తే తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసంతి' యనుశ్రుతియును, అక్కడ కార్యబ్రహ్మముయొక్క సమానరూపమును పొంది సర్వలోకవ్యాప్తిని పొందుదురని, కౌ. 1-6 'సాయా బ్రహ్మణో జితిర్యావ్యుష్టిస్తాంజితిం జయతి తాం వ్యుష్టిం వ్యశ్నుతే' యనెడి శ్రుతియును చెప్పుచున్నవి.

(2 అధి) వాయుమబ్దాదవిశేషవిశేషాభ్యాం ॥ 2సూ.

ఛాం. 5-10-1 'తేఽర్చిషమభిసంభవం త్యర్చిషోఽహార హ్న ఆపూర్యమాణ పక్షమాపూర్యమాణ పక్షాద్యాన్ షడుదఙ్ఞేతి మాసాం స్తాన్ మాసేభ్యస్సంవత్సరం సావత్సరాదాదిత్య మాదిత్యాచ్చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవః సఏనాన్ బ్రహ్మ గమయతి'

తా॥ పంచాగ్న్యుపాసకులగు గృహస్థులును, బ్రహ్మనిష్ఠులగు వానప్రస్థులును, పరివ్రాజకులును, మరణానంతరము క్రమముగా అగ్ని దేవతను, అహర్దేవతను, శుక్లపక్ష, ఉత్తరాయణ, సంవత్సర, దేవతలను, సూర్యుని, చంద్రుని, విద్యుత్తును పొందుదురు. తరువాత వీరిని అమానవపురుషుడు బ్రహ్మలోకమును పొందించును. ఈశ్రుతిలో చెప్పిన అబ్దాత్ =సంవత్సర దేవతకును, సూర్య దేవతకును మధ్యను వాయుం=వాయు దేవతను, అవిశేషవిశేషాభ్యాం=ఉపాసకులకుగల సామాన్య విశేషోపదేశములవలన పొందుచున్నారు.

కా. 1-3 'సఏతం దేవయానం పంథానమాపద్యాగ్నిలోకమాగచ్ఛతి సవాయులోకం సవరుణలోకం సఇంద్రలోకం సప్రజాపతిలోకం సబ్రహ్మలోకం' ఇతి కాపీతకీనః। పర్యంకోపాసకుడు దేవయాన (అర్చిరాది) మార్గముచేత అగ్ని, వాయు, వరుణ, ఇంద్ర, ప్రజాపతి, బ్రహ్మలోకములను పొందుచున్నాడు.

3 బృ. 7-10-1 'యదావై పురుషోఽస్మాల్లోకాత్ప్రైతి సవాయుమాగచ్ఛతి తస్మై సతత్ర విజిహీతే యథా రథ చక్రస్య ఖం తేన సఊర్ధ్వమాక్రమతే సఆదిత్యమాగచ్ఛతి'

తా॥ దేవలోకమునందలి ఆవాయువు తనయందుచేయు సూక్ష్మబిలముగుండా విద్వాంసుకు సూర్యునిపొందుచున్నాడు ఇట్లు దేవయానమార్గము కలదు.

(3 అధి) తటితోఽధివరుణః సంబంధాత్ ॥ 3సూ.

తా॥ తటితోధి- ఛాం. 4-15-5 'ఆదిత్యాచ్చంద్రమసం చంద్రమసో విద్యుతం' యను శ్రుతియందు విద్యుత్తు అంత్యముగా చెప్పబడినది. దానికంటె పూర్వమే వరుణః-వరుణలోకమున్నందున సంబంధాత్-మెరుపులకును, మేఘములకును పరస్పరకారణమువలన తటిత్ (మెరుపు) తో సంబంధించును ఇదియే అర్చిరాదిమార్గమునకు అంత్యముగనున్నది. దీనికిపైని స్థానాంతరము చెప్పలేదు.

(4 అధి) ఆతివాహికాస్తల్లింగాత్ ॥ 4సూ.

తా॥ ఆతివాహికాః-మెరుపు అంతముగాగల అర్చిరాదులు బ్రహ్మలోకమునకు పోవువారిని తీసికొనిపోవు దేవతలేయని తల్లింగాత్-నేతృత్వలింగమువలనను, ఛాం. 4-15-5-6 'చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవః సఏనాన్ బ్రహ్మగమయతి' విద్వాంసులు చంద్రుని, విద్యుత్తును పొందినతరువాత వీరిని యజమానపురుషుడు బ్రహ్మలోకమునకు తీసికొనిపోవునని చెప్పుటచేత నర్చిరాదులు దేవతలని చెప్పతగును.

5 మొ॥ 14 వరకునుగల సూ॥ 12వ ప్ర॥లో నున్నవి.

(6 అధి) అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణ ఉభయథాఽదోషాత్తత్క్రతుశ్చ ॥ 15సూ.

తా॥ అప్రతీకాలంబనాత్ - నామాది ప్రతీకోపాసనలను విడిచి అహంగ్రహోపాసకులనందఱిని అమానవసిద్ధుడు

బ్రహ్మలోకమును పొందించుచున్నాడని బారరాయణః-వ్యాసులు తలచుచున్నాడు. ఉభథా అదోషాత్-ప్రతీకోపాసనల కుపపత్తిలేనందునను, వానికంటె ఇతరోపాసనకుపపత్తికలిగి ఏవిరోధమున్న లేనందునను, తత్క్రతుశ్చ-ఎవడు దేనినుపాసించునో వాడు దానిని పొందుచున్నాడను న్యాయమువలనను, 'తం యథా యథోపాసతే తదేవ భవతి' యను శ్రుతి వలనను బ్రహ్మోపాసకుడే బ్రహ్మమును పొందును గాని ప్రతీకోపాసకులు పొందలేరు.

విశేషంచ దర్శయతి ॥ 16సూ.

తా॥ క్రిందిశ్రుతులు నామాదులగు ప్రతీకోపాసనములలో పూర్వపూర్వపుదానికంటె ఉత్తరోత్తరదానియందు విశేషంచ దర్శయతి-ఫలాధిక్యముచు చూపుచున్నది. ప్రతీకోపాసకులకు బ్రహ్మోపాసకులతో సమమగు ఫలముగాని దక్షిణాయనమార్గముగాని, తృతీయమార్గముగాని లేదు. వారు అర్చిరాదిమార్గముననే విద్యుల్లోకమువఱకునుపోయి ఫలానుభవముదాక నుందురని సంప్రదాయజ్ఞులు చెప్పుచున్నారు.

1 ఛాం. 7-1-5 'యావన్నామ్నో గతం తత్రాస్య యథా కామచారో భవతి' తా॥ నామము బ్రహ్మమని యుపాసించువారికి ఆనామమునకు గోచరించువిషయమునందు స్వేచ్ఛాసంచారము కలుగును.

2 ఛాం. 7-2-1 'వాగ్వావనామ్నో భూయసీ' నామముకంటె వాక్కు గొప్పది. 3 ఛాం. 7-2-2 'యావద్వాచో గతం తత్రాస్య యథా కామచారో భవతి' తా॥ వాక్కును బ్రహ్మముగ నుపాసించువానికి వాగ్విషయమునందు కామ

చారము సిద్ధించును. 4 ఛాం. 7-3-1 'మనోవావవాచో భూయః' తా॥ వాక్కుకంటె మనస్సు గొప్పది.

మూడవపాదము సమాప్తము.

---

16 వ ప్ర॥ 4అ. 4 పాదము.

1 అధి) సంపద్యావిర్భావః స్వేనశబ్దాత్ ॥ 1సూ.

తా॥ సంపద్య=బ్రహ్మమునుపొందినవాడు కేవలాత్మరూపమును ఆవిర్భావః=పొందుచున్నాడని స్వేనశబ్దాత్=స్వశబ్దమువలననే చెప్పబడుచున్నది.

ముక్తః ప్రతిజ్ఞానాత్ ॥ 2సూ.

తా॥ బ్రహ్మమును పొందినవాడు ముక్తుడని ప్రతిజ్ఞానాత్= చతుర్ముఖుని చేత ప్రతిజ్ఞ చేయబడుటవలన ముక్తః=సర్వబంధములనుండి విడువబడి ఆత్మస్వరూపముతోనుండును.

1 'ఏతం త్వేవ తే భూయోఽను వ్యాఖ్యాస్యామి'

తా॥ అవస్థాత్రయదోషములేనివాడు ఆత్ముడు.

2 'అశరీరం వా వసంతం నప్రియాప్రియే స్పృశతః'

3 'స్వేనరూపేణాభినిష్పద్యతే సఉత్తమః పురుషః'

తా॥ ఇట్లు ఆత్మస్వరూపమునే యుపదేశించినట్లు ఇంద్రునితో బ్రహ్మ చెప్పెను. బంధనివృత్తియే మోక్షము.

ఆత్మాప్రకరణాత్ ॥ 3సూ.

తా॥ ప్రకరణమువలన 'తద్దేవాజ్యోతిషాం జ్యోతిః' యనువాక్యములోని జ్యోతిశ్శబ్దమునకర్థము బ్రహ్మమేకాని అగ్నిదేవతకాదు.

(2 అధి) అవిభాగేన దృష్టత్వాత్ ॥ 4సూ.

తా॥ ముక్తుడు విభాగములేకనే పరమాత్మునితో నేకీభవించును. కాని బ్రహ్మముకంటె భిన్నుడుకాడు.

1 ఛాం. 6-8-7 'తత్త్వమసి, అహంబ్రహ్మాస్మి' 2 ఛాం. 7-24-1 'యత్ర నాన్యత్పశ్యతి' 3 బృ. 6-3-23 'నతు తద్ద్వితీయమస్తి తతోఽన్యద్విభక్తం యత్పశ్యేత్' 4 క. 4-15 'యథోదకం శుద్ధే శుద్ధమాసిక్తం తాదృగేవ భవతి ఏవం మునేర్విజానత ఆత్మా భవతి గౌతమః'

తా॥ శుద్ధజలమందుంచిన నిర్మలోదకము శుద్ధజలమగునట్లే జీవేశ్వరులకైక్యమును తెలిసికొనిన మననశీలునియొక్క ఆత్మ ఏకరసమేయగును.

5 ఛాం. 7-24-1 'సభగవః కస్మిన్ప్రతిష్ఠితఇతి, స్వేమహిమ్ని' తా॥ 280 పుటలో కలదు.

6 ఛాం. 7-25-2 'ఆత్మరతిరాత్మక్రీడః'

(3 అధి) బ్రాహ్మేణ జైమిని రుపన్యాసాదిభ్యః ॥5సూ.

తా॥ పరబ్రహ్మముతో ముక్తుడు ఏకీభవించుచున్నాడని జైమిన్యాచార్యుడు 'యఆత్మాఽపహతపాప్మా' 'సత్యకామస్సత్యసంకల్పః' యను ఉపన్యాసాదులవలన తలచుచున్నాడు తా॥ 60 పుటలో కలదు.

ఛాం. 'స తత్ర పర్యేతి జక్షన్ క్రీడన్ రమమాణః' 'తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి'

ఇట్లు ముక్తునకైశ్వర్యమును బోధించుచున్నవి.

చితితన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః ॥ 6సూ.

తా॥ సర్వజ్ఞత్వాదిధర్మములు ,చితి=చిత్తునందు శబ్దజ్ఞాన

ముఁవలన పుట్టినవియే. తదాత్మకత్వాత్=బ్రహ్మమునకు చైత
న్యమాత్రమే స్వరూపమగుటవలన తన్మాత్రేణ=కేవలచైత
న్యస్వరూపముచేతనే చెప్పతగును. ఉప్పుగడ్డవలె బ్రహ్మము
లోపల వెలుపల భేదములేని చైతన్యపురసమేయని బృ.6-5-
15 'ఏవంవాఽరేఽయమాత్మాఽనంతరోఽబాహ్యః కృత్స్న
ప్రజ్ఞానఘనఏవ' యను శ్రుతిచెప్పుచున్నదని ఔడులోమ్యా
చార్యుడు తలచుచున్నాడు.

ఏవమప్యుపన్యాసాత్పూర్వభావాదవిరోధం
బాదరాయణః। 7సూ.

తా॥ ఏవమపి-ముక్తునకు చైతన్యస్వరూపమంగీకరించినను
వ్యవహారాపేక్షచేత ఉపన్యాసాత్-పైనియుదహరించిన యు
పన్యాసాదులవలన బోధించు పూర్వభావాత్- మీదచెప్పిన
బ్రాహ్మమగు నైశ్వర్యరూపమునకు కుశ్శంకలవలన అవిరో
ధం-విరోధములేదని బాదరాయణః-బాదరాయణాచార్యుడు
తలచుచున్నాడు.

(4 అధి) సంకల్పాదేవ తు తచ్ఛ్రుతేః। 8సూ.

తా॥ ముక్తునియొక్క సంకల్పమువలననే బ్రహ్మలోకభో
గముకలుగునని 'సంకల్పాదేవాస్య పితరస్సముత్తిష్ఠంతి' యను
నుశ్రుతిలోని ఏవకారము చెప్పుచున్నది. ముక్తునిసంకల్పము
ఇతరులసంకల్పములకంటె బలముగలది గనుక మోక్షముకలు
గువఱకును స్థిరముగానుండును.

అతఏవ చానన్యాధిపతిః। 9సూ.

తా॥ అతఏవచ-తిరుగులేని సంకల్పము కలవాడగుటవల
ననే ముక్తుడు అనన్యాధిపతిః-మఱియొక్కదైవము లేనివాడగు

చున్నాడు. సత్యజ్ఞాన సత్యసంకల్పాదిగుణములుగల ఆత్మను తెలిసికొనినవాడు (ఈలోకమున సార్వభౌమునివలె) ఎల్లలోకములయందును సంచరించునని ఛాం. 8-1-6 'అథ యఇహాత్మానమనువిద్య వ్రజంత్యేతాంశ్చ సత్యాన్ కామాన్ తేషాం సర్వేషు లోకేషు కామచారోభవతి' యనుశ్రుతిచెప్పుచున్నది

(5 అధి) అభావం బాదరిరాహ హ్యేవం ॥ 10సూ.

తా॥ ముక్తుడు బ్రహ్మలోకమునందు కోరికలను మనస్సుచేతనే అనుభవించి సంతసించుచున్నాడని ఛాం. 8-12-5 'మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే యఏతే బ్రహ్మలోకే' యనుశ్రుతిచెప్పుటవలన మోక్షమునందు శరీరేంద్రియములు లేవని బాదర్యాచార్యుడు తలచుచున్నాడు.

భావం జైమిని ర్వికల్పామననాత్ ॥ 11సూ.

తా॥ మనస్సునకువలెనే ఇంద్రియములతోకూడిన శరీరమును భావం-ముక్తునకు కలదని. వికల్పామననాత్ - కొన్నిశాఖలవారు చెప్పుచున్నారు. విద్వాంసుడు సృష్టికిపూర్వము ఏకాకారమైనను తరువాత తేజోబన్న-అగ్ని జల పృథివీరూపాకారములను పొందునని ఛాందోగ్యము 7-26-2 'సఏకధా భవతి త్రిధా భవతి' యని శ్రుతిచెప్పుటనలన శరీరమున్ను కలదని జైమిన్యాచార్యుడు తలచుచున్నాడు.

ద్వాదశాహవదుభయవిధం బాదరాయణోఽతః ॥12

తా॥ బాదరాయణః-వ్యాసముని శ్రుతులవలన ద్వాదశాహమను క్రితువునందువలెనే ముక్తునికోరికప్రకారము శరీరముండుట, లేకపోవుట రెండునుకలుగవచ్చునని తలచుచున్నాడు. తన్వభావే సంధ్యవదుపపత్తేః ॥ 13సూ.

తా॥ 'ఛాం. 'మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే' యను శ్రుతిలోని మనసాయను విశేషణమువలన శరీరేంద్రియములు లేకున్నను స్వప్నమునందు శరీరకృత్యములు లేనిదే పుత్రాదికామములను పొందినట్లే మోక్షమునుపొందును.

భావే జాగ్రద్వత్ ॥ 14సూ.

తా॥ శరీరముండగా జాగ్రదవస్థయందు భోగములను పొందునట్లె ముక్తునకును భోగములుకలుగును.

(6 అధి) ప్రదీపవదావేశ స్తథాహి దర్శయతి ॥ 15సూ.

తా॥ ప్రదీపవదావేశః- దీపమునకు అనేకవర్తులందువలె విద్వాంసునకు అనేకశరీరములందు ప్రవేశముకలుగును. తథాహి దర్శయతి-ఛాం. 'సఏకధా భవతి త్రిధా భవతి పంచధా సప్తధా నవధా' ఈ మొదలగు శ్రుతులు ఒకనికనేకభావమును చెప్పుచున్నవి. ముక్తుడు సత్యసంకల్పముచేత ననేకశరీరములను సృజియింపగలడు. యోగశాస్త్రమునందు యోగులకు 'నిర్మాణచిత్తాన్' ఇత్యాది సూత్రములచేత ననేకశరీరయోగప్రక్రియకలదు.

స్వాప్యయసంపత్త్యోరన్యతరాపేక్షమావిష్కృతం హి ॥16.

తా॥ 'స్వమపీతో భవతి। తస్మాదేనం స్వపితీత్యాచక్షతే' యను శ్రుతివలన నిద్రావస్థయు, 'బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి' యను శ్రుతివలన మోక్షావస్థయును కనిపించును. ఈ రెండింటిలో ఒకచోట సుషుప్త్యవస్థనపేక్షించి అజ్ఞానమున్నువేఱొకచోట మోక్షావస్థయున్ను చెప్పబడినది. హి-ఏ కారణమువలననగా, 'ఏతేభ్యో భూతేభ్య స్సముత్థాయ తాన్యేవానువినశ్యతి నప్రేత్య సంజ్ఞాస్తి। యత్రత్వస్య సర్వమాత్మైవా

భూద్యతి సుప్తో నకంచన కామం కామయతే నకంచన స్వప్నం పశ్యతి' ఇత్యాది శ్రుతులవలన నిర్విశేషసంజ్ఞాభావ వచనములకు ఆవిష్కృతం-ప్రకరణబలముచేత నన్యాపేక్ష లేను

జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసంనిహి తత్వాచ్చ ॥ 17

తా॥ జగద్వ్యాపారవర్జం-ముక్తులకు జగత్సృష్ట్యాదులను విడిచి అణిమాద్యైశ్వర్యము కాతగియుండును. సృష్ట్యాదులు ఈశ్వరునకేకాని యితిరసన్నిహితులకు లేదు.

ప్రత్యక్షోపదేశాదితి చేన్నాధికారికమండలస్థోక్తేః ॥18

తా॥ 'ఆప్నోతి స్వారాజ్యం' ఇత్యాది శ్రుతులు విద్వాంసులకైశ్వర్యస్వతంత్రము కలదని ప్రత్యక్షముగా చెప్పబడిన దందువేని ఆధికారికమండలస్థోక్తేః-ఈస్వారాజ్యప్రాప్తినిగూర్చిన స్వతంత్రము సూర్యాదులకధికారములనిచ్చి నియోగించువాడగు పరమేశ్వరునకే కలదు. గనుక నిదిదోషమనరాదు. 'ఆప్నోతి మనసస్పతిం' సర్వమనస్సులకు పతియు, పూర్వసిద్ధుడునగు పరమేశ్వరుడే యగును.

19-20 సూత్రములు 12వ ప్రకరణములో నున్నవి.

(7 అధి) భోగమాత్రసామ్యలింగాచ్చ ॥ 21సూ.

తా॥ సగుణోపాసకులకు ఈశ్వరునితో భోగమాత్రమునకేగాని జగత్సృష్ట్యాదులయందు సామ్యములేదు.

1 కా. 1-6 'తమాహ ఆపోవై ఖలు మీయంతే లోకోఽసావితి సయథైతాం దేవతాం సర్వాణిభూతాన్యవంతి'

తా॥ హిరణ్యగర్భుడు తనచేననుభవింపబడుచున్న అమృతమయములగు నుదకములను మీరుకూడ అనుభవించవలసి

నదని తనలోకమునకువచ్చిన యుపాసకులతో నయపూర్వక
ముగా చెప్పుచున్నాడు. వంతి'

2 బృ. 3-5-20 'ఏవం హైవం విదం సర్వాణి భూతాన్య
తా॥ భోగమాత్రసామ్యమెట్లనగా- ఎల్లజంతువులును ఈ
దేవతనెట్లు ఉపాసించుచున్నవో అట్లే ఆజంతువులను భుజిం
చుచుండును. సలోకతాం జయతి'

3 బృ. 5-23 'తేనోఏతస్యై దేవతాయై సాయుజ్యం
తా॥ ప్రాణవ్రతధారణముచేత ఏకాత్మత్వమును, ఏకస్థా
నత్వమును పొందుచున్నారు. గనుక నుపాసకునకు ఈశ్వరుని
వలె సామర్థ్యములేదు.

అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్ । 22సూ.

ఛాం. 'యస్మిన్నరశ్చ హవై ణ్యశ్చార్ణవౌ బ్రహ్మలోకే
తృతీయస్యామితో దివి యస్మిన్నైరమ్మదీయం సరో యస్మి
న్నశ్వత్థస్సోమసవనో యస్మిన్నపరాజితాపూర్బ్రహ్మణో య
స్మింశ్చ ప్రభువిమితం హిరణ్మయం వేశ్మయశ్చ'

తా॥ భూలోక అంతరిక్షలోకములకు తిరువాతనున్న దివి
(బ్రహ్మలోకమునందు) అరము-ణ్యము-లనెడి ప్రసిద్ధనామ
ములుగల సముద్రమువంటి-సుధాహ్రదములును, అన్నమ
యములును, హర్షకరమునగు కొలను, అమృతవర్షియగు
పిప్పల, అశ్వత్థ-వృక్షమును, హిరణ్యగర్భునియొక్క కర్మజ్ఞాన
శూన్యులు పొందతగని పురమును, హిరణ్యగర్భునిచే నిర్మింప
బడిన స్వర్ణవికారమైన మండపమును గలవు. అట్టిబ్రహ్మలో
కమును దేవయాన (అర్చిరాది) మార్గముచేత పొందిన
విద్వాంసులకు అనావృత్తిః-పునరావర్తి లేదు. దేనివలనను,

శబ్దాత్-శబ్దేభ్యః క. 6-16 'తయోర్ధ్వమాయన్నమృతత్వమేతి' హృదయమునందుగల అనేక నాడులలో బ్రహ్మరంధ్రమువఱకును వ్యాపించియుండు సుషుమ్నానాడిచేతను మీదికిపోవుచున్నవాడు సూర్యద్వారముచేత అమృతత్వమును పొందుచున్నాడు. 'ఆభూతసంప్లవం స్థానమమృతత్వంహి భాష్యతే' యను స్మృతివలన ప్రళయమునఱకు హిరణ్యగర్భలోకమున నుండుటయే అపేక్షింపబడు అమృతత్వము లేదా అచటనున్న నిరుపమానమైన భోగములననుభవించి హిరణ్యగర్భునితో కాలాంతరమునందు ముఖ్యమగునట్టి యమృతత్వమును పొందుచున్నాడు.

2 బృ. 2-7-15 'తేషాం న పునరావృత్తిః'

3 ఛాం. 4-5-6 'ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవమావర్తం నావర్తంతే। బ్రహ్మలోకమభిసంపద్యతే। నచ పునరావర్తతే'

తా॥ బ్రహ్మలోకమును పొందినవారు ఈమనుసృష్టిలో జన్మింపరు. గాని మఱియొకకల్పమునందు జన్మము సూచింపబడుచున్నది. అప్పుడు అయినను ఈశ్వరోపాసనలేకుండ పంచాగ్నివిద్యాశ్వమేధ దృఢబ్రహ్మచర్యాది సాధనములు కలిగి తత్త్వజ్ఞానములేకుండ పోయినవారికి మఱల జన్మము కలుగుననియు, దహరాద్యుపాస్తిచే పోయినవారికి సగుణవిద్యాఫలము క్షయించినను ఈశ్వరానుగ్రహలబ్ధమైన తత్త్వజ్ఞానమువలన మరలజన్మములేని ముక్తి కలదనియు తలచి యిట్లుచెప్పబడెను. 4వ అ. 4వ పాదము సమాప్తము.

శ్రీపరదేవతార్పణమస్తు.

# సూత్రభాష్యమునందలి

| అధ్యాయము | పాదము | అధికరణము | సూత్రములు | మొత్తము |
|---|---|---|---|---|
| 1 | 1 | 11 | 31 | |
| | 2 | 7 | 32 | |
| | 3 | 14 | 43 | 134 |
| | 4 | 8 | 28 | |
| 2 | 1 | 13 | 37 | |
| | 2 | 8 | 45 | |
| | 3 | 17 | 53 | 157 |
| | 4 | 9 | 22 | |
| 3 | 1 | 6 | 27 | |
| | 2 | 8 | 41 | |
| | 3 | 36 | 66 | 186 |
| | 4 | 17 | 52 | |
| 4 | 1 | 14 | 19 | |
| | 2 | 11 | 21 | |
| | 3 | 6 | 16 | 78 |
| | 4 | 7 | 22 | |
| | | 192 | 555 | 555 |